అంతర భారతీయ పుస్తకమాల

# కొన్ని సమయాలలో కొందరు మనుషులు

రచన

జయకాంతన్

అనువాదం

మాలతీ చందూర్



నేషనల్ బుక్ ట్రస్ట్, ఇండియా

బయట వర్షం కురుస్తోంది. బస్ తిరుగుతుంటే ఒకళ్ల మీద ఒకళ్లు వరిగి పడిపోతున్నారు. నాకు ముందున్న అతను కావాలనే వెనక్కి వొంగుతున్నాడు. కావాలనే మీదకి వంగి అనుకుంటుంటే ఏం చెయ్యగలను? ఆడపిల్లనై పుట్టి మొగవాళ్లతో సమానంగా చదివి, వుద్యోగానికి బయలుదేరినప్పుడు వీటన్నిటినీ భరించక తప్పదు. బస్‌లో ఆడవాళ్లకని నాలుగు సీట్లు ప్రత్యేకంగా వేశారు. ఏదో ఒకరో యిద్దరో ఆడపిల్లలు చదువుకుని, ఏ ఒక్కరో యిద్దరో వుద్యోగాలు చేసే రోజుల్లో బస్‌కి యిన్ని సీట్లని, నాలుగేసి చొప్పున కేటాయించి వుంటారు. ఇప్పుడో ఆడవాళ్లకని ప్రత్యేకం బస్‌లు వేసినా బాగుండును. అలా ప్రత్యేకం బస్‌లు వేయడానికి అవకాశం వుండదా? అవకాశం వుండక ఏమవుతుంది? పాపం - చిన్న పికిలి పిట్టల్లాంటి ఆడపిల్లలు ఈ మొగవాళ్లతో పోటీపడి, కావాలని తమని తాకి, తోసి మీద పడుతున్నా కూడా నిలదొక్కుకుని, డబ్బులు యిచ్చి పడే అవస్థ యింతా అంతా కాదు. ఆడవాళ్లకి ప్రత్యేక సీట్లు వున్నా కూడా పడే యిబ్బందులు, విడిగా బస్‌లు నడుపుతే వుండవేమో! వెరిగుడ్ అయిడియా! అయామ్ గోయింగ్ టు రైట్ ఎ లెటర్ - టు ద లెటర్స్ టు ది ఎడిటర్.

బయట బాగా వర్షం కురుస్తోంది. కిటికీకి కట్టిన కాన్వాసు బట్టమీద వర్షపు జల్లుపడి 'టప టప' శబ్దమవుతోంది. బస్ లోపల సీట్లు - బురద చిత చితలాడుతూ అసహ్యంగా వుంది. కిచ కిచలాడుతూ జనం, ఆ గుంపు మధ్య వేడిగా ఏదో కంపు వస్తోంది. ఒకే మొగ వాసన. చుట్టూ మొగవాళ్ల వాసన. ఒకళ్ల మీద ఒకరు పడిపోతూ, పైనుంచి వేలాడుతున్న తోలు [illegible] పట్టుకున్నారు. చుట్టూ పైకి చాచిన చేతులు. ఖర్మ! హాండిల్ తోలు [illegible] ఈ వాసనకి తోడు ఆ తోలు యింకా కంపు. ఎలక్ట్రిక్ ట్రైనులో [illegible] హాండిల్స్ వెయ్యరాదా! దీన్ని గురించి కూడా రాయాలి. ఇంకా బస్ [illegible] లేదు. ఒక లెవెల్లో పోతున్నది. అయినా నా వెనకే వున్నాడే వాడుమటుకు ముందుకు కొంచెం కొంచెం జరుగుతూ

కావాలనే అంటుకునేట్లు మీద పడుతున్నాడు. వీడికి ఎంత ధైర్యం? ఇదేం న్యాయం?

ఒకసారి కళ బస్‌లో వెళుతుంటే ఎవరో యిలానే మిస్ బిహేవ్ చేస్తే - కాలి స్లిప్పర్ తీసి కొట్టబోతే, పెద్ద రగడ జరిగిందట. వీడూ అలాటివాడిలాగానే వున్నాడు. నాకు కళ చెప్పింది జ్ఞాపకం వస్తోంది. వీడిని కూడా అలా కొడితే! నాకు చెప్పుతో కొట్టాలని అనిపించినట్లే - ఆ రోజు తనకీ అనిపించి వుంటుంది. ఆడది మనసులో అనుకున్నవన్నీ చెయ్యగలుగుతుందా? పాపం అతను నిజంగా కావాలని అనుకోవడంలేదేమో! పెద్దవాడేమో! వెనక్కి తిరిగి చూడాలనుకున్నాను. వీలవుతుందా? లేదు. కాదు వీడు కావాలనే మీద పడుతున్నాడు. ముసలివాడేం కాదు. బాగా తెలుస్తున్నది నాకు. ఆక్సిడెంటల్‌గా వంగుతున్నాడేమో అనుకుందా మంటే కొంచెం వంగి నొక్కి నొక్కి మీదకి పడటం ఎందుకు జరుగుతుంది. వొళ్ళంతా కుంచించుకు పోతోంది. వర్షం కురుస్తోంది కదా యీ రోజు స్నానం చేయనక్కరలేదు అనుకున్నాను. కాని యిప్పుడు యింటికెళ్లి స్నానం చేస్తేగాని తోచదు. గుంపుగా చుట్టూ మనుషులున్నప్పుడు యిలా ఎడ్వాన్‌టేజ్ తీసుకునే వాళ్లని ఏమనాలి? ఇది కూడా పురుష లక్షణమా? తమ ఆడవాళ్లని యిలా ఎవరన్నా చేస్తే? ఇటువంటి ఆలోచన వీరికి రాదా? అసలు వీళ్లకు యిటువంటి ఆలోచనలే రావు. వీళ్లకంటె వీధిలో పోతున్న ఆడదాన్ని 'వస్తావుటే' అంటూ చెయ్యి పుచ్చుకుని యీడ్చుకెళ్ళే మగవాడు ఎంతో నయం. నిజంగా అలా లాక్కెళ్లడానికి గుండె ధైర్యం కావాలి. ఇష్టం వుంటే వెంట వెడుతుంది. ఇష్టం లేకపోతే 'నేను రానని' చేయ్యి విడిపించుకు పోతుంది. అంతేగాని యిదేమిటి? గుంపులో మీద పడటాన్ని ఏమనాలి? దీన్ని ఏమని అనాలి? మంచీ మర్యాద మర్చిపోయి, గుంపులో యిలా సిగ్గు లేకుండా ప్రవర్తించేవాళ్ళని ఏం చెయ్యాలి? వీళ్ళని నిప్పుల్లో కాల్చాలి. 'బ్లాక్ గార్డ్స్'

ఈ విషయం గురించి కూడా లెటర్స్ టు ద ఎడిటర్‌కి రాయాలి. ఆడవాళ్లకి విడిగా బస్‌లు వెయాలనేది చాలా రిలవెంటు పాయింటే. భాషా పత్రికలకు రాసి లాభం లేదు. ఇంగ్లిషు పత్రికల్లో రాస్తే నలుగురూ చదువుతారు. నాలుగు వాక్యాల్లో చెప్పదలుచుకుంది క్లుప్తంగా చక్కగా చెప్పెయ్యవచ్చు. బ్యూటిఫుల్ లాంగ్వేజిలో వుండాలి. అందుకని రెండు రోజులు వృథా అయినా ఫరవాలేదు.

ఆడవాళ్లకి మొగవాళ్లు లేచి బస్‌లో సీటు యివ్వాలి. (వెంటనే ఆమె చిరునవ్వుతో థాంక్స్ చెబుతుంది. అందుకతను డోంట్ మెన్షన్ అంటాడు - స్టుపిడిటీ) అల్లా నేను రాయబోవడంలేదు. నాకు ఎవరైనా సీటు యిచ్చినా కూడా నేను కూచోను. నాకేదో పెద్ద సాయం చేసినట్లు - అసలు వాడెవడు నాకు సీటు యివ్వడానికి?

నేనేం అవిటిదాన్నా - ముసలిదాన్నా ? పోనీ నా వయసుకి గౌరవం యిచ్చి సీటు యిస్తున్నాడని అనుకునేందుకు. అంత వయసు అయిపోయిందాన్ని కాదే! ఇంకా నాకు ముప్పై నిండలేదు. అందరిలాగా నేను స్టయిల్‌గా వుండను. ఇలా వుంటేనే - యీ వెనక మనిషిలాగా మీద పడిపోతున్నారే - షోకు చేసుకు స్టయిల్‌గా వుంటే యింక చెప్పక్కర్లేదు. నన్ను చూస్తుంటే మీద పడాలని అనిపిస్తోందా ? అంటే నేను చవకబారు దానిలా కనిపిస్తున్నానా ? నేను చూసిన మొగవాళ్లందరికీ యిదే రకం జబ్బు. మొగవాళ్లందరిలో ఒక్కడు కూడా సవ్యంగా ఆలోచించలేడా ? నేను నాన్న ముఖం ఎరగను. మరి అన్నయ్యో ! వాడో పెద్ద మంచివాడయినట్లు. అన్నయ్య అన్న రక్తబంధం సూటిగా గుచ్చుకుంటున్నది. లేకపోతే అలాంటి మాటలు విని భరించ గలిగేదాన్నా ? నానా మాటలు అంటంతోనే సరిపోలేదు "నువ్వు నా చెల్లెలివి కాదు, నాకు చెల్లెలివి కాదు" అని రెట్టించాడు.

ఇదేవిధంగా బస్‌లో వస్తుంటే వాడు కూడా అదే బస్‌లో వస్తున్నాడు. ఇదిగో యిప్పుడు మీద పడుతున్నాడే యీ మహానుభావుడు ఇది అన్నయ్య కంట్లో పడితే ఏం చేస్తాడో ? తోడబుట్టిన వాడన్న జ్ఞానం లేకుండా దీనిని గురించి చాలా అసహ్యంగా ఆలోచించి, ఏదో ఏదో వూహించుకుంటాడు. ఈ చూసిందంతా వూసగుచ్చినట్లు కథ అల్లి ఒదినతో చెపుతాడా ? ఆవిడ ఒకటికి పది కలిపించి, ఆ యింట్లో అద్దెలకున్న వాళ్లందరికి కొంపమునిగి పోతున్నట్లు చెబుతుందా ?

అదిగో వాడు వీపు మీద ఆని నుల్చున్నాడు .... అందుకని వాడికీ నాకు మధ్య సంబంధం వుందనుకుంటే - అన్నయ్య చూస్తే ఏం చేస్తాడో ? తను తప్ప మిగతా వాళ్లందరితో నాకు సంబంధం కడతాడు. వీడి మొహం కూడా నాకు తెలియడంలేదు. వెనక్కి తిరిగి చూసేపాటి ధైర్యం లేదు నాకు. వాడు తెలుపా ? నలుపా ? ముసలివాడా ? వయసులో వున్నవాడా ? ఎవరైతే నాకేం ? ఎలా వుంటే నాకెందుకు. వాడెవరయినా నే నీ గుంపులో చిక్కు పడకపోతే చాలు. అదిగో నేనేదో వాడి సొంత మనిషిలా మీద పడుతున్నాడు.

అదిగో వెనకనుంచి మళ్లీ పడుతున్నాడే వాడినీ నన్నూ తరుచు చూస్తున్నట్లే అన్నయ్యకి తోస్తుంది. తరువాత ఆఫీసులో పని యిప్పిస్తాను. బస్‌లో వస్తుంటే అతను నాకు టికట్ కొంటాడు. నేను కావాలనే - అన్నయ్య కళ్లముందే వాడిని అవమానించడానికని వీడి మీదకి వరుగుతాను. నాకు తిమ్మిరి అంటాడు. 'నన్ను అడగటానికి వాడెవరు. నేను చదువుకున్నాను, వుద్యోగం వెతుక్కున్నాను - వాడి కంటే పెద్ద పొజీషన్‌లో వున్నాను. తిమ్మిరట' ఎంత వుద్యోగస్తురాలైతే మటుకు యిలా పబ్లిక్‌లో బరితెగిస్తావా ? అని బస్‌లో పాసింజర్సు నా ముఖాన్న వుమ్ముతారు. వాడు సిగ్గుతో కుంగిపోయి, తలవంచుకుని, నోరు మెదపకుండా,

యీ దృశ్యాన్ని భరించలేక తర్వాత స్టాపులో దిగిపోతాడు.

వీధి గుమ్మంలోనే అన్నయ్య నన్ను చూసిన విషయం వదినకు చెపుతాడు. వొదిన యీ వార్తని చుట్టుపక్కల అందరికీ వొకళ్లని కూడా వదలకుండా మనిషి మనిషికీ చెబుతుంది. 'నేను కూడా ఒకసారి చూశాను. వాడే అయివుంటాడు' అంటుంది పక్క యింటి యిల్లాలు యీ వార్తకి ఆజ్యం పోస్తూ.

'వాడే అయివుంటాడా లేక యింకోడో' అంటుంది మరో యిల్లాలు.

అప్పుడు వొదిన అందుకుంటుంది. "మాకెందుకు. ఇది చెడిపోయిందనేకదా - మొఖాన్న నీళ్లు జల్లి తరిమేసింది. అయినా తోడబుట్టిన వారు చూస్తూ వూరుకోలేరు కదా. ఆయన సిగ్గుతో తలెత్తుకోలేక పోయారుట. ఇటువంటి గంగిగోవుని కన్న ఆ తల్లే ఈ పరువు తీసేదాన్ని కన్నది" అంటూ వొదిన యీ వార్తని అన్నయ్య దగ్గరకు చేరవెయ్యడానికి వెళుతుంది. అన్నయ్య చెప్పిన విషయాలు అందరికీ చెప్పి, వాళ్ల అభిప్రాయాలు సేకరించి, అన్నయ్యతో యిలా అంటుంది వొదిన : "మన కెందుకని వూరుకుందామంటే మనసు వొప్పుకోదే! వాళ్ల డబ్బూ దస్కం అక్కర్లేదు, యిల్లూ వాకలీ అక్కర్లేదు, — అనేకదా యిలా వొదిగివున్నాము. అందుచేత వాళ్లేం చెడిపోలేదే! బాగానే వున్నారు గదా! వాళ్లని అలా వొదిలేశామని ఎవరూ మనని తప్పు పట్టక్కర్లేదు. వాళ్లు 'హా హా' అని హాయిగా వున్నారు. అందులో మనకేం ఒరగపెట్టరు. అది చెడి ఎక్కడున్నా 'మీ చెల్లెల'ని కదా అందరూ అంటారు. ఆ వయసులో ఆ పిల్ల చేసిన వెధవపనికి మనం కాబట్టి వీధిలోకి తరిమేశాం. ఇంకోళ్లయితే కత్తి తీసుకొచ్చి నిలువునా నరికి వుండేవాళ్లు. మీకు తల్లి అయితే అవచ్చు - కాని అటువంటి వెధవపని చేసినప్పుడు కొట్టక ఏం చేస్తారు? 'కొడితే ఏం తిడితే ఏం వాడు నీకు అన్న' అని సరిపెట్టుకుందా? ఊహు. ఆపిల్ల చెయ్యి పుచ్చుకు తనూ బయాలుదేరింది వీధుల్లోకి. అలా సరిపెట్టు కుంటే యీనాడు సొంత యిల్లూ, షోకైనా జీవితం యివన్నీ అమరేవా అని? ఈ ముష్టిముప్ఫై రూపాయల యిరుకు గదుల్లో, శని గ్రహాల్లాంటి ఆడవాళ్లమధ్య, నల్లుల్ని చంపుకుంటూ మనం ఏడుస్తున్నాం గాని వాళ్లకేం మహరాజులు పెట్టి పుట్టారు. నా ఖర్మలో యిలా రాసివుంటే ఎవరిననుకుని ఏం లాభం? 'ముందొచ్చిన చెవుల కంటే వెనకొచ్చిన కొమ్ములు వాడని' - వూరికే అన్నారా? మొగపిల్లవాడు ఇంటికి పెద్ద అని మీ అమ్మకు లక్ష్యం వుంటేనా? మొదటినుంచీ యింతే. మీకు చదువు రాదని ఆవిడకు చిన్న చూపు. నాతో అంటూనే వుండేవారు. 'మొగవాడయితేనేం - ఆడదయితేనేం -దానికి చక్కగా చదువొస్తోంది. రేపు పెద్ద చదువులు చదివి యూని వర్సిటీకి ఫస్టవస్తుంది. పెద్ద వుద్యోగస్తురాలవుతుంది. కలక్టరవుతుంది. ఆడపిల్లే నాకు దిక్కు. వీడు మెట్రిక్కులేషను మూడుసార్లు తప్పాడు. వాడు పెట్టి పుట్టలేదు-

వాడికి చదువు యోగ్యతలేదు. భగవంతుడు దానికి ఘట్టి ఆయుష్షు యివ్వాలేగాని అది మూడు ఎంత వృద్ధిలోకి వస్తుందో' అనేవారు. వచ్చింది. పెద్ద చదువులు చదివింది. పెద్ద వుద్యోగస్తురాలయింది. స్వంత యిల్లు సంపాయించుకుంది. ఇంక ఎవరివెంట తిరిగితే మీకెందుకు? వాళ్లకి మన సంగతి అక్కర్లేనపుడు మీరు మటుకు 'నా చెల్లెలు నా చెల్లెలు' అంటూ చీటికి మాటికి వాళ్లిళ్లకెళ్లి పూసుకోవడమెందుకో! మీ ప్రియమైన అమ్మ ఆ ముద్దుల కూతురికి కాస్త బుద్ధి చెప్పరాదా అని. ఆ పంచవటి పక్కనున్న పార్కు లేదూ-రోజూ చీకటి పడ్డాక ఆ పార్కుకొచ్చి తిరుగుతూంటుందిట. చదువుకుంటె చాలా? పెద్ద వుద్యోగస్తురాలయితే చాలా? సిగ్గూ లజ్జా వుండద్దా అని. నలుగురు నాలుగు విధాల రోజుకోమాదిరి చెప్పుకుంటుంటె - ఒక్కొక్క మాటా నా వంటని తూట్లు చేస్తున్నాయి.'' ఒదిన మాట్లాడటం మొదలుపెడితె అన్నయ్య ఆమె ధోరణి ఆగేదాకా నోరువిప్పడు. మంత్రించిన వాడిలాగా తల వూపుతూ నోరు మెదపకుండా వింటాడు.

''సరి - సరి - అందుకు నన్నేం చెయ్యమన్నావో చెప్పు. నేను చెబితే వింటారా? నన్నంటా వెందుకు?'' పళ్ళు బిగబట్టి ఒక్క అరుపు అరుస్తాడు.

''వింటే వింటుంది - లేకపోతే పోతుంది. మన చెవుల్లో పడిన మాటలు చెపుతాం. మీ వెనక పుట్టింది - పైగా ఆడపిల్ల - మీరక్తం పంచుకు పుట్టింది. బుర్రపగలకొట్టి అయినా బుద్ధి చెప్పాలి.''

కిర్రుమని శబ్దం చేస్తూ దేన్నో గుద్దుకోపోయినట్టు గుబుక్కున ఆగిపోయింది బస్. నా వెనకున్నవాడు సడెనుగా నా మీదకి వంగి పడ్డాడు. వాడికి చాలా తృప్తిగా వుండివుండాలి. ఈసారి మటుకు వాడు కావాలని పడలేదు. బస్ కుదుపుకి పడిపోయాడు.

లెటర్స్ టు ది ఎడిటర్‌కి ఏం రాయాలో ఆలోచించుకుంటున్నాను. ఎన్నో సార్లు ఏవేవో విషయాల గురించి రాయాలని అనుకుంటూ వుంటాను. అవి మనసులో అనుకోవడంతోనే సరి. తరువాత ఆ విషయాలు పాతబడి పోతాయి. నేను ఎంతకీ అనుకుని అనుకుని పూరికోవడం అవుతున్నది. ఈ విషయం రాసేసి పడెయ్యాలి - ఆలోచన ఒక్కసారి వస్తుంది. దాంతో ఆ విషయం అక్కడే ఆగిపోతుంది.

కొన్ని సమయాల్లో 'లెటర్స్ టు ది ఎడిటర్' లో - చాలా తమాషా అయిన వుత్తరాలు వస్తూవుంటాయి. నేను రోజూ పేపర్లో ముఖ్యంగా వాటినే చదువుతాను. ఆ తరువాత మాట్రిమోనియల్ కాలమ్. అదికూడా చాలా యింటరెస్టుతో చదువుతాను. వాటికి రెస్పాండ్ చేస్తాననికాని, అప్రోచ్ అవుదామనికాని కాదు. అదేదో ఆ కాలమ్ అంటే నాకు ఒకరకమైన యింటరెస్ట్. దట్ యీజ్ రియల్లీ యింట

రెస్టింగ్. నాకు పెళ్ళి చేసుకోవాలనిలేదు. పెళ్లి అవదు. పెళ్ళి చేసుకోకూడదని ఎప్పుడో తీర్మానించుకున్నాను. అందువల్లనేమో పెళ్లి ప్రకటనలంటే నాకింత యింటరెస్ట్ ఏర్పడింది. అందులో తప్పేమీ లేదే!

ఎగ్మూర్ స్టాపింగ్ కాబోలు. కిటికీలన్నీ మూసివుండటంచేత ఎంతదాకా వచ్చిందీ తెలియడంలేదు. గబగబమని చాలామంది దిగడానికి లేచారు. బయట యింకా వర్షం కురుస్తూనే వుంది.

"ఎగ్మూర్ స్టేషన్ అందరూ దిగండి" కండక్టర్ కంఠం వినిపిస్తోంది. ముందు సీట్లలో చాలామంది సర్దుకున్నారు. ఆడవాళ్ళసీటు ఖాళీ అయింది. గభాలున కూలబడ్డాను. నేను దిగడానికి యింక మూడు స్టాపింగులే వున్నాయి - అయినా యీ వెనకాలినుంచి మీదపడే వాడిని తప్పించుకున్నాను. ఇప్పుడు వాడిముఖం చూడ గలుగుతున్నాను. వెధవ పళ్ళు యికిలిస్తున్నాడు. సిగ్గులేని రాస్కెల్. నెత్తిమీద జుట్టు కొబ్బరిపీచులా ముందుకు పడుతూ - బస్‌లో 'లవ్' చేస్తున్నాడు. ఇలా బస్‌లో 'లవ్' చేసే ముఖాలన్నీ యిలానే వుంటాయి. నేను వాడివంక చూస్తున్న విషయం వాడికి కనిపించదు. హాండ్‌బాగ్‌లోంచి ఆ వారపు పత్రికతీసి, ముఖానికి అడ్డు పెట్టుకుని చదవటం మొదలుపెట్టాను. దాంతో ఆ బస్‌లోవాడి విషయం మర్చి పోయాను.

మధ్యాహ్నం లంచ్ టైములో రెండు పేజీలు చదివి వదిలేసిన ఆ కథని అక్కడి నుంచి చదవడం ప్రారంభించాను. నా జీవితంలో ఏర్పడినటువంటి అదేమాదిరి సంఘటన తీసుకుని రాసిన ఆర్. కె. వి. కథ. అతను రాసిన కథలంటే నాకు చాలా యిష్టం. ఆర్. కె. వి. అన్న ఆ పొడి అక్షరాలు చూసి - స్త్రీ అయివుంటుందని అనుకొన్నాను. ఆ కథలన్నీ ఆ థీమ్స్అన్నీ ఆడవాళ్లు ఎదుర్కొనే సమస్యలగూర్చే వుంటాయి. అంచేత ఆర్. కె. వి. స్త్రీ అయివుండాలని నా నమ్మకం.

ఆర్. కె. వి. కథలగురించి మా ఆఫీసులో చాలా కాంట్రవర్సీ నడుస్తోంది. నేను ఆ కాంట్రవర్సీలో కలిపించుకోను. వాళ్ళ వాదనలు, మాటలు వింటుంటే ఒకోసారి నవ్వు వస్తుంటుంది. ఒకోసారి వళ్ళు మండిపోతూంటుంది.

వాళ్లందరూ నాకు సాహిత్యంలో టేస్టు లేదనుకుంటూంటారు. వాళ్ల మాటలు వింటున్న నాకు ఎవరికి ఎంత టేస్టువుందో బోధపడుతూనే వుంటుంది. నా టేస్టు నా దగ్గిరే వుండనివ్వండి. వై షుడ్ ఐ షేర్ విత్ అదర్స్?

కథ మొదలుపెట్టాను. ఇది ఆర్. కె. వి. రాసిన కథ.

"ఆ అమ్మాయిలో బీదలక్షణాలు కనిపించినా, ఆ ముఖంలో విలక్షణమైన కాంతి తొంగిచూస్తోంది. ఆ ముఖంలో అమూల్యమూ, అపురూపమూనైన కాంతి గోచరిస్తోంది. ఆ పిల్లముఖం చూస్తుంటే అప్పుడే అరవిచ్చుకున్న పుష్పం జ్ఞాపకానికి

వస్తుంది. అందులోనూ వర్షంలో తడిసి, నీటిలోనాని, చలికి కిందనుంచి పైదాకా విగురుటాకువలె కంపిస్తోంది. పాతబడి వాయపోయిన మబ్బురంగు వోణీ, దానికింద జాకెట్టూ రెండూ తడిసి వొంటికి అంటుకునిపోయి వున్నాయి. ఆ పిల్ల కాళ్ళు, పాదాలు తెల్లని దంతాలవలే మెరుస్తున్నాయి. సన్నగా కంపిస్తున్న ఆ పిల్ల పాలరాతి శిల్పం వలె, ప్రతిమా సుందరివలె చలికి మరీ కుంచించుకుపోయి చూలాగ్గా ఒక్కచేత్తో ఎత్తుకు పోవచ్చునా అన్నంత నాజూగ్గా వుంది."

ఇట్లా రాయడం ఒక్క ఆర్. కె. వి. కే తగును. అతను పెద్ద పెద్ద వాక్యాల్లో వర్ణించి వర్ణించి చుట్టి చుట్టి రాస్తాడు. అయినా ఆ వాక్యాలు ఎంతో సొంపుగా చదువరుల మనసులో ఒక కమనీయమైన రేఖాచిత్రాన్ని రూపు దిద్దుతాయి.

పన్నెండు సంవత్సరాలకు ముందు ఆ రోజున నేనుకూడా యిదేమాదిరి నుల్చుని వున్నాను. పాతవోణీ - అమ్మచీరలు పాతవి వోణీలకింద వేసుకునేదాన్ని. చందనం బొమ్మమాదిరిగా నేనూ వుండేదాన్ని. ఇదేమిటి? ఇది నా కథా? నా జీవితకథా?

మళ్ళీ చదవడం మొదలుపెట్టాను.

"అది విశాలమైన రోడ్డు. సాయంకాలమయింది. మబ్బు మబ్బుగా వుంది. ఆ పిల్లవొక్కర్తె ఒంటరిగా బస్‌కోసం నిలుచుని వుంది. ఆ అమ్మాయికి తోడుగా ఆ చెట్టు కింద ఒక ముసలి అవ్వమటుకే వుంది. రోడ్డు నిర్మానుష్యంగా వుంది. దూరాన ఎదురుగా కాలేజీ కాంపౌండ్ లోపల ఒకరిద్దరు మనుషులు వరండాలో నడుస్తూ కనిపిస్తూన్నారు. చుట్టూ మబ్బులు. ఒక్కసారి నీలితెరపడ్డట్టు ఆకాశం మూసుకు పోయింది. చుట్టూ కాటుక మబ్బులు మూసుకున్నాయి. 'టప్ టప్' మని వర్షపు చినుకులు మొదలుపెట్టాయి. చుట్టూ చూసింది. చీకట్లు కమ్ముకొస్తున్నాయి. వర్షం ఎక్కువవుతోంది. చెట్టు మొదలుకి - పొడిగా వున్న స్థలం వైపుగా జరిగింది. వర్షం తీవ్రమవుతోంది. చెట్టు కిందనుంచి రోడ్డుకి అడ్డంగా కాలేజీ వైపు పరుగెత్తబోతూ రోడ్డుకి రెండు వైపులా చూసింది. గబ గబ రెండు పరుగుల్లో రోడ్డు మధ్యకొచ్చేసరికి కుడివైపు సందులోంచి గభాలున పెద్ద కారు వేగంగా వచ్చి - ఆ అమ్మాయిని గుద్దుకోపోయి 'టక్' న ఆగిపోయింది.

అందంగా వున్న ఆ కారు స్టీరింగ్ ముందు కూచున్న అతను ఆశ్చర్యంగా తల పక్కకి తిప్పి ఆ అమ్మాయిని రెప్పవాల్చకుండా చూశాడు.

కారు ఇంజను ఆపి - చిరునవ్వుతో కారు వెనక తలుపు తెరిచాడు.

'ప్లీజ్ గెటిన్ ఐ విల్ డ్రాప్ యు ఎట్ యువర్ ప్లేస్' అంటూ చిన్నగా నవ్వాడు. ఆ అమ్మాయి అటువంటి అందమయిన కారును ఎప్పుడూ చూడలేదు. కారువంక ఆశ్చర్యంగా చూస్తున్న ఆ అమ్మాయి అతని మాటలు వినగానే తల తిప్పి చూసింది.

అతని ముఖం చూడగానే ఆ అమ్మాయి కళ్ళలో ఆశ్చర్యం మాయమయింది. కళ్ళు ఎరుపువన్నె తిరిగాయి. ముఖం కోపంతో ఎర్రబడింది. 'నో— థాంక్సు కొంచెం సేపు వుంటే బస్ వస్తుంది. బస్‌లో వెళ్ళిపోతాను' అంది.

'ఇట్ యీజ్ ఆల్ రైట్ గెట్ యిన్' అంటూ అతను బలవంతపెట్టాడు. వర్షం ఎక్కువవుతోంది. ఆ వర్షంలో నులుచుని నిలువునా తడిసిన తనను చెయ్యిపట్టుకు యీడుస్తాడా. . . . .

ఆ అమ్మాయి ఒక్కసారి వెనక్కి చూసింది. తను తలదాచుకున్న ఆ చెట్టుకింద నేలంతా తడిసిపోయింది. పొడిగావున్న ఆ కాస్త స్థలాన్ని ముసలి ఆవు ఆక్రమించు కున్నది.

ఆ అమ్మాయి ముందు కారు తలుపు యింకా తెరిచేవుంది. తనకోసం తెరిచి వుంచిన ఆ తలుపులోంచి వర్షపుజల్లు కారులోకి కొడుతోంది. అదిచూసి తలుపు మూయబోయింది. గబుక్కున అతను తన చెయ్యి ఆమె చేతిమీదవేసి తలుపు మూయ్య కుండా పట్టుకున్నాడు. ఆ అమ్మాయి ఖంగారుగా చెయ్యి వెనక్కి లాక్కుంది. అతను ఆ పిల్ల ఖంగారు చూసి చిన్నగా నవ్వాడు. అతను ఎంత అందంగా నవ్వుతాడో!

అతను కారులోంచి బయటకొచ్చి, ఆ అమ్మాయితోపాటు తనూ వర్షంలో తడుస్తూ నుల్చున్నాడు.

'ఊ - గెటిన్'

ఆ కంఠంలోని మార్దవాన్ని, ఆ మాటలోని వేడికోలుని తృణీకరించలేక పోయిందేమో!

కారులో ఎక్కింది. కారు వెనక సీటు తలుపు వేశాడు. కోటుమీద పడిన వర్షపు నీరు సుళ్లు తిరుగుతున్నది. ఆ నీళ్లలోంచి యీదుకుంటూ వచ్చినట్లు స్టీరింగ్ ముందు కూచున్నాడు.

ఆ అమ్మాయి కళ్లు ఒక్కసారి జిగెల్‌మన్నాయి. కారుని తేరిపార చూసింది. ఇంతసేపూ వర్షంలో తడిసిన ఆ అమ్మాయికి కారు లోపల వెచ్చగా హాయిగా వున్నట్లుంది. ఆ కారు నేలమీద వెళుతున్నట్లు లేదు ఒక అడుగు ఎత్తున తేలిపోతున్నట్లుగా వుంది.

సీటు ఎంత విశాలంగా వుందో! ఒక మనిషి హాయిగా పడుకోవచ్చు. ఆ ఆలోచన రాగానే తాను సీట్లో ఒక మూలగా వొదిగి, వొళ్లో పుస్తకాలు పెట్టుకుని కూచోవడం చూసి, అతను తనని అనాగరికురాలని — అనుకుంటాడేమోనని సిగ్గు కలిగింది. ఒళ్లోనుంచి పుస్తకాలు తీసి పక్కన పెట్టింది. పుస్తకాల మీద స్టీలు డబ్బా వుంచి, సీటుకి జారగిలపడి గంభీరంగా కూచుంది.

ఈ కారు ఒక యిల్లులాగా విశాలంగా వుంది. ఇల్లాంటి కారు గనక ఒకటి

వుంటే యిల్లే అక్కర్లేదు. వీడికి అయ్యో కాదు. ఇతని కారే యిల్లా వుంటే - యిల్లు ఎల్లా వుంటుందో ? బ్రహ్మాండంగా పెద్ద సౌధంలాగా వుండి వుంటుంది. అక్కడ ఎవరో చాలామంది వుండి వుంటారు. ఈయన ఎవరో నాకు తెలియదే ! హాయ్. యిదేమిటి ? రెండు సీట్లకి మధ్య మేజాలాగా వుందే .... ఇలా లాగితే బల్లలాగా వస్తుంది కాబోలు. దీని మీద పుస్తకాలు పెట్టుకోవచ్చు, రాసుకోవచ్చు, లేకపోతే అటు వొకరూ యిటు వొకరూ తల పెట్టుకుని హాయిగా పడుకోవచ్చు. ఈ చిన్న లైటు ఎంత బాగుందో.... తామర మొగ్గలాగా వుంది. వుహూ - కాదు కలువ మొగ్గలా వున్నది. ఇది వెలిగించి చూస్తే అతను కోప్పడుతాడేమో !

స్టీరింగ్‌కి ముందున్న అద్దంలోంచి చూస్తూ చిరునవ్వుతో 'దాని కిందనే స్విచ్ వుంది చూడు' అన్నాడు.

ఆ అమ్మాయి స్విచ్ వేసింది. లైటు వెలిగింది. ఆ కాంతిలో ఆమె కళ్ళు తళుక్కుమన్నాయి సంతోషంతో. పవర్ వేస్ట్ చెయ్యకూడదని మనసులో అనుకుని వెంటనే లైటు ఆర్పేసింది.

తలలోంచి నీరు ధారలాగా కారుతోంది. రెండు చేతులతోనూ కణతలమీద నుంచి కారుతున్న నీటిని తుడుచుకుంది.

'ఈ రోజు యింటికెళ్లగానే యీ దరిద్రపు కండువా విప్పేసి అవతల పారెయ్యాలి' అని మనసులో నిశ్చయించుకొని. ఆ తడిసిన కండువాతో తల వత్తుకుంటోంది. అతను స్టీరింగ్ వక్క పెట్టెలాగా వున్న అర తలుపు తెరిచాడు ఎడం చేత్తో, తలుపు తెరుస్తున్నపుడు టక్‌న శబ్దం అయింది. ఆ శబ్దానికి ఆ అమ్మాయి తల ఎత్తి చూసింది. 'అరె తలుపు తెరవగానే ఎర్ర బల్బు వెలుగుతోందే!' ఒక చిన్న టర్కిష్ టవల్ తీసి ఆ అమ్మాయికి అందేలాగా వెనక్కి చెయ్యి జాపాడు.

'థాంక్స్' అంటూ టవల్ అందుకొని తడి తల తుడుచుకుని, ముఖం కూడా శుభ్రంగా తుడుచుకుంది. 'అబ్బా ఎంత మంచి వాసన' అనుకుని మరోసారి ముఖం తుడుచుకునే సాకుతో — టవల్‌ని వాసన చూసింది.

టర్నింగ్‌లో ఆ కారు విసురుగా వెళ్లడంతో 'అమ్మా' అంటూ సీటు పక్కకి వరిగింది ఆ అమ్మాయి. సీటు మీద నున్న పుస్తకాలు పక్కకి పడిపోయాయి. ఎవర్‌సిల్వర్ టిఫిన్ డబ్బా కిందకి దొర్లిపోయింది.

'సారీ' అంటూ వెనక్కి తిరిగి చిరునవ్వుతో చూసి - ఆ తరువాత కారు నిదానంగా నడపడం మొదలుపెట్టాడు. తాను భయపడిపోయానని అతనికి నవ్వులాటగా వుంది. అతను నవ్వినందుకు కొంచెం కినుకగా కూడా వుంది. పుస్తకాలన్నీ తీసి సరిగ్గా సర్దిపెట్టి, టిఫిన్ డబ్బా పక్కన పెట్టింది.

గాజు కిటికీ తలుపుల్లోంచి బయటకు చూస్తే ఏమీ కనపడటంలేదు. బయట అస్పష్టంగా వుంది. గాజు తలుపుల మీద వర్షపు నీరు పడి అలుక్కు పోయినట్లున్నాయి. గాజు తలుపులని కొంగుతో తుడిచి బయటకు చూస్తు కూచున్నది.

రోడ్ల మీద దీపాలు వెలిగినాయి. కొట్ల ముందున్న దీపాల అలంకరణ వర్షపు నీటిలో ప్రతిఫలించి, దీపాల తోరణాలవలె కనపడుతున్నాయి.

ఆ కారులోంచి కిందకి చూస్తుంటే, ఈ రోడ్డుకి అడుగున మరో లోకం వున్నదేమో నన్నట్లు భ్రమ కలుగుతోంది.

'ఇదేమిటి ? కారు ఈ వీధిలోంచి వెళ్తోంది. మా యిల్లు యీ వీధిలో వుంది' అంటూ నెమ్మదిగా గొణిగింది ఆ అమ్మాయి.

'ఉండనీ – ఎవరూ వద్దనలేదే !' అంటూ నెమ్మదిగా అమ్మాయిని చూసి చిరునవ్వు నవ్వాడు.

'ఇదేమిటి ? ఇట్లా నవ్వుతాడు' అనుకుంటూ ఆ అమ్మాయి రెండు చేతులూ కట్టుకుని, అతను అద్దంలోంచి తన వంక చూసి నవ్వుతుంటే ఏమీ అనలేక తల వంచుకుంది. అతని – ఆ నగుమోముని యింకా యింకా చూడాలని అనిపిస్తున్నది.

కార్ వేగంగా వెళుతోంది.

కారు రద్దీగా వున్న రోడ్లని, పెద్ద పెద్ద షాపులని, యిళ్లని దాటుకుంటూ విశాలమైన రోడ్డు వెంట వెళుతోంది. కిటికీలోంచి యిళ్లని, షాపులని, పూల మొక్కలని చూస్తోంది. జనం పల్చబడుతున్నారు. రోడ్లమీద సందడి తగ్గింది. కారు ట్రంక్ రోడ్డు మీద వెళ్తోంది.

"టి. బి. హాస్పటల్. టి. బి. హాస్పటల్" కండక్టర్ నాకోసమని రెండోసారి గొంతు హెచ్చించి చెపుతున్నాడు. బయట యింకా వర్షం జోరున కురుస్తూనే వుంది. ఒకే వాన. ఆగకుండా కురుస్తోంది. పొద్దుట ఆఫీసుకు బయలుదేరినపుడు మంచి ఎండగా వుంది. అందుకని గొడుగు తీసుకుని రాలేదు. వర్షం తగ్గేదాకా బస్ స్టాప్‌లో నులుచునే బదులు, టెర్మినస్ దాకా కథ చదువుకుంటూ యిదే బస్‌లో తిరిగి రావచ్చు.

"మాంబళానికి ఒక టికట్" అని కొనుక్కుని, లేచినదాన్ని మళ్లీ కూచుండి పోయాను.

ఆ మీడి బడే జంతువు ముందు సీట్లో కూచుని వెనక్కి తిరిగి తిరిగి నన్ను చూస్తున్నాడు. ఈ వెధవ వెనకాల రావడానికి టికట్ కొనుక్కున్నానని అనుకుంటున్నాడేమో ! ఖర్మ – వీడికోసమా !

బస్ కదలింది.

నేను మళ్లీ కథ చదవడం ప్రారంభించాను.

ఇది నా కథలాగానే వుంది. ముగింపు ఎలా వుంటుందో ? కలవరంగా వుంది.

డబ డబమని పిడుగులు పడిన శబ్దం.

ఆ రోజునా యిలాగే పిడుగులుపడ్డాయి.

ఆర్. కె. వి. కథలో ఒక అధ్యాయం ముగిసింది. ఈ వారపు కథని యిలా ముగించాడు.

'మబ్బులు మూసుకువస్తున్నాయి. వురుములు మెరుపులు పెళపెళామని శబ్దం. ఎక్కడో పిడుగు పడిన శబ్దం. అంత శబ్దం పిడుగు పడినప్పుడే అవుతుంది.'

ఆ పిడుగు ఎక్కడో కాదు. నా నెత్తి మీదనే పడింది.

## 2

ఉదయం పది గంటలకి గంగ ఆఫీసుకి వెళ్ళిన తరువాత వీధి తలుపు లోపల గడియ పెట్టుకుని, కటికనేలమీద బెంగు హ సుని సాయింత్రం నాలుగింటిదాకా అలా ఏడుస్తూనే వుంది కనకం. వారం ది జుల నుంచీ యిలా ఏడుస్తూంటం నిత్య కృత్యమయిపోయింది కనకానికి.

సాయంత్రం నాలుగింటికి పాలవాడు తలుపు కొట్టినప్పుడు, గబగబలేచి ముఖం కడుక్కొని, పాలుపోయించుకు వంటింట్లోకి ప్రవేశిస్తుంది. వంటచేస్తూకూడా తనలో తాను కుళ్లికుళ్లి ఏడుస్తూ వుంటుంది.

క్రిందటివారం ఒక సాయంత్రంవేళ గంగ ఆఫీసునుంచి యింటికొచ్చే సమయానికి వర్షం జోరున కురుస్తోంది. వర్షంవల్ల గంగ ఆఫీసులో చిక్కుబడి పోయివుంటుందని, చీకటి పడిపోయినా యింటికి రాలేదు. యింకా యింటికి రాలేదు. వర్షం తగ్గే సూచనలు కనిపించడంలేదు. గంగ ఆఫీసుకి గొడుగు పట్టుకెళ్ళలేదని కనకానికి తెలుసు. ఒకవేళ బస్ దిగికూడా వర్షంవల్ల బస్టాప్‌లో చిక్కుపడి పోతుందేమోనని, గొడుగు తీసుకుని తలుపుకు తాళంపెట్టి బస్టాపుకి బయలుదేరింది కనకం.

చివరికి, ఎనిమిది గంటలవేళవర్షం పూర్తిగా వెలిశాక, ఆఫీసునుంచి వచ్చే బస్‌లో కాక, ఎదురుగుండా వున్న స్టాప్‌లో ఆఫీసుకెళ్లే బస్‌లోంచి కూతురు దిగడం చూసి, ఆశ్చర్యపోయి, పేరుపెట్టి పిల్చింది. తన పిలుపు వినుపించుకోకుండా, రోడ్ క్రాస్ చేసి యింటి వైపుకి పరుగులాంటి నడకతో వెళ్లిపోతున్న కూతుర్ని చూసి, ఆవేగం అందుకోలేక వెనకాతలలే గబ గబా వచ్చింది కనకం.

ఇల్లు తాళం పెట్టి వుంటం చూసి కూతురు ఆశ్చర్య పడుతుందేమోనని, "ఇదిగో వచ్చేస్తున్నాను. సాయంకాలంనుంచి వెధవ వాన దిమ్మరిస్తోంది. గొడుగుకూడా తీసుకెళ్లలేదు యీ పిల్ల. బస్ స్టాప్‌లో యిబ్బంది పడిపోతుందేమోనని పరుగెత్తు కెళ్లాను. పాడువర్షం. దీనికి తోడు దీపాల్లేకపోవడం ఒకటి. కటికచీకటి. రోడ్డుమీద కంకర రాళ్ళు సూదుల్లా గుచ్చుకుంటున్నాయి. బస్‌స్టాప్‌లో చూశాను. నేను అంత పరుగెత్తి నడవలేను బాబూ! అది నడకగాదు పరుగు" అంటూ తనలో తను మాట్లాడుకుంటున్నట్లు, కూతురు ముఖంలోకి చూడకుండా, సణుక్కుంటూ తలుపు తాళం తీసింది కనకం. తను చెపుతున్నది వినిపించుకోనట్లు, తన వంకనన్నా చూడక, తనుపడ్డ శ్రమని లక్ష్యపెట్టకుండా, ఆఖరికి మొఖంలో సానుభూతినన్నా కనబరచక, నిర్లక్ష్యంగా వున్న గంగని చూసి, తన మాటలు వినిపించుకోనంత ఆలోచనలో మునిగివుందని గ్రహించుకుంది. తననొక నేరస్తురాలివలె చూస్తూ, మొదటిమాటు చూస్తున్నట్లు, కొత్తవ్యక్తివి అన్నట్లుగా కూతురు తేరిపార చూస్తూ వుంటే. కనకానికి ఏదో కలవరంగా వుంది.

"ఇది తీసుకుచదివి చూడు" అంటూ మామూలు విషయాన్ని - చాలా కోపంతో అని, పత్రికను నిర్లక్ష్యంగా, కనకం వైపుగా గుమ్మం దగ్గరే విసిరిపడేసి, తన గది లోకి వెళ్లి తలుపుగడియ పెట్టుకుని, ఆరాత్రి భోంచెయ్యకుండా పడుకుసుంది గంగ.

ఆరాత్రి తెల్లవార్లూ హాలులో లైటు వెలుగుతూనే వుంది. ఆ కధని తిరిగి తిరిగి చదివి తెల్లవారేదాకా అలా ఏడుస్తూనే వుంది కనకం.

ఆ రాత్రి నుంచి ప్రతిరోజు కనకం ఏడుస్తూనే వుంది. ఈ వారంరోజుల నుంచీ ఏదో తల్చుకు తల్చుకు కుళ్లిపోతూ వుంది కనకం.

ఆవిడచాటుగా ఏడుస్తోంది. తల్లి యిల్లా కుళ్లిపోతోందని గంగకి తెలియదు. తెలిసినా ఆపిల్ల సానుభూతికనబరిచే స్థితిలో లేదు. ఆమె కంటినీరు ఏనాడో యింకి పోయింది. కన్నీరు అన్నది కేవలం వుప్పునీరు. అంతకుమించి అందులో ఏమీలేదు అన్న నిర్ణయానికి ఏనాడో వచ్చేసింది గంగ. ఆ అమ్మాయి ఏడవడం మానుకుంది. కన్నీటిని మర్చిపోయింది. తన కన్నీరు కూతురి మనసుని మార్చలేదని, వోదార్చ లేదని కనకానికి తెలుసు. అందుకనే తనలోని బాధను గంగకంటికి కనబడనీయ కుండా కప్పిపెట్టుకుంటున్నది కనకం.

తల్లీ కూతుళ్ళు యీ పన్నెండేళ్ల కాలంలో, గంగ రెండేళ్ళు హాస్టల్లో వున్న కాలం తప్పించి, మిగతా పదేళ్ల నుంచీ, ఒక దశ నుంచీ ఒక యింట్లో కలిసి మెలిసి బతుకుతున్నా, యిద్దరూ ఒకరి పట్ల మరొకరు అపరిచితులువలె ప్రవర్తిస్తున్నారు. ఒకే కప్పుకింద యిద్దరు వ్యక్తులు - తెల్లవారి నిద్రలేస్తూ, ఒకరి దృష్టిని మరొకరు తప్పించుకుంటూ, నిత్యకృత్యాలు తీర్చుకుంటూ, మొక్కుబడి

వలె గడిపేస్తున్నారు. రాత్రి లైట్ల వెలుగులో తప్పదన్నట్లు - ఒకరినొకరు తప్పించుకుంటూ నిద్రలో పొరుగుతున్నారు. ఇద్దరికీ మూడో మనిషి తోడులేదు. ఇద్దరూ ఒకరికొకరు తోడుగా, ఒకరి మీద మరొకరు ఆధారపడుతూనే, ఎవరికి వారే వంటరిగా, ఎవరి అవేదనలతో వాళ్ళు సతమతమవుతున్నారు. తన చుట్టూ తాను తిరుగుతూ సూర్యుని చుట్టూ తిరిగే భూమివలె ఈ తల్లీ కూతుళ్ళు ఒకరి చుట్టూ మరొకరు తిరుగుతున్నా – ఎవరికి వారు ఏకాకులే. మానసికంగా ఏకాకులే. పగలల్లా ఆహారం కొరకు శ్రమించి, తిరిగి తిరిగి రాత్రికి గూడు చేరుకునే ఏకాకివలె, తల్లివుండి వంటరిదయింది గంగ.

'అమ్మా' అని తన తల్లిని నోటితో పిలిచి పన్నెండేళ్ళయింది. ఈ పన్నెండేళ్ళలో - గంగ తల్లిని 'అమ్మా' అని నోరెత్తి పిలవలేదు.

నలభై ఏళ్ళు నిండని కనకం, యీ నాటికి, యీ పది సంవత్సరాల నుంచీ సుఖంగా పొడుదుడుకులు లేకుండా జీవితం గడపగలుగుతున్నది.

"అత్తా ఓ గరిట కాఫీపొడి బదులు యిస్తారా? ఓ సోలెడు బియ్యం అప్పివ్వండి" అని యీ పది సంవత్సరాలలో - ఏ ఒక్క రోజూ ఆమె ఎవరినీ నోరు తెరిచి బదులు అడగలేదు. అడిగే అవసరం రాలేదు. పది సంవత్సరాల క్రితం అలా చేబదుళ్ళు అడగకుండా ఒక్కరోజు గడవలేదు. గంగ తల్లి పట్ల కర్తవ్యాన్ని ఏనాడూ విస్మరించలేదు. ఉదయం కాస్త భారంగా కనబడితే మధ్యాహ్నం అయేప్పటికి డాక్టర్ గుమ్మంలో ఉంటాడు. చినిగిపోయిన చీరతో కనకం కనబడితే ఆ సాయింత్రం అయేసరికి పది కొత్త చీరలు యింట్లో వుంటాయి. నెలాఖరు అయినా రెండొందలు చేతులో ఆడుతుంటాయి. ఇచ్చిన డబ్బుకు తల్లిని ఏనాడూ కూతురు లెక్క అడగదు. ఆనాడు గరిట కాఫీపొడి కోసం దీనంగా నిలబడిన తాను యీనాడు చుట్టు పక్కలందరికీ ధారాళంగా చేబదుళ్ళు యివ్వ గలుగుతోంది. కట్టు బట్టలతో సంసారం ఆరంభించిన తాను, యీనాడు స్టీలు సామాను కొనని నెల లేదు. సుఖంగా స్వతంత్రంగా జీవితం వెళ్ళిపోతోంది. పెద్ద వాళ్ళకి యింతకంటే ఏం కావాలి? ఏం కోరుకోవాలి?

ఎప్పుడైనా గణేశన్ వస్తూవుంటాడు. మూడువందలు జీతంతో, అరడజను మంది పిల్లలతో, ముప్ఫైరూపాయల యింటి అద్దెతో వాడు పడుతున్నయిబ్బందులు తల్లిదగ్గర వెళ్ళబోసుకుంటాడు. కష్టాలన్నీ విని యీ తల్లి తన చెల్లెలు సంపాదన తనకి దోచి పెట్టాలనే ఆశ వాడికి ఎప్పుడూ లేదు. ఒకవేళ తల్లీ యిద్దామని అనుకున్నా పుచ్చు గోవడానికి ఆత్మాభిమానం అడ్డువస్తుంది. ఊరినిండా అప్పులుచేసి, అవితీర్చలేక సతమతమౌతున్నా తల్లిదగ్గరనుంచి ఒక్క పైసాకూడా ఆశించడు అతను. 'తల్లినికదా

నన్ను అడక్కూడదా - అడిగితే డబ్బు యిస్తాను' అని కనకానికి వున్నా అతను ఎప్పుడూ అడగలేదు. అసలు అతను డబ్బుకోసం యిక్కడికి రావడం లేదు.

అతను హాలులో కూర్చుని గంగను గురించి గాలి కబుర్లు విని, ఆ పుకార్లగురించి ఎత్తుతాడు. దానికి కనకం ఘాటుగా బదులు చెప్పి, ఖండించేటప్పటికి దెబ్బలాట వేసుకుంటాడు. గణేశన్ హాలులో వున్నంత సేపూ గంగ గది విడిచి బయటకు రాదు. కనకం మనుమలనీ మనుమరాళ్ళనీ పండగ పబ్బాలకి తీసుకొచ్చి బట్టలు కుట్టించినా, ఏదన్నా పిండివంటచేసి వాళ్ళకి తీసుకెళ్ళినా, పుస్తకాలూ అవి కొనిచ్చినా గంగ ఏమి అడగదు. పండుగ రోజుల్లో ఒకటి రెండు రోజులు పిల్లలని అట్టే పెట్టుకున్నా అభ్యంతర పెట్టదు. ఆ విషయాల్లో కలిపించుకోదు.

ఆ పిల్లలు రావటం, వాళ్ళసందడీ అవీ కూతురికి మనసులో యిష్టంగానే వుంటుంది అని అనుకుంటుంది కనకం.

కనకం ప్రతిపనీ కూతురుకోసం తాపత్రయపడి చేస్తూవుంటుంది. తన కూతురి సుఖంకోసం అలమటించి పోతూంటుంది. కాని ఆ అమ్మాయి జీవితానికి ఒకమాయని మచ్చ ఏర్పడింది - ఆ జీవితం మోడువారి పోయింది. చిగురించని ఆ జీవితాన్ని, ఆ మాయని మచ్చని తల్చుకున్నపుడల్లా కనకం ఆవేదనతో వాపోతూంటుంది.

ఆ మచ్చని, ఆ సంఘటనని కనకం ఎంత ప్రయత్నించినా మరవలేకుండా వుంది. ఆ సంఘటన ఆమె గుండెల్లో గునపంవలె గుచ్చుకుని బాధ పెడుతోంది.

వారం రోజుల క్రితం ఆ పత్రికలో కథ చదవమని - విసురుగా పడేసి వెళ్లింది గంగ. తన కూతురు యింతబాధ పడుతోందని, తనమీద క్రోధం వెళ్ళబోస్తున్నదని, తనని నేరస్తురాలివలె చూస్తున్నదని - కనకానికి అప్పుడుగాని తట్టలేదు. కూతురి మనసులో తనపై యింత ద్వేషం గూడుకట్టుకుని వుందని వూహించలేకపోయింది.

సాయంత్రం అయేసరికి అలవాటు ప్రకారం వంట ముగించి, వంటగది సర్దుకుని, వీధితలుపు తెరిచి, గుమ్మాలదగ్గర రోడ్డు కనపడేటట్లుగా, పత్రిక చేతిలో పట్టుకుని కూచునివుంది. ఆ పత్రిక చదువుతుందనికాదు. కూతురి రాకకోసం అలా నిరీక్షిస్తూ వుంది. వీధిదీపాలు వెలిగినాయి. వీధివరండాలోని స్విచ్ నొక్కి, లోపల లైటు ఆర్పే సింది. ఒకసారి పత్రిక చదువుతుంది. ఒకోసారి వీధిలో వచ్చేపోయే జనాన్ని చూస్తూ వుంటుంది. కళ్ళు రోడ్డుమీద వున్నా - మనసుమటుకు కూతురు రాకకై తహతహ లాడుతూ వుంటుంది. రోడ్డుమీద నుండి రాబోయే గంగ మూర్తికోసం ఆమెకళ్ళు ఆదుర్దాగా ఎదురుచూస్తూ వుంటాయి. ఆమె మనసు "ఇది యింకా రాలేదు. ఆఫీసు నుంచి యింకా ఎందుకు రాలేదు ?" అని క్షణ క్షణానికి ఆదుర్దా పడుతూంటుంది. 'బయటకెళ్లిన పిల్ల యింకా తిరిగిరాలేదు - ఇంకా రాలేదు' అని గుండెలు కొట్టు కుంటూంటాయి. ఇలా ఖంగారుపడి ప్రయోజనంలేదని, ఇది అనవసరమైన ఆదుర్దా

అని కనకానికి తెలుసు. అయినా ఆమె మనసుని నిలదొక్కుకోలేకపోతోంది. 'కూతురు యిలా ఆలశ్యంగా రావడానికి తగినంత కారణంవుంది. దానికి తనే బాధ్యురాలు' అని ఆమె మనసు బాధపడుతోంది.

సాధారణంగా గంగ దీపాలు పెట్టేలోపునే యింటికి వస్తుంది. అయిదు - అయిదున్నర్ర అయేటప్పటికి ఒకోసారి యిల్లు చేరుకుంటుంది. కొన్నిసార్లు ఆరు ఏడు, ఒకోసారి ఎనిమిది కొడితేకాని యింటికి రాదు. దాన్ని అడగడానికి ఎవరున్నారు? ఎవరికి ధైర్యం వుంది! దానిష్టమొచ్చినపుడు కొంపకి చేరుకుంటుంది.

'అసలు దాన్ని ఎందుకు అడగాలి? తప్పుదోవన పోతుంటేగదా అడగడానికి? ఈ వయసులోనే అదొక విరాగిలాగా బతుకు వెళ్ళదీస్తోంది. దానివయసు పిల్లలు సినిమాలని గినిమాలని తిరుగుతుంటారు. ఇది ఒక సినిమాకిగాని, నాటకానికిగాని, ఆఖరికి పాటకచ్చేరికి కూడా వెళ్లదు. అసలు వీధి గుమ్మంలోకే రాదు. నలుగురు మనుషులున్న చోటుకే రాదు. అసలు మనుషులని చూస్తే దానికి భయమేమోనని పిస్తూంటుంది. నావంకే కళ్ళెత్తి చూడదు. అందుకే మనుషులంటే దానికి భయం అనుకుంటున్నాను. అదిగో ఎదురింటి గుమ్మంలో ఆ అమ్మాయి నిల్చుని వుంది. వీధివాకిట్లో నుల్చోని ఆడవాళ్ళుంటారా? వుండకేం వుంటారు - మా గంగలాంటి వారు. మా గంగలేదు! వీధులోకి తలెత్తిచూడదు. సంసారులుండే యిలాంటి వీధుల్లో ఆడపిల్లలు వాకిట్లో నులుచుంటే - తప్పుగా తోచదు. బహుశా ఆ అమ్మాయి ఆఫీసుకు వెళ్ళిన భర్త యింకా రాలేదని ఎదురుచూస్తున్నదేమో! బడికి వెళ్లినపిల్లల కోసం ఎదురుచూసేవాళ్ళు. పొయ్యిమీద గిన్నెపడేసి అణా ఆవాలు తెమ్మని పనిమనిషిని పంపి, దానికోసం ఎదురు చూస్తున్నదేమో! ఇలా పిల్లలూ భర్త అని ఎదురు చూడటంలో ఒక అందం వుంది. నిండుతనం వుంది. ఈలాటి అదృష్టం అందరికీ వుంది తాము ఒక్కరే దీనికి నోచుకోలేదు - - - -

'మా గంగ వీధిలో హడావుడి జరుగుతున్నా బయటకి రాదు. తొంగి కూడా చూడదు. ఓ పెళ్లి వూరేగింపు, ఓ దేముడు వూరేగింపు యిలా బాజాలు వినిపించ గానే నేను మటుకు చిన్నపిల్లలా ఎక్కడ పని అక్కడ వదిలేసి పరుగెత్తుకొని వచ్చి, వీధి వాకిట్లో నిలుచుండిపోతాను. అది మటుకు తలుపు ఘడియ పెట్టుకుని, చదువు కుంటూనో, రాసుకుంటూనో, లేకపోతే చేతులుకట్టుకు సూన్యంలోకి చూస్తూనో గడుపుతుంది. అంతేగాని బయటకి మటుకు రాదు . . .

ఆ గదితలుపు తట్టడానికి నాకు భయంగా వుంటుంది. నా కడుపున పుట్టినపిల్ల అయినాకూడా దాన్ని చూస్తే నాకు బెరుగ్గా వుంటుంది.

'ఇలాగే వుంటే ఎట్లా?

'ఇదేవిధంగా ఎప్పుడూ వుండటానికి వీలవుతుందా?

'నా దగ్గరకొచ్చి ఏదైనా మాట్లాడితేకదా నేను మంచి చెడ్డా చెప్పడానికి ! అయినా మాట్లాడేందుకు ఏముంటాయి ? అది రోజూ ఆఫీసుకి వెళ్ళి వస్తూంటుంది. నేనింత వండి పెడుతుంటాను. తింటుంది ఆఫీసుకెళ్తుంది. నేను బతికివున్నంతకాలం యీ వండి వార్చడం తప్పదు. ఈ వుడకేసిపెట్టడమూ తప్పదు. ఇంతే జీవితం అంటే. పొద్దుట ఎనిమిదీ అయేప్పటికి చెయ్యికాల్చుకోని రోజంటూవుండదు. ఘున్నాటరవై రోజులూ పొద్దుతోపాటు నేనూ యీ వంటపని చేస్తూంటాను. నా వంట్లో వోపిగ వున్నంత వరకూ, నా బొందిలో ప్రాణం వున్నంతవరకూ యిలా వుడకేసి పెడతాను. నా ప్రాణం హరీ అంటే దీని గతేంకాను ? ఎవరు చూస్తారు దీన్ని ? ఒక వంటదాన్ని కుదుర్చుకుంటుందేమో ! వంటమనిషి దొరకచ్చు, వండి వార్చవచ్చు, అంతేగాని దీని జీవితంలో మార్పురాదు. దీని దినచర్యలో మార్పు రానేరాదా ?

'ఇల్లాంటి పిల్లని పట్టుకుని ఏమనగలను ? విరాగివలెవుండే దీన్ని గురించి అంటానికీ వింటానికీ ఏముంటాయి ? నాకయితే వుండవుగాని - దాని అన్న గణేశన్ వున్నాడే — వాడికి కావలసినన్ని వుంటాయి. క్రిందటి నెలలో వచ్చాడు నా సుపుత్రుడు. వాడు వచ్చేవేళకి గంగ యింట్లోవుంది. గదిలోవుంది. వాడికి అది గదిలో వుందని తెలుసు. లేక తెలియదేమోకూడా ! కాకపోతే తెలిసికూడా అది వినాలనే రామాయణం విప్పాడో ? వున్నవీ లేనివీ అవాకులూ చెవాకులూ మొదలు పెట్టాడు. అవన్నీ దాని చెవుల్లో పడివుండవా ? 'ఎవరువచ్చి ఏం వాగితే నాకేం - నా గురించి ఏం పేలినా నాకు లక్ష్యంలేదు' అని అది మాట్లాడకుండా వూరుకున్నపుడు - వాడుసిగ్గు లజ్జా వున్నవాడైతే, అంత అసహ్యంగా మాట్లాడి వుండేవాడా అని. అనలు దాన్ని గురించి - ఇలాంటి అభాండాలు వెయ్యడానికీ వాడికి నోరెల్లా వచ్చిందో ? అది ఎట్లానన్నా వుండనీ - వాడికెందుకు మధ్య. దాని ప్రవర్తన గురించి మాట్లాడే హక్కు వాడికి లేదు - - - -

'మా గంగ ఏం చేసినా 'రయిట్ రాయల్'గా ధైర్యంగా చేస్తుంది. కిటికీ వెనక నక్కి, తలుపు వెనకాల నక్కి తొంగి చూడదు. రహస్యంగా వినదు. కావాలంటే ఎదురుగా నులుచుని, ధైర్యంగా తలెత్తి చూస్తుంది. అడగదలుచుకుంటే ఒకటికి రెండు అడిగి మరీ పంపుతుంది. ఇతర్ల గూర్చి అనవసరంగా మాట్లాడదు. ఇతర్ల విషయంలో జోక్యం చేసుకోదు. ఎంతకీ తన పనేదో తను చేసుకుపోతుంది. తనేమో - తన పనేమో -

'అమ్మా ! యీ అమ్మాయి నా స్నేహితురాలు' అని యింతవరకూ ఏ స్నేహితురాలనీ యింటికి తీసుకుని రాలేదు. దీనికి స్నేహితులంటూ వున్నారా అని ? అనలు యిది ఎవరితోనైనా సరదాగా ఆఖరికి నవ్వుతూనన్నా మాటాడుతుందా

అని? ఇది ఆఫీసులో కూడా యిలా ఏకాకిగా వుంటుంది కాబోలు. తల్చుకుంటే నాకే ఆశ్చర్యంగా వుంటుంది ....

'నెలకి యాభైరూపాయలు సంపాయిస్తున్న పిల్లలయినా ఈ రోజుల్లో పెళ్ళి పేరంటం చేసుకుని, ముఖం నిండా యింత పిండి పూసుకుని, కళ్ళ నుంచి చెవుల దాకా కాటుక పెట్టుకు, షోకు చేసుకుని దర్జాగా ఆఫీసులకి వెళుతున్నారు. మా గంగ చేతినిండా సంపాయిస్తోంది .... దీనికెంత జీతం యిస్తారో? ఇంతా అని నాకు తెలియదుకాని గణేశన్ అంటూవుంటాడు, ఏడువందల యాభయ్యో, ఏడు వందలో యిస్తారని . . . ఏముంది? సబ్బుతో మొహం కడుక్కుని తడితుడుచు కుంటుంది. ఆఖరికి పౌడరుకూడా రాసుకోదు . . . .

'అట్లాంటిదాన్ని పట్టుకుని అనరాని మాటలు అంటూంటాడు. గంగ రోజూ వాకింగ్‌కి వెళ్తుందట. ఆ గొప్పవార్త నా చెవుల వెయ్యడానికని పనివేశావచ్చాడు. ఆ ట్రిప్లికేన్ వుచ్చకంపు సందులో వాళ్ళలాగా మగ్గిపోతూ పడివుండలేదని వాడిబాధ. వాకింగ్‌కి బీచ్‌రోడ్‌లో వెళ్ళక ఆ కంపుసందుల్లోకి వెళతారా? బస్‌ఎక్కి ప్రయాణం చేసి వాకింగ్‌కి వెళ్తోందని వాడిబాధ. వెళితే వెళుతుంది దాని యిష్టం. అది ఏది కావాలంటే అది చేస్తుంది.

'దానికి స్నేహితులంటూ లేరు. వెళ్ళడాని కిఒక యిల్లుకూడా లేదు. గుడికి వెళ్ళదు, దేవుడికి దణ్ణం పెట్టదు. ఇంట్లో నేను దీపారాధనచేస్తాను. ఏదో నా అలవాటు కొద్దీ పూజా పునస్కారం చేస్తాను. ఆఖరికి అది పూజ గదిలోకి కూడా రాదు. . . .

ఏదో ఆలోచించుకుంటూ కొంచెందూరం నడిచివస్తూవుంటుంది రెండుపూట్లాను. పొద్దుటపూట షికారుకెళ్ళివచ్చి, స్నానంచేసి, అన్నంతిని ఆఫీసుకి వెళుతుంది. సాయంత్రం ఆఫీసునుంచివచ్చి స్నానంచేసి, ఆపైన షికారుకెళుతుంది. ఇది పెద్ద బ్రహ్మాండమైన వార్తలాగా, అపూర్వమైన విషయంలాగా ట్రిప్లికేన్‌నుంచి మూట కట్టుకుని వచ్చాడు. వాడి పెళ్లాం, అదే .... మూటకట్టి మీ అమ్మకి చెప్పిరండి అని పంపించివుంటుంది. వీడు ఆ వార్తమోసుకుని నా దగ్గరకొచ్చాడు. ఈ గణేశన్ ఎప్పుడూ ఇంతే.

'ఇది చదివి చూడు' అని నా ముఖం మీద విసరికొట్టినట్లు పడేసిందే! ఆ కథలోమాదిరి ఆ రోజూ కూడా వర్షం దిమ్మరించినట్లు కురిసింది. నేను కడుపున పుట్టినపిల్ల అని కూడా చూడకుండా చచ్చేట్లు బావగొట్టాను. తల పట్టుకుని గోడకేసి 'టప టప' బాదాను. తలంతా బొప్పి కట్టి వాచిపోయింది. వొళ్లు జ్వరంతో సల సల కాగిపోతోంది. అట్లాటి పరిస్థితిలో 'ఒక్క నిముషం కూడా యిక్కడ వుంటానికి వీల్లేదు' అంటూ మెడపట్టుకుని వీధిలోకి యీడ్చి పారేశాడు యీ పాపిష్టివాడు.--

2

'వీధి గుమ్మంలో శవంలాగా, ప్రాణంలేని కట్టెలాగా పడివుంది పిల్ల. కన్న కడుపు భగ్గుమంది. పరుగెత్తికెళ్ళి కిందబడ్డ పిల్లని వొళ్ళోకి లాక్కున్నాను. 'అది కావాలంటే నువ్వు కూడా బయటకి పో' అని వీధి తలుపు మూసి లోపల గడియ పెట్టుకున్నాడు. దాన్ని ఎలాగో ఎత్తుకుని వీధి అరుగుమీద పడుకోబెట్టుకున్నాను. అందరూ అంతా విని తమాషా చూసినట్లుగా, బయటకొచ్చి నులుచుని చూస్తున్నారు - - - -

'నేను పాపిష్టిదాన్ని. కసాయిదానిలాగా వొంటిమీద తెలివిలేని పిల్లను పట్టుకు 'చచ్చిపో - ఎక్కడన్నా పడి చావు' అని వుండి వుండి బావబాదాను. అలాంటి పిల్లను కొట్టి కొట్టి, ఆ బాధ భరించలేక నా నెత్తిని నేనే బాదుకున్నాను. పిల్లని కొట్టి నన్ను నేను కొట్టుకుంటుంటే ఆ చుట్టుపక్కలవాళ్ళు అడ్డుతగిలి సమాధానపరిచారు. తెలివిలేని పిల్లనూ, నన్నూ అలా ఆ అరుగుమీదే - యింత కాఫీ, వేళకింత అన్నం పడేశారు. ఎదురుగుండా వోదార్చి - అయ్యో అని జాలి పడి, పక్కకెళ్ళి మమ్మల్ని చూసి హేళనగా నవ్వేవారు. ఇది తలఎత్తలేదు, మూసిన కన్ను తెరవలేదు. ప్రాణం లేనట్టు పడివుంది. ఆ వర్షంలో చెడిపోయిన దీన్ని పెట్టుకుని, వయసులో వున్న దీన్ని పెట్టుకుని - అలా అరుగుమీద కూచుని వున్నాను. ఇది యిలా భ్రష్టురాలయిందని విని, మొగవాళ్లు అందులో రౌడి పిల్లలు రాబందుల్లా అరుగుచుట్టూ తిరుగుతుంటే కళ్లల్లో వత్తులు వేసుకుని కాపాడుకున్నాను. దీన్ని నా కడుపులో దాచుకున్నాను. కోపం, దుఃఖం, అవమానం, అసహాయం యివన్నీ నన్ను ముంచెత్తుతుండేవి. భరించలేక దాన్ని మళ్లీ మళ్లీ చితక బాదుతూండేదాన్ని. వెకిలిగా దానివంక చూస్తున్న మొగ పిల్లలని ఏమీ చెయ్యలేక 'దాన్ని సముద్రంలోకి తోసి, నేనూ దూకుదామని అనుకున్నాను' ఆఖరికి రెండు రోజుల యమయాతన తరువాత వెంకు అన్నయ్య వచ్చి - మా యిద్దరినీ వెంటపెట్టుకుని తీసుకెళ్లిపోయాడు. ఆయన దయవల్లనే యిది చదువుకుంది. దాన్ని కాలేజీలో చేర్పించి, హాస్టల్లో పెట్టి చదివించాడు. దాని చదువు ఖర్చంతా అన్నయ్యే భరించాడు. అంతా ఆ మహానుభావుడి చలవే! ఇది అన్ని పరిక్షలూ పాసయింది - రాష్ట్రానికంతా ఫస్ట్ వొచ్చింది. అంత తెలివయిన పిల్లకి ఎవరు సీటు యివ్వరు - ఎందుకు వుద్యోగం యివ్వరు! ఇదంతా మా వెంకు అన్నయ్య చలవే. ఆయనే ఆ రోజున ఆదుకోకపోతే ఏమయిపోయి వుండేవారమో! ఆయన సాయం చేశాడు. ఇది బాగా చదువుకుని, ఈనాడు రెండు చేతులా సంపాయిస్తోంది - - - - .

'ఆనాడు నేనూ యీ పిల్లా పడిన కష్టాలు పగవాళ్లకి కూడా వద్దు, నా పరమ

శతృవు కూడా మేము పడిన కష్టాలు పడకూడదని భగవంతుని వేడుకుం టూంటాను. - - - -

'దానికి లోకం తెలియని వయసులో జరగకూడనిది జరిగిపోయింది. దీని జీవితం ఛిన్నాభిన్నమై పోయింది. ముక్క ముక్కలయింది. దాని జీవితం యిలా అయిపోవడానికి నేను కూడా కొంత కారణం అనుకుంటున్నది గంగ. ఇన్నాళ్లకి నన్ను దోషిగా నిలబెట్టి చూస్తున్నది. నిజంగా నేనే అందుకు కారణమా? - - - -

'నీవే కారణం అని వేరే నోటితో చెప్పాలా? పోయినవారం నా ముఖాన్న కొట్టిందే ఆ పత్రిక - అది చదివినప్పటినుంచీ నా మనస్సులో అగ్ని పర్వతాలు పగులుతూనే వున్నాయి....

'నాకన్న కూతురు బతుకు ఇలా బ్రద్దలయి పోతుందని నాకానాడు తోచలేదు. దాని జీవితం చెడిపోయిందనే బాధలో, ఆవేదనలో నిప్పులాంటి ఆ నిజాన్ని కప్పి వుంచుకోలేక పోయాను. పైపెచ్చు దాన్ని ఎగసనదోసాను. ఆ అగ్ని నా మాటలతో ప్రజ్వరిల్లి బయట పడిపోయింది. అది దాచిపెట్టాలని, గుంభనగా వుండాలని నాకు తెలియలేదు. అసలు అటువంటి మార్గం వుందని యీ కథ చదివిన వెనుకగాని నాకు తట్టలేదు. ఇటువంటి తప్పుడు పనులు జరిగినప్పుడు, అలాంటివేమీ జరగనట్లు దాచిబెట్టి మామూలుగా బతకగలరని నాకిప్పుడిప్పుడే తెలిసివచ్చింది. పిల్లలని కనగానే సరా? వాళ్ల ఆలనా పాలనా చూసి పెంచితే సరిపోతుందా? ఇటువంటి సంఘటనలు ఎదురైనపుడు - గుట్టుగా గుంభనగా ప్రవర్తించాలని తెలియకపోవడంచేతనే దాని జీవితం సర్వనాశనమయింది. ఈ కథలోని అంతరార్థం అటువంటి రంపపు కోతకి లోనయినవాళ్లకి గాని బోధ పడదు. నేను అటువంటి అగచాట్లు పడ్డాను కాబట్టి యిప్పుడు తెలుసుకున్నాను. ఇప్పుడు తెలుసుకుని ప్రయోజనం ఏముంది? అంతా చెయ్యి దాటిపోయింది. అది తెలుసుకోగలిగిన వయసు నాకిప్పుడే వచ్చింది. అప్పుడు అది పదిహేడు సంవత్సరాల పిల్ల - నేను ముప్ఫైఏడేళ్ల పిల్లని. ఆ వయసులో నాకు ఏది మంచి ఏది చెడు అని తెలుసుకొనే విచక్షణ లేదు. ....

'ఎవడో దాన్ని ఎక్కడికో రహస్యంగా తీసుకుపోయి అన్యాయం చేశాడు. అంత చిన్న వయసులో దాని జీవితాన్ని ముక్కలు ముక్కలు చేశాడు ....

'ఆ రోజున అది వచ్చిన తీరు తల్చుకుంటే నాకిప్పటికీ కడుపు దహించుకు పోతూవుంటుంది. ఆ కడుపు మంటలో నా బుద్ధి మందగించింది - నా బుర్ర పని చేయలేదు ....

'ఆ కథలో ఆ పిల్ల సరిగ్గా అలాటి స్థితిలోనే వచ్చి నిలిచింది. అది చూసిన ఆ తల్లి కడుపు ఎలా భగ్గున మండిందో! నాకు ఈనాటికీ అలానే కడుపు దహించుకు పోతున్నది ....

'మొదట్లో నా మాదిరిగానే కోపం పట్టలేక తల్లి ఆ పిల్లని బావబాదింది. ఆ పిల్ల ఏడుపు విని పక్క వాటాల్లోని వాళ్లు పరుగెత్తుకొచ్చారు. బావు దెబ్బలు కొడుతున్న తల్లినీ, కుళ్లి కుళ్లి ఏడుస్తున్న పిల్లనీ చూసి 'ఏమిటి? ఏం జరిగింది?' అని ప్రశ్నించ మొదలుపెట్టారు. అసలు యిలాటి ప్రశ్నలు వెయ్యడానికే కదా - యిరుగుపొరుగూ వున్నది ....

ఆ కథలో తల్లి జరిగింది జరిగినట్లు చెప్పబోయి, ఎవరో నెత్తిన మొట్టినట్లు గబుక్కున ఆగి, నెమ్మదిగా 'ఆ ఏం లేదు - యీ పాడుపిల్ల జోరునకురిసే వర్షంలో తడిసి ముద్దయి వచ్చిందా? రేపు జబ్బు చేస్తే ఎవరు చాకిరి చేస్తారు? వొళ్ళు మండి కొట్టాను -' అంటూ తెలివిగా బదులు చెప్పింది ....

'అయ్యో - నేను కూడా ఆ రోజున ఆ సమయంలో నిజం దాచి, ఏదో ఒక సాకు చెప్పలేకపోయానే! నేను కూడా కథలోని ఆ తల్లిలాగా తెలివిగా చెప్పి వుంటే నా కూతురి జీవితం యిలా బుగ్గి అయిపోయి వుండేది కాదు. ఇలా మోడు వారి పోయేది కాదు. దాని జీవితం వ్యర్థమయి పోవడానికి నేను కూడా కారణభూతురాలినయ్యాను. 'నేను కూడా' అని కాదు - నేనే నా చేతులారా దాని జీవితాన్ని పగలగొట్టాను ....

'ఈ కథలో ఆ పిల్లని తల్లి తిట్టి, కొట్టి, ఆ పిల్లని ఏడిపించి తాను ఏడ్చి, చివరికి ఆ పిల్లని దొడ్లోకి తీసుకెళ్ళి నెత్తిన నాలుగు చెంబుల నీళ్ళు దిమ్మరించి, చెయ్యి పుచ్చుకుని యింట్లోకి తీసుకొచ్చి తల్లి ఆ పిల్లకి బుద్ధి చెప్పింది. 'ఎప్పుడూ యిలాంటి పాడుపనులు చెయ్యవద్దని' హెచ్చరించింది. ఆ రోజున నా కడుపులో పేగులన్నీ పెగుల్చుకు వచ్చినట్లుగానే - కథలోని ఆ తల్లికీ కడుపులో పేగు కదిలి వుంటుంది ....

'ఆ కథలోని ప్రతి మాటా - ప్రతి వాక్యం నా కోసం చెప్పినట్లే వుంది. నన్ను వుద్దేశించి నా కొరకు చెప్పినట్లుంది ....

'ఇది ఎవరికీ చెప్పకమ్మా. ఇది బయటకు తెలిసిందంటే ఒక కుటుంబం నేల కూలిపోతుంది. మన యింట్లోనూ ఒక ఆడపిల్ల వుంది, దానికి యిలాటి అన్యాయం జరిగితే ఏం చేస్తాం – అని ఎవరూ యోచించరు. లోకులు కాకులు. ఈ మచ్చ నీ జీవితానికే కాదు - యీ కుటుంబానికి, మన వంశానికి అంతకూ పాకుతుంది. ఇది ఇక్కడితో మర్చిపో – ఇలాంటిది నీకు సంభవించలేదని అనుకుందాము ....

'నేను నాశనం చేశాను. దాన్ని సర్వనాశనం చేశాను' అని బాధ పడుతోంది కనకం. మెట్లమీద కూచుని కూతురి రాకకోసం ఎదురుచూస్తూ ఆమె చెప్పరాని వ్యధతో కృంగిపోతున్నది.

వీధి గుమ్మంలో టాక్సీ వచ్చి ఆగింది.

ఏదో భయంతో, ఖంగారుగా నిల్చుండిపోయింది కనకం.

టాక్సీలోంచి చిన్న సూట్‌కేసుతో వెంకు అన్నయ్య దిగాడు, అమ్మయ్య అనుకుంది కనకం.

"అదేమిటన్నయ్యా యిప్పుడేం రైలు లేదే? ఎలా వచ్చారు?" అంటూ ఎదురువెళ్ళింది ఆ చిన్న కాంపౌండు గేటు దగ్గరకు.

"పొద్దుటే వచ్చాను. రైలు లేటయింది. సరాసరి స్టేషన్నుంచి కోర్టుకి వెళ్ళిపోయాను. అక్కడినుంచి ఒకరిద్దరిని కలుసుకుని మాట్లాడుతుంటే టైము తెలియలేదు. గంగ ఎక్కడ? కనిపించదేం?" అని అడుగుతూ హాలులోకి వచ్చి నల్లకోటు విప్పి కుర్చీకి తగిలించి, పక్కనున్న యీజీ ఛైర్లో కూలబడ్డాడు.

"ఇది యింకా ఆఫీసునుంచి రాలేదు"

"ఎనిమిది గంటలవుతోంది ఇంకా పూరమ్మట తిరుగుతూనే వుందా? నువ్వు దాన్ని కాస్త కేకలెయ్యకూడదా అని-" అతను అడుగుతున్నాడు. ఆ కంఠంలో అధికారంతో కూడిన ఒక విధమైన కోపం కూడా ధ్వనించింది.

## 3

కేసులు వాదించడంలో వెంకు మామయ్య ఒక పులి అని అందరూ అంటూంటారు. నేరస్థులని విచారణ చేస్తున్నవాడిలాగా ఒక చేతిలో పత్రిక మడిచి పట్టుకుని, రెండో చేతిని వూపి వూపి ఏదో చెబుతున్నారు. అమ్మ స్థంభానికి ఆనుకుని నుల్చుని వుంది. నేను మెట్లు ఎక్కి లోపలికి రాబోతున్నాను.

మామయ్య దేన్ని గురించో బిగ్గరగా మాట్లాడుతున్నాడు. మొదట్లో దేన్ని గురించి మాట్లాడుతున్నాడో అంతు పట్టలేదు గాని, ఆయన చేతిలో ఆ పత్రికా అమ్మ ముఖ కవళికలూ పట్టి బహుశా ఆయన ఆ విషయం గురించే మాట్లాడుతున్నాడని వూహించగలిగాను.

దేన్ని గురించి మాట్లాడుతున్నాడు?

అదే ఆ కథ లేదూ— ఆ కథ రాసిన ఆర్. కె. వి. ని ఓ పట్టు పట్టి చూస్తున్నాడు.

"ఇతనిలాగా రాసేవాళ్లందరినీ ప్రాసిక్యూట్ చేసి పారెయ్యాలి. ఇందులో ఏదో పెద్ద మోరల్ వున్నట్లు - పైగా నిన్నుకూడా చదవమని యిచ్చిందా? నెత్తిమీద చెంబుడు నీళ్ళు దిమ్మరిస్తే తప్పు వొప్పవుతుందా? ఇంకనుంచీ ఒకోతప్పు చేసి, ఒకో సారి తల్లి దగ్గరకొస్తుంది, ఆ తల్లి ఒక్కొక్కసారి యిలా నెత్తిన నీళ్ళు చల్లుతుంది అనేకదా మనం అనుకోవాలి. ఈ లెక్కన బోగంవాళ్ళందరూ రోజు స్నానం చేస్తూనే వున్నారుగా అప్పుడు వాళ్ళందరూ పతివ్రతలయిపోయివుండాలే! తప్పు ఎప్పుడూ తప్పే. ఒకసారి చేసిన తప్పు ఎప్పుడూ వొప్పవదు. ఈ కథలో చెప్పి నట్లుగా చెయ్యడం మొదలుపెడితే, యింక ఆడపిల్లలని నమ్మటం అంటూ వుండదు. అటువంటప్పుడు వైవాహిక జీవితంలో పవిత్రత అన్నదానికి అర్థం లేకుండా పోతుంది. అది ఏ వుద్దేశ్యంతో నిన్నీ కథ చదవమని చెప్పిందో నాకు అర్థం కావ డంలేదు. అంటే నువ్వు ఆ కథలో తల్లి మాదిరిగా అది చేసిన తప్పుడు పనిని దాచి పెట్టివుండాల్సింది అనేనా? నువ్వు చెప్పావే - నిన్నేదో దోషిలాగా చూస్తున్నదని . . . నీ కెందుకు అలా అనిపిస్తోంది? ఇలాంటి పాడుపనులని సంసార్లు మూసిపెట్టి వుంచ రాదు: వుంచకూడదు. నీకూతురిపట్ల నీకు ప్రేమా, సానుభూతి ఎంతైనా వుండి వుండవచ్చు. కాని ఆ క్షణంలో నువ్వు ఈ విషయాన్ని దాచి పెట్టలేక పోయావ్? ఎందుకని? దీనికి మించిన విలువలేవో నీలోవుండి, ఆ విషయాన్ని దాచలేక పోయావు, ఇలా తప్పు చేసినపుడల్లా తల్లి దాచిపెడుతుందే అనుకుందాము. ఇలాటి తప్పుడు పనులు ఒకసారి కాకపోతే ఇంకోసారి బయటపడక మానవు. ఈలాటి రహ స్యాలు ఎన్నటికి దాగవు. ఆ రచయిత పిల్ల దృక్పథంనుంచి ఆ కథ రాశాడు. వొప్పు కుంటాను. మరి ఆ తల్లి విషయం? ఆ కుటుంబ మర్యాద విషయం ఆలోచించాడా? నేను చెబుతాను విను యిలాటి విషయాలు కప్పిపెట్టడం మహాపాపం. ఆ పాపానికి ప్రాయశ్చిత్తంలేదు. ఈమాదిరివి దాచిపెడితే ఆ పైన ఎవరికీ నైతిక విలువలంటూ వుండవు. అందరూ విచ్చలవిడిగా ప్రవర్తిస్తారు. ప్రతివాడు తప్పుచేసి కప్పిపెట్టు కుంటాడు. ఈ కథలోని తల్లిలాగా నువ్వు చేయగలవా? ఊహు - అది మనలాటి మర్యాదస్తులు చెయ్యలేని పని. ఒకవేళ నువ్వు అలా దాచిపెట్టావే అనుకో – మన కుటుంబం, వంశం, మానంమర్యాద యివన్నీ ఏమయివుండేవి? మన ధర్మ శాస్త్రాలు ఈలాటి పాపిష్టి పనులని వొప్పుకోవు. పవిత్రమైన వివాహక్రతువుని అపవిత్రం చేసిన పాపం నిన్ను చుట్టుకొని వుండేది. నామటుకు నాకు నువ్వుచేసిన పని సవ్యంగాను, ధర్మబద్ధంగానూ తోస్తున్నది. ఆనాడు యీ పాడుపని మూసిపెట్టి దీనికి పెళ్లిచేశావే అనుకో – అప్పుడు వివాహ వ్యవస్థలోని పవిత్రతకు అర్థం ఏమిటి? నువ్వు దాచకుండా పైకి చెప్పినందువల్ల ఏం నష్టం కలగలేదే! అదేం బజార్లు పట్టుకుపోలేదే! వీధులవెంట పడలేదు. బజారు కుక్కని చిన్న పిల్లలు

పట్టుకు వస్తే ఏం చేస్తావు? తన్ని తరుముతారు. ఇదేదో పెద్ద విషయంలాగా, నువ్వేదో తొందరపాటుగా ప్రవర్తించావని దిగులుపడటం నేను ఒప్పుకోను. అలా నువ్వు బాధపడటం నాకేం బాగాలేదు."

మామయ్యకు తర్కించడం, హేతుబద్ధంగా వాదించడం ఎవరూ నేర్పక్కర్లేదు. అది ఆయనకు వుగ్గుపాలతో వచ్చిన విద్య.

నేను వీధిమెట్ల మీద నులుచుని వున్నాను. మామయ్య యింకా ఏదో మాట్లాడుతూనే వున్నాడు. నాకామాటలు స్పష్టంగా వినిపించడంలేదుగాని, అస్పష్టంగా చెవుల పడుతున్నాయి. మామయ్య అంటున్న మాటలు పూర్తిగా వినిపించక పోయినా, ఏం అంటున్నాడో వూహించుకోగలను. మామయ్యకి కోర్టులో వాదించి వాదించి బిగ్గరగా అరవడం అలవాటు అయిపోయింది. ఆయన మామూలుగా మాట్లాడితే కోపంతో కేక లేస్తున్నట్లుంటుంది. నిజానికి కోపంగనక వస్తే ఆయన మాట్లాడడు పళ్ళు బిగబట్టి శబ్దం బయటకి రానివ్వడు.

ఆయన కోపం ఎటువంటిదో, శబ్దంరాని ఆకోపం ఎంత భయంకరమైనదో అంబుజం అత్తని అడగాలి. అడిగినా ఆవిడ చెప్పదు. అసలు అత్త నాకు యీ విషయాలు చెపుతుందని నేనూ అనుకోలేదు. అత్తని తలుచుకుంటే జాలిగా వుంటుంది. ఆవిడ చెప్పిన మాటలు జ్ఞాపకం చేసుకుంటుంటే కడుపులో గుబ గుబ మంటుంది. అంబుజం అత్తని చూస్తే సూర్యరశ్మి సోకక, నీడపట్టున ఎదిగిన మొక్క జ్ఞాపకం వస్తుంది. ఎండ పొడతగలక తెల్లగా పాలిపోయిన మొక్కలాగ వుంటుంది అత్త. వంచిన తల ఎత్తకుండా, యిరవై నాలుగు గంటలూ అలా ఏదో ఒక పనిలో నిమగ్నమయి వుంటుంది. చాకిరిచేసి చేసి అత్తవొళ్ళు క్షీణించిపోయింది. ఏదో శాపవశాత్తూ యీ యింట్లో పడ్డ పురాణ కాలంలోని దేవతామూర్తిలాగా, ఆ శాప విమోచనకొరకు, పళ్ళుబిగబట్టుకు నిరంతరం ఎదురుచూసే ఒక సహనమూర్తి లాగా తోస్తుంది ఆవిడని చూస్తుంటే. కాని అత్తకి శాపవిమోచనం తన చితిలో తప్ప మరెక్కడా లభించదని నాకు తెలుసు. ఆ విషయం తలుచుకుంటే ఏదోబాధగా వుంటుంది.

మామయ్యకు దాదాపు డెబ్భై ఏళ్లు వుంటాయి. అత్తకు దగ్గిర దగ్గిర్గ అరవై ఏళ్ళు వుండవచ్చు. అరవై ఏళ్ళు వచ్చినా అత్త ఈనాటికీ తలుపు వెనక నుంచి బయటకురాదు. చిన్న పసి పిల్లవాడి గొంతు, ఆఖరికి పనివాళ్లతోనయినా ఎదురు పడి మాట్లాడదు. గొంతెత్తి జవాబివ్వదు. తలెత్తి చూడదు. ఏదో బెరుగ్గా, తప్పని సరిగా ఒకటి రెండు మాటలు నెమ్మదిగా చెబుతుంది అంతే. ఆవిడకు పుట్టింటి వాళ్ళు ఎవరూ లేరు. ఒకవేళవున్నా వాళ్ళు మామయ్య అరుపులకి దడిసి ఈ వైపులకి రారేమో! మామయ్య ఆస్తిలో సగభాగం అత్త పుట్టింటినుంచి తెచ్చిందే.

ఆవిడకు పిల్లా పాపాలేరు. పిల్లలు లేరని మామయ్య కొన్నేళ్ల క్రితం యింకో పెళ్లి చేసుకున్నాడు. ఆ భార్య పెళ్లి అయాక ఓరెండేళ్ళు కాబోలు బతికింది. దెయ్యమో, పిచ్చో ఏదో పటి చచ్చిపోయింది. ఆ తరువాత మామయ్య మళ్లీ పెళ్లి చేసుకోలేదు.

నన్నూ అమ్మనూ అన్నయ్య యింట్లోంచి తరిమేసినప్పుడు మామయ్య మా యిద్దరికీ ఆశ్రయమిచ్చాడు. తను వచ్చి మాయిద్దరినీ తీసుకెళ్లాడు. ఆరోజుల్లో అంబుజం అత్త గురించి అమ్మ ఏమేమో చెబుతూండేది. ఇప్పటికీ అమ్మకి అత్తంటే సదభిప్రాయంలేదు - ఆమెపై సానుభూతి లేదు. పైపెచ్చు ఆవిడంటే కోపం కూడా. అమ్మ మాటలు వింటుంటంచేత నాకు ఆవిడంటే భయంగా వుండేది. అమ్మ అత్తని 'తాచు పాము' అంటూండేది. తంజావూరులో వెంకు మామయ్య తోటలో ఒక తాచు పాము వుంటూండేది. అది ఎవరినీ కాటేసేదికాదు, ఎవరికీ హాని చేసేదికాదు. గోధుమ వన్నెలో మిల మిలా మెరిసే ఆ పాము పగపట్టిందా కాటేయక మానదు. అదికాటేస్తే ఆ మనిషి యిక బతకడం కల్ల. 'అత్త కూడా అలాంటిదే పగబడితే వదలదు' అంటూండేది అమ్మ. పైకి ఎంతో సాధువుగా కనిపిస్తుంది. ఆ పాము కూడా ఎవరిజోలికీ పోక చాలా రోజులుగా ఆ తోటలోవుంది. అయినా దానిని నమ్మకూడదు. మీ అత్త కూడ అంతే పైకి ఎంతో సౌమ్యంగా కనిపిస్తూ, సవితికి మందు పెట్టి చంపింది. ఆ సవితి చచ్చిపోవడానికి యీావిడే కారణం. .... మామయ్య సొత్తును ఎవరన్నా ముట్టుకుంటారేమోనని - భూతంలా కాపలా కాస్తూవుంటుంది.

అంబుజం అత్త గురించి అమ్మ యింకా చాలా చాలా చెప్పింది. నన్ను జాగ్రత్తగా వుండమని, ముఖ్యంగా అత్త దగ్గిరకు వెళ్లద్దని చెప్పి, తంజావూరులో మామయ్య గారింట్లో నన్ను వుంచి, రెండురోజుల్లో తిరిగి వచ్చేసింది. నిజానికి ఆరోజుల్లో అత్తఅంటే నాకు చాలా భయంగా వుండేది. అత్త యింటి వెనుక భాగం దాటి ముందు భాగంలోకి వచ్చేది కాదు. ఆ వైపుకి నేను వెళ్లేదాన్ని కాదు. అత్త కంట బడగానే భయంగా మామయ్య వెనక నక్కేదాన్ని. ఆ తరువాతనే నాకు తెలిసి వచ్చింది - నేనొక పులి వీపు మీద స్వారీ చేస్తున్నానని. ఆ విషయం నాకు తెలియ జెప్పింది అంబుజం అత్తయ్యే. 'ఈ పులి మామయ్య'కు కోపం వస్తుందని నాకు అప్పుడే మొదటి మాటు తెలిసింది.

ఎట్లా జరిగిందో, ఎప్పుడు జరిగిందో సరిగ్గా చెప్పలేను కాని - ఒక రోజున మామయ్య బయటకెళ్లాడు. ఇంట్లో ఎవరూలేరు. ముందు వసారాలో కూచునివున్న నన్ను వెనక నుంచి అత్త 'పాపా - పాపా' అంటూ పిలుస్తూ వచ్చింది. అత్త యీ వైపులకి ఎప్పుడూరాదు, నాకు భయం ఆశ్చర్యం రెండూ కలిగాయి. వీధి తలుపు గడియ తీసుకుని బయటకి పారిపోదామనుకున్నాను. కాని ఎందుకనో వెళ్లలేక

పోయాను. గోడనానుకుని రెండు చేతులూ దూరంగా పట్టుకుని, పరుగెత్తి పారిపోవడానికి తయారుగా నుల్చున్నాను.

ఇంత వయసువచ్చిన నన్ను చిన్నపిల్లని పిల్చినట్లు 'పాపా' అని అత్త పిలుస్తుంటే ఆవిడపట్ల నాకున్న భయం కాస్తా ఎగిరిపోయింది. ఆమెపట్ల ఏదో చెప్పరాని జాలి కలిగింది.

భయపడటానికి నేనేం పసిపిల్లనా? నేను ఏ పనిచేసి, ఏ పరిస్థితుల్లో యీ యింటికి వచ్చి చేరుకున్నానో ఒక్కసారి నెమరువేసుకున్నాను. అత్తను చూసి భయపడినందుకు నాలో నాకే నవ్వుగావుంది. అసలు దేనికి భయపడాలి? ఎందుకు భయపడాలి? జన్మయిచ్చిన తల్లి, తోడబుట్టినవాడు, ముక్కు మొహం తెలియని ఆ అపరిచితుడు వీళ్లందరూ నాలోని భయాన్ని పోగొట్టేశారు. వాళ్లకంటే ఎక్కువగా నన్నెవరూ భయపెట్టలేరు. 'ఏమిటత్తా?' అంటూ ప్రేమగా నవ్వాను. అత్త వెక్కి వెక్కి ఏడుస్తూ, కళ్లు తుడుచుకుని, బెదురుతూ నాలుగు పక్కలకీ చూసింది.

"ఇక్కడ సుల్చోవాలంటే నాకు భయంగావుంది. వెనక యింట్లోకి రా" అంటూ పరుగులాంటి నడకతో వెనక భాగంలోకి వెళ్లపోయింది. నాకు ఏం అర్థం కావడం లేదు. వెనకభాగంలోకి వెళ్లాను. అప్పుడు తెలుసుకున్నాను పాపం! అత్త ఎంత అమాయకురాలో, ఎన్ని కష్టాలు పడుతోందో, ఆ తరువాత మామయ్య యింట్లో లేనపుడల్లా అత్త దగ్గరకెళ్లి కూచునేదాన్ని. అత్త ఎవరి దగ్గరా చెప్పని, ఎవరికీ చెప్పుకోలేని విషయాలన్నీ నాతో చెబుతూండేది. ముఖ్యంగా మామయ్య గురించి చెప్పే సంగతులు నమ్మడానికి వీలులేనివి ఎన్నో చెప్పేది. మామయ్య పరమ శత్రువు కూడా 'ఛీ-ఛీ యిన్ని అభాండాలా' అని ఆశ్చర్యపోయే విషయాలు చెప్పింది. చెప్పరాని విషయాలు, మామయ్య స్వభావంలోని వక్రాలన్నీ నాకు తెలుసు. మామయ్యకు బలి అవబోయే నాకూ, బలి అయిన అత్తయ్యకూ తప్ప యీ విషయాలు మూడో కంటివాడికి తెలియదు. ఆ తరువాతనే నాకు మామయ్యను చూసినపుడల్లా పెద్దపులిని చూసినట్లు అనిపించేది. మామయ్య యిల్లు పులిబోను లాగా అనిపించడం మొదలుపెట్టింది.

అదిగో! మెట్లమీద నుల్చున్న నాకు మామయ్య ముఖం కనిపిస్తున్నది. కుర్చీకి నల్లకోటు తగిలించివుంది. ఈజీఛైర్‌లో వెనకనుంచి చొక్కా వేలాడుతోంది. ఒక్క బనియన్ మటుకే వేసుకుని, నడుముకి ఆ మోటు బెల్టు పెట్టుకుని, కుర్చీలో కూచుని ఖబుర్లు చెబుతున్నాడు మామయ్య. ఆ తోలుబెల్టు ఎటువంటి భయంకరమైన ఆయుధమో ఒక్క అంబుజం అత్తకు మటుకే తెలుసు.

ఒకరోజున అత్త నాకు చూపించింది. వీపుమీద, గుండెలమీద, పొట్టమీద, తొడలమీద, గొంతుమీద, జబ్బలమీద - ఈ పులి ఎవరికంటాపడని ఆ చోట్లు

కనిపెట్టి కోపంతో ఎలా బాదాడో! వంటిమీద వాతలు వాతలుగా, పొంగి ఎర్రబడి వుంటం చూశాను. అత్తకి ఆ దెబ్బల పుట్టుపూర్వోత్తరాలు బాగా తెలును. "ఇదిగో ఎర్రగా రక్తం గడ్డకట్టినట్లున్నాయే ఇవి - నిన్న కొట్టిన దెబ్బలు. నీలంగా కమిలిపోయివున్నాయే అవి - పోయిన వారం కొట్టినవి. అంతకు ముందు కొట్టినవి ఇవిగో నల్లగా మచ్చలు పడుతున్నాయి"

"పాపా యీ విషయాలు ఎవరి దగ్గరా అనకు. ఇవి ఎవరికీ తెలియకూడదని నాలోనే దాచిపెట్టి వుంచుకున్నాను. వీటిని ఎవరికంటా పడనీయకుండా నాతోపాటే నాచితిలో తగలపెడతాను. ఎవరి కంటా పడనీయకూడదని దాచి వుంచుకున్నాను. నేను చచ్చిపోయాక మోసుకెళ్లి స్మశానంలో దించినప్పుడు, పైబట్టలు తీసుకొనే ఆ వెట్టివాళ్లకి మటుకే యీ వాతలు కనబడుతాయి. వాళ్లు వాటినిచూసి - ఏదో అనుకుంటారు. నాకుతప్ప యీ దెబ్బలు ఎవరికీ తెలియ కూడదు. ఎవరి దృష్టికీ రాకూడదు. ఈ వాతలు నాతోనే కాలి నుసి అయిపోవాలి. పాపా - ఎందుకో నీకీ విషయాలన్నీ చెప్పేశాను. ఎవరికీ చెప్పకూడదని అనుకుంటూనే నీకు చెప్పేశాను. ఈ విషయం నువ్వు ఎవరికీ చెప్పకు. ఎవరకీ చెప్పనని మాటియ్యి. చేతిలో చెయ్యివేసి చెప్పు-"

అత్త చేతిలో చెయ్యివేసి - ఈ విషయాలు ఎవరికీ చెప్పనని మాటయిచ్చాను. నేను ఈ విషయాలు ఎవరికీ చెప్పను, చెప్పలేను, చెప్పకూడదు. అత్తకి మాట యివ్వడం ఒకటేకాదు, మామయ్య నాకు చేసిన వుపకారం, ఆనాడు అనాధగా నిరాధారంగా రోడ్డుమీద నిలబడివున్నపుడు - మామయ్య నన్ను ఆదరించి నీడ యిచ్చాడు. నాకు చదువు చెప్పించాడు, హాస్టల్లో చేర్పించాడు, నాకోసం డబ్బు ధారాళంగా ఖర్చు పెట్టాడు, నాకు వుద్యోగం దొరికింతరువాత కూడా మధ్య మధ్య వచ్చి మంచి చెడ్డలు కనుక్కుంటున్నాడు. ఇవన్నీ మర్చిపోగలనా? ఇంత ఉపకారం చేసి, నన్నింత వృద్ధిలోకి తీసుకువచ్చిన మామయ్యలోని యీ బలహీనతని, యీ లోపాన్ని బయటపెట్టడం ధర్మంకాదు. ఆ పనిచేస్తే నాకు మహాపాపం వస్తుంది. నేను అటువంటి పని చెయ్యను, చెయ్యలేను.

ఏది ఏమయినా ఈ మామయ్య ఒక పెద్దపులి. ఈ పెద్దపులి దగ్గర జాగ్రత్తగా మసులుకోవాలి. ఆ విషయమే అత్త నాకు చెప్పింది. అదే నేను అత్తదగ్గర నేర్చుకున్న మంత్రం.

మెట్లమీద నిలుచున్న నన్ను మామయ్య యింకా చూడలేదు. ఇప్పుడేగదా నేనూ వచ్చింది. 'ఆ' అని నెమ్మదిగా మామయ్య ఒక్కమాట అనేలోపల నామనసులో యిన్నిభావాలు పరుగెత్తాయి. ఈ మనసు ఎంత వేగంగా పరుగెడుతుందో!

ఆ కథగురించీ, ఆ కథరాసిన వాడివిగురించీ చాలా తేలికగా మాట్లాడుతూ తన మనసులోని అక్కసున్నంతా ఆ పత్రికని నేలకివేసి విసిరికొట్టడంలో చూపించి, నడుముకున్న బెల్టుని విప్పుతూ, గుమ్మంలో వున్న నన్ను చూశాడు మామయ్య. నేనూ ఆయనవంక చూశాను.

మామయ్య ముఖం పెద్దపులి ముఖంలాగానే వుంది. రెండువైపులా చెవుల తమ్మెలదాకా కడ్డీలవంటి మీసాలు, వెనకాల వేలాడుతున్న గిరజాలజుట్టు. ఇవి చూస్తుంటే నాకు పెద్ద పులిని చూసినట్లే వుంటుంది. ఈ పులి నన్నుచూసి నవ్వు తోంది. నేనూ నవ్వాను. నామీద ప్రేమ కురిపిస్తుంది. నాకు నిలువనీడ నిస్తుంది. అయినా ఇది పెద్ద పులి. ఈ పులిపట్ల నేను విశ్వాసం కలిగివుంటాను. కృతజ్ఞత చూపిస్తాను. నాకు యీ పులివల్ల రక్షణకావాలి. పది సంవత్సరాలుగా యీ సర్కస్ నడుస్తూనేవుంది. సర్కస్ అంటే పులిని మచ్చికచేసుకుని ఆడించడమొక్కటే కాదు, పులితో జాగ్రత్తగా బ్రతకడంకూడా సర్కసే.

నన్ను చూడగానే అంతవరకూ మాట్లాడుతున్న ఆ ధోరణి మారిపోయింది. అసలు ఆ కంఠధ్వనే మారిపోయింది.

"రా - రా" అంటూ అల్లరి చేసివచ్చిన పసిపిల్లను పిల్చినట్లు, బెల్టు పూర్తిగా విప్పకుండానే చెయ్యి చాచాడు మామయ్య. సగం విప్పిన ఆ బెల్టు రాజుగారి నడుం నుంచి వేలాడుతున్న ఖడ్గంలాగావుంది. లేచిముందుకొచ్చి, నన్ను గట్టిగా కావలించు కుని, గుండెలకి హత్తుకున్నాడు మామయ్య. పక్కనులుచున్న అమ్మ మమ్మల్ని చూసి కళ్లుతుడుచుకుంది. అమ్మ చిన్నతనంలో మామయ్య ఒక ఆడపిల్లకి తండ్రి అయే వయసులో వుండివుంటాడు. ఆ వయసు మనిషిని చూస్తుంటే - పైవాళ్ళకి పసిపిల్లలమీద ప్రేమపాశం తప్ప మరోభావం తోచదు.

మామయ్యకు తన వయసు ఆయనకొక పెట్టని గోడవంటిది. ఒక తెరవంటిది. అసలు ఆయన ఆయనకే ఒక పెద్ద కోటగోడ. ఆయన వున్నతస్థితి, ఆ మాటలు, ఆ చెప్పే విషయాలు, ఆయనకున్నటువంటి విషయపరిజ్ఞానం, కర్మ క్రతువులపట్ల ఆయనకున్న నమ్మకాలు, ఆయనకున్న ధర్మశాస్త్ర, పరిజ్ఞానం, ఆయన పాటించే నిత్యానుష్ఠానం - ఇవన్నీ చూసినవాళ్ళు ఆయన కాళ్లమీద పడటం పరిపాటి. ఇది అతిశయోక్తి కాదు - పచ్చినిజం. "కోపం పట్టలేకపోతే కాలుకి కాలు, చెయ్యికి చెయ్యి నరికి పోగులుపెట్టు. నీకేం పరవాలేదు. వకీలు వెంకట్రామయ్యారు వున్నాడు. మిగతాది ఆయన చూసుకుంటాడు" అని ఆయన్ని దేవుడు అన్నట్లు చాలామంది చాలాసార్లు అనుకోవడం నాచెవులతో నేను విన్నాను. ఆయనకున్న వాగ్ధాటితో బోనులో నిలబడ్డ హంతకుడిని నిరపరాధిగానూ, నిరపరాధిని హంతకుడుగాను వాదించి నిరూపించగలడు. ఇంగ్లీషులో అనర్గళంగా వాదిస్తుంటే, జడ్జీ వొళ్లుమరిచి

వింటూంటాడుట. సరస్వతీ మహాలుకి వచ్చే సంస్కృత పండితులంతా మామయ్య ఇంట్లోనే దిగుతారు. ఆయన వాళ్లతో సంస్కృతంలోనే మాట్లాడుతారు. ఇదంతా నేను యీనాడు కొత్తగా చెప్పక్కర్లేదు. ఆయనతో పరిచయం వున్నవారందరికీ యీ విషయాలు తెలుసు.

ఇన్ని తెలిసిన యీ మనిషి, డెభై ఏళ్ల యీ ముసలాడు చూసేవాళ్లకి, యీ తాతకి మనుమరాలిమీద ప్రేమవాత్సల్యాలు పొంగిపొర్లుతున్నాయి అన్నట్లు ప్రవర్తించే, ఈ డెభై ఏళ్ల వ్యక్తి ఎంత పోకిరీమనిషో నా ఒక్కదానికే తెలుసు. చెబితే ఎవరూ నమ్మరు. బస్‌లో వస్తుంటే మీద మీదకి వంగి మోకాలుతో పొడుస్తూ వుంటాడు. టాక్సీలో వద్దామనుకుంటే వేరే చెప్పక్కర్లేదు. ఈ పెద్దమనిషి 'ఉమన్ హంటర్' అని బయటకి ఎలా చెప్పను ? చెప్పానంటే ఆఖరికి మా అమ్మకూడా నా మాట నమ్మదు. అయినా – నా మనసుకి నాకు తెలుసు. ఈ మామయ్యపట్ల నాకు విశ్వాసమూ, భయమూ రెండూ మిళితమయి వున్నాయి.

మూతికాలిన పిల్లిలాగా – ఒకే ఒకసారి జీవితంలో .... ఇంకోసారి అటువంటిది జరగదు. ఒకసారి ఒకడి చేతుల్లో చిక్కుకుని మోసపోయాను. నిజంగానే నేను చిక్కుకుని మోసపోయానా ? నాకు ఆ సంఘటనతో సంబంధంలేదా ? నిర్బంధం వల్ల, నిస్సహాయతవల్ల వొప్పుకున్నా అది మోసపోయినట్లేకదా ! ఆ ఒక్క అనుభవం తరువాత, ఆ సంఘటన తరువాత - నాకు ఏ మొగవాణ్ణి చూసినా, వాడు దగాకోరు, మోసగాడు అన్నభావం కలుగుతోంది. ప్రతిమొగవాడినీ సంశయంతోనే చూస్తున్నాను. అప్పటినుంచీ ఏమొగవాడిని నమ్మలేకుండా వున్నాను.

కాని అప్పుడే ఆ క్షణంలోనే అతనితోపాటు అతనింటికెళ్లి వుండిపోదామని అనుకున్నాను. అలా అనుకోవడం తప్పుకాదని ఈ మామయ్య నాకు తెలియజెప్పాడు.

అంబుజం అత్త ధర్మమా అని ! అత్త 'ఇతను పెద్దపులి - జాగ్రత్తగా వుండు' అని నన్ను హెచ్చరించకపోయి వున్నట్లయితే ఏమయిపోయి వుండేదాన్నో ? ఏమయివుండేదాన్ని. ఇంకోసారి బురద పూసుకుని వుండేదాన్ని. మరోమాటు వూబిలో దిగబడి వుండేదాన్ని. ఏది ఎట్లా జరిగినా ఇదివరకటిలాగా జరిగిందంతా చెప్పి నలుగురిలో నవ్వులపాలు మటుకుకాను. అసలు అటువంటి పరిస్థితి రాకుండా నా జాగ్రత్తలో నేను వుంటాను.

అందుకనే మామయ్య పెద్దపులి అని గ్రహించుకుని కూడా, అసలు రంగు పసిగట్టి కూడా, ఆ విషయం అమ్మకు చెప్పకుండా జాగ్రత్త పడ్డాను. ఒకవేళ పిచ్చిదాన్నిలాగా మామయ్య అసలు రంగు బయటపెట్టాలని అనిపిస్తే, వెంటనే పాత విషయాలు జ్ఞాపకం వచ్చేస్తాయి. ఎంతో నమ్మకంతో, కొండంత భరోసాతో

భగవంతునిసాక్షిగా తన తల్లి, తన స్వంతం అన్న భావంతో ఏమీ దాచకుండా ఆనాడు అన్నీ చెప్పినందువల్ల ప్రతిఫలం ఏమయింది? ఆ నమ్మకానికి ప్రతిఫలం దెబ్బలు, తిట్లు, అవమానాలు.

జరిగిందంతా చెప్పివుండకూడదు అని చెప్పిన మరుక్షణంలోనే అనిపించింది. కాని ఏం లాభం? కాలుతోపాటు నా నోరు కూడా జారిపోయింది. వెనక్కి తీసుకోలేకపోయాను. ఆ క్షణంనుంచీ 'అమ్మ' అన్నది నా అవసరంకొరకు, నా సౌకర్యంకొరకు ఏర్పడిన వ్యక్తిగా తప్ప పూర్వపు ప్రేమ నమ్మిక అన్నీ మర్చిపోయాను, అన్నిటినీ తుడిచివేశాను. ఆ తరువాత నేను అమ్మతో నోరెత్తి ఒక్క మాట మాట్లాడలేదు. ప్రేమాభిమానాలు మాసిపోయిన యీ తల్లి దగ్గర నేను 'మామయ్య ఒక పెద్ద పులి' అని ఎలా చెప్పను? ఆ చెప్పే అవకాశం ఎప్పుడో జారిపోయింది.

ఇటువంటి విషయాల్లో ఒకరు ఇంకొకరికి సాయం చెయ్యడం, సలహాలివ్వడం వీలుకాదు. తమకు తాము యోచించుకొని తామే సాయం చేసుకోవాలి. అంతేగాని బయటనుంచి ఎటువంటి చేయూతారాదు. ఆనాడు నేను వున్న పరిస్థితుల్లో - యీ పులి యిచ్చేటువంటి రక్షణం, యీ పులి సహాయం నాకు కావలసివుంది. నాకు ఆ స్థితిలో చావాలని అనిపించలేదు. మరణమనేది చాలా నికృష్టమైన మార్గంవలె నా మనసుకి తోచింది - అన్నయ్య గొంతుపట్టుకు నడివీధిలోకి యీడ్చిపారేశాడు, అమ్మ సముద్రంలో పడి చావమంది. అటువంటి పరిస్థితిలో ఆ రోజున యీ మామయ్య ఒక్కడు మాత్రమే 'నేను వున్నాను' అని తిరుచ్చిలో చదువుకోమని, కాలేజీలో చేర్పిస్తానని అన్నాడు.

ఈ పులిని ఆధారంగా జేసుకుని, ఈ పులి దగ్గర బ్రతకడం నేర్చుకోవచ్చునని నాకు అనిపించింది. ఈ పులి పంజాకు చిక్కకుండా, మోసపోకుండా బ్రతకడం నేర్చుకున్నాను. ఇది పెద్దపులి. మంచిపులి. బుజ్జగించి, భయపెట్టి, మచ్చిక చేసుకుని, వీపుపైకెక్కి స్వారీ చెయ్యాలిగాని దీని పంజా కింద చిక్కి బలి అవకూడదు. కొన్ని సమయాల్లో ఈ మామయ్య పెద్దపులి అవుతూంటాడు. అప్పుడు బోను తలుపులు మూసేసినట్లు, గది తలుపులు మూసేస్తాను. కొన్ని సమయాల్లో కొందరు మనుషులు క్రూరజంతువులవలె యిలానే ప్రవర్తిస్తూంటారు. వాళ్ల పరిధిలో వాళ్లు న్యాయంగా ప్రవర్తించామనే అనుకుంటారు. నేను నాకు ధర్మమనితోచిన మార్గాన్న ఆ క్షణానికి తగిన వేషం ధరించి, నన్ను నేను కాపాడుకుంటూంటాను. ఈ పన్నెండు సంవత్సరాలనుంచీ మామయ్య అనే యీ పెద్దపులినుంచి నేను యీ విధంగానే తప్పించుకుని, నన్ను నేను రక్షించుకుంటూ వచ్చాను.

ఇప్పుడు నేను పులి చేతుల్లో చిక్కుకుని వున్నాను.

"రా - రా" అంటూ వచ్చి నన్ను గట్టిగా పట్టుకున్నాడు మామయ్య. "ఏ - పిల్లా - వై ఆర్ యు సో లేట్ ? ఆఫీసునుంచేనా రావడం ? నువ్వు యింకెక్కడికీ వెళ్లవుగా ? అయిదుగంటలంటే అయిదుకొట్టేప్పటికి ఫైల్సనీ కట్టేసి నువ్వు బయట కొచ్చెయ్యాలి. 'యు మస్ట్ హావ్ ఢిఫెనెట్ అవర్స్ ఫర్ ఎవ్విరి థింగ్' గంగ అంటే యిన్ని గంటలకి ఆఫీసులో వుంటుంది, యిన్ని గంట్లకి యింటికి వస్తుంది - అని ఖచ్చితంగా వుండాలి. అంతేగాని వేళాపాళాలేకుండా పని చెయ్యకూడదు. ఇలా చేస్తుంటే ఆరోగ్యం చెడిపోతుంది. పొద్దున్న పదింటికి అన్నం తిని వెళ్లివుంటావ్- మధ్యాహ్నం ఏమన్నా తిన్నావా ?" అని నన్ను పట్టుకుని కొరుక్కుతినేసేటట్లు వీపంతా తడుముతూ, బుజాలూ జబ్బలూ పట్టుకుని కుదిపి నొక్కుతున్నాడు. నేను వుక్కిరి బిక్కిరి అయి నెమ్మదిగా ఆలోచించి బదులు చెప్పాను.

"మజ్జిగా అన్నం"

నేనేదో తమషా విషయం చెప్పినట్లుగా మామయ్య 'ఓ' అంటూ బిగ్గరగా నవ్వి, "అనుకుంటూనే వున్నా నువ్వు మజ్జిగా అన్నం పట్టుకెళ్లి వుంటావని. మీ అమ్మ అంతకిమించి ఏంచేసి యివ్వదని నాకు తెలుసులే. నువ్వు పెద్ద ఆఫీసరువి, సెక్షన్ హెడ్‌వి కూడా అనుకుంటా. టిఫిన్ డబ్బాలో మజ్జిగా అన్నం తీసుకెళ్లడానికి నీకు సిగ్గు వెయ్యడంలేదా అని ? మీ ఆఫీసులో కాంటీన్ వుందిగా. అందులోంచి తెప్పించుకోవచ్చుగా. నిన్ను ఆ గుంపులో నిలుచోమనికాదు. ప్యూన్‌ని పంపి నీ రూమ్‌కి తెప్పించుకోవచ్చుగా- పోనీ సాయింకాలం కాఫీ అన్నా తాగావా ?"

ఈ ముసలాడు ఎంతకీ వదలకుండా పట్టుకు గుంజుతున్నాడని కడుపులో మంటగావుంది.

'నేను అనాథనై వున్నపుడు, నాకు చదువు చెప్పించి జీవితంలో ఒక దారి చూపించాడు. . . .'

నాకు ఏడుపు వస్తోంది. బుజాలు వదలడు. అడిగినదానికి నిదానంగా బదులు చెప్పడానికని బ్రహ్మప్రయత్నం చేస్తున్నాను.

"కప్పు కాఫీ కూడా తాగకుండా ఆ డబ్బంతా కూడబెట్టి ఏం చేస్తావ్ ?" రెండు బుగ్గలూ పట్టుకు సాగదీస్తున్నాడు.

"అయ్యో వదలండి - నెప్పిగా వుంది" అంటూ ఒక్కసారి అరిచాను. నా కంట్లో గిర్రున నీరు తిరిగింది. నేను నెప్పి అని అరిచింది అబద్ధం. నా ఏడుపు మటుకు నిజం.

ఇదంతా చూసి అమ్మ చిన్నగా నవ్వుతోంది.

"కనకం - నాకూ నా మేనగోడలికీ మంచి కాఫీ తీసుకుని రా"

అమ్మ లోపలికెళ్లింది.

"వదలండి. నేను వెళ్లి డ్రస్ ఛేంజి చేసుకుని వస్తాను" అని చేతుల్లోంచి విడిపించుకుని పరుగెత్తాను.

"ఇదుగో పిల్లా తలుపు గడియ పెట్టుకోకు నేనూ వస్తాను" మామయ్య వేళాకోళం చేస్తున్నారు.

"పొండి - మామయ్య" నేను గబాలున గదిలోకి దూరాను.

గదిలోకి వచ్చి తలుపు వేసుకుని ఒక్క క్షణం నులుచున్నాను. మనసులో ఆ ముసలాడి మోటు సరసం మెదిలింది. కళ్లంట నీళ్లు గిర్రున తిరిగాయి.

కన్నీళ్లు. అవును మనసుని ప్రక్షాళనం చేసే నీరు - అది వుప్పునీరు.

## 4

మామయ్యా నేనూ వాకింగ్‌కి బయలుదేరాము. వాకింగ్‌కి వెళ్లే యీ అలవాటు నాకు మామయ్యవల్లనే కలిగింది. తంజావూరులో వున్నపుడు మామయ్య కోసమని నేను రోజూ వాకింగ్‌కి వెళ్లేదాన్ని. ఆ రోజుల్లో వాకింగ్‌కి వెళ్లటమంటే నాకు మా చెడ్డ బోర్‌గా వుండేది. నడిచి నడిచి కాళ్లు నెప్పులు పుట్టేవి. తెల్లవారు ఝామున అయిదింటికల్లా మామయ్య నిద్దర లేచేవాడు. 'లట లట' మంటూ వుండే ఒక లూజు నిక్కర్ వేసుకుని, నేను పడుకున్న మంచం దగ్గరకొచ్చి 'ఏయ్ పిల్లా - లేలే - నువ్వు ఆడపిల్లవుగదూ ! ఇంకా నిద్రేమిటి లేలే" - అంటూ చేతి కర్రతో నెమ్మదిగా తట్టి లేపేవాడు.

మామయ్య కంఠం వినగానే పక్కబట్టలు సర్దుకుని లేచి, గబ గబ ముఖం చేతులూ కడుక్కుని, పరికిణీ వోణీ సరిచేసుకుని వచ్చేదాన్ని. నేను వచ్చేదాకా మామయ్య వాకింగ్ స్టిక్ గిర గిర తిప్పుతూ కాచుకుని వుండేవాడు

మామయ్య నా కోసం అలా ఎదురుచూస్తూ వుండటం, నాకు కొంచెం గర్వంగా వుండేది. అంత పెద్దమనిషి నన్ను రోజూ వెంటబెట్టుకుని వాకింగ్‌కి వెళుతున్నారంటే మొదట్లో గొప్పగా, సంతోషంగా వుండేది.

పాపం! నేను లేనప్పుడు వొంటరిగా వెళ్లాలి కాబోలు అని జాలిగా వుండేది.

ఒంటరిగా వెళ్లలేక మామయ్య నన్ను సాయం తీసుకెళుతున్నారనీ, నా కంపెనీ ఆయనకు సంతోషాన్ని యిస్తోందని కూడా అనుకుంటూండేదాన్ని.

ఆ తరువాత పోను పోను వాకింగ్‌కి వెళ్లాలంటే నాకు విసుగనిపించేది. – బోర్‌కొట్టేది.

మా వీధి చివరన మలుపు తిరిగి, అక్కడినుంచి అడ్డంగా నడిచి, పైవీధి మలుపు తిరిగి, ఆస్పత్రి రోడ్‌మీదుగా నడుస్తూ, పెద్ద కోవెల వీధిలోంచి, కొత్త రోడ్ మీదుగా వెళ్లేవాళ్లం. వొచ్చేటప్పుడు శివగంగ తోట పక్కనుంచి నడిచి వచ్చేవాళ్లం. ఒక్కోరోజున కొత్తదారమ్మంట వెళ్లి వస్తూ వుండేవాళ్లం. పొద్దుటపూట వాకింగ్‌కు వెళ్లేటప్పుడు రూట్ మార్చి వెళుతుండేవాళ్లం. సాయంత్రం పూటమటుకు రోజూ కోవెల ప్రాకారం చుట్టూ ప్రదక్షిణంచేసి, అక్కడినుంచి శివగంగ తోటకి వచ్చి,ఆ తోటంతా తిరిగి, లోపల ఒక మూలగా మర్రిచెట్టువుంది - అక్కడినుంచి చూస్తే శివగంగ కోనేరు కనబడుతుంది. అక్కడ ఎత్తుగావున్న ప్రదేశంమీద ఆ చెట్టు కిందన కూచునేవాళ్లం. రాత్రి ఏడుగంటల దాకా ఆ చెట్టు కింద గడిపేవాళ్లం.

అలా కూచున్న సమయాల్లో యీ మామయ్య మాట్లాడే మాటలు, ఆయన అడిగే ప్రశ్నలు, ఆయన చెప్పే కథలు యివన్నీ ఆ రోజు కార్లో తీసుకెళ్లిన - ఆ మనిషికీ నాకూ మధ్య నడిచిన సంఘటన గురించే, ఆ మనిషి గురించే వుండేవి.

చూసేవాళ్లకుమటుకు తాతా మనుమరాలూ షికారు కెళుతున్నారు అన్నట్లు కనిపించేది.

ఏం మాట్లాడి ఎక్కడ మొదలుపెట్టినా చివరికి సంభాషణ ఆనాటి సంఘటన దగ్గరకే వచ్చి చేరేది.

"వాడు నిన్ను పిలవగానే 'సరే' అని కార్లో ఎక్కి కూచుని వుంటావ్ ?"

"ఊహ - లేదు మొదట్లో నేను రాను అనే చెప్పాను"

"మనఃపూర్వకంగా చెప్పావా ? లేక నాలిక చివరినుంచి అన్నావా ?"

"నాకు భయంవేసింది అందుకనే రానుగాక రానన్నాను"

"ఆ తర్వాత నీకెల్లా ధైర్యం వచ్చింది. ఆ భయం ఎల్లా పోయింది ?"

"భయంగానే కారెక్కాను"

"నీకు అతనంటే యిష్టం కలిగింది కాబోలు"

"ఊహు అదేం లేదు"

"మరి ఎందుకెళ్లావ్ ? అందులోనూ భయపడి ఎక్కానంటున్నావ్ ?"

"వర్షం కురుస్తోంది"

"పెద్ద వర్షమా ? చప్పగా తడిసిపోయివుంటావ్. చలివేస్తూ వుండివుంటుంది. ఆ చలిలో ఎవరో ఒకరు (ఇప్పుడు మామయ్య కంఠం బొంగురుగా రహస్యంగా మారిపోతుంది. ఆ ముఖంలో ఒక మాదిరి నవ్వు. కళ్లు ఎర్రగా అవుతాయి. నా బుజంమీద వేసిన చెయ్యి గట్టిగా బిగునుకుంటుంది. ఆ చెయ్యి జబ్బమీదకి జారి గట్టిగా బిగుసుకుంటుంది జబ్బ చుట్టూ. నాకు ఏడుపు వస్తుంది. ఏదో భయంగా వుంది.) ఎవరినన్నా వెచ్చగా హత్తుకోవాలని అనిపించిందా ?"

నా నోట్లోంచి మాట రాలేదు. ఏం చెప్పాలో తెలియడంలేదు. మనసు భగ్గుమంటోంది. గొంతులో ఏదో అడ్డుకున్నట్లుంది.

"ఈ చెప్పు - నీకు యిష్టంగానే వుందికదూ" మళ్లీ జబ్బని మెలిపెడుతున్నాడు.

"లేదు నేను యిష్టపడలేదు. నాకు యిష్టం కలగలేదు"

"అబద్ధం చెప్పకు. నువ్వు యిష్టపడకపోతే అల్లా జరిగివుండేదా ?"

అప్పుడు నాకు అనిపించేది. ఒక్కసారి 'అవును యిష్టం అయింది' అంటే యీ పీడ వదులుతుందిగదా అని ....

ఆ సమయంలో నాకు మామయ్యపట్ల వున్న గౌరవమంతా ఎగిరిపోయేది. ఈ మనిషిని 'మీరు' అని మన్నించక్కరలేదు, ఆఖరికి 'నీవు' అని కూడా అనక్కర్లేదు, 'ఒరేయ్' అని గట్టిగా అరవాలనిపించేది. 'నువ్వు చేస్తున్న యీ వెధవపనులూ, నీ మాటలు నాకు డోకు తెప్పిస్తున్నాయి. నువ్వు నన్ను నొక్కి నొక్కి కావలించుకుని, చేతులు గట్టిగా పట్టుకు గిల్లుతున్నపుడు, నా తొడలు నిమురుతున్నపుడు ఎక్కడన్నా పడి చచ్చిపోవాలనిపిస్తున్నదిరా - ఒరేయ్ ముసలి పీనుగా ! నువ్వు అంటున్న మాటలు అర్థంకానట్లు నటిస్తూ, పళ్లు కరుచుకుని - 'మామయ్యా మామయ్యా' అని పిలుస్తున్నానురా ! ఆ కారులో సంఘటన నువ్వు చేస్తున్న యీ వెధవ చేష్టలకంటే ఎంతో మేలురా ! ఆనాడు నా మనసు యింత బాధపడలేదు. నీలాగా ఆడవాళ్లను అసహ్యంగా ఎక్కడో ఎక్కడో పట్టుకుని, వెధవ మాటలు మాట్లాడేవాళ్లని ఎవరూ యిష్టపడరు. నీకంటే ఆ కారులో తీసుకెళ్లాడే - అలాంటివాళ్లు వందరెట్లు నయం. కాటికికాళ్లు చాచుకున్న నీ మీద నాకు మోహం కలుగుతుందని అనుకుంటున్నావుగదా ! మరి . వయసులో చిన్నవాడయిన అతనికి యీ భావన కలగదా ? కలగడంలో తప్పేముంది ? నీ మీద నాకు యిష్టం కలిగించాలనే తాపత్రయంలో - అతనిమీద నాకు యిష్టం అని ఏడుస్తున్నావ్.... అవును అతనంటే నాకు యిష్టం. అతని మీద నాకు మోహం. కాని, నీ పొడ అంటే నాకు గిట్టదు. ముసలిపీనుగా నువ్వంటే నాకు అసహ్యం – నా వొంటిమీద చెయ్యి తియ్యరా ?" అని గబ గబ అనేద్దామన్న వుద్రేకం కలుగుతోంది. కాని ఆ భావాలని అలానే మనసులో నొక్కిపెట్టి నొప్పిగా వున్న చెయ్యిని రాసుకుంటున్నాను. కోపంతో అవమానంతో నా మనసు కుత కుతలాడిపోతోంది.

కొన్ని సమయాల్లో మామయ్య నాకు ధర్మోపదేశాలు చేస్తుంటాడు. మన ధర్మశాస్త్రాలు నారీజీవితాన్ని గురించి ఎలా ఘోషిస్తున్నాయో చెపుతూంటాడు. ప్రకృతి రీత్యా స్త్రీ పురుషులలో వత్యాసవుంది. పురుషుడు ఏకపత్నీవ్రతుడై వుండాలన్నది మన ధర్మశాస్త్రాలలో వుటంకించివున్నా, వారి వారి మనోధర్మాలనిబట్టి అనేక

మందిని పెళ్లిచేసుకోవచ్చు, కాని స్త్రీ ఎవరినైతే చేపట్టిందో అతనికి అంకితమయి మనసావాచా, అతనికే చెందివుండాలని మన పెద్దలు చెపుతున్నారు. మన ఇతిహాసాలు వాక్కాణిస్తున్నాయి. ఇంతకిమించి స్త్రీకి మరోదారిలేదు. స్త్రీలకంటే పురుషులు వున్నతులని దీనికి అర్థం. స్త్రీలు పురుషులని గౌరవించి, వారిని పూజించాలి.' స్త్రీలకంటే పురుషులది వున్నతస్థానం. ఇవన్నీ చెపుతున్నపుడు ఆయన మనుశ్మృతినీ, మన పురాణాలలోని సంఘటనలని వుదహరించి చెబుతుండేవారు.

కొన్ని సమయాల్లో ఆయన చెప్పేవి వింటానికి చాలా సొంపుగా వుంటాయి. ఆయన చేసేవాదనలూ, తర్కించే విషయాలూ గొప్ప లాజిక్‌తో కూడివుంటాయి. కాని ఆయన చెప్పిన ప్రతీవిషయాన్నీ ఖండించి, ఎదురుతిరిగి సవాలు చెయ్యడానికి నాకు ఎన్నో ప్రశ్నలు, వాదనలు తడుతూంటాయి, కాని వాటిని మనసులోనే అణిచి వేస్తుంటాను పైకి అడగను.

మామయ్య మనోభావాలూ, ఆయన వాక్చాతుర్యమూ నాకు చాలామటుకు తెలుసు. ఆయన చెప్పే విషయాల పట్ల నాకు అనేకమైన సందేహాలు, ఎదురు ప్రశ్నలూ వుత్పన్నమవుతుంటాయి. అవిగనక నేను తిరిగి అడిగితే - ఆయన ఆ ప్రశ్నలకి జవాబు చెప్పడమేగాక, నావాదాన్ని ఖండించి ఎలాముక్కలు చెయ్యగలడో కూడా నేను వూహించగలను. అంచేతనే మామయ్య చెప్పింది వినటంతప్ప తిరిగి అడగటమనేది ఎప్పుడూలేదు.

ఒకసారి అడిగాను. నేను అడిగే ప్రశ్నకు ఆయన ఎటువంటి ప్రత్యుత్తర మిస్తాడో అన్నది నా వూహకు అందలేదు. అందుచే యీ విషయానికి ఆయన బదులు చెప్పలేక నోరుమూసుకు వూరుకుంటాడనే ధైర్యంతో అడిగేశాను. "స్త్రీకి ఒకే ఒక భర్త వుండాలనికదా మీరంటున్నారు. మరి మహాభారతంలో ద్రౌపతికి అయిదు గురు భర్తలున్నారుగదా - మరి మన ధర్మశాస్త్రాలు వొప్పుకున్నాయా?" అని.

ఈ ప్రశ్నకు మామయ్య బదులు చెప్పడు నోరు మూతపడుతుందని అనుకున్నాను.

"మన శాస్త్రాలు వొప్పుకోలేదు గనుకనే ఆ పద్ధతిలో మార్పుతీసుకొచ్చారు. ఈ కాంటెక్స్ట్‌లో నువ్వు ఎలా ఆలోచిస్తున్నావో నేను గ్రహించుకోగలను. పుత్రులు లేని వారు పుత్రదానం పొందవచ్చునేతప్ప దానికి వక్రమార్గాలు, వక్రార్థాలు ఎప్పుడూ వెతకకూడదు. మనశాస్త్రాల్లో నిస్సంతుకు పరలోకాలలో చోటులేదు. అంతేగాని అయిదుగురు భర్తలతో ద్రౌపతి కాపరం చేసిందని మనం అనుకోకూడదు. అంతకు ముందు వ్యాసమహర్షి చేసిన పుత్రదానం వలన ధృతరాష్ట్ర పాండురాజులు జన్మిం చారనికూడా మర్చిపోకుడదు. ఇటువంటి విషయాల్లోని పరమార్థం గ్రహించాలే గాని, మనం వాటిని సంఘటనలుగా మన సామాన్య దృష్టితో చూడకూడదు." ఇలా

చెప్పడం మొదలుపెడితే ఆగటం అంటూ వుండదు - అనర్గళంగా ఒక దాంట్లోంచి యింకోదాంట్లోకి పోతునేవుంటాడు. ఎందుకురా అడిగానని నేను మనసులో లెంపలు వేసుకుంటాను. అందుకనే నేను నోరు ఎత్తను.

ఇంక ఈ విషయాల గురించి ఇతిహాస పూర్వకంగానేగాక, విజ్ఞానశాస్త్రం ద్వారా వుదాహరణలు ఎత్తిచూపిస్తుంటారు. మృగాలు, పక్షులు, స్థావరాలు వీటన్నిటినీ కూడా వుదాహరణలో చూపిస్తూవుంటాడు. పది కోడి పుంజుల మధ్య ఒక కోడి పెట్ట వుండగలదా? ఆయన దృష్టిలో మొగవాడికి ఒక నీతి, ఆడదానికి ఒక నీతి - అన్నది సర్వసహజమైన విషయం. ఇది చాలా న్యాయసమ్మతమైనదని కూడా ఆయన వాదిస్తూంటాడు.

కొన్ని కొన్ని సమయాల్లో స్త్రీలు ఎలా నడుచుకోవాలో, ఎలా ప్రవర్తించాలో చెపుతూంటాడు. అలాంటప్పుడు, 'నీలాంటి చెడిపోయిన పిల్లలుకూడా' అంటూ ఆయన నా మొహంమీద ఏకాస్త సంకోచం లేకుండా అంటుంటాడు.

ఆయన అలా నన్ను వేలెత్తి చూపడం సత్యమైనట్లూ, సబబైనట్లూ నేను తల ఎత్తను. తలవంచుకుని ఆయనతో మనస్ఫూర్తిగా ఏకీభవిస్తున్నట్లు వింటూ కూచుంటాను.

"నువ్వు యికనుంచీ పవిత్రంగా వున్నాకూడా, యింకోడిని కట్టుకుని బ్రతుకుదామని అనుకోకూడదు. ఇంకోడి అండ దొరుకుతుందని ఎదురు చూడ కూడదు. నీ కాళ్లమీద నువ్వు నిలబడగలగాలి. నీ జీవితం నువ్వు నడుపుకో గలగాలి." మామయ్య అన్న ఈ ఆఖరి వాక్యం నా పట్ల రామనామం. ఆ వొక్క మాటనే మంత్రంవలె పునశ్చరణ చేసుకుంటున్నాను.

"నిన్ను సముద్రంలోకి తోస్తాననీ, నీ తలమీద నిప్పులు దిమ్మరిస్తాననీ అన్నవాళ్లు పరమ మూర్ఖులు. నీకు జీవించే హక్కు వున్నది. నువ్వూ అందరి స్త్రీల లాగే బ్రతకవచ్చు. ఎటొచ్చీ నువ్వు కన్యవనీ, నీకింకా పెళ్లికాలేదనీ అనుకుంటే - నిన్ను నువ్వు మోసం చేసుకుంటూ, లోకాన్ని కూడా మోసగించ చూస్తున్నావనీ అర్థం. నీకు జీవించే హక్కు వుందిగాని, పెళ్లిచేసుకునే యోగ్యతలేదు. కన్నెపిల్లననే వేషం వేసుకుని మోసం చేద్దామనుకున్నావో నీకు మహాపాపం చుట్టుకుంటుంది. చెడిపోయిన ఆడదానికి పెళ్లి చేసుకునే హక్కులేదు - అర్హతలేదు అని మన ధర్మ శాస్త్రాలు ఘోషిస్తున్నాయి. ఇలా చెయ్యడం మన సంప్రదాయం వొప్పుకోదు."

ఇలా భూమి గుండ్రంగా వున్నదన్నట్లు ప్రతిసారీ మామయ్య చివరికి యీ విషయాన్ని గురించే మొదలుపెడతాడు. ఎన్ని మాట్లాడినా అలవాటు ప్రకారం ఆనాటి సంఘటన దగరకే వస్తాడు.

మామయ్య ఆ విషయాల గురించి మాట్లాడటం ఆరంభించినపుడు, ఆయన ఆనాటి సంఘటనను తిరిగి తిరిగి తన కళ్ల ముందు వివరంగా మాస్తున్నట్లు మాట్లాడుతూ, ప్రతి సంఘటననీ విశదంగా గుచ్చి గుచ్చి అడిగి మాట్లాడుతున్నపుడు, నా వంటిమీద బట్టలన్నీ వలిచి, నన్ను వివస్త్రను చేసినంత బాధగా వుంటుంది. నా వళ్లు సిగ్గుతో కుంచించుకుపోతుంది. ఈ ముసలాడు తనని ఆ అపరిచితుని స్థానంలో వూహించుకుని ఆనందపడుతున్నట్లనిపిస్తుంది. ఇలా ఆ సంఘటన గురించి పదే పదే అడగటంలో ఆయనకు ఆనందం కలుగుతోందా? ఏదో సుఖం లభిస్తోందా? అని కూడా నాకు అనిపిస్తూవుంటుంది.

"నీకు అతను ఎవరో తెలుసా?"

"ఊహు - తెలియదు"

ముక్కూ మొఖం తెలియని అపరిచితుని మీద ఆయనకి ఏదో గౌరవం, నా మీద చెప్పరాని కోపం ఏర్పడినట్లు గభాలున మళ్లీ మొదలుపెడతాడు.

"నీది ఎటువంటి చపలచిత్తమో యిప్పటికైనా గ్రహించావా? నీ స్వభావంలో వక్రత, నీలో బలహీనత లేకపోతే ఎవరో ముక్కూ మొఖం తెలియని వ్యక్తికి లొంగిపోవడం సాధ్యమయేదా?" ఆయన అలా అడుగుతున్నపుడు నా గొంతు పట్టి వీధిలోకి తరిమిన అన్నయ్య, సముద్రంలోకి తోసి తాను పడతానని ఏడ్చిన అమ్మా ఎంతో మంచివారిలాగా కనిపించేవారు.

"న్యాయంగా చూస్తే ఆ పేరు తెలియని, ఆ అపరిచితుడే నీ నిజమైన భర్త. వివాహం, సంసార సుఖం అవన్నీ నీకు ఆ కార్లోనే జరిగిపోయినాయి. అక్కడే అన్ని అనుభవాలు ముగిసిపోయినాయి. ఇది పచ్చి నిజం. ఈ నిజాన్ని అబద్ధం అని - నిన్ను నువ్వు మోసం చేసుకోవడానికి ప్రయత్నించకు. ఆ సంఘటన నిజంగా జరిగి, అది నిజమైన అనుభవం అయినపుడు నువ్వు ఆ మనిషిని వెతికి పట్టుకుని, అతనిని పెళ్లిచేసుకు, వాడితో కాపరం చెయ్యడం న్యాయమైన మార్గం. అతన్ని వెతికి పట్టుకుంటావే అనుకో, వాడు ఇది నిజమని నమ్మవద్దా? అతను నీకు అన్యాయం చెయ్యడని నమ్మకమేమిటి? సకు సబబు అని తోచింది అతనికి సబబుగా తోచవద్దా? కారు ఆపి చెయ్యి పుచ్చుకు లాగిన ప్రతివాడి వెంటా పోయేటువంటి బలహీనురాలివని అనుకోవచ్చుగా! అతను అలా అనుకోవడం ధర్మంకాదని నువ్వూ నేనూ అనుకోకూడదు. అలా అనుకునే హక్కు మనకి లేదు. అలా అనుకోవడంలో న్యాయం ఏమన్నా వుందా చెప్పు? అంచేత మామూలు అందరి ఆడవాళ్లలాగా బ్రతుకుదామని, పెళ్లి సంసారం లాంటి సుఖాలు నీ జీవితంలో వుంటాయనీ ఆశ పెట్టుకోకు. ఆ ఆశలన్నీ వొదులుకో"

మామయ్యతో వాకింగ్కి వెళ్లినపుడల్లా యీ విషయాల గురించి మాట్లాడుతూనే వుండేవాడు. ఆయన మాట్లాడుతున్నపుడు ఆ మాటలు చాలా వెగటుగా వుండేవి. వింటుంటే చాలా కష్టంగా వుండేది. మనసు విలవిల్లాడేది. అయినా యిలాంటి మాటలని – ఆయన ఒక విధంగా నాకు వుపకారం చేశాడనే వొప్పుకోవాలి. నా చదువుకి, నా వున్నతికి వీటికే కాదు ఆయన ద్వారా, ఆయన మాటల ద్వారా నేను ప్రపంచాన్ని, ముఖ్యంగా ఆయనని కూడా బాగా అర్థం చేసుకోగలిగాను. నా గురించి ప్రపంచం ఏమనుకుంటుంది? చుట్టూ మనుషులు ఎలా ప్రవర్తిస్తారు? ఎలా ఆలోచిస్తారు? ముఖ్యంగా మామయ్య ఆలోచనా ప్రవాహం ఎలా పరుగెడుతూంటుంది – అన్న విషయాలు, లోకాన్ని అర్థం చేసుకునే అవకాశం కల్పించాడు మామయ్య. ఆయన మాటలు తాత్కాలికంగా నన్ను బాధించినా, ఒక విధంగా అవి మహోపకారమే చేశాయి.

“నిన్ను ఎవరైనా వుంచుకుంటారుగాని, పెళ్లి మటుకు చేసుకోరు. నువ్వు ఏ మొగాడితోనైనా జీవించవచ్చుగాని, ఏ మొగవాడికి భార్యవుకాలేవు” అని అనేక సార్లు అంటూండేవారు. దీనినే నాజూగ్గా ‘యు కెన్ బి ఎ కాన్కుబైన్ టు సమ్ వన్ – బట్ నాట్ ఎ వైఫ్ టు ఎనీ వన్’ అంటూండేవారు. నువ్వు ఎలాగూ చెడిపోయావు, నీతోపాటు మన సమాజాన్ని కలుషితం చేసి, ధర్మశాస్త్రాలని మంటగలిపే హక్కు నీకు లేదు, అంచేత పెళ్లి విషయం నువ్వు మర్చిపో. ఈ చేసిన పాపాన్ని యింకా పెద్దది చేసుకోకు”

ఆయన మాటలు వింటున్నపుడు నాకు అనిపించేది. ఈ ముసలాడికి ఎంత ఆశ? ఈ మాటలకి సరి అయిన అర్థం ‘వై నాట్ యు బి మై కాన్కుబైన్’ అని. ఈ ముసలాడికి యీ వయసులో కూడా యింకా యీ కోర్కెలు చచ్చిపోలేదు కదా!

మామయ్య చాలా మంచివాడు. ఇంతవరకూ నన్ను యీ విషయం సూటిగా అడగలేదు. ఒకవేళ అడిగితే – ‘కాదు’ అని నేను అంటానన్న సందేహమేమో! లేక అలా అడగడం ధర్మం కాదనుకున్నాడేమో! ఈక్షణం దాకా ప్రతి నిముషం – యీ విషయం ఏ క్షణంలో అడిగేస్తారో అని. నేను నాలోనే హడలిపోతున్నాను, కాని ఆయన యింతవరకూ అలా సూటిగా అడగలేదు. ఒకవేళ నా పట్ల అటువంటి మర్యాద కూడా చూపక్కరలేదనుకుంటున్నాడేమో! సమయం చూసి బలవంతం చేద్దామని, అదనుకోసం కాచుకుని వున్నాడా?

అవకాశం దొరికితే దాన్ని వృథా పోనిచ్చే మనిషి కాదు మామయ్య. ఈ పులికి అటువంటి ఆకలి, అటువంటి రుచిమరిగిన ఆకలివుంది. ఒకసారి అటువంటి సందర్భం ఏర్పడినప్పుడు నేను మెళకువగా తప్పించుకొన్నాను. నాకు అటువంటి

సాహసం, తెలివితేటలూ మహాత్మాగాంధి రచనలు చదవడంవల్ల కలిగినాయి. మహాత్మాజీ స్త్రీలని గురించి చాలా రాశారు. ఆయన రాసినవాటిలో ముఖ్యమైన ఒక పేరా రెడ్ యింక్‌తో అండర్ లైన్ చేసి, మామయ్య టేబుల్ మీద పెట్టివచ్చాను.

"నేను స్త్రీలకి చెప్పేది యిదే. మిమ్మల్ని ఎవడైనా బలాత్కరించపోయినపుడు – మీకు అహింసామార్గం అవలంబించమని బోధించను. మీరు అటువంటి సమయాల్లో ఏ ఆయుధాన్నైనాసరే వుపయోగించి, మిమ్మల్ని మీరు కాపాడుకోండి. మీకు ఏ ఆయుధమూ అందుబాటులో లేనప్పుడు, మీపళ్లు, మీచేతిగోళ్లు యీ రెండే చాలు స్త్రీ తనని కాపాడుకునేందుకు. ఈ రెంటితో స్త్రీ తనను తాను రక్షించుకోవచ్చు. ఇటువంటి మానరక్షణ సమయాల్లో స్త్రీలు హత్యచేసినా, అది హత్యకానేరదు. అది హత్యానేరమవదు. అది ఆత్మరక్షణ అవుతుంది. తన మానరక్షణకు స్త్రీ హత్య చేస్తే అది హింసకాదు, పాపం కూడా కాదు."

ఆ రోజు సాయంకాలం వాకింగ్‌కి వెళ్లినప్పుడు మామయ్య యీ విషయం గురించి చాలా సావకాశంగా మాట్లాడాడు.

"ఈ పుస్తకం నువ్వు కాలక్షేపంకోసం చదివావు. ఆ పుస్తకంలో చెప్పింది ఒకవిధంగా రైటే. కాదనను. నిన్ను బలాత్కరించపోయినపుడు ఆత్మరక్షణకొరకు హత్యచేయవచ్చు. అంతవరకూ బాగానేవుంది. కాని అతను నిన్ను బలాత్కారం చేశాడా అని ? నీలాంటి ఆడపిల్లలని బలవంతపెట్టాల్సిన అవసరం వుందా అని ?"

మామయ్య చెప్పింది నిజం. కాని ఆయన మాటల్లో ఆయనకే పరిపూర్ణమైన విశ్వాసంలేదు. ఎందుకంటే యీ క్షణందాకా ఆయన నన్ను బలవంతపరచలేదు. ఒకవేళ ఆయన బలవంతపెడితే నేను మహాత్మాజీ చెప్పినట్టు హత్య చేయగలనా ? లేక ఆత్మహత్య చేసుకోగలనా ? ఏదో ఒక సమయంలో, ఏదో ఒక భయంవల్లనో, మనోభావం వల్లనో – ఆ పుస్తకంలోని విషయాలని అండర్ లైన్ చేశాను - ఎర్ర సిరాతో. ఆ మాటలే నన్ను కాపాడుతూవచ్చాయి. అవే నాపాలిట రక్షకులయినాయి.

తంజావూరులో అలవాటయిన వాకింగ్, నేను తిరుచ్చిలో హాస్టల్లో వున్నపుడూ, యీ వూరు వచ్చాకకూడా వొదిలిపెట్టలేదు. వొంటరిగా షికారుకెళ్లడం నాకు బాగా అలవాటయింది. మామయ్య మద్రాసు వచ్చినపుడల్లా నాతోపాటు వాకింగ్‌కి బయలుదేరుతుంటాడు.

పంచవటికి మారింతరువాత స్పర్‌టాంక్ రోడ్డుమీదుగా వాకింగ్‌కి వెళ్లడానికి చాలా వీలుగావుంది. కెనాల్ పక్కనుంచి, హారింగ్‌టన్ రోడ్ లెవెల్ క్రాసింగ్‌వరకూ నడుస్తూంటాను. సాయంకాలంకూడా ఒక రౌండు వేసివస్తూంటాను.

ఈ పక్కనుంచి కాసామేజర్ రోడ్‌కివెళ్లి, పాంథియన్ రోడ్‌కట్ చేసి, కాలేజీరోడ్ మీదుగా నడుస్తూ, పన్నెండు సంవత్సరాలక్రితం కారునిల్చిందే, ఆ బస్‌స్టాప్‌లో

కొంచెంసేపు నిల్చుని, ఆ తరువాత అలా విలేజ్ రోడ్ వైపుగా నడిచి, బ్రిడ్జిదాటి ఘుశ్శీ స్పర్‌టాంక్ రోడ్ మీదుగా యింటికి చేరుకుంటాను.

సాధారణంగా నేను వాకింగ్‌కి వెళ్ళేసమయానికి, ఒక కుక్కతో ఒకావిడ ఆ వైపుకే ఎదురు వస్తూంటుంది. కుక్కగొలుసుని ఆవిడ పట్టుకుందో, కుక్క ఆవిడను పట్టుకు యీడుస్తున్నదో చెప్పడం కష్టం. ఆవిడనే యీ కుక్క లాకొస్తున్నదని చెప్పడం సబబనుకుంటాను. కుక్క అలా యీడ్చుకు లాక్కెడుతుంటే, నడవడం అదొక రకమైన ఎక్సర్‌సైజట. ఆ దొరసాని ఫ్రెంచి దేశస్తురాలో, రష్యన్ దేశస్తురాలో అయివుంటుంది - ఇక్కడేదో ఒక కాన్సలెట్ ఆఫీసువుంది. అవును అది బెల్జియం కాన్సలేట్ ఆఫీసు. ఎదురుగా వస్తోంది. ఆవిడ నడచిరావడంలేదు. ఆ కుక్క ఈవిడను యీడ్చుకొస్తోంది. ఆ కుక్క గొలుసు పట్టుకుని రావడం ఒక ఎక్సర్‌సైజ్ కాబోలు. నన్ను చూడగానే ఆవిడ చిరునవ్వునవ్వి, కొన్నిసార్లు విష్‌చేస్తూవుంటుంది. నేనూ విష్‌చేస్తాను. ఆవిడపేరు ఏమిటో ? నా మనసులో నేను ఆవిడకు 'లేడీ విత్ ఎ డాగ్' అని పేరు పెట్టాను.

షెకవో, తుర్గినివో అనుకుంటూ యీ పేరుమీద ఒక కథ రాశాడు. ఆమెను చూసినపుడల్లా నాకు ఆ కథ జ్ఞాపకం వస్తూంటూంది. తుర్గినివ్. షెకవ్ యిద్దరిపేర్లూ జ్ఞాపకం వస్తూంటాయి.

ఆవిడకు ఆ కుక్కంటే చాలా యిష్టం అనుకుంటాను.

నాకు 'పెట్స్ - అంటే యిష్టం వుండదు. కుక్కల్నీ పిల్లుల్నీ పెంచి వాటికోసం మనుషులెందుకింత ఆరాటపడతారో అర్థంకాదు. ఇలా జంతువులని పెంచడం ఒక పెర్వర్షనేమోననిపిస్తుంది. పెర్వర్షన్ అనేది మానవుల్లోనే వుంటుంది. జంతువుల్లో కూడా పెర్వర్షన్ వుంటుందట. పెర్వర్షన్ అన్నదానికి తెలుగులో సరిఅయిన మాట ఏమిటో ! ఆర్. కె. వి. వక్రం అంటూ రాస్తూంటాడు. అది సరిఅయిన మాట కాదనుకుంటా. స్వభావంలోని ఒక విధమయిన 'మానియా' లేక జబ్బు అంటే బాగుంటుందేమో !

ఆమాటకొస్తే వెంకు మామయ్యకూడా ఒక పెర్వర్టేకదా ! ఆయన సెక్స్ మానియాకా ? కాదు ఆయనొక పెర్వర్టు. ఒక సాడిస్ట్, లేకపోతే అంబుజం అత్తని అలా వాతలు తేలేటట్లు కొట్టగలుగుతాడా? నా బుజాలు నెప్పిపెట్టేటట్లు గిల్లి పోగులు పెడతాడా ? కొన్నిసమయాల్లో మామయ్య గిల్లినచోట్ల రక్తం గడ్డకట్టినట్లు కంది నల్లబడిపోతుంది. ఆడపిల్లని ముట్టుకోకుండా మాట్లాడితే ఏమవుతుందో ?

ఇంకా వెలుతురు రాలేదు. ఆరు కొట్టలేదనుకుంటా. ప్రాతఃకాలపు పిల్లగాలి చలచల్లగా వీస్తోంది. మామయ్య నేనూ నెమ్మదిగా నడుస్తున్నాం. నా బుజంమీద

ఒకచెయ్యివేసి, రెండోచేత్తో వాకింగ్‌స్టిక్ పట్టుకుని, తాతా మనుమరాలూ షికారు వెళుతున్నట్లు చూసేవారికి అనిపించేటట్లు నడుస్తున్నాడు.

అలవాటు ప్రకారం మామయ్య మళ్ళీ మొదలుపెట్టాడు. "ఆర్. కె. వి. రాసింది నేనూ చదివాను. మీ అమ్మ ఆ కథ చదివి ఏడుస్తూ కూచుంది. అసలు నువ్వే చదవమని యిచ్చావుటకదూ! 'వాట్ డు యు మీన్'' అంటూ బుజాన్ని గట్టిగా నొక్కాడు. నేను నొప్పితో గిజగిజలాడాను.

అదిగో - దొరసాని కుక్కకి గొలుసుకట్టి లాక్కువస్తోంది. నేను అదేమాదిరి ఒక పెద్దపులిని పట్టుకుని ఆవిడకు ఎదురు వెళుతున్నాను. గొలుసుకు కట్టిన ఆ కుక్క మామయ్యని చూసి గుర్రుమంది. మామయ్య ఆ దొరసానిని ఎగాదిగా పరిక్షగా చూశాడు

'లేడీ విత్ ఎ డాగ్' అని ఆమెకు నేను పేరు పెట్టానే. 'లేడీ విత్ ఎ టైగర్' అని నాకు పేరుపెట్టి వుంటుందా:

ఆవిడ స్థానంలో నేనుగనక వుంటే - నేను అలానే యోచిస్తాను. అసలు నేను అలానే కదా అనుకుంటున్నది.

నేను 'లేడీ విత్ ఎ టైగర్'ని.

## 5

క్రిమినల్ లాయర్ వెంకట్రామయ్యర్ ఆర్. కె. వి. కథను, తన వాక్ చాతుర్యంతో, వాద ప్రతివాదాలతో ముక్కలు చేద్దామని ఎంత ప్రయత్నించినా, వినిగిపోయిన ఆ ముక్కలు జరాసంధుడి తలలాగా అతుక్కునిపోయి ఆయన ముందు నుల్చుంటున్నాయి.

మన ధర్మశాస్త్రాలనుంచి ఎన్ని వుదాహరణలు ఎత్తి చూపించినా, మన అనుష్టానాల గురించి ఎంత చెప్పినా, నీతి నియమాల గురించీ, పవిత్రత గురించీ ఎంత పించుకు వాదించినా - - - "గంగ కళంకాన్ని దాచిపెట్టకుండా ఆ తల్లి నిర్దాక్షిణ్యంగా నలుగురి ఎదుటా బహిరంగపరిచి, ఆ పిల్ల జీవితాన్ని సర్వనాశనం చేసింది" అని ఆర్. కె. వి. పబ్లిక్ ప్రాసిక్యూటర్‌లాగా తన ముందు నిలిచి ఈ అన్యాయాన్ని వేలెత్తి చూపుతున్నట్లుగా వుంది.

"గౌరవనీయులైన - నా ప్రతివాది తరపు వకీలుగారు'' అంటూ నవ్వుతూ ప్రతివాదాన్ని అరంభించి:

"ఈ గంగ తల్లి ఈమె జీవితాన్ని నాశనం చేసిందనీ, తన మొహంమీద కళంకమనే మసి పూసిందనీ, కన్నకూతురు చేసిన పనిని దాచిపెట్టకుండా నలుగురి ముందూ చెప్పిందనే అనుకుందాము. చెప్పింది అని వొప్పుకుందాం. ధర్మశాస్త్రాలు, మన ఆచార వ్యవహారాలు ఖండిస్తున్నటువంటి ఏ ఒక్కరైనా యీ గంగకు రక్షణ యివ్వగలరా? ఆ పిల్ల భారం వహించగలరా? ఈ గంగ చేసిన పనిని ఆమోదించి, యీ తల్లి బిడ్డలకు ఆశ్రయం ఎవ్వరూ యివ్వరు. ఇలాంటి ఆడవారిని, ఆడపిల్లలని ఎవరూ ఆమోదించరు హర్షించరు. మీరు చెప్పినట్లు యీ కళంకాన్ని దాచిపెట్టడమన్నది - నమ ధర్మ శాస్త్రాలనీ, సంప్రదాయాన్ని తగలపెట్టడమన్న మాట. మన కులాచారాలని భ్రష్టం చెయ్యడం తప్ప వేరొకటి కాదు. 'తప్పును దాచిపెట్టినవారు క్షమార్హులు - తప్పును పైకి వొప్పుకున్నవారు శిక్షార్హులు' అనడం అధర్మమూ, అన్యాయమూను. ధర్మశాస్త్రాలు, నీతి నియమాలూ, కులాచారాలు యివన్నీ ఒక పక్కనుంచండి. ఎవరో తెల్లవాడు రాసిన ఇండియన్ పీనల్‌కోడ్‌లో - అప్రూవర్ విషయంలో క్షమ చూపించారే - - - -

ప్రాసిక్యూటర్ వాదం దారి తప్పిపోవడం చూసి వెంకట్రామయ్యరు చిరునవ్వుతో - -

"ఈ కేసులో గమనించాల్సిన విషయాలు మన ధర్మశాస్త్రాలూ, నీతి నియమాలూ, కులాచారాలు ఎంత చెడిపోయినాయని కాదు: లోకంలో చెడు వుందని, ఒక తల్లి, పాప పుణ్యాలకి వెరిచే ఒక తల్లి, తన కడుపున పుట్టిన కూతురు, లోకం తెలియని పసిపిల్ల, జీవితంలో భంగపడితే, తెలియక తప్పు చేస్తే - ఆ సమయంలో ఆ తల్లి పరిస్థితిని ఎలా ఎదుర్కొంటుంది? ఎటువంటి దృష్టితో చూస్తుంది అన్నదే సెంటర్ పాయింట్, అది అతి ముఖ్యమైన విషయం."

"సరి - నేను యిప్పుడు కనకాన్ని పిలిచి ఆ విషయం అడుగుతాను"

"కనకం - కనకం"

ఈజీ ఛైర్లో కూచుని, కొంచెంసేపు పేపరు చదివి, ఆ పైన పేపరు మొఖంమీద వేసుకుని చిన్న కునుకు తీసి, ఆ కథ గురించే యోచిస్తూ, గొంతెత్తి పిలిచాడు వెంకట్రామయ్యరు. సాయంకాలం ఆయన వూరికి బయలుదేరుతున్నాడు. ఆయన కోసం త్వరగా వంట చేస్తున్న కనకం పిలుపు వినగానే "వొస్తున్నా అన్నయ్యా" అంటూ చేతిలో పని వదిలేసి హాలులోకి వచ్చింది.

"పనిలో వున్నావా? తీరిగ్గా వున్నావేమోనని పిలిచాను. దాహంగా వుంది కొంచెం మంచి తీర్థం పట్టుకురా."

"కాఫీ తాగుతావా? పట్టుకొస్తా"

"ఏదీ గాని వేళ కాఫీ ఏమిటి? వొద్దు. టైము అయిపోతోంది. ఇంకో గంటలో ఎలానూ ఫోంచేసి బయలుదేరాలిగదా!" అంటూ కుర్చీలోంచి లేచి ఆమె వెనకాలే వంటింట్లోకి వెళ్లి, కనకం గౌరవంగా రెండు చేతులతో పట్టుకుని అందించిన మంచినీళ్ల చెంబు తీసుకుని, పక్కనే వున్న స్టూలుమీద కూచుని:

"ఒక అప్పడం కాల్చిపెట్టు. చేతిలోకి యివ్వు చాలు"

కనకం ఆయన వంక ఒక్కసారి తేరిపార చూసింది. క్రిమినల్ లాయరు వెంకట్రామయ్యరు, చెయ్యెత్తి నమస్కరించ తగినంత వున్నతుడు, గౌరవనీయుడు. ఏ సభకి వెళ్లినా అందరూ లేచి నుల్చుని 'రండి రండి' అని గౌరవ ప్రతిపత్తులతో భయభక్తులతో నమస్కరించి ఆహ్వానిస్తారు. అటువంటి పండితుడు, గొప్ప వ్యక్తి తన వంటింట్లోకి వచ్చి, స్టూలుమీద ఒక కాలు ఎత్తిపెట్టుకు కూచుని, 'నాకో అప్పడం కాల్చిపెట్టు' అని అడగడం, ఆయనలోని నిరాడంబరతకి నిదర్శనం. అని - తనలో తను ఆశ్చర్యపడసాగింది.

"ఎందుకు పిల్చానంటే - ఆ కథ గురించి ఆలోచిస్తూ నీతో మాట్లాడాలని. ఆ కథ చదివి నువ్వు ఏడుస్తూ కూచున్నానని చెప్పావు.... నువ్వు అలా ఏడవడం నాకు నచ్చలేదు. అట్లా ఏడవటం తప్పని నా వుద్దేశం. ఏడవడం సవ్యం కాదని ఎందుకంటున్నానంటే నీ పిల్ల చేసిన తప్పుడు పనిని - దాచిపెట్టలేకపోయానని బాధపడుతున్నావు - అని అర్థం. కాని ఒక్కసారి యోచించి చూడు. నీ మనసుకి ఆ పని చెడు అనీ, అది తప్పుడు పని అనీ అనిపించడంలేదా?"

ఆయన యీ విషయం గురించి మళ్లీ తిరగతోడి, చాలా సీరియస్‌గా సంభాషణ ఆరంభించేసరికి, కనకం మనస్సు కలవరపడటం మొదలుపెట్టింది. ఈ కోతకు తట్టుకోలేననిపించింది. ముఖంలో రంగులు మారడం మొదలుపెట్టినాయి.

వారంరోజులనుంచి తనలో తను కుళ్లి కుళ్లి ఏడుస్తోంది. ఈ రెండు రోజులూ ఈయన రావడంతో ఆ విషయం కొంత మరిచిపోకలిగింది. ఈయన వెళ్లిపోయాక మళ్లీ తను వొంటరిదైపోతుంది. తనలో తాను ఏడ్చుకుంటూండాలి. ప్రయాణానికి గంట వ్యవధి వుందనగానే యీ విషయం కదిపి మళ్లీ ఏడిపిస్తున్నాడు, తన వంటరితనం తలుచుకుంటే కనకానికి కన్నీళ్లు తిరుగుతున్నాయి.

ఆ కన్నీటిని ఆయన సరిగా అర్థం చేసుకోలేదు. తప్పుగా భావించాడు.

'తన కూతురు చేసిన తప్పుడు పనిని దాచలేదని, నలుగురికీ చెప్పాననీ, యిప్పుడు కూడా బాధపడుతోంది' అన్న ఆలోచన రాగానే ఆయన మొఖంలో పట్టుదల, కంఠంలో కాఠిన్యం చోటు చేసుకున్నాయి. ఆయన మళ్లీ యిలా అన్నాడు.

"అలాంటప్పుడు నువ్వు ఏం చేసివుండాలో తెలుసా? ఆ రోజు నీ ఎదురుగుండా వచ్చి నిలుచున్నచే – ఆ క్షణంలోనే దాని చెయ్యి పట్టుకుని, ఆ నీచుడు

ఎక్కడున్నాడో చూపించు, అని బర బర యీడ్చుకుని, వెళ్ళివుండాల్సింది. వాడిని వెతికి పట్టుకుని ఏ జాతివాడైనా, ఏ కులంవాడైనా, కులగోత్రాలు చూడకుండా వాడి కాళ్ళమీద పడేసి చస్తేచావమని నువ్వు వెనక్కి రావాల్సింది. వాడు కాదని తోసి పొమ్మంటే దాన్నే కాదు, నిన్నూ, నీ వాళ్ళనీ, మానమర్యాదలనీ నష్టేట్లో గలిపి దేశాలు పట్టుకుపోయి వుండాల్సింది. ధర్మాధర్మాలు, న్యాయన్యాయాలు పాటించాలనుకున్నపుడు యిది సరి అయిన మార్గం ఇది తప్ప మరొకటిలేదు. అంతేగాని ఆ కళంకాన్ని దాచిపెట్టి, దాన్ని యింకోడికిచ్చి కట్టబెట్టలేదని, నువ్వు యీనాడు వాపోవడంలో నీతిగాని, ధర్మంగాని లేదు. అది పెళ్ళిచేసుకుని, ఇంకోడితో కాపరం చెయ్యడం వ్యభిచారంకాదా?" నెత్తిమీద సుత్తితో కొట్టినట్లు గబ గబ అడగడం మొదలుపెట్టాడు వెంకట్రామయ్యరు.

కనకానికి కన్నీళ్లు ఆగిపోయాయి. పమిట చెంగుతో కన్నీళ్లు తుడుచుకుని, "నా బిడ్డ కూడా నలుగురిలాగా బ్రతకాలనే కదా యింత కష్టపడింది? ఇంత కంటే వెధవపనులు చేసినవాళ్లు కూడా, మా అంతవాళ్లు లేరు - మాకు సాటి ఎవరున్నారు? అని హాయిగా తిరగడం యీ కళ్లతో చూస్తున్నాను. మంచో చెడ్డో దాని జీవితం యిలా నాశనం అయిందేనన్న బాధ వుండదా?" అని దీనంగా ప్రశ్నించే ఆ తల్లి మనసులోని వేదని ఆయనకి అర్థమవుతోంది. అంతకఠినంగా మాట్లాడి వుండకూడదు, అని క్షణంపాటు అనిపించి, నెమ్మదిగా అనునయంగా మొదలుపెట్టాడు.

"నువ్వు యిలా కుమిలికుమిలి ఏడవడం బాగాలేదు. నీ కూతురు జీవితం వ్యర్థమయి పోయినందుకు నిన్ను సంతోషించమని ఎవరూ అంటంలేదు. అదంతా దాని ఖర్మ అనుకోవాలి. దాని ఖర్మని తల్చుకు నువ్వు విచారపడాలిగాని, జీవితాన్ని చూసికాదు. అది ఆ విధంగా కాలుజారినందుకు విచారించుగాని, నువ్వేదో తెలివి తక్కువగా పైకి అన్నందువల్ల దాని బ్రతుకు బండలయిందని బాధపడకు. అదేదో నిన్ను వేలెత్తి, నీ వల్ల యిలా అయిందని అనుకుంటున్నదని బాధపడుతున్నావే - అసలు నీకు మతివుందా అని? ఎవరో నీతిజాతిలేని వెధవ ఓ కథరాశాడు. అది వుత్తజులాయికథ. సిగ్గులేనివాడు రాసిన కథ. ఆ కథలో పాత్రలు ప్రవర్తించినట్లు నువ్వు నడుచుకోలేదని ఏడుస్తున్నావా? చాలా బాగుంది నీవరస. లోకంలో లక్ష రకాల జీవితాలుంటాయి. ఎవరు ఎట్లా నడుచుకోవాలి అన్నది, ఎవరికి వారు నిర్ణయించుకోవాలి. ఎవరి సమస్యలు వారివి. నిన్ను ఒక విషయం సూటిగా అడుగుతాను - జవాబు చెప్పు. మన సంప్రదాయాల్లో, నీతి నియమాల్లో, ధర్మశాస్త్రాల్లో నీకు నమ్మకంవుందా? ఆకథరాసాడే ఆ దగుల్బాజీకి స్త్రీజాతిని వుద్ధరించేందుకు ధర్మకంకణం కట్టుకున్నాడే, వాడికి వాటిలో నమ్మకం

లేదు. వాడు రాసిన కథే యిందుకు నిదర్శనం. నీకు నీతినియమాల్లో, సంప్రదాయాల్లో నమ్మకం వుందా? జవాబు చెప్పు?''

ఒక పక్క ఆకథ కనకాన్ని దోషిస్థానాన్న నిలబెట్టి, వేలెత్తి చూపుతున్నది. ఇంకో ప్రక్క తనని సాక్షిస్థానంలో నిలబెట్టి అవునా? కాదా? నమ్ముతావా? లేదా? అని సూటిగా ప్రశ్నిస్తోంది. సాక్షినోటివెంట 'అవును-కాదు' అని చెప్పించే పరిస్థితిలో యిరుక్కున కనకాన్ని తిరిగి ప్రశ్నించాడు.

"నమ్మకం వుందా – లేదా? చెప్పు"

కనకానికి ఏం చెప్పాలో తోచడంలేదు. తననెందుకిలా నిలవదీసి అడుగుతున్నాడో కూడా అర్థం చేసుకోలేకుండావుంది. ఆయన చెప్పే ఆ పెద్ద పెద్ద విషయాలు; శాస్త్రాలూ, పురాణాలు చదివినవారు అర్థం చేసుకోగలగుతారు. తాను సామాన్యమైన స్త్రీ. మామూలు కుటుంబంలో పుట్టి, తన తల్లి తనకు నేర్పిన నిత్యకృత్యాల్లో, ఆచార వ్యవహారాల్లో సాధారణ గృహిణివలె జీవితం వెళ్లదీస్తున్న తనకు యివన్నీ ఎలా తెలుస్తాయి? వీటిని నమ్మటమా - లేదా అన్న పెద్ద ప్రశ్నకి ఏం సమాధానం చెబుతుంది?

"వాటిని నమ్మడం చేతనే కదా, ఈ కుటుంబానికి అప్రదిష్ట కలగడం భరించలేక, ఆనాడు కడుపున పుట్టిన దాన్ని సముద్రంలోకి తోసి నేనూ దూకి చచ్చిపోదామనుకున్నది'' ముఖం చేతుల్లో దాచుకు ఏడవడం మొదలుపెట్టింది కనకం.

"ఉష్ ఏడవకు. నిన్ను ఏడిపించాలని నేను యివన్నీ అడగలేదు. నువ్వు ఏడవకూడదని, ఏడిచేటువంటి అవసరం లేదనీ చెప్పడానికే యీ విషయం కదిపాను. తప్పుదారి బడిన దాని జీవితాన్ని నువ్వు సరిఅయిన మార్గంలో పెట్టావు. అందుకని గర్వపడాలి, సంతోషించాలి. అంతేకాని ఏదో లోపంచేశానని బాధపడటంలో అర్థంలేదు. ఈ ప్రపంచంలో చెడిపోయినవాళ్ళు, కులభ్రష్టులు చాలామంది వున్నారు. వాళ్ళనిచూసి సదాచారులు యిలావున్నారు అలా వున్నారు అని మనసులో వ్యథ పడకూడదు. అది సక్రమమైన మార్గమేమోనని వూగిసలాడకూడదు. లోకంలో రకరకాల వ్యక్తులుంటారు. 'చెడిపోయిన ఆడపిల్ల నెత్తిన నీళ్ళు దిమ్మరించి అంతా సరిపోయింది' అని కప్పిపెట్టె తల్లి ఒకరకం అయితే, చెడిపోయి చెడుమార్గాల డబ్బు సంపాయించి తీసుకొచ్చి తల్లికిస్తే, ఆ డబ్బు మీద నీళ్ళు చల్లుకుని తీసుకునే తల్లులూ వున్నారు. నీతిగా బతకాలనుకునేవాళ్ళు యిలాంటివి దాచిపెట్టుకుంటారా?'' ఆయన మాటలు వింటున్న కనకానికి యీ కథకంటే అసహ్యమైన జీవితాలు వున్నాయి కాబోలు అనిపించింది. చెడిపోయిన వారి పక్షాన వాకలత్ పుచ్చుకునే యీకథలు రాస్తారా? ఈలాటి భ్రష్టజీవితాలని ప్రచారం చెయ్యడానికి, యీమాదిరి కథలు రాస్తారు కాబోలు అని కూడా అనుమానం కలిగింది.

'ఈయన చెప్పినట్లు ఆ పిల్లని కన్నతల్లి ఎంత నీచురాలయినా ఇలాంటి విషయాలు దాచిపెట్టడానికి సాధ్యమవుతుందా ?''

ఈ కథ రాసినవాడు యీయన చెప్పినట్లు చెడిపోయిన ఆడపిల్లలని చేరతీసేవాడై వుంటాడా ?

గంగ ఎందుకీలాంటి వెధవ కథలు చదువుతుందో ? తను చదవడమే కాదు. 'నువ్వు చదివిచూడు' అంటూ ఆనాడు తన ముఖాన్న ఎంత దిలాసాతో కొట్టిందో ! తను చేసిన వెధవపనిని ఆమోదించి, వత్తాసు యివ్వలేదని కోపమా ? సంప్రదాయమైన వంశంలో పుట్టిన నేను యిలాటివి ఎలా ఆమోదిస్తాననుకుందో ? అలాంటి జీవితాన్ని ఎలా వొప్పుకుంటాను ? నేను చేసిన పని సరి అయినదే ! నేను పొరబాటుచేశానని విచారించను. విచారించే అవసరంకూడ లేదు.

"దీనిని పది నెలలుమోసి కన్నానే, అందుకు ఏడుస్తున్నాను. దీన్ని కన్న పాపానికి ఏడుస్తున్నాను. యింక దేనికి కాదు'' అంటూ కనకం కళ్ళు తుడుచుకుని, తేలికపడిన మనసుతో తల పైకెత్తి :

''టైమయిపోతోంది. మీరు భోంచెయ్యండి'' అంటూ పీటవాల్చి విస్తరివేసింది.

కాళ్ళూ చేతులూ కడక్కుని, భోజనానికి కూచుని, మళ్ళా చెప్పడం మొదలుపెట్టాడు :

''నువ్వు దేనికీ ఏడవకూడదు. నీ కడుపున పుట్టిన పిల్ల గురించి యిట్లా అంటున్నానని తప్పుగా అనుకోకు. ఈ రోజుల్లో పిల్లలకంటె మన గంగ చాలా నయం. కాని దానికి స్థిరమైన అభిప్రాయాలు లేవు. కొంచెం చాపల్యం ఎక్కువ. ఇలా వుంటున్నారని మనం వాళ్ళని తప్పు పట్టకూడదు. కాలం అలా వుంది. ఈ కాలం పిల్లలు తమ కోర్కెలు తీర్చుకునేందుకు ఏపని చెయ్యడాని వెనకాడటం లేదు. ఇది చాలా నీతివంతమైన కథ అనుకుంటూ ఒకడు రాశాడు. ఆ పత్రికవాళ్ళు దీన్ని అచ్చు వేశారు. దానిని లక్షలాది మంది చదివారు. చిన్న పిల్లల నయితే యిది చదవకు అది చదవకు' అని ఆంక్షలు పెడతాం. వారి వారి మనోప్రవృత్తులని బట్టి, స్వభావాలని బట్టి రచనలు నచ్చుతూంటాయి. అంతదాకా ఎందుకు ? ఇంత తెలిసిన నువ్వు యీ కథ చదివి బాధ పడ్డావే– ఎందువల్లనంటావ్ ? తల్లి ప్రేమచేతనే కదా !''

''నా పిల్ల జీవితం యీ విధంగా నాశనం అయిపోయిందనే బాధ వుండదా ?'' గుండెలమీద చెయ్యి వుంచుకు, కంట తడిపెట్టింది కనకం.

''నీకు తెలుసుననే అనుకుంటా. మన జడ్జీ శివరామకృష్ణయ్య కూతురికి - అప్పటికి ఎనిమిదేళ్లుంటాయి. అల్లుడినీ కూతురినీ రెండు కళ్ళలాగా అతి ప్రేమగా చూసుకునేవాడు. ఆ పిల్లవాడు ఒక రోజున నదిలో స్నానం చెయ్యడానికి వెళ్ళి మళ్ళీ తిరిగి రాలేదు. అంతే ఆ పిల్ల మాంగల్యం తెగిపోయింది. అంత చిన్న వయసులో

అన్నీటినీ పోగొట్టుకు ఆ పిల్ల బ్రతకడం లేదా? అదేమాదిరి మన గంగ కూడా 'నాకింతేప్రాప్తం' అని మనసుని సమాధాన పెట్టుకు బ్రతకడం నేర్చుకోవాలి."

పెళ్లి కాని తన కూతురిని, వైధవ్యం చేపట్టమంటున్నాడు. వివాహమే గాని ఒక ఆడపిల్లను నువ్వు వితంతువుగా బ్రతుకు అంటం ఎంత అన్యాయం. ఆయన మీద వున్న ప్రేమ, అభిమానం యీ మాటలతో తుడిచి పెట్టుకుపోయాయి.

"శివ శివా! ఇలా చెయ్యడం మహా పాపం కాదా?" అంటూ రెండు చెవులూ మూసుకుంది కనకం.

"భర్త చనిపోతే మాంగల్యం తీసివెయ్యడం మహా పాపం అనుకునేవారు అనేక మంది వున్నారు యీరోజుల్లో. ధర్మశాస్త్ర రీత్యా వివాహ క్రతువులో మాంగల్య ధారణ ఒక ముఖ్యాంశం. ఏ ధర్మశాస్త్రాలు మాంగల్య ధారణ ముఖ్యభాగమంటున్నాయో, అవే ధర్మ శాస్త్రాలు భర్త చనిపోతే ఆ మాంగల్యం తెంపి వెయ్యమంటున్నాయి. వైవాహిక బంధంలోని పవిత్రతనీ, పతివ్రతాధర్మాన్నీ నమ్మకపోవడం వల్లనే యీ బాధలన్నీ వస్తున్నాయి. మనం వీటిని సగం నమ్ముతున్నాం - సగం నమ్మడం లేదు. పూర్తిగా యీ క్రతువులని నమ్మక వదిలేస్తే ఏ బాధా వుండదు.

"నీ కూతురిని ఏదో బలవంత పెట్టి యిలా వుండమంటే అది పాపం అనుకోవచ్చు. అలా బతకమని నిర్బంధ పెట్టడమెంతపాపమో, దానికి మించిన పాపం నీ కూతురు కన్నెపిల్ల అని మభ్యపెట్టి ఎవడికో కట్టబెట్టాలని అనుకోవడం. దానికి సమర్థత వుంటే, వాడిని వెతికి పట్టుకుని, లాక్కొచ్చి 'వీడే నామొగుడు. వీడితోనే కలిసి బతుకుతాను' అని అంటే మనం వద్దు అని అంటామా? చేతనయితే అలాచేసి చూపించమను." అటువంటిపని జరగదు, జరగపోదు అన్నధైర్యంతో రెండు చేతులూ వూగిస్తూ ఛాలెంజ్ చేస్తున్నట్లు చెపుతున్నాడు మామయ్య.

అప్పుడే నేను యింటిలోపలకి అడుగుపెట్టాను. వీధిగుమ్మంలో టాక్సీ సిద్ధంగా వుంది.

పొద్దున్న ఆఫీసుకు బయలుదేరుతున్నపుడే మామయ్య "సాయింకాలం వచ్చేప్పుడు టాక్సీలోరా - దాంట్లో నేను స్టేషనుకి వెళ్లడానికి వీలుగా వుంటుంది" అని చెప్పాడు.

మామయ్యకి యిలా చెప్పడం అలవాటే.

మామయ్యకి సాధారణంగా ఒక రోజుకంటే కోర్టు పని వుండదు. ఆ పని అయిపోయాక మరో రెండు రోజులు యిక్కడ మకాం వేస్తూంటాడు. ఒకోసారి మరో రోజు కూడా వుంటూంటాడు. అందుకు లోటు చెయ్యడు. కోర్టు వెకేషన్సు అపుడు మటుకు పదిహేనురోజులు యీవూరువచ్చి, యిక్కడే నాపీకలమీద కూచుంటాడు.

ఛీ – ఆయన గురించి నేనెందుకింత తేలిగ్గా అనుకుంటున్నాను ? ఈ యింట్లో ఆయనకిగాక మరెవరికి స్వతంత్రముంటుంది ? ఈ చదువు, యీ వుద్యోగం, యీ యిల్లు, యీ జీవితం ఇవన్నీ ఆయన చలవవల్లనేకదా నాకు లభించాయి.

మామయ్య యిక్కడికొచ్చి వుండటంవల్ల నాకేం కష్టంలేదు. నామీద ప్రేమగా వుండటంలో కూడా నాకు పెద్దబాధలేదు. కాని వచ్చిన గొడవేమిటంటే, ఆయన వచ్చినప్పటినుంచీ నన్ను గిల్లి, పిండిపిండి, వెధవవిషయాలన్నీ గుచ్చిగుచ్చి అడిగి ఏడిపించుకుతింటాడు. అది నేను ఎవరికి చెప్పుకోను ?

పొద్దుట సాయంత్రం నాతో వాకింగ్‌కి రావడంతప్ప, మిగతా వేళల్లో ఆయన మెట్లుదాటి పాదం బయటపెట్టడు. ఇల్లు కదలడు.

టాక్సీ తీసుకురావడానికి కూడా నేనే వెళ్ళాలి. పొద్దుటపూట కూరలు తీసుకొస్తున్నపుడే ఆయనకి తమలపాకులు తీసుకొస్తుంటాను. ఒకవేళ ఎప్పుడన్నా మర్చిపోతే, నేనుగాని అమ్మగాని వెళ్ళాలిమళ్ళా. అంతేగాని ఆయన కదలడు.

ఇక్కడ వున్నపుడు బుధవారం కాని, శనివారంగాని వచ్చిందాఅంటే - తలంటు పోసుకుని తీరాల్సిందే. ఓ చిన్న తుండుముక్క నడుముకి చుట్టుకుని, వంటినిండా నూనె పట్టించుకుని కూర్చుంటాడు.

"మెడనరం లాగుతోంది. వెన్నునరానికి కాస్త నూనెరాయమ్మా" అంటూ ఆఫీసుకు బయలుదేరుతున్న నన్ను గడిగుమ్మం దగ్గరకొచ్చి పిలుస్తాడు. తంజావూరులో అయితే యింటివెనక కావలసినంత ఖాళీస్థలంవుంది. అక్కడ ఎలా తిరిగినా ఫరవాలేదు. అగ్గిపెట్టెలాంటి యీ 'సి' టైపు యింట్లో జానెడు తుండు మొలకు చుట్టుకు, వొంటినిండా నూనె పోసుకుని యీ ముసలాడు - ఛీ ఛీ . . . . . .

హాలుకు మధ్యలో స్టూలు వేసుకుకూచుని, పక్క స్టీలుగిన్నెడు నూనె వుంచుకుని, అందులోని నూనె చేతినిండా తీసుకుని, పొట్టమీదా బొడ్లోనూ పోసుకుని మర్దన చేసుకుంటుంటే వొళ్ళు తగలబడిపోతూంటుంది.

రైలు కెళ్లడానికి టాక్సీ కూడ తెచ్చుకోడు. ఆఫీసునుంచి వస్తూ నేనే టాక్సీలో వచ్చి, దాంట్లో ఆయన్ని సాగనంపుతాను. ఈ రోజున నేను కావాలనే ఆఫీసునుంచి ఆలశ్యంగా బయలుదేరాను. నేను తొందరగా వచ్చానంటే "రావే స్టేషన్ కెళదాం" అంటూ నన్నూ లాక్కుపోతాడు.

హాల్లో మనుషులజాడ కనిపించటంలేదు. మామయ్య భోంచేస్తున్నాడేమో ! 'నేను ప్రయాణానికి రెడీ' అన్నట్లు ఆయన లెదర్‌బాగ్ కుర్చీమీదవుంది. ఈజీఛైర్‌లో ఆయనకి బదులు పేపరు పడివుంది.

మామయ్య నాగురించి అమ్మతో ఏదో అంటున్నట్టున్నాడు.

"చేతనయితే, దానికి గనక సమర్ధతవుంటే వాడిని వెతికి పట్టుకొచ్చి - 'వీడే నా మొగుడు, నేను యితనితోనే బతకదల్చుకున్నాను' అని చెప్పవచ్చునే. మనం వద్దంటామా ?"

నేను అలానే నుల్చుండిపోయాను.

మామయ్య యింకా ఏదో చెప్పబోయి గబుక్కున ఆగిపోయాడు. ఆయనవి పాముచెవులు. నేను వచ్చినట్లు అలికిడి అయిందా ? లేకపోతే అమ్మగాని సౌజ్ఞ చేసిందా ? ఏదైతేనేం - చెప్పే విషయం మధ్యలో ఆపేశాడు. చేతిలో మజ్జిగ పోయించుకుని తలఎత్తి హాల్లోకి చూస్తూ:

"గంగా వచ్చేశావా ?" ఇంతసేపూ నాగురించి కోపంగా మాట్లాతున్న ఆయన-ఏం జరగనట్లు గొంతుగభాలున మార్చి, శాంతంగా ఎలా మాట్లాడగలుగుతున్నాడో !

"బయట టాక్సీ నులుచునుంది. ఎక్కువసేపు వెయిటింగయితే వుండ నంటున్నాడు"

"ఉండనంటానికి వాడెవడు ? వెయిటింగ్ ఛార్జీ యిస్తున్నాం కదా". హాలులోకి వచ్చాడు మామయ్య.

నేను నా గదిలోకి వెళ్లాను.

డ్రస్ ఛేంజి చేసుకుంటుంటే మామయ్య గది తలుపు తట్టాడు.

"గంగా రైలుకి టైమయిపోతోంది. నేను వెళ్లొస్తాను. ఎప్పుడైనా వుత్తరాలు రాస్తూండు. నీ దగ్గరనుంచి వుత్తరాలే రావడంలేదు." గది తలుపుకి అవతల వైపునుంచి అంటున్నాడు.

నేను తలుపు తెరిచాను. నా చెయ్యి పట్టుకుని. "మంచి పిల్లలా బుద్ధిగా వుండు. నానా చెత్తా చదివి మనసు పాడుచేసుకోకు. లోకంలో లక్షమంది లక్షరకాల మాటలు చెపుతూంటారు. వాళ్లు చెప్పినవన్నీ నిజాలుకావు. అలా అని అబద్ధాలూ అనలేము. నీ మనసుకి ఏది ధర్మమని తోస్తే అది చెయ్యాలిగాని ఒకరు చెప్పింది నమ్మి అది మంచి అనుకోకూడదు. తప్పు ఒప్పులు ఎవరికి వారు నిర్ణయించుకోవాలి. అదే బుద్ధిమంతుల లక్షణం. 'బి ఎ గుడ్ గరల్" అంటూ ప్రేమగా నన్ను దగ్గరకు తీసుకుని, తలమీద ముద్దుపెట్టుకున్నాడు.

"కనకం - నేను బయలుదేరుతున్నాను. జాగ్రత్తగా వుండండి. గంగా వెళ్ళిరానా ?" టాక్సీ కదిలేదాకా వెనక్కి తిరిగి తిరిగి చూస్తూనే వున్నాడు మామయ్య.

వీధి గుమ్మంలో నులుచుని వున్నాను. అమ్మకు చాల ఆశ్చర్యంగా వుండి వుంటుంది. నేను వీధి గుమ్మంలో నులుచోనని, వీధి వైపుతలెత్తి చూడనని అమ్మకు బాధ. బాధకాదు కొంతగర్వం కూడాను. ఇప్పుడు నేను యిలా వీధి గుమ్మంలో నిలుచోవడం ఆశ్చర్యకరమైన విషయంగా తోచివుండవచ్చు.

రెండు సంవత్సరాలబట్టీ ఈ వీధిలో వుంటున్నాను. కాని ఇప్పుడే తల ఎత్తి, కొత్తదానిలాగా మొదటిమాటు చూస్తున్నాను.

ఎదురింటి కాంపౌండు లోపలకి యిప్పుడే ఒక కారువచ్చింది ఆగింది. ఆ ప్రక్కనే యిద్దరు ఆడపిల్లలు పరికిణీలు దోపుకుని తొక్కుడుబిళ్ళ ఆడుతున్నారు. కారులోంచి దిగినాయన ఆ పిల్లలతండ్రి కాబోలు. 'దీపాలు పెట్టాక ఇంకా ఆటలేమిటని' అదిలించి కేకలేసివుంటాడు.

చేతిలోని బిళ్ళపెంకుని పక్కకి విసిరేసి, దోపిన పరికిణీ కిందకువదిలి, పచ్చ పరికిణీ కట్టుకున్న అమ్మాయి రెండో పిల్లతో చెప్పేసి యింట్లోకి వెళ్ళిపోయింది. ఇంట్లోకి వెళ్ళిపోయిన పిల్ల ఆ యింటివారమ్మాయి అయివుంటుంది - రెండోపిల్ల పొరుగింటిపిల్ల కాబోలు. బిళ్ళపెంకు చేతిలోపట్టుకున్న రెండోపిల్లకు ఆటమీద మోజుతీరలేదనుకుంటా, బిళ్ళపెంకు ఎగరేసి పట్టుకుంటూంది. పైకిఎగరేసిన పెంకు చేతులోపట్టుకుని, అలావీధిలోకి నడుస్తూ మా గేటుదగ్గర ఆగింది. నేను వీధిగుమ్మంలో నిలుచునివుంటం ఆ పిల్లకి కూడా ఆశ్చర్యంగా వుందికాబోలు నా వంక తేరిపారచూస్తోంది. మా గేటుదగ్గర ఆ పెంకుని ఒకసారి పైకి ఎగరేసి రెండుచేతులతో చప్పట్లుకొట్టి, పెంకుకింద పడకుండా పట్టుకుంది. మళ్ళీపైకి ఎగరేసి చప్పట్లు కొటి బిళ్ళపెంకు పట్టుకుంది చేత్తో- ఆ పిల్లఆట చూస్తుంటే నాకు నవ్వువస్తోంది.

"అత్తా ఎందుకు నవ్వుతున్నారు?" అంటూ గేటు దగ్గర నిలుచుంది. నాకు ఏం చెప్పాలో తెలియలేదు. మూడో మనిషితో మాట్లాడే అలవాటు తప్పిపోయింది. చిన్న పిల్లఅయినా కూడా నాకెందుకో సిగ్గుగావుంది. ఈ పిల్ల యింత ఫ్రీగా నాతో మాట్లాడుతోంది, కాని నాకుమటుకు గొంతులోంచి శబ్దం రావడంలేదు. ఆ పిల్ల మళ్ళీ నవ్వింది.

"మామ్మగారు లేరా ?" అంటూ గేటు తెరిచింది ఆ పిల్ల.

ఓహో యీ పిల్ల అమ్మ ఫ్రెండు కాబోలు. నేను వెనక్కి తిరిగి చూశాను. అమ్మ నా గురించి యీ పిల్లతో ఏదో చెప్పివుంటుంది. అందుకనే భయంతో లోపలికి వెళ్లిపోయింది.

'మా అమ్మాయి- మునిగి, గది విడిచి బయటకురాదు' అని యీ పిల్లతో చెప్పి వుంటుంది. చాకులాంటి యీ పిల్ల నాచేత ఎలానేనా మాట్లాడించాలని బద్ధ కంకణం కట్టుకున్నట్లుంది. దొరికిన అవకాశాన్ని విడవకుండా మాట్లాడించాలని ప్రయత్నిస్తోంది. నాకు అక్కడ నులుచో బుద్ధి పుట్టలేదు. లోపలికి వెళ్లిపోయాను. అమ్మ మెట్లమీద చాప తీసుకుని వీధి గుమ్మంలోకి వెళ్ళి మెట్లమీద కూచుని ఆ పిల్లతో ఖబుర్లు ఆరంభించింది.

"మామ్మగారు యీ అత్తయ్యగారు పలకరిస్తే మాట్లాడరేం? బలే ప్రవుడ్ అనుకుంటా" అంటూ మొదలుపెట్టింది ఆ వాగుడుకాయ.

"ఏవే దాన్ని అత్త అంటావేమిటి? అత్తకాదు అక్కా అని పిలవాలి. ఈ రెండురోజులు యిటువైపుకి రాలేదు"

"మీ యింటికి ఆ తాతగారు వచ్చారుగా?"

"తాత వస్తే నీకేం? నువ్వు రాకూడదా?"

"ఆయన్ని చూస్తే భయం. ఆయన ఎవరండీ?"

"నాకు అన్నయ్య అవుతారు. మా అమ్మాయికి మామయ్య"

"సొంత అన్నయ్యా?"

"ఊహు. వేలు విడిచిన అన్నయ్య"

"వేలు విడిచిన అన్నయ్య అంటే"

"నీకు అర్థంకాదులే - నీ కెందుకు యివ్వన్నీ?"

"తెలుసుకుందామనే అడుగుతున్నాను. వేలు విడిచిన అన్నయ్య అంటే ఎవరు?"

అమ్మ చెప్పే సోది వింటానికి సరి అయిన జోడి దొరికింది. లొడ లొడ మాట్లాడుతూ వుంది. గదిలో మంచం మీద వెల్లకిలా పడుకుని, తలవెనుక చేతులుపెట్టుకుని పైకి చూస్తున్నాను. ఆరుగంటలయింది. స్నానం చేసి ఒకసారి అలా వాకింగ్‌కి వెళితే బాగుండేట్లుంది. ఏదిగాని వేళ యీ పడక విసుగ్గా వుంది. అమ్మయ్య - యీ మామయ్య వూరికెళ్లిపోయాడు - అంటే ప్రాణానికి హాయిగా వుంది. రెండురోజులు కాదు రెండునెలలపాటు వున్నట్లుంది. 'నేను చెయ్యను' అని ముఖంమీద అనలేను - అలా అనటం న్యాయంకాదని అనిపిస్తుంది.

హాల్లో పడుకుని "అమ్మా - అమ్మాయి కొంచెం కాళ్లు పట్టు. కాళ్లు లాక్కుపోతున్నాయి" అంటూ అడిగినపుడు 'పట్టను' అని ఎలా అనను? ముందు అమ్మ వూరుకోవద్దూ. "అమ్మాయి చేతులు లాగుతున్నాయే" అంటూ నా చేతి వేళ్లు పట్టుకుని పటుకూ పటుకూ విరిచిపెడతాడు. అలా చేస్తున్నపుడు దబ దబ నెత్తిన రెండు వేసి పారిపోదామన్నంత కోపం వస్తూంటుంది నాకు. అలాటి పెదమనిషి వూరుకెళ్లాడూ అంటే నాకు ఏదో తెరిపిన పడినట్లువుంది.

ఆయన అమ్మతో ఏ అంటున్నాడు? "నీ కూతురు సమర్థురాలయితే వాడిని వెతికిపట్టుకు....

నేను అసమర్థురాలనని అనుకుంటున్నాడు. 'అతన్ని' వెతికి పట్టుకుంటేగదా నా సమర్థత తెలిసేది. వెతికి పట్టుకున్నా అతను నా మాట నమ్మడనే కాదా - మామయ్య యీ కేసులో యిచ్చిన జడ్జిమెంటు.

అతని ముఖం జ్ఞాపకం చేసుకుందామంటే, ఏదో అలుక్కుపోయినట్లు, లీలగా మటుకే జ్ఞాపకం వస్తోంది. పదిమంది మధ్యన వుంటే అతన్ని గుర్తించలేనేమో కూడా.

ఆ రోజు అతను అన్న మాటలుమటుకు యిప్పుడు కూడా స్పష్టంగా నిన్న మొన్న విన్నట్లుగా జ్ఞాపకం వున్నాయి. "నీకు తెలుసా? ఈ కారు రెండు సంవత్సరాలనుంచి ప్రతిరోజూ నీ వెనకాతల వస్తున్నదనీ, నీ వెంబడే తిరుగుతున్నదనీ - డు యు నో యిట్ ?"

అవును ఆ కారుని బట్టి అతన్ని తప్పకుండా గుర్తించవచ్చు. వీలవుతుందా? ఇంకా ఆ కారు నా వెనకాతలే వెంటాడి వస్తున్నదేమో! నా వెనక ఎవరు వస్తున్నారు అన్నది నేనాడూ గమనించలేదు లక్ష్యపెట్టనూలేదు. .... ఎవరైతే నాకేం - నాకు వెనక్కి తిరిగి చూసే అలవాటులేదు, అలా చూడటం భయం కూడాను.

అతన్ని వెతికి పట్టుకోవడం కష్టమని యిన్నాళ్లనుంచి గాలించకుండా వున్నానా? అతన్ని వెతకాల్సిన అవసరం నాకు కనిపించలేదు. వెతకాలని అనిపించనూ లేదు. అతను నా మాటలు విశ్వసించడనే అపనమ్మకం వల్ల నేను వెతకకుండా వూరుకున్నాను - అనేకంటే అతనిమీద నాకు నమ్మకం లేక వెతకలేదు అనడం సబబు.

ఇప్పుడనిపిస్తోంది. అతన్ని వెతికి పట్టుకుంటే ఏమవుతుంది? అది పెద్ద కష్టమైన పనికాదు. అలాంటి కార్లు యీ మద్రాసులో ఒక పది వున్నాయేమో! కాని ఆ కారు యింకా అతని దగ్గిరే వుండి వుంటుందా అని ... ఉంటే ఏం లాభం? మొదట కారుని వెతికి పట్టుకుంటే - ఆ పైన అతన్ని గుర్తించి పట్టుకోవచ్చు. ఛీ! పన్నెండేళ్ల తరువాత యిప్పుడీ ఆలోచనలు రావడం – పిచ్చి కాక మరేమిటి? ఇది పిచ్చి అయితే అవచ్చు. లోకంలో పలురాకాల పిచ్చి మనుషులున్నారు. అందులో ఇదోరకం. ఈ పిచ్చి ఎలావుంటుందో చూస్తాను.

ఎస్. నేను అతని కొరకు వెతకడం మొదలుపెడతాను.

## 6

ఆరు నెలలయింది. నేనింకా అతనికోసం వెతుకుతూనేవున్నాను. ఆ కారులాంటి కార్లు చాలా చూశాను కాని, ఆ కారుమటుకు యింకా కనపడలేదు.

మామయ్య అన్నట్లు అతనిని వెతికి పట్టుకోవడం అసాధ్యమవుతుందా ? అతనిని గాని, ఆ కారునిగాని నేను కనుక్కోలేకపోతానా ? నా ప్రయత్నాలు యింతవరకూ సఫలం కాలేదన్న విషయం నన్ను పట్టి బాధిస్తున్నది.

ఈ పన్నెండు సంవత్సరాల బట్టీ నేను రోడ్డుమీద పోయే కారునిగాని, మొగవాడినిగాని తేరిపారి చూసి ఎరగను. నా వెనకాతల ఏదన్నా కారు ఫాలో అవుతోందనిగాని, ఎవరైనా వెంటపడుతున్నారని గమనించలేదు. ఖంగారు పడనూలేదు. వెనకనుంచి వచ్చి డాష్ యిచ్చినా కూడా నేను లక్ష్యపెట్టలేదు. వెనక్కి తిరిగి చూడనూలేదు. నా జీవితంలో మొగవాడికి స్థానంలేదు. మొగవాడి నీడకి దూరంగావుంటూ వచ్చాను. ఇప్పుడు కూడా ఆ మొగవాడి తోడు కోసరం వెతుకుతున్నానుగాని, ఆ మొగవాడిమీద ప్రేమ పొంగి పొర్లిందనిగాని, అతని మీద అనురాగం జాలువారిందని కాదు. ప్రస్తుతం అతని వల్ల కొంత పనివుంది. ఒక మొగవాడి నీడ, ఆఖరికి ఏ మొగపురుగు ఛాయా నేను భరించలేను. మొగవాడు అన్న శబ్దాన్నే నేను భరించలేను. మొగవాని స్పర్శ, మొగవాని భావన, నా గర్భకుహరంలో భయంకలిగించి, ఏదో తెలియని ఆందోళన కలిగిస్తున్నది. నన్ను చూడగానే మొగవానికి కూడా యిటువంటి ఆందోళన కలుగుతుందా ? మామయ్యకు అనిపించినట్లే నన్ను చూడగానే 'చెయ్యి పట్టుకు లాగంగానే వచ్చేస్తుంది' అన్న అభిప్రాయం కలుగుతుందికాబోలు. నిజంగానే నన్ను చూడగానే యిటువంటి ఆలోచనలు కలుగుతాయా ? నా ప్రవర్తనలో అటువంటి 'చీప్‌నెస్' వుందా ? లేక చూసేవాళ్ల దృష్టిలో 'ఆ చీప్‌నెస్' వుందా ? నన్ను చూడగానే మకరందం జ్ఞాపకం వస్తుందా ? లేక యీ తెలివితక్కువదాన్ని, యీ మొద్దుని పట్టుకుందామనే సాహసం కలుగుతుందా ? నాలోని మెత్తదనం, నా స్వభావంలోని పిరికితనం మొగవాడిలో అణిగి మణిగి వున్న పశువుని వుసికొలుపుతుందా ?

ఏం ఖర్మోగాని ఆడదాని వేటలో ఆరితేరిన అఖండులు నా పాలబడి, నన్ను చూడగానే మిస్ బిహేవ్ చేస్తారు. తల ఎత్తి చూస్తే చాలు ఏదో పెద్దపని వున్నట్లు పలకరించి, సమాధానం రాకపోయినా ముప్పైమూడు పళ్లూ బయటపెట్టి యికిలించి చూస్తారు. ఆ యికిలింపులో వారి మనసులోని ఆకలి కనబడుతుంది.

బస్‌లో టికెట్ ఇచ్చేప్పుడు ఆ కండక్టరు మీసాలు దువ్వుకుంటూ చూసే ఆ చూపు టికెట్‌కి డబ్బులు యిస్తుంటే కావాలని నా చేతివేళ్లని తాకేవాడిచొరవ, మిగతా అందరి వద్దా యిలా చెయ్యడు. ఒక్క నా దగ్గరే కావాలని వేళ్లతాకి డబ్బులు తీసుకుంటాడు, చిల్లర యిచ్చేప్పుడు వేళ్లు తాకి మరీ యిస్తాడు, మిగతావాళ్ల దగ్గిర కూడ యిలానే ప్రవర్తిస్తాడేమోనని గమనించి చూస్తాను. 'ఊహు' నన్ను చూస్తేనే యిలా

ప్రవర్తిస్తాడు. బస్‌లో వాడు నన్నెక్కడ ముట్టుకుంటాడోననే భయంతో గుండె 'టప్ టప్' మని కొట్టుకుంటుంది.

మొత్తంమీద మొగవాళ్లని చూడగా చూడగా ఒకరకమయిన జుగుప్సతో కూడిన భయం కలుగుతున్నది. వాళ్లని చూస్తే బొద్దెంకలు జ్ఞాపకం వస్తాయి. బొద్దెంకను చూస్తుంటే అది కుడుతుందేమోనన్న భయంతోపాటు ఏదో గగుర్పాటు, పారిపోదామనే జుగుప్స, అసహ్యంతో వంటిమీద వెంట్రుకలు నిక్కడబొడుచుకుంటాయి. నాకు ఆ మాదిరి జుగుప్సే కలుగుతుంది మొగవాళ్లని చూస్తే.

అయినా నేను యిప్పుడో బొద్దెంక కొరకు వెతుకుతున్నాను. ఆ బొద్దెంకతో నాకు పనివుంది.

కొన్నాళ్లగా నాగురించి నేను చాలా ఆలోచిస్తున్నాను. 'సెల్ఫ్ కాన్షెస్' గా కూడ వుంటున్నాను. రోడ్డుమీద నడుస్తూ వెనక్కి తిరిగి తిరిగి చూస్తూంటాను. బస్‌లో వెళుతున్నా, వస్తున్నా నా ప్రక్కగా రోడ్డుమీద వెళ్లే ఒక్కొక్క కారుని విడవకుండా, పరీక్షగా ప్రతికారుని చూస్తున్నాను. వాకింగ్‌కి వెళ్లేప్పుడు కూడా కార్లని పరీక్షగా చూస్తున్నాను. నా వెనక రోడ్డుమీద ఏదన్నా కారు ఫాలో అవుతున్నదేమోనని చూస్తూంటాను. ఒకోసారి ఆ కారు ఫాలో అయినట్లే అనిపిస్తూంటుంది. ఆకారు నన్ను వెంబడిస్తున్నట్లు వూహించుకుంటున్నాను.

సాయంకాలంవేళ నేను పూర్వంలాగా గదిలోకూచుని వుంటంలేదు, వీధివాకిట్లో నుల్చుని, వొచ్చేపోయే మనుషులని ప్రతివొక్కరినీ పరిశీలనగా, గుచ్చిగుచ్చి చూస్తూంటాను. నాకళ్లు రోడ్డుమీద పోయేవారిని శల్య పరిక్ష చేస్తూంటాయి. ఆ చూపులనిబట్టి వారు ఏదో ఏదో వూహించుకుంటారా? కొందరు తలవంచుకుని వెళ్లిపోతూంటారు- 'నువ్వు చూసింది చాల్లే మేము తిరిగి చూడటం ఎందుకు' అన్నట్లు.

అతని గురించి ఆలోచించి, ఆలోచించి ఆ ముఖాన్ని గుర్తు చేసుకునేందుకు ప్రయత్నిస్తున్నాను.

ఈ మధ్య కళ్లు మూసుకుంటే నాకు ఒక్కటే ఒక్కటి కనిపిస్తున్నది. అది మొగవాళ్ల ముఖాలు. రకరకాల మొఖాలు, మీసాలున్న మొఖాలు. మీసాలు లేకుండా నున్నగా గీసివేసినవి, నల్లపడిన నున్నటి గడ్డంగల ముఖాలు, వెడల్పాటి ముఖాలు, పొడుగాటివి, గుండ్రటివి, కూలింగ్ గ్లాసు పెట్టుకున్న ముఖాలు, శుభ్రంగా కడిగి తుడిచినట్లుండే ముఖాలు, మొటిమలతో గతుకులముఖాలు, చక్కగా వున్నవాళ్లు, తెలివయిన ముఖాలు, వుత్త దద్దమ్మల్లాగా వున్న తెల్ల ముఖాలు, ఎప్పుడూ పళ్లు బయటపెట్టి యికిలించేవాళ్లు, యిలా రకరకాల మొఖాలు, ఒక ముఖంలాగా మరొక ముఖం కనిపించదు. అన్నీ మొగముఖాలే కాని ఒక ముఖానికీ మరొకదానికీ పోలిక వుండదు. కొన్ని ముఖాలు చూస్తుంటే కొన్ని జంతువుల ముఖాలు జ్ఞాపకం వస్తుంటాయి. కొన్ని

పక్షి ముఖాలు కూడా జ్ఞాపకం వస్తుంటాయి. మేకలాగా, గుర్రంలాగ, కోతిలాగ, డేగలాగ, పిలకలాగ, ముంగినలాగ వుంటాయి కొన్ని ముఖాలు.

ఇలా మనుషులని పరీక్షగా చూడటం చక్కటి పాస్టైము. నేను వీళ్లందరినీ యిలా ఆశగా చూద్దామనే వుద్దేశ్యంతో గమనించలేదు. అతనిని వెతికి పట్టుకోవాలనే పట్టుదలతో ఈ రకరకాల మొహాలని పరీక్షించి చూస్తున్నాను. ఎవరి ముఖం తేరిపార చూసినా ఒకవేళ అతనే యీ మనిషేమోనన్న సంశయం కలుగుతూంటుంది. అతను యీ మనిషికి పరిచయస్తుడేమో! అడిగి చూద్దామా అన్న కుతూహలం కలుగుతుంది. ఏమని అడగను? అతని పేరు నాకు తెలియదు. ఆ కారు నెంబరు కూడ తెలియని నేను ఎవరిని ఏమని అడగను!

నా ముఖాన్న ఏంరాసి పెట్టివుందో? పేరుకూడా తెలియని ఆ వ్యక్తే నా సర్వస్వం. మామయ్య ఆమాటే చెప్పాడు. ఆయన పండితుడు. అటువంటి అతను చెప్పింది అబద్ధంకాదు. పేరు తెలియని ఆ వ్యక్తే నా సర్వస్వం.

మామయ్య చెప్పినట్లు నేను చపలచిత్తురాలినా? పేరుకూడా తెలియని ఒక మొగవాడిని, పేరుకూడా అడిగి తెలుసుకోలేని, అతను ఎవరోకూడా తెలుసుకో ప్రయత్నించని నేను, అతనివల్ల నా సర్వస్వం ఎలా కోల్పోగలిగాను? నా చపలత్వం వల్లనే యిటువంటి సంఘటన ఏర్పడింది. లేకపోతే ప్రపంచంలో యిటువంటి ప్రమాదాలున్నాయని తెలియనంత మూర్ఖురాలినా? నాకు అందుబాటులో లేని, నేను అందుకోలేని ఆపై మెరుపులు చూసి, ఆ అనుభవానికి నేను అమాయకురాలివలె లొంగిపోయి, నన్ను నేను నాశనం చేసుకున్నానా?

పేరు తెలియని ఆ వ్యక్తే నా భర్తా? కారులోని ఆ సంఘటనే నా వివాహమా? ఆమాదిరి పెళ్లిళ్లని గాంధర్వ వివాహమంటారు కాబోలు. గాంధర్వ వివాహమంటే యిదేనా?

నేను ఎలాగో అలా నా భర్తని వెతికి పట్టుకోవాలి. శకుంతలని దుష్యంతుడు గాంధర్వ వివాహం చేసుకున్నట్లు, దమయంతి నలునికొరకు అడివిలో వెతికినట్లు, ఈ మహానగరంలో, వీధి వీధిలో కారూ కారూ వెతకనా? ఆ అపరిచితుడు ఒకస్త్రీకి భర్తగాకుండా, ఆమె పిల్లలకి తండ్రికాకుండా యింకా బ్రహ్మచారిగా వుండి వుంటాడా? ఇన్నిరోజులూ అలా వుండగలగడం సాధ్యమా? అసలు నేను అతనికి జ్ఞాపకం వుండి వుంటానా? ఒకవేళ నేను నా గురించి చెప్పినా, అతను జ్ఞాపకం తెచ్చుకుంటాడా? నన్ను జ్ఞాపకం పెట్టుకోవడానికి నా దగ్గిర ఒక్క గుర్తు కూడా లేదే! ఆనాడు అతని జ్ఞాపకార్థం ఒక్క అవమానం తప్ప మరేచిహ్నమూ తీసుకో లేదే! నేను వుత్త మూర్ఖురాలిని, తెలివి తక్కువ మొద్దుని. అతనిని ఎలాగైనా కలుసుకోవాలని, చూడాలనివుంది. నేను అసమర్థురాలని కాదని మామయ్య

దగ్గర నిరూపించుకోవాలి అంటే - అతన్ని వెతికి పట్టుకోవాలి. ఈ మామయ్యను కాస్త దూరంగా వుంచడానికొరకైనా అతన్ని వెతికి పట్టుకోవాలి.

లంచ్ టైము - నా సెక్షనులోని వారంతా కాంటీనుకి వెళ్లారు. ఆడవాళ్లు భోజనం చెయ్యడానికని, ఒక వారగా ఏర్పాటు చేసిన స్క్రీన్ వెనుకనుంచి రెండు మూడు కంఠాలు వినిపిస్తున్నాయి. మధ్య మధ్య నవ్వులూ, మాటలూ నా చెవుల సోకుతున్నాయి. నాకు ఆకలి వెయ్యడంలేదు. మజ్జిగా అన్నంవున్న టిఫిన్‌బాక్స్ అలా టేబుల్ మీదనే వుండిపోయింది. సంతకం పెట్టాల్సిన ఫైళ్లదొంతర ఒక పక్కగా వుంది. సంతకంపెట్టి విసిరిపడేసిన ఫైల్సు మరోప్రక్కన గుట్టలా పడివున్నాయి. ఈ రోజున ఎ.సి. చాలా చల్లగావుంది. టెలిఫోన్ టేబుల్‌మీద పక్కగా ఒక గ్లాసులో మంచినీళ్లూ, దానిపైన ప్లాస్టిక్ మూతా వున్నాయి. ఈ నీళ్ల రంగసామి రోజూ ఎందుకు తెచ్చిపెడతాడో ? ఒక్క రోజునకూడా నేనానీళ్ల తాగిన పాపాన పోలేదు. అయినా అతని డ్యూటీ అతను చేస్తున్నాడు. ఎవరన్నా 'ఇదుగో యీ ఫైలు తీసుకెళ్లు' అని పిలిచారా - రంగసామి ఆ మనిషిని తినేసేటట్లు చూస్తాడు.

"మీరు సంతకం పెట్టారుకదా - అక్కడితో మీ పని అయిపోయింది. వెళ్లాల్సిన చోటుకి అవే వెళతాయి. మీ ఫైలు ఏమన్నా ప్రత్యేకమైన చోటికి వెళ్లాలా ? విడిగా తీసిపెట్టి అప్పుడు చెప్పు" అంటూ డబాయించి మాట్లాడుతాడు రంగసామి.

నేను ఎవరికీ ఏపనీ చెప్పను. అందరూ భోజనాలకి వెళ్లాక నేను ఒంటరిగా కూచుని తింటాను. నన్ను ఎవ్వరూ లంచ్ టైములో రమ్మని పిలవరు. నేనూ ఎవ్వరినీ రమ్మనను. నాకు ఎవరూ ఫ్రెండ్సు లేరు.

రంగసామి ఎప్పుడూ నన్ను వుదాహరణగా చూపించి మెచ్చుకుంటూంటాడు. అతనికి ఆఫీసుపని చెయ్యడమంటే కష్టంగా వుంటుంది. అదే 'అక్కడికెళ్లు - ఇక్కడికెళ్లు' అని ఎన్నిసార్లు తరిమినా సంతోషంగా పరుగెడుతాడు. రంగసామికి ఎంత బయట తిరగమంటే అంత సరదా. అతనికి నేనెప్పుడూ ఆఫీసు పని చెప్పను. బయటకు ఏ పని మీదా పంపను.

నిన్న యిల్లాగే కూచుని నావెనక వున్న గ్లాసు స్క్రీన్‌లోంచి, మౌంట్‌రోడ్ చూస్తున్నాను. రోడ్డు మీద వచ్చే కార్లూ, వెళ్లే కార్లూ ఆ గాజు స్క్రీన్‌లో నుంచి స్పష్టంగా కనిపిస్తాయి. అలా చూస్తుంటే నాకు అనిపించింది.

ఈ ఆర్. కె. వి. అతనయి వుంటాడా అని.

నాకెందుకో ఆర్. కె. వి. అన్నది ఒక స్త్రీ అయివుంటుందని - అనిపిస్తూంటుంది.

కాని మామయ్యే మటుకు అర్. కె. వి. మొగవాడు, ఆడదికాదు - అతను ఒక పోలీసువాడు కాని. ఆడపిల్లలని వేరతీసే జులాయివాడు కాని అయివుండాలని అంటూంటారు.

ఆ కధలో రాసిన ఆ సంఘటన, ఆ స్థలం, ఆ కారు, ఆ సమయం, అతను కధ నడిపించిన తీరు యివన్నీ చూస్తే రాసిన ఆ కధ - నా కధ అయివుంటుందనీ ఆ రాసిన వ్యక్తి అతనే అయివుంటాడనీ నాకు అనిపిస్తోంది.

నేను గౌరవించి, అభిమానించే ఒక యింటలెక్ట్యుల్‌ని 'అతను' గా వూహించుకో లేక పోతున్నాను. అలా వూహించుకున్నపుడు, మనసులో ఏదో వెలితిగా, బాధగా వుంటుంది. అలా అయివుండదు. అతను అర్. కె. వి. అయివుండడు. అని నన్ను నేను సమాధాన పరచుకున్నాను.

అర్. కె. వి. కి వున్న తీక్షణమైన యోచన, నిసితమైన దృష్టి, మానవతా దృక్పధం, వున్నతమైన అభిప్రాయాలు 'అతని'కి ఎక్కడవి? సాయంకాలం అయే సరికి కారు తీసుకుని వీధుల్లో వున్న బస్టాండుల చుట్టూ తిరిగే, యీ కలవారి అబ్బాయికి అర్. కె. వి. కి పోలిక ఎక్కడ?

ఆడపిల్లల మనోభావాలని, వారు సమాజంలో ఎదుర్కొంటున్న సమస్యలని అంత చక్కగా, సహజంగా చిత్రించి రచనలు చేసే అర్. కె. వి. స్త్రీ అయివుంటుందనే నా వుద్దేశం. ఒకవేళ స్త్రీకాక పురుషుడే అయినా ఫరవాలేదు. కాని అర్. కె. వి. మటుకు - 'అతను' అయివుండడు, 'అతను' కాకూడదు.

నేనెందుకు యిలా వూహించుకుంటున్నాను, అర్. కె. వి. అతను అయివుండడు అని అనుకోవడంలో అరంవుంది. అంతేగాని అతను అవకూడదు అనుకోవడం ఏం న్యాయం?

'అతను' అర్. కె. వి. అయివుండకూడదని ఎందుకు అంటున్నానంటే, ఒకవేళ అతను అర్. కె. వి. గనక అయితే, ఆపైన అతని రచనలని నేను ఎలా చదవగలుగు తాను? ఎలా యిష్టపడగలుగుతాను? అతను అర్. కె. వి. అయినపుడు అతను రచనలలో చెప్పేది ఒకటి - నిజ జీవితంలో చేసేది ఒకటి అనేకదా అర్ధం. అంటే అర్. కె. వి. అన్న ఆ పెద్ద రచయిత 'హిపోక్రట్' అనేగదా అర్ధం? ఆ నాటి సంఘటన అతను మర్చిపోయాడనే అనుకుందాం. మర్చిపోయినవి జ్ఞాపకం చేస్తే అతను గుర్తిస్తాడా? అసలు ఆ విషయాలన్నీ మరచిపోయి, యింత పెద్ద ఆశయాలతో కధలురాసే ఈ రచయితను నేను మెచ్చుకుంటున్నానంటే - నా ఎడ్మిరేషన్ కూడా ఒక బూటకమవుతుంది.

పన్నెండు సంవత్సరాలు గడిచిపోయినాయి. పన్నెండేళ్ల క్రితం ఏమీ తెలియని వుత్త మొద్దుని నేను. ఈనాడు ప్రతీది నిశితంగా ఆలోచించడం నేర్చుకోలేదా? అతనూ

యీ పన్నెండేళ్లలో పెళ్లిచేసుకునివుంటాడు. స్త్రీహృదయాన్ని అర్థంచేసుకుని వుంటాడు. పిల్లలతండ్రి అయివుంటాడు. ముఖ్యంగా ఒక ఆడపిల్లకి తండ్రి అయి వుంటాడు. ఆ పిల్లకు యిప్పుడు పది పన్నెండేళ్ల వయసువచ్చి, స్కూలుకి వెళుతూం టుంది. ఆపిల్లని చూసినపుడల్లా నేను జ్ఞాపకంరానా? ఆనాటి సంఘటన అతని మనోఫలకంమీద ముద్రపడి వుండదా? ఈ పన్నెండేళ్ల జీవితానుభవాలూ అతని హృదయానికి పదునుపెట్టి వుండకూడదా? నేను మారినట్టే అతని బుద్ధికూడా వికసించి వుండటంలో ఆశ్చర్యంలేదే! స్కూలుకెళుతున్న ఆ పన్నెండేళ్లపిల్లనీ చూస్తున్నవుడు ఒకరోజుకాకపోతే మరో రోజనన్నా నేను జ్ఞాపకం రాకుండా వుంటానా? నాకు సంభవించిన ఆ దుర్ఘటన తన కూతురికి సంభవించగల దేమోనన్న భావన అతని మనసుని కలవరపెట్టదా?

ఈ జీవితంలో ఎప్పుడు ఏమవుతుందో చెప్పలేం? ఏది ఎప్పుడైనా సంభవించ వచ్చు. ఎవరికైనా సంభవించవచ్చు. సంభవించిన తరువాత ఏమి చేయలేము. హౌ టు ఫేస్ ది ప్రోబ్లెమ్?

ఆర్. కె. వి. అన్నది అతనేగనక అయితే నాకు మరోసమస్య ఎదురవుతుంది. ఎందుకంటే, ఆర్. కె. వి. రచనలమీదా, తద్వారా అతనిమీదా నాకు గొప్ప ఎడ్మిరేషను కలిగింది. ఇప్పుడు అతన్ని కలుసుకుంటే అతనే ఆర్. కె. వి. అయితే అతనిపట్ల నాకున్న గౌరవం ఏమవుతుంది? అతని పైనున్న గౌరవం, ఆరాధన యివన్నీ భగ్గునమండి బూడిదలో పోసిన పన్నీరవుతాయి. పెళ్లి చేసుకోకూడదని నిర్ణయించుకొని, ఒంటరిగా నిరాధారంగా బ్రతుకుతున్నాకూడా నాకు అంతబాధగా లేదు, కాని ఆర్. కె. వి. అతనుగనక అయితే నేనా దెబ్బకి తట్టుకోలేను. చెప్పలేని ఏదో ఒక భావం నన్ను మెలిపెడుతున్నది.

అతనికోసం వెతికి అతనే ఆర్. కె. వి. అని నిరూపణ అయేపక్షంలో, అసలు అతన్ని వెతికే ప్రయత్నమే మానుకుంటే మంచిదేమో! నా యీ ప్రయత్నానికి అది ముగింపుగనక అయితే, అసలు ఈ ప్రయత్నమే మానుకుంటాను.

గాజుస్క్రీన్‌లోంచి నాకళ్లముందు వరస వరసగా కార్లు పరుగెడుతున్నాయి. ఏడవ అంతస్తులోంచి చూస్తున్న నా కళ్లకు వందలాది మనుషులు గుంపులు గుంపులుగా కనిపిస్తున్నారు. నలుపు, ఎరుపు, పచ్చ, తెలుపు, నీలం రకరకాల రంగుల్లో కార్లు ఎదురు బదురుగా వరసల్లో, బొమ్మలాటలోవలె పరుగెడుతున్నట్లు కనిపిస్తు న్నాయి. ఇక్కడినుంచి చూస్తుంటే కారు పైభాగం 'టాపు' మటుకే కనిపిస్తోంది. లోపల కూచున్న మనుషులు కనబడటంలేదు.

ఈ కార్లలో ఒక కారు అతనిదై వుండవచ్చునేమో! అతనికి ఎన్నోకార్లు వుండి వుంటాయి. పెద్దకారు ఒకటేకాదు చిన్నకారూ వుండివుంటుంది. అదిగో ఆ వచ్చే

కారు ఎంత బాగుందో! తెల్లనెమలి పిల్లలాగా, తెల్లగా ముద్దుగావుంది. తెల్లనెమలి అపురూపంగా వుంటుంది. అల్లానే ఈ కారుకూడా చిన్నగా అందంగావుంది. అయ్యో ఎదురుగా ఆ లారీవాడు అతివేగంగా వస్తున్నాడే . . . . . . అయ్యో రామరామ!

నేను చూస్తుండగానే, నాకళ్లముందు ఒకక్షణంలో, రెప్పపాటులో అబుల్లికారుని లారీ గుద్దుకుంది.

ఇక్కడికి శబ్దం వినిపించలేదు.

ఆ బుల్లితెల్లకారు ముందుభాగమంతా చితికి ముక్కలయిపోయింది. ఆ తరువాత ఏమీ తెలియటంలేదు. ఒకటే జనం. పోలీసులు- గుంపుగా మనుషులు. గాజుస్క్రీన్‌లోంచి అంతా కనిపిస్తోంది. మనుషులు వారి కదలికలూ అంతా మూగ సినిమాలాగా కనిపిస్తున్నాయి. శబ్దం వినిపించడంలేదు.

లంచ్‌కి వెళ్లినవాళ్లంతా ఒక్కొక్కరే తిరిగి వస్తున్నారు. టైపుమిషన్ల శబ్దం తిరిగి ప్రారంభమయింది.

రంగసామి ఫైల్సన్నీ బొత్తిగా అమర్చి, తాడువేసికట్టి, అదేదో పెళ్లిముచ్చటలాగా ఎవరిదగ్గరో చెబుతున్నాడు.

"మనిషి అవుట్ సార్. చిన్నవాడు మంచి షోగ్గావున్నాడు. ఆ చొక్కా అదీ బలే స్టయిల్‌గా వున్నాడు – కాని వూపిరి పీలుస్తున్నట్లులేదు. తలంతా చితికిపోయింది – "క్లోజ్"

"రంగసామీ ప్లీజ్" అంటూ నేను చెవులు మూసుకున్నాను. రంగసామి నోరెత్తకుండా వెళ్లిపోయాడు. నాకెందుకో తెరలు తెరలుగా దుఃఖం వస్తోంది. ఆ పక్కకి చూడమని మనసు తొందరపెడుతోంది. అయినా ధైర్యం రావడంలేదు.

సాయంకాలం యింటికెళ్లేముందు గాజుస్క్రీన్‌లోంచి చూశాను. ఇంకా పోలీసులు నిలుచునేవున్నారు. ఆ చిన్నకారుని క్రేన్ తీసుకొచ్చి పైకిలాగి తీసుకెళ్తున్నారు. నా కడుపులో తిప్పినట్లయింది.

మధ్యాహ్నం చక్కగా తెల్లనెమలి పిల్లలాగా వచ్చిన యీ చిన్నకారు యిప్పుడు చితికిపోయి శిధిలంఅయివుంది, ఆ శిధిలాన్ని చూస్తుంటే బాధగావుంది.

వస్తువు ఎవరిదగ్గరవున్నా దాని అందాన్నిచూసి అందరూ ఆనందించవచ్చు. కాని దాని అందాన్ని ఛిన్నాభిన్నం చేసినపుడు బాధకలగక మానదు.

అతను, ఆ కారు నడుపుతున్నతను 'క్లోజ్' అని రంగసామి తేలిగ్గా అనేశాడు. నాకెందుకో అలా జరిగివుండదని అనిపిస్తోంది. అతను ఎటువంటి వాడయినాకానీ, ఎవరికీ అటువంటి దుర్మరణం రాకూడదు. అతని ఆత్మశాంతికి నేను ప్రార్థిస్తాను. అతనింకా ఆస్పత్రిలో వుండివుంటాడు. అతని ప్రాణానికి ఏ ఆపదావుండదు. అతను

బ్రతుకుతాడు. రోడ్డుమీద రక్తం మరకలు కనిపించడంలేదు. ఆ రంగసామి ఒకడు. వాడో 'సిక్‌పర్సన్' ప్రతీది అభూతకల్పనలుచేసి కథలల్లి చెపుతాడు.

ఒకవేళ ఇతను అతనయి వుంటాడా ? భగవాన్ !

## 7

మామయ్య అనుకున్నట్లు ఆర్. కె. వి. అన్న యీ రచయిత ఒక మొగవాడా ? అయామ్ సారి వాడు కాదు ఆయన.

నేను టెలిఫోన్‌లో మాట్లాడుతున్న వ్యక్తి పత్రికాఫీసులోని ఎవరో సబ్ ఎడిటర్‌ట. అతనితో మాట్లాడుతున్నాను. ఆ పత్రికను ప్రతివారం చదివే పాఠకులలో నేనొకదాన్ని, అని నన్ను నేను పరిచయం చేసుకున్నాను. ఆ పత్రికలో ఆర్. కె. వి. రాస్తున్న కథలను విపరీతంగా మెచ్చుకునే పాఠకురాలినని కూడా చెప్పుకున్నాను. ఆ కథ గురించి చాలా చెప్పాను. టెలిఫోన్‌లో మాట్లాడుతున్నపుడు, నాకు ఎదుటి మనిషితో మాట్లాడుతున్నప్పటివలె – భయంగా, సిగ్గుతో మాటలు తడబడవు. ఆ కొసని ఒక మనిషి వున్నాడనే సంగతి పూర్తిగా మరచిపోతాను. నా ఎదురుగా వున్న ఆ రిసీవర్‌తోటి మాట్లాడుతున్నట్లనిపిస్తుంది. అందుకే ఫోన్‌లో ధైర్యంగా మాట్లాడుతూంటాను. చాలాసేపు మాట్లాడాను. నేను ఎప్పుడూ నాలో నేను ఆలోచించుకుంటూ, నాతో నేను మాట్లాడుకుంటూంటాను. ఎదుటి మనిషితో ప్రత్యక్షంగా మాట్లాడే అలవాటు కోల్పోయాను. ఆ కథలోని ప్రతివాక్యం నాకు జ్ఞాపకం వుంది. పత్రికా పాఠకురాలిగా ప్రారంభించిన నా సంభాషణ ఆర్. కె. వి. ఎడ్మయిరర్‌గా మారిపోయింది. అతను రాస్తున్న ఆ కథలోని పాత్రలు ముఖ్యంగా ఆ కథానాయకి పట్ల అతనికున్న సానుభూతి, ఆమెకి న్యాయం చేకూర్చాలనే ఆవేదన నన్ను ఎలా ఆకర్షించాయో, వివరంగా చెప్పడం మొదలుపెట్టాను. ఆ వుత్సాహంలో నన్ను నేను మర్చిపోయి 'నేనే ఆ కథలోని పిల్లని' అని బయట పెట్టేస్తానేమోనన్న భయంవేసి, గబుక్కున సంభాషణ ఆపేశాను. నేను అసలు దేనికోసం ఫోన్ చేశాను? ఆ విషయం దగ్గరకొచ్చి, ఆర్. కె. వి. ఎడ్రసు కావాలని యింగ్లీషులో అడిగాను. ఆ పక్కనుంచి కొంచెం ఆగి కదలిక వచ్చింది. యోచించి బదులు చెపుతున్నట్లుగా వుంది.

"మేము రచయితల ఎడ్రసులు వారి అనుమతి లేనిదే యివ్వకూడదు. కావాలంటే మీరు ఒక పని చెయ్యండి. ఆయనకు రాయదలచుకుంది మా ఎడ్రసుకి రాయండి. ఆ వుత్తరం మేము ఆర్. కే. వి. కి అందచేస్తాం"

"ఆయనని కలుసుకుని కొన్ని విషయాలు మాట్లాడాలనివుంది." నా ధైర్యానికి నన్ను నేనే వీపుమీద తట్టుకుని అభినందించుకున్నాను.

ఆ వైపునుంచి మళ్లీ జవాబొచ్చింది.

"అది సరే మేడమ్. మీకు ఆయనని చూడాలని వుండవచ్చు. కాని అందుకు ఆయన సమ్మతిస్తారో లేదో తెలుసుకోకుండా ఎడ్రసు యివ్వడం ఎలా? ఓ పని చెయ్యండి. మీ ఫోన్ నెంబరు యివ్వండి. ఆయన్తో ఫోన్‌లో మాట్లాడి - పది నిముషాల్లో ఏ విషయం తెలియజేస్తాను."

ఫోన్ నెంబరు యిస్తున్నపుడు అతను నా పేరు కూడా అడిగాడు. కాస్త సంశయించి ఆ విషయం తప్పించేశాను. పేరు చెప్పకుండా "ఈ నెంబరుకి ఫోన్ చెయ్యండి. ఎక్సెటెన్షన్ సిక్స్‌త్రీ అని అడగండి. ఫోన్ నా టేబుల్ మీదనే వుంటుంది. థాంక్యూ" అంటూ నా ఫోన్ నెంబరు యిచ్చి, మళ్లీ తిరిగి టెలిఫోన్ ఎప్పుడు మోగుతుందా అని ఎదురుచూస్తూ కూచున్నాను.

ఆ సబ్ ఎడిటర్ ఫోన్‌లో చెప్పబోయే ఎడ్రసుకోసం ఎదురుచూస్తూ కూచున్నాను. ఈ పదినిముషాల టైములో ఏ పనీ చెయ్యలేకపోతున్నాను. ఇంక ఏ పనీ లేనట్లు, చూడవలసిన పేపర్లు ముఖ్యం కాదన్నట్లు ఆ ఫోన్ వంక చూస్తూ కూచున్నాను. మనసు పనిమీద లగ్నం కావడంలేదు. ఈ ఫోన్ కోసం చేతులు కట్టుకుని కూచోవాలా? ఎదురుగుండా వున్న ఫైల్సు తీసుకు చూడవచ్చుగా? ఏదో ఒక పని చెయ్యొచ్చుగా? ఈ ప్రశ్నలన్నీ నా బుర్రలో తిరుగుతున్నాయేగాని, నేనుమటుకు ఏ పనీ చెయ్యడంలేదు. వూరికినే కూచుని అర్థంలేని ఆలోచనలతో సతమత మవుతున్నాను.

నేను కూచున్న కార్నర్‌లో నుంచి చూస్తుంటే, నా సెక్షనంతాయే కాదు, పక్క సెక్షనుకూడా పూర్తిగా కనిపిస్తుంది.

విశాలమైన మైదానంలాంటి ఈ హాలు. హాలుపొడవునా రెండు వరసల్లో టేబుల్సు, కుర్చీలు, టైపురైటర్లు రైలుపట్టాల్లా అవుపడుతున్నాయి. టేబుల్సు మధ్యన ఒక మనిషి మాత్రమే నడిచే దారివుంది. ఆ దారంట కొందరు ఫైల్సు పట్టుకుని పరుగులాంటి నడకతో తిరుగుతుంటారు. రంగసామి మటుకు తీరిగ్గా నిదానంగా నడిచి వస్తూవుంటాడు. ఇరుకుగావున్న ఆ దారిలో యిద్దరు మనుషులు నడవాలంటే, కాస్త జాగర్తగా తప్పుకొని రావాలి. లేకపోతే డాషిచ్చుకుంటారు. అలా నడుస్తున్నపుడు యిద్దరూ ఒకరినొకరు చిరునవ్వుతో పలకరించుకుంటున్నారు. ఆ టేబుల్ చుట్టూ అయిదారుగురు కూచునివున్నారు. అందులో నలుగురు విజిటర్స్‌లా వున్నారు. ఈ ముఖాలు కొత్తగా వున్నాయి. ఒకళ్లనొకళ్లు పరిచయం చేసుకుంటు న్నారు. కూచునేందుకు కుర్చీలు చాలక పక్క టేబుల్ నుంచి కుర్చీలు లాక్కుని, అక్కడే

కూచున్నారు. అందులో ఒకతను నల్లపాంటుమీద తెల్లషర్టు వేసుకున్నాడు. కూలింగ్‌గ్లాసెస్ పెట్టుకుని, ఈ హాలునంతా ఆ నల్లఅద్దాల వెనకనుంచి పరీక్షగా చూస్తున్నాడు. తాను చూస్తున్న విషయం పక్కవాళ్ళకి తెలియదన్నట్లు చూస్తున్నాడు. అతనిదృష్టి నామీద నిలిచినపుడు, నా కళ్లని మరోవైపుకి తిప్పుకున్నాను.

ఈ హాలులోవున్న ఈ ఆఫీసుని, ఇందులో చెక చెక తిరిగే ఈ మనుషులని, టిక్ టిక్ మనే టైపుమిషన్ల శబ్దాన్నీ - యివన్నీ చూస్తుంటే వీరంతా, ఏదో మెకానికల్‌గా— ఒక గడియారంలాగా తిరుగుతున్నారనిపిస్తుంది.

ఆ నలుగురి విజిటర్స్‌లో ఒకడు 'అతనై' వుంటాడా? ఈ నల్లపాంట్ వైట్‌షర్ట్ మనిషి అతనేనా? ఇతనకీ అతనికీ పోలికలులేవే! పన్నెండు సంవత్సరాలలో ఒకమనిషి ఎంతైనా మారిపోయివుండచ్చు. మొఖంలో ఎంతో మార్పు వచ్చి వుండవచ్చు. నేను మటుకు అల్లాగేవున్నానా? నాలోమటుకు మార్పురాలేదా?

నా వెనుకనున్న గాజుస్క్రీన్‌లోనుంచి రోడ్‌మీదనున్న కారు పార్కింగ్‌లోని కార్లని చూస్తున్నాను. ఆ కార్లలో, ఆ కారుకొరకు వెతుకుతున్నాను. అక్కడ చాలా కార్లువున్నాయి. నేను వెతుకుతున్న ఆ కారుమటుకులేదు.

నేనెందుకిలా అవుతున్నాను? ఏం చూసినా, ఏ సంఘటన చూసినా, ఏ జన సమూహం చూసినా, ఏయాక్సిడెంట్ చూసినా నేనెందుకు యిలా ఒకే ఒక ఆలోచనతో వుక్కిరి బిక్కిరి అవుతున్నాను?

నిన్నరాత్రి డాబామీద - వెల్లకిలా పడుకొని ఆకాశంలోని మేఘాలని చూస్తున్నాను. ఆకుపచ్చా ఎరుపు దీపాలు తోకమీద మెరుస్తూండగా విమానం ఆకాశంలో ఎగిరి వెళ్లిపోతోంది. అది బొంబాయికి వెళుతోందా? ఢిల్లీకి వెళుతోందా? నాకు వెంటనే ఆ ప్లేన్ గురించి, ఆ విమానంలో ప్రయాణంచేస్తున్న ప్రయాణీకుల అర్జెన్సీ గురించీ ఆలోచనలు రావటం మొదలుపెట్టాయి. చివరకు 'అతను' ఒకవేళ యీ విమానంలో వెళుతూ వుంటాడా? అనే ఆలోచన మెదిలింది. ఆ విమానంలో అతను వుండి వుంటాడని కూడా అనిపించింది. ఏది ఆలోచించినా, నా ఆలోచనలు తిరిగి తిరిగి చివరకి అతని దగ్గరకే వచ్చి ఆగిపోతున్నాయి.

దీనికి అర్థమేమిటి? నా భావాలన్నీ పైకి చెపితే నేను అతన్ని ప్రేమిస్తున్నానని అంటారు. నేను అతన్ని ప్రేమించకూడదు. ప్రేమించలేనుకూడా. అసలు అటువంటి భావన నాలో కలగడం భరించలేకుండా వున్నాను. అతనికోసం వెతికి వెతికి వేసారి పోతున్నాను.

ఒక ప్రయోజనంతోనూ, ఒక నిశ్చయంతోనూ అతనికొరకు వెతుకుతున్నాను. వెతికి వెతికి అలిసిపోతున్నాను. ఏమైనా అతను ఏదో ఒక సమయంలో నాకంట పడక మానడని నాకెందుకో గట్టినమ్మిక ఏర్పడుతున్నది. అది యీ క్షణంలో కావచ్చు.

లేక యింకోప్పుడు కావచ్చు - అతను యీ క్షణంలో యీ భవంతిలో ఎక్కడో ఒక చోట వుంటాడని అనిపిస్తోంది—ఎవరినైనా పిలిచి అతన్నిగురించి అడిగితే! ఆ నల్లకళ్ళద్దాలు - అతనే అయివుంటాడా? లేక అతనికి పరిచయస్తుడై వుంటాడేమో! నేను అతన్ని గురించి వెతుకుతున్నాను, అతన్ని గురించి ఆలోచిస్తున్నట్లు ఎవరికీ తెలియదు. ఇదిగో టెలిఫోన్ మోగుతోంది. వన్ సెకండ్.

"ఎస్"

"అవును - నేనే అడిగాను. వుండండి నోట్ చేసుకుంటాను. యస్. చెప్పండి. మిస్టర్ ఆర్. కె. విశ్వనాథశర్మ - అతని ఫుల్ నేమా? డోర్ నెంబరు పదహారా? మందవల్లి, థాంక్యూ వెరిమచ్, టెలిఫోన్ నెంబరా? ఇంట్లో లేదా? ఆయన ఆఫీసు నెంబరుందా? చెప్పండి. డబుల్ ఎయిట్ .... ఒకె థాంక్సు ఎ లాట్"

ఆరె. కె. వి. అనేపేరుతో రాస్తున్న ఆర్. కె. విశ్వనాథశర్మ ఎడ్రసు పెన్సిలుతో పెద్దపెద్ద అక్షరాల్లో నా లెటర్‌పాడ్ లోపలున్న బ్లాటింగ్ పేపరు మీద రాసివుంచుకొన్నాను. పెద్ద ఘనకార్యంచేసి ఎడ్రసు సంపాయించాను. వాట్ నెక్స్ట్?

నేను చేసే పనులన్నీ అంతే. ఇది చెయ్యాలి, అది ప్రారంభించాలి అనుకోవడంతో సరి. లెటర్స్ టు ది ఎడిటర్‌కి లెటర్ రాసినట్లే. ఈ విషయం కూడా అలానే అవుతుందా?

నేను ఒక కథ రాస్తే ఎలా వుంటుంది? నా అనుభవం, నా సమస్య రాస్తే. ఛీ .... కథ రాయాలంటే ముందు ఐ షుడ్ స్టార్ట్ థింకింగ్ యిన్ టెమిల్. ఐయామ్ సారీ - తమిళంలో ఆలోచించడం అలవాటు లేదే! కథలు రాయాలంటే ముందు తమిళంలో ఆలోచించి ఆ పైన ఆరంభించాలి కాబోలు.

నా అనుభవాలు, సమస్యలు, ఆలోచనలు యివన్నీ ఒక కథలో రాస్తాను. కాని ఆర్. కె. వి. లాగా రాయడంరాదే! ఎందుకు రాదు? అచ్చు అలాగే రావాలని ఎక్కడా లేదే! ఇంకో మాదిరిగా రాయచ్చు. రాయగలను. సరి యిప్పుడు చెయ్యవలసిందేమిటి? ఆర్. కె. వి. ని కలుసుకోనా? ఈ ఎడ్రసులో వున్న వీధి పేరు చూస్తుంటే, ఏదో చిన్న గల్లీలాగా తోస్తోంది. ఉండేది గల్లీ అయినా, యిల్లు పెద్ద బంగళా అయివుంటుంది. ఆయన ఎక్కడో వుద్యోగం చేస్తున్నాడనుకుంటా. ఆడపిల్లల తండ్రీ, పెద్దమనిషీ అయివుంటాడు. విశ్వనాథశర్మ అన్న పేరు వింటుంటే - అతను వయసులో పెద్దవాడు అనిపిస్తోంది. విశ్వనాథశర్మ అన్న పేరు గల వ్యక్తి అలా కారులో తిరుగుతూ, ఆడపిల్లల వెంట పడతాడనుకోను. ఆయన 'అతన'యి వుండడు. అంతవరకూ రూఢి. నేను ధైర్యంగా వెళ్లి కలుసుకోవచ్చు. అయినా కూడా విశ్వనాథశర్మ అన్నది - ఒక మొగజాతి ఆ విషయం నేను

మరచిపోకూడదు. నా జాగ్రత్తలో నేను వుండాలి. తెలివి తక్కువగా 'ఆ కథలో వచ్చిన అమ్మాయిని నేనే' అని మనసులో వున్నది పైకి అనెయ్యకూడదు. అయితే దేనికొరకు వచ్చినట్లు చెప్పాలి?

ఊరికే ఒక పాఠకురాలిగా, అతని అభిమానిగా వెళ్లి చూడకూడదా?

సరి వెళ్లాక మిగతా విషయాలు చూసుకోవచ్చు.

ఆయన్ని కలుసుకోవడానికి వెళుతూ వుత్తచేతులతో ఎలా వెళ్లను? ఏదన్నా కొని తీసుకెళ్లాలి? ఏం తీసుకెళ్లను? నేను యింతవరకూ ఎవరికీ ఏ ప్రజంట్లూ తీసుకుని వెళ్లలేదు. నాకూ ఎవరూ ప్రజంట్లు తెచ్చియివ్వలేదుకూడాను. ఏం తీసుకెళ్లాలి? టకీమని ఒక ఆలోచన వచ్చింది. ఆయన రాసిన పుస్తకం ఏదన్నా కొని తీసుకెళితే? బాగుంది బాగుంది -- ఆయన రాసిన పుస్తకం ఆయనకే యివ్వడమా! ఏం తీసుకెళ్లి యివ్వాలో నిశ్చయించుకోలేకుండా వున్నాను. ఆయన రాసిన పుస్తకం కొనుక్కెళ్లి, ఆయన చేత సంతకం చేయించుకుని, జ్ఞాపకార్థం నా దగ్గిర దాచుకుంటేనో? చాలా బాగుంది. వెరీ గుడ్ ఐడియా! ఈ అయిడియాని అతను చాలా అభినందిస్తారు. ఏమో ఎవరు చూశారు! నాలాగే యింతకు ముందు ఎందరో యిలా పుస్తకాలు కొని సంతకాలు పెట్టించుకుని వెళ్లి వుండచ్చుగా! ఏం అలా చేస్తే చేసివుండచ్చు. నేను మాటుకు ఇలానే చేయదల్చుకున్నాను. ఈ రోజు బుధవారం. శనివారం మధ్యాహ్నంపూట వెళితే ఎలా వుంటుంది? ఆయన యింట్లో వుంటాడా? ఫోన్ చేసి - ఎంగేజిమెంటు ఫిక్సుచేసుకుని వెళ్తే మంచిది కదూ! ఫోన్ నెంబరెంతా? డబుల్ ఎయిట్ - - -

ఆర్. కె. వి. ని కలుసుకోవడానికి బయలుదేరాను. ఆరునెలల క్రితందాకా నేను పారిస్ కార్నర్‌లో వున్న మా బ్రాంచి ఆఫీసులో వుండేదాన్ని. అప్పుడు రోజూ యీ బీచ్‌రోడ్ మీదుగా వెళుతూండేదాన్ని. ఇప్పుడు మౌంట్‌రోడ్డు ఆఫీసుకు మారాను. ఈ రూట్ చాలా బోరుగా వుంటుంది.

మందవల్లి బస్‌స్టాండ్‌లో బస్ ఆగింది. ఆయన వుండేవీధికి ఎటువైపుగా వెళ్ళాలో తెలియడంలేదు. ఎవరినన్నా అడగాలంటే సిగ్గుగావుంది. అందుకని ఒక్కొక్కవీధి వెతుక్కుంటూ వెళ్ళానా?

ఒక సైకిలురిక్షా యిటువైపుగా వస్తోంది. వాడిని అడిగితె! ఏం మొదలీ విధి..... చేతిలోవున్న అడ్రసు చీటీ ఒకసారి చదివి వాడిని అడిగాను.

"ఆ వీధిలోకి వెళ్ళాలంటే దీనికి ముందుస్టాపుల్ దిగాలి. తిరిగి వెళ్ళాలంటే యీ దారంటవెళ్ళడానికి వీలవదు. ఇది వన్‌వేరోడ్. ఆరు అణాలివ్వమ్మా - ఆ యింటి గుమ్మంలోకి తీసుకెళ్ళి దించుతాను" అన్నాడు.

సరిఅనుకొని సైకిల్ రిక్షా ఎక్కాను. ఏవో రెండు మూడు వీధులు తిప్పి, చివరికి ఓ చిన్నసందులోకి తీసుకొచ్చాడు. ఇదేనా ఆ వీధి? చాలా యిరుగ్గావుందే! ఎదురుగా మరొక రిక్షా వస్తోంది. ఇద్దరు రిక్షావాళ్ళు గంటలు కొడుతున్నారు. ఏ వొక్కరూ పక్కకు తప్పుకుని ఆగడంలేదు. ఎదురెదురుగా రెండు రిక్షాలుఆపి యిద్దరూ పోట్లాడుకుంటున్నారు.

నా రిక్షావాడి వాదన ఏమిటంటే: 'తను మనిషిని ఎక్కించుకుని వస్తున్నాడు. ఎదుటిబండీ ఖాళీగావస్తోంది. అందుకని ఖాళీరిక్షా తప్పుకుని తనకి దారియివ్వాలి' అని.

సైకిల్‌రిక్షావాళ్ళ మధ్య ఇది ఒక న్యాయంకాబోలు. అంచేత వాడు న్యాయం కోసం పోరాటం ఆరంభించాడు. న్యాయాన్యాయాల గురించి వాళ్ళు మాట్లాడే తీరూ వుపయోగించే భాషా చాలా కఠినంగావుండి చెవులు చిల్లులు పడుతున్నాయి. నాకు భయంగావుంది. ఈ యిద్దరూ కొట్టుకునేటట్లువున్నారు. అనుకోకుండా తలతిప్పి చూశాను. నా పక్కయింటినెంబరు పదమూడు కనిపించింది. ఇక్కడనుంచి నడిచి వెళ్తే సరిపోతుంది. నేను వెతుకున్నది దీనికి మూడో యిల్లు.

"ఇదుగో నేను యిక్కడ దిగుతాను" అంటూ సలభై పైసలుతీసి, తీవ్రంగా పోట్లాడుతున్నవాడిచేతుల్లో పెట్టి, కిందకిదిగి నడక ఆరంభించాను.

పధ్నాలుగు, పదిహేను, తరువాత. ఎ. బి. వొకటా? యిదిగో పదహారో నెంబరు--- ఈ యిల్లా?

ముందుపెంకుల వసారా - చుట్టూ కటకటాలు. తంజావూరులోని యిల్లు మాదిరిగావుంది. లోపలికి సొరంగంలాగా గదులువుంటాయి. పూర్వం మేము ట్రిప్లికేన్‌లో యిలాంటి యింట్లోనే వుండేవారం. అదే టైపుయిల్లు. అద్దెవాటాలు చాలా వున్నట్లున్నాయి· వీధి వసారాలో- గచ్చు అరుగులమీద ఇద్దరు ముగ్గురు ఆడవాళ్ళు కూచునివున్నారు. అవతలపక్కగా, కొంచెం దూరంగా, రూమ్‌లోపల ఒక మధ్యవయసు స్త్రీ కూచుని తలబయటకిపెట్టి చూస్తోంది. ఆమెకి మధ్య వయసని కూడా అనలేం. చూడటానికి చక్కగావుంది. నాకంటే రెండు మూడేళ్లు చిన్నకూడానేమో!

నలుగురు ఆడవాళ్లు ఒకే సమయంలో యిలా వీధివసారాలో కూచోవడం చూస్తే ఆ యింట్లో అద్దె కుటుంబాలు చాలావున్నట్లు తోస్తున్నది. వారపత్రికలూ, సీరియల్ బైండ్లూ అలా పక్కగా పడివున్నాయి. చాలా వుత్సాహంగా వారివారి నెల యిబ్బంది గురించి మాట్లాడుకుంటున్నారు.

"హడలిపోయానంటే నమ్మ. ఈ నెల మూడురోజులు ఎగించి మరీ వచ్చింది!" అందులో ఒకావిడ చాలా సీరసంగా అంటోంది.

"నా రోజు బాగుంది - కాఫీకూడా కలిపాకనే వచ్చింది. ఇంక రాత్రిళ్ళు చపాతీలేకదా! ఆయన వస్తూనే చిటపటలాడిపోతారు. నేనేదో కావాలని చేసినట్లు" అంటూ యింకో ఆవిడ ఏడుపే తరవాయి అన్నట్లుగా బొంగురు గొంతుతో అంటున్నది తానేదో మహాపరాధం చేసినట్లు.

"ఒరేయ్ దిక్కుమాలిన వెధవా–ఇలా వచ్చిఏడు. చొక్కావిప్పి స్నానం చేసిరా. మీనాన్నరాని చంపి పారెయ్యమంటాను" అంటూ మీదపడుతున్న పిల్లవాడిని, యివతలకి లాగుతూ, పళ్లబిగబట్టి తిడుతోంది మరొక ఆవిడ.

ఆవిడను అడిగాను :

"ఇక్కడ మిస్టర్ విశ్వనాధశర్మ - యీ యింట్లోనేనా వుండేది?"

ఆ ఆడవాళ్లంతా నన్నొక్కసారి ఎగాదిగా చూశారు. నా చేతులు వణుకుతున్నాయి, గొంతు తడి ఆరిపోతోంది. వయసులో వున్న ఒక ఆడపిల్ల మొఖం తెలియని ఒక మొగవాడిని వెతుక్కుంటూ వచ్చిందంటే - ఏదో తప్పుడు పని చేసివుండాలని అనుకుంటున్నారా? ఆ మాట నా ముఖంమీదనే అడిగేస్తారేమోనని గుండె దడదడలాడింది.

గది లోపలగా పక్కగా కూచుని వుండే ఆవిడ చిన్నగా నవ్వుతూవుంది. ఆ నవ్వు చిన్న పిల్ల నవ్వులా అమాయకంగా వుంది.

"అవునవును యిక్కడే వుంటారు. వారు మా ఆయనే. మీరెవరు? మీకేం కావాలి?" అంటూ ఆవిడ చాలా సౌమ్యంగా అడిగింది. కాని పక్కనున్న ఆడవాళ్లు మటుకు నా వంక గుర్రుగా చూస్తున్నారు. నా రాకలో దురుద్దేశమేమీలేదని వాళ్లని నమ్మించడానికన్నట్లు బాగ్‌లోంచి పుస్తకాన్ని తియ్యబోయి :

"ఏమీలేదు. నాకు వారి కథలంటే చాలా యిష్టం. ఆయన కథలన్నీ చదివి, అభిమానించేవారిలో ఒకత్తెను. వారిని కలుసుకుని, ఈ పుస్తకంమీద ఆయన ఆటోగ్రాఫ్ తీసుకోవాలని" అంటూ నేను చెప్పే మాటలు నిజమన్నదానికి నిదర్శనంగా, హాండ్‌బాగ్‌లోంచి పుస్తకం తీశాను.

ఆమెకి మనసులో చాలా గర్వంగా వుండి వుంటుంది. వుండదా మరి? ఎవరికైనా వుంటుంది. ఆర్. కె. వి. వంటి ప్రముఖ రచయితకు భార్య అయినందుకు గర్వంగా వుండటం సహజమే! ఆయనకోసం, ఆయనని చూడాలని నాలాంటి అభిమానులు ఎందరెందరో వెతుక్కుంటూ వస్తూంటారు. ఈ ప్రపంచంలో చివరికి మిగిలేవి పేరు ప్రతిష్టలేకదా! ఆయనని చూడటానికి వొచ్చేవాళ్లు యీ అద్దె యింటినీ, యీ యిరుకు సందునీ, వీటన్నిటిని లక్ష్యపెట్టరు. ఇవి వారికి జ్ఞాపకం రావు. ఆయన ప్రతిభా, పేరు ప్రతిష్టలూ చూస్తారు గాని, యీ యిల్లూవాకిలీ కాదు. అ...

"ఓసే గణేశీ - యిక్కడే నిల్చుందే యింతసేపూ - పిన్నీ కొంచెం లోపలికి తొంగి చూడండి. లోపల మాగణేశీ వుందేమో! ఆమెని లోపలికి తీసుకెళ్లమని చెప్పండి" అంది ఆవిడ పక్కనున్న పిన్నిగారితో.

లోపల పక్కగా గోడవారనున్న కుళాయిలోంచి నీళ్లు పడుతున్నది ఒక బామ్మ గారు. ఎవరో వస్తున్న అలికిడి వినిపించిందికాబోలు - తలమీంచి జారిపోతున్న ముసుగు సవరించుకుని వెనక్కి తిరిగి నన్ను చూసింది.

ఆమెకి పక్కగా పై జాకెట్టు లేకుండా, చీటీ పరికిణీ నాడా బుజాలమీంచి వేలాడుతూ, ఆరేళ్ల పాప, పొట్టకు పలక ఆనించుకుని, నాలిక బయటపెట్టి, ఏదో గబ గబ రాసి, తుడిచేస్తూ నిలుచుని వుంది. ఆ పిల్లేనా గణేశీ?

"వెళ్లవే - మీ అమ్మ ఎందుకో పిలుస్తోంది. పో" అంటూ బామ్మగారు పిల్లని తరుముతోంది.

"నేను పోను పో" అంటూ ఆ పిల్ల మొండిగా అక్కడే నిలుచుంది.

అక్కడ కూచుని కథ చదువుతున్నవారిలో ఒకావిడ బామ్మగారితో "ఏమిటి చూస్తున్నారు? మీ యింటికే. మీ అబ్బాయిని చూద్దామని వచ్చారు. తీసుకెళ్లండి" అంది.

ఆ బామ్మగారు నీళ్ల బిందె ఎత్తుగుని నా ముందుగా వచ్చి నిలుచుని "ఎవరమ్మా - మా విసూని చూట్టానికి వచ్చావా? వాడి కాలేజీలో చదువుకుంటున్నావా?" అని అడిగింది.

నాకు ఏ కాలేజీవో, అసలు ఆవిడ ఏమడుగుతున్నారో కూడా బోధపడలేదు. ఆర్. కె. వి. అనే విశ్వనాథ శర్మకి, యింట్లో విసూ అని పేరు. ఈ విషయం మటుకు తెలిసింది.

"నేను వారి కథలు చదువుతూంటాను." ఆ పైన నాకేం చెప్పాలో తెలియలేదు. ఆవిడనే చెప్పే సమాధానం కోసం ఎదురు చూడలేదు. ఆ గణేశీ ఆర్. కె. వి. కూతురు ఆ పిల్ల మటుకు యింతింత కళ్లు వేసుకుని, నా వంక చూస్తోంది. నీళ్లబిందె ఎత్తుకున్న బామ్మగారు ముందుగా నడుస్తోంది. నేను వారి వెనకనే వెళుతున్నాను. "నాన్నా నీకోసం ఎవరో ఓ అత్త వచ్చారు" అంటూ ఓ కేక పెట్టింది ఆ గణేశీ. వాళ్ల పోర్షన్ వెనకభాగాన వుంది కాబోలు. రెండు మూడు వాటాలు దాటి వెళ్లాము. ఎక్కడ చూసినా పిల్లలు చిన్న ఎలిమెంటరీస్కూల్లో ప్రవేశించినట్లుంది. ఆ వసారాలో అంతా బట్టలు, తోరణాల వలె వేళ్లాడుతున్నాయి రెండువైపులా.

బామ్మగారు, ఆర్. కె. వి. తల్లిగారు ఏదో గొణుగుతూనేవుంది. ఆవిడకు తనలో తాను మాట్లాడుకోవడం అలవాటు కాబోలు. ఆవిడ మాట్లాడేది ఎవరినీ వుద్దేసించికాదు. ఈవిడకు ఇది అలవాటు కాబోలు.

"శనిగాళ్లు - వసారానింతా బట్టలే. కుళ్లు బట్టలూ పేళ్లూను. ఇది బ్రాహ్మణ కొంపని ప్రమాణం చేసి చెప్పినా ఎవరూ నమ్మరు. వెనక పంపులో నీళ్లు వచ్చి ఏడవ్వు. రెండు గుమ్మాలు దాటి ముందు పంపుకి వెళ్లి తెచ్చుకుందామంటే, అక్కడో పెద్ద కచ్చేరీ మొదలు పెడతారు. వాళ్లంతా పట్టుకుంటే తప్ప వెనక వాటాలవారికి హక్కులేదుట. అంచేత వాళ్ల అవసరాలు తీరేదాకా పడగాపులు పడివుండాలి కాబోలు. రెండేళ్లుగా చెవిన యిల్లుకట్టుకు పోరుతున్నాను. వాడు వినిపించుకుంటేగా. నలుగురితో వాకబుచేస్తే తప్ప యిల్లు దొరుకుతుందా? నీలాంటి దాని చెవిన వేస్తే - ఏదన్నా దొరకొచ్చు. నువ్వు ఎక్కడుంటున్నావమ్మా?"

అమ్మయ్యా - ఇప్పటికి నా వునికిని గమనించారన్నమాట. నన్ను యిల్లెక్కడని అడుగుతున్నారని తెలిసింది.

"ఎగ్మూర్ - పంచవటిలో -- వుంటున్నాము"

"నేను పంచవటీ చూడలేదు కిష్కింధా చూడలేదు. నా చెల్లెలి కొడుకు తిరుచ్చి నుంచి బదిలీ అయి కుటుంబంతోపాటు ఈవూరొచ్చి మూడు నెలలయింది. అదేమిటి అశోకనగరంట అక్కడుంటున్నాడు. వాడింటికి వెళ్లాలి వెళ్లాలి అనుకోవడమేగాని, వొక్కసారి కూడా వీలపలేదు. ఒక్కదాన్నీ వెళదామంటే దారి తెలియదు. దారి తెలుసుంటే ఏదో తీరిక దొరికినపుడు వెళ్లి వుండేదాన్ని. ఒక్కదాన్నీ పోలేనుకదా. నాకెవరన్నా సాయంకావాలి. వాడికి తీరిక వున్నపుడు నాకు వీలవదు, నాకు వీలయినపుడల్లా వాడింట్లో వుండడు. ఒరేయ్ వినూ - ఎవరో వచ్చారు చూడరా? నీ కథలంటే యిష్టంట, అవి చదివి చిన్నపిల్ల పాపం వెతుక్కుంటూ వచ్చిందిరా. ఎగ్మూర్ పంచవటీట్రా. పాపం అక్కడినుంచి ఎంతో అభిమానంతో వచ్చిందిరా. కూచో అమ్మా" - అంటూ లోపలికెళ్లి నీళ్లబిందె దించారు.

ఇంటి వెనక భాగంలో బంగాళా పెంకులతో చిన్నయిళ్లు వరసగా మూడు నాలుగున్నాయి. మహారచయిత ఆర్. కె. వి. వుంటున్నది యిటువంటి యిల్లు అంటే ఎవరూ నమ్మరు.

ఇంట్లో రెండే రెండు గదులు వున్నాయనుకుంటా. ఒకదాని వెనుక యింకొకటి వున్నాయి. ముందు గది వస్తూనే కనిపిస్తుంది. దాని వెనక ఎడంవైపున వంటిల్లు. ముందు గదిలో నేను నులుచుని వున్నాను, కుడిచేతి వైపున మూడు అడుగుల వెడల్పున వరండా, గోనె పట్టాతో ఒకవైపు తెరలాగా మూసి, రెండోవైపు తడికలు కట్టి వున్న యీ స్థలం ఆర్. కె. వి. యొక్క స్టడీ అయివుంటుంది. మధ్యాహ్నం వేళ నిద్రపోతున్నట్లున్నారు. నేను వారిని డిస్టర్బ్ చెయ్యడం లేదుకదా!

ఈజీఛైర్‌లోంచి ఆయన లేస్తున్న శబ్దం వినిపిస్తోంది. ఇదిగో ఇంక ఆయన బయటకొస్తారు కాబోలు

నా జీవితాన్ని కథారూపంలో చిత్రించిన ఈ రచయిత విశ్వనాథశర్మ అని నాకు తెలుసు. కాని ఆ కథలోని కథానాయకిని నేనేనని, ఆ సృష్టించిన పాత్ర నేనని ఆయనకి తెలుసా ?

ఆ విషయం నేను బయటపెట్టకూడదు. కథ వేరు జీవితం వేరు. కథలో ఒక పాత్రకు సంభవించే దర్ఘటనలు, జీవితంలో ఒక వ్యక్తికి నిజంగా సంభవించినాయని, ఆఖరికి ఆ రచయితకి కూడా సూటిగా చెప్పలేం, అలా సూటిగా చెప్పడానికి ఏదో ఒక సంకోచం కలుగుతుంది.

నేను అలా ఒక తెరిచిన పుస్తకం కాకూడదు. నేను యీనాడు మంచి స్థితిలో వున్నాను. ఆ విషయం తలుచుకు సంతోషపడుతున్నాను. "ఎవరినీ సులభంగా నమ్మకు - నీ జివితంలోని ఆ మచ్చని ఎవరికంటా పడనీయకండా దాచుకో లేకపోతే మీ అమ్మ, అన్నయ్యలలాగా, మీ మామయ్యలాగా ఈ లోకమే నిన్ను నీచంగా అనుకుంటుంది" అని నా మనసు నన్ను హెచ్చరిస్తూనే వుంటుంది.

అదిగో - గోనెపట్టా తొలగించుకుని సులుచని వున్నారాయన -

## 8

"యస్ ప్రభూ ఆర్గనైజేషన్స్"

"---"

"ఎవరు మాట్లాడుతున్నారు ?"

"----"

"ఏం పనిమీద ఫోన్ చేస్తున్నారో తెలుసుకోవచ్చా ?"

"----"

"వారి సెక్రటరీకి కనెక్షన్ వేస్తాను. మిస్టర్ ప్రభు యీజ్ నాట్ యిన్ స్టేషన్. మీ రెవరు? మీ పేరు తెలుసుకోవచ్చా?"

"---"

"రిలేటివా ? మూడొంతులు మధ్యాహ్నం ప్లేన్‌లో రావచ్చు. రెండు గంటలు దాటాక ఫోన్ చేసి చూడండి"

ఆ పెద్ద బంగళాలో, విశాలంగా, చల్లగా అమర్చిన్న వున్న ఆ హాలులో చాలా సేపటినుంచీ టెలిఫోన్ మోగుతూవుంది. బయట ఎండ మాడిపోతూవుంది. ఆకుపచ్చని తివాచీ పరిచినట్లు, కాంపౌండ్‌లోపల ముందుగా ఒక పక్కని లాన్ వుంది. నీళ్ళపంపుకి హోస్ తగిలించి, ఆ హోస్‌తో లాన్‌పై నీళ్ళు చిలకరిస్తున్నాడు

తోటమాలి. టెలిఫోన్ బెల్ వినిపించనంత దూరంగా, యింటి వెనక వరండాలో పనిమనిషీ వంటవాడూ తీరికగా ఖబుర్లు చెప్పుకుంటున్నారు. ఆ యింటి యజమానురాలు పద్మనుష్టుగా భోంచేసి, తన ఏర్‌ఖండీషన్ రూములో పడుకుని, తాపీగా తమలపాకులు వేసుకుంటూ, రేడియోలో సినిమాపాటలు వింటోంది.

హాలులో టెలిఫోన్ చాలాసేపటినుంచీ గణగణ మోగుతూనేవుంది.

కాంపౌండ్‌లోకి ఒక పెద్ద కారు నెమ్మదిగా వస్తోంది. శనివారం అవడంచేత స్పెషల్‌క్లాసుకి వెళ్లి, కాలేజీనుంచి తిరిగివస్తున్నది మంజుల. కారు ఆగి ఆగగానే టెలిఫోన్ శబ్దం చెవులబడటంతో, కారుదిగి గబగబ పరుగులాటి నడకతో హాలులోకి ప్రవేశించింది.

ఎవరూ యింట్లోలేరా? అంతా ఎక్కడ చచ్చారో? అన్నట్లు మొఖంపెట్టి, విసుగ్గా యింకా మోగుతూనే వున్న రిసీవర్‌ఎత్తి:

"అవును మిస్టర్ ప్రభూ యిల్లే మీ రెవరు? నాన్న కావాలా?"

"----"

"ఐ డోంట్ నో. ఒక్క నిముషం వుండండి. కనుక్కొని చెబుతాను" అంటూ టెలిఫోన్ పక్కన రిసీవరువుంచి, "అమ్మా - అమ్మా" అంటూ బిగ్గరగా పిలుస్తూ - మెడమెట్లు రెండేసి చొప్పున ఎక్కుతూ పైకి వెళ్ళింది.

మేడమీద గదితలుపు తెరవగానే, లోపలనుంచి సినిమాపాటలు వినిపిస్తున్నాయి.

"అమ్మా – నాన్న ఎక్కడ? రెండు రోజులయింది యింకా రాలేదా? పొద్దుట వచ్చారనుకున్నా - యింకా రాలేదా? ఎవరో గంగట. నాన్నతో మాట్లాడాలట. ఆఫీసులో వుంటారా?"

"పొద్దున్నే బెంగుళూర్‌నుంచి ఫోన్‌వచ్చింది. ఎయిర్‌పోర్ట్‌కి బండివెళ్ళింది. ఎప్పుడెళ్ళారో ఎందుకెళ్ళారో ఎవరికి తెలుసు? బెంగుళూర్‌లో యిప్పుడు రేసుల సీజనా? సరిసరి యింకేం ఆఫీసుకి ఫోన్‌చేసి - ఆ రావ్‌కి చెప్పు. ఇంటికి ఫోన్ చెయ్యడం దేనికి —?"

మంజుల సినిమా సంగీతం బయటకి రాకుండా లోపలే వుండేటట్లు, నెమ్మదిగా తలుపుతెరిచింది. సినిమా పాటలు ఆ గదిలోపలనే పీకనొక్కుకుని అణిగిపోయాయి. గదికున్న స్ప్రింగ్ డోర్ కిర్రుమని శబ్దంచేస్తూ మూసుకుంది. గబగబ మేడమెట్లు దిగివచ్చి రిసీవర్ అందుకుని మాట్లాడుతున్నది మంజుల:

"మీరేదన్నా పనిమీద వారిని కలుసుకోవాలనుకుంటున్నారా? నేను వారి డాటర్ని ఆఫీసు విషయమైతే రావు అని నాన్నగారి సెక్రటరీ ఆఫీసులో వుంటారు. యు టాక్ టు హిమ్"

" "

"ఎస్. యు ఆర్ రైట్. హి యీజ్ నాట్ యిన్ స్టేషన్. మధ్యాహ్నం మూడు దాటింతరువాత ఫోన్ చెయ్యండి - - - ప్లీజ్ జస్ట్ హోల్డ్ ఆన్ హి యీజ్ కమింగ్"

కాంపౌండు లోపలికి వచ్చి ఆగుతున్న ఆ చిన్నకారుకు చోటు యివ్వటానికి పోర్టికోలో ఆగిన ఆ పెద్ద కారు కదిలి షెడ్‌లోకి వెళ్లింది.

ఈ రోజుల్లోని కాలేజీపిల్లలకి మల్లే - వొంటికి పట్టుకున్నట్లుండే బట్టలు వేసుకుని, నోట్లో సిగరెట్‌తో, కారులోంచి దిగీదిగగానే ఆసిగరెట్ పీకెని, కింద వేసి షూజ్ కాలుతో నలిపి, ఎదురుగుండా వస్తున్న కూతురిని చూశాడు ఆ ప్రభు.

"ఓ - దిస్ యీజ్ ఆఫుల్. బెంగుళూర్‌లో క్లైమేట్ ఎలా వుందో తెలుసా? నెక్ట్స్ టైమ్ నువ్వూ రా. - - పూరికే ఒక వీకెండుకు వెళ్దాము."

"మీవెంటనా? అమ్మ తప్పకుండా పంపుతుంది - - -"

"వై? నా వెంట పంపనంటుందా? అయితే తననే తీసుకెళ్లమను. మంజూ యు డు వన్ థింగ్. వచ్చే శని ఆదివారాల్లో నిన్ను బెంగుళూరు తీసుకెళ్లమని మీ అమ్మను అడుగు. ఇట్ యీజ్ వండర్‌ఫుల్. నేనూ వచ్చి మిమ్మల్ని అక్కడ కలుసుకుంటాను"

"అదేం కుదరదు. నాకు ఎగ్జామ్స్ వున్నాయి. మీకేం నాన్నా ఎగ్జామ్సా, బిజినెస్సా? జాలీగా ఏ బాధా లేకుండా హాయిగా తిరుగుతారు. సరి సరి - మీకేదో ఫోన్‌కాలు వచ్చింది. చాలా సేపటినుంచీ వెయిట్ చేస్తున్నారు. ఎవరో గంగట - -"

"గంగా? - ఎవరబ్బా?" అని జ్ఞాపకం చేసుకునే ప్రయత్నంలో టెలిఫోన్ దగ్గిర కెళుతుంటే మంజుల లోపలి కెళ్లిపోయింది.

కార్లోంచి చిన్న సూట్‌కేసు తీసుకుని, మేడమీద రెండోవైపుకి వున్న అతని గదివైపుకి వెళ్లాడు డ్రయివరు.

"ఎస్ - ప్రభూ హియర్"

నాకు నోట మాట రావడంలేదు. ఏమీ మాట్లాడలేకపోతున్నాను. గొంతులో ఏదో అడ్డుకున్నట్లుగా వుంది. కళ్లలో నీళ్లు పొంగిపొంగి వస్తున్నాయి.

"హలో - హలో - " అన్న అతని కంఠంతో నా చెవులు తూట్లుపడుతున్నాయి.

"హలో — నేను గంగను మాట్లాడుతున్నాను" అని చెప్పబోతున్న నా కంఠం వొణుకుతున్నది.

"గంగవా? - ఏ గంగ? వాట్ నంబర్ డు యు వాంట్?"

"ఈ నెంబరే - ఇది రాంగ్ నంబర్ కానేకాదు. మీకు నేను తెలుసు. కాని నాట్ మై నేమ్. పేరు చెప్పినా మీరు తెలుసుకోలేరు. నన్ను చూస్తే గుర్తుపడతారు."

"ఓ —"

"నీ పేరు గంగా ?" అని అతను ఒక నిట్టూర్పు విడిచాడు. అది నా చెవులో పాము బుసకొట్టినట్లు, బుస్‌మని నా చెవుల్లోకి సోకింది.

ఆనాడు ఆముని మాపువేళ అతని కళ్లు సన్నగా ఒకసారి పాము కళ్లలాగా, మరోసారి నెమలి కళ్లలాగా సోగతేలి నాకంటికి అవుపించాయి. ఆ జ్ఞాపకం యీ క్షణంలో- ఒక్కసారి మెదిలింది నాలో.

నా ఎదుట టేబుల్ మీద అతని కంపెనీ ఎంప్లాయీస్ రిక్రియేషన్ క్లబ్ జన్మదిన ప్రత్యేక సంచిక వుంది. అందులో అతని ఫొటో. ఒక పక్కగా తిప్పి చూస్తే వెంటనే ఆ ముఖం జ్ఞాపకానికి వస్తోంది. ఆ ఫొటోకిందనే అతని పేరు. ఈ ఫొటోచూసి, కిందనున్న అతని పేరు చూస్తూనే- నేను అతన్ని గుర్తించకలిగాను. అతనే యితను అని తెలుసుకున్న తరువాత నాకు ఆ కళ్లు పాముకళ్లలాగే అనిపించాయి.

"మీకు అదంతా జ్ఞాపకం వుందా ? ఇప్పటికైనా నేనెవరో గుర్తింపగలిగారా ? నేనెవరో తెలిసిందా ?"

ఎన్ని చెప్పినా అతన్ని కమిట్ చేయించలేకుండా వున్నాను. అతను 'వూ - ఆ -' అని రెండుమాటలతో సరిపెడుతున్నాడు. అతన్ని మాటల్లో పట్టుకోలేకుండా వున్నాను.

'ఇలాంటివి అతనెన్నో చూసివుంటాడా ? నాలాంటి పిల్లలు ఎందరో యితనికి ఫోన్ చేసి చేసి, మోసపోయి విసిగి వేసారివుంటారా ?' అన్న ఆలోచన నన్ను హడలగొట్టింది. నాగుండె దడదడలాడుతోంది. మా యిద్దరిమధ్యా యీ మౌనం ఒక సంభాషణలాగా నడుస్తున్నది. 'టక్' మని రిసీవర్ పెట్టేద్దామని ఒక క్షణంపాటు అనిపించింది. అతనే పెట్టనియ్యి - అని, అతడు రిసీవర్ పెట్టేస్తాడేమో - చూద్దామని అనుకుంటూ నిశ్శబ్దంగా వేచియున్నాను. "ఏం నోటమ్మట మాట రావటంలేధా ?" అని అతన్ని తీక్షణంగా అడిగేయమని మనసు తొందరచేస్తోంది. అతను ఏదన్నా అడుగుతాడేమోనని ఎదురుచూస్తూ - మాట్లాడకుండా రిసీవర్ పట్టుకుని నిరీక్షిస్తున్నాను.

"గంగా" అతను నాపేరుపెట్టి నన్ను పిలుస్తున్నాడు. నాకు గొంతుపెగిలి రావడంలేదు. అతని నోటంట నాపేరు. ఏం చెప్పాలో తెలియటంలేదు. 'ఉ' అని మటుకు అనగలిగాను.

అతను మాట్లాడటం మొదలుపెట్టాడు.

"నాకు చాలా ఆశ్చర్యంగావుంది. పన్నెండు సంవత్సరాల తరువాత నీగురించి జ్ఞాపకం చేసుకుందామనుకున్నా - నువ్వు గుర్తుకు రావడంలేదు. ఒక పుష్కరం దాటిన తరువాత నీదగ్గరనుంచి యిలా ఒక ఫోన్‌కాల్ వస్తుందని కలలో కూడా వూహించలేకపోయాను. నువ్వు నిజంగా ఆపిల్లవేనా ? ఎంత అమాయకంగా, చిన్నపిల్లలా వుండేదానివో ? నీగురించి తెలుసుకోవాలనీ, నీ పరిచయం

చేసుకోవాలనీ చాలా కుతూహలంగావుంది. ఎక్కడినుంచి మాట్లాడుతున్నావ్? హౌ ఆర్ యు ? వాట్ ఆర్ యు ? మీ యింట్లో టెలిఫోన్ వుందా ?''

ఏవేవో ఒకటి తరువాత ఒకటి, ఆగకుండా అడిగేస్తున్నాడు. నేను అన్నిటికీ "ఉ ఉ" అంటున్నాను. అదికూడా చాలా నెమ్మదిగా అనగలుగుతున్నాను. గొంతులో ఏదో అడ్డుకున్నట్లుండి, శబ్దం రావడంలేదు. గుండెలు బరువుగా వున్నాయి. ఏదో బాధగావుంది. నాకు తెలియకుండానే కన్నీళ్లు వస్తున్నాయి. "పాపాత్ముడా" అన్నమాట గొంతుమధ్యలో యిరుక్కునిపోయి, శబ్దరూపాన పైకి రానంటున్నది. భగ్నమండే నామనసు అతన్ని శపించమంటోంది. కాని నా హృదయం అది న్యాయంకాదు అంటున్నది.

"హలో— హలో గంగా — డు యు హియర్ మి-ప్లీజ్ డోంట్ డిస్‌కనెక్ట్ హలో"

"ఎస్ — ఐ హియర్ యూ" నేను రిసీవర్ పెట్టేశాననుకుని అతనెక్కడ డిస్‌కనెక్ట్ చేస్తాడోనని చాలా ప్రయత్నంమీద గొంతుస్వాధీనం చేసుకు 'అయామ్ సారీ' అన్నాను.

"నన్ను ఎలా కనుక్కోగలిగావు? హౌ డు యు స్పాట్ మి ?"

నా మనసు కొంచెం స్వస్థత చెందుతోంది. నన్ను నేను సర్దుకుని చిన్నగా నవ్వి చెప్పాను. "పెద్ద మనుషులైన వారందరికీ యిలాంటి యిబ్బందే సంభవిస్తూంటుంది. మాములు మనుషులబారినుండి మీరు తప్పించుకు పోలేరు. టెలిఫోన్‌లో ముందు మాట్లాడింది మీ డాటరా ?''

"అవును. కాలేజీలో చదువుతోంది"

"కాలేజీలోనా ?"

"అవును ఈ ఏడే జేరింది"

తన కూతురు కాలేజీకి వెళుతున్నపుడు కూడా నేను అతనికి గుర్తు రాలేదు నా గురించి జ్ఞాపకం రాలేదు. కాలేజీకి వెళ్లేపిల్ల అంటే పదిహేను సంవత్సరాల వయసుంటుంది. అంటే అప్పటికే అతనికి పెళ్లి అయి వుందన్నమాట.

"వై డోంట్ యు కమ్ హియర్. ఎప్పుడు రాదల్చుకున్నా రావచ్చు. మై డోర్స్ ఆర్ ఆల్‌వేస్ వోపెన్ ఫర్ యు. యు మస్ట్ మీట్ మై డాటర్. షి ఈజ్ వెరీ స్వీట్. స్మార్ట్ గరల్"

తన కూతురి గురించి ఒకే పొగిడేస్తున్నాడు. మా అమ్మకూడా ఆ రోజుల్లో నేను కాలేజీకి వెళుతున్నపుడు, నా చదువు గురించీ, నాకొచ్చే మంచి మార్కుల గురించీ యిలాగే చెప్పుకుని గర్వపడుతూండేది. పొంగి పోతూండేది. అతను కూతుర్ని గురించి అంత సంతోషంతో చెప్పుకుంటుంటే నాకు ఏం బదులు చెప్పాలో తెలియలేదు. అతను మళ్లీ అడిగాడు.

"ఇంతకీ నువ్వెందుకు ఫోన్ చేశావో చెప్పావు కాదు."

"మిమ్మల్ని కలుసుకోవడానికి ఫోన్ చేశాను."

"ఇంత అకస్మాత్తుగా – పన్నెండు సంవత్సరాల తరువాత నన్ను కలుసుకోవాలని అనిపించిందా?"

"కాలంతో పాటు మనుషులూ మారవచ్చుగా. ఆరు మాసాల క్రితముదాక నాకు మిమ్మల్ని కలుసుకోవాలనే ఆలోచన రాలేదు; కలుసుకోవాలనే తలంపూ కలుగలేదు. కాని ఈ ఆరునెలల్లో ప్రతిక్షణం మీ కొరకు నేను వెతుకుతూనే వున్నాను. నాకు మీ కారొక్కటే గుర్తు. ఎన్నోకార్లు రోజూ చూస్తున్నాను. కాని మీ కారు మటుకు నా కంటబడలేదు యింతవరకూ. ఇప్పుడు ఆ కారు మీ దగ్గర లేదా?"

"నా దగ్గిరేవుంది. ఇంట్లో మిగతావాళ్లంతా అది వాడుకుంటూంటారు. నా కూతురు ఆ కార్లోనే కాలేజీకి వెళుతుంది. నేను చిన్నకారు వాడుకుంటున్నాను. ఇప్పుడు చిన్న కార్లేగా ఫాషను"

"ఓహో - పెద్దమనిషీ – చిన్నకారూ అన్నమాట. బై ది బై యు హావ్ ఎ వైట్ కార్?"

"అవును వుంది."

"పోయినవారం మౌంట్‌రోడ్డు పక్క ఆ కార్లో వెళ్లారా?"

"ఏం? రోజుకి నేను రెండు మూడు సార్లు మౌంట్‌రోడ్ మీద వెళుతుంటాను."

"ఏం లేదు. మా ఆఫీసుకి ముందు ఒక తెల్లకారుకి యాక్సిడెంటయింది. అప్పుడు మీరు గుర్తుకొచ్చి భయపడ్డాను."

"అంటే నువ్వు ఏదో ఆఫీసులో పని చేస్తున్నావన్నమాట. ఎక్కడ చేస్తున్నావ్? ఆర్ యు మారీడ్? నీకు పెళ్లయిందా, పిల్లలా?"

నేను నవ్వాను. చాలా విచిత్రంగా నవ్వాను కాబోలు. మా ఆఫీసువాళ్లకి నేను నవ్వడమంటే చాలా అబ్బురమైన విషయం. వాళ్లు విన్న యీ నవ్వుని, కళ్లారా చూసి, చెవులారా విన్న యీ నవ్వుని వాళ్లే నమ్మలేకుండా వున్నారు. తమ కళ్లని తామే నమ్మలేనట్లు నావంక ఆశ్చర్యంగా చూస్తున్నారు. నేను అంత బిగ్గరగా నవ్వానా? అంత పగలబడి నవ్వానా? పకపకమన్న నా నవ్వు విని అతను భయపడి పోయినట్లున్నాడు.

"వాట్ యీజ్ ది మేటర్ - ఎందుకలా నవ్వుతున్నావ్? ఇందులో అంత నవ్వే విషయమేముంది?" అని అతను ఏదేదో అడుగుతున్నాడు. నేను ఆగకుండా నవ్వేతున్నాను. నా నవ్వుని ఆపుకోలేకుండా వున్నాను.

"ప్లీజ్ స్టాప్ యిట్" అని అతను గట్టిగా అరిచాడు ఫోన్‌లో. నా రెండు కళ్లలోంచి కన్నీరు కారబోతుంది. ఈ నవ్వుని ఒక్క ఏడుపే ఆపగలదు కాబోలు. అయ్యో. నేను ఏడవకూడదు. ఆఫీసులో వాళ్లంతా నావంక చూస్తున్నారు. నేను యిప్పుడు ఏడవకూడదు.

గుండ్రంగా తిరిగే రివాల్వింగ్ కుర్చీ నాది. పొంగిపొరలబోతున్న నా కన్నీళ్ళని ఆపుకుంటూ నవ్వుముఖంతో, కుర్చీతోపాటు వెనక్కి తిరిగాను. టెలిఫోన్‌లో మాట్లడుతున్న నాముఖం వాళ్ళకి కనబడదు. నా వీపుమటుకే వాళ్ళకి కనబడుతుంది.

నా కంఠం నవ్వుతోంది, నా ముఖం ఏడుస్తోంది. ఆ ఏడుపు వచ్చింతరువాతనే నవ్వు ఆగింది. రుమాలుతో ముఖం తుడుచుకొని, ఇన్ని సంవత్సరాల అనంతరం అతని ప్రశ్నలకి సమాధానం చెప్పడం మొదలుపెట్టాను.

"ఎస్ - నేను ఒక ఆఫీసులో పని చేస్తున్నాను. మిగతావిషయాలు కలుసుకున్నపుడు చెబుతాను. మనం కలుసుకుని చాలా మాట్లాడుకోవాలి. ఎక్కడ కలుసుకుందాం?"

అతను నా ఆఫీసు ఎడ్రసు అడిగాడు. ఇప్పుడేవచ్చి కలుసుకుంటానంటున్నాడు. అది అంత బాగుండదని అనిపించింది. మాయింటికి రమ్మనమని చెపితే వొద్దు. ఇతను ఎలాటివాడో పూర్వాపరాలు తెలుసుకోకుండా యింటికి తీసుకెళ్లి యితనే 'అతన'ని బయటకి చెప్పడం మంచిదికాదు. ఒకవేళ మామయ్య చెప్పినట్లు – -

"అతన్ని వెతికి పట్టుకుంటుందే అనుకో - దీనికి న్యాయం చెయ్యమని అడిగినా, అద అతనికి ధర్మమని తోచవద్దా -- అతను నిన్ను నమ్ముతాడే అనుకుందాం, కారు ఆపి చెయ్యి పుచ్చుకుని లాగిన వాళ్ళందరితోటా - వెళ్లేటువంటి దానివని అతను నీగురించి అనుకోడా ?"

ఒకవేళ అటువంటి వుద్దేశంతోనే అతను ఇప్పుడు నాతో మాట్లాడుతున్నాడా? ఒక్కక్షణం యీ భావం నాలో మెదిలింది.

నేనిప్పుడు చాలా జాగర్తగా వుంటాను. నేను అప్పటిలాగా మొద్దునికాను. ఇప్పుడు చాలా తెలివిమీరాను.

"అదేచోట్లో కలుసుకుందాం"

"ఎక్కడ? ఏచోటు?"

"ఇంతకుముందు మనం కలుసుకున్నామే - అక్కడే కలుసుకుందాం. కాలేజీ గేటుముందు బస్‌స్టాప్‌లో - - రేపంటే అయిదున్నరకి అయిలాండ్ గ్రవుండ్‌లో కలుసుకుందాం."

## 9

ఇంకో రెండు గంటల్లో ఆ ప్రభుని నేను రెండోసారి కలునుకోబోతున్నాను. పన్నెండు సంవత్సరాలక్రితం అతన్ని నేను మొదటిసారి కలునుకున్నాను. ఆ క్షణంనుంచీ, యీ నిమిషందాకా ఆ కలయిక ఫలితాన్ని నేను అనుభవిస్తూనే వున్నాను. అతన్ని ఆ రోజున చూసివుండకపోతే! ఆనాడు కారులో నేను ఎక్కి వుండకపోతే! అతని పైపై మెరుగులు చూసి మంచులా కరిగి వుండకపోయి వుంటే. బుద్ధిలేనిదానిలాగా అమ్మదగ్గర ఏడుస్తూ జరిగిందంతా చెప్పి వుండక పోయినట్లయితే!

ఏవైవుండేది? పెద్ద ఏం వొరిగేది? ఆర్. కె. వి. యింట్లో చూశానే ఆ ఆడవాళ్ళని, వాళ్ళమాదిరిగా ఎవడినో ఒకడిని పెళ్ళాడి, అయిదారుగురు పిల్లలనికని, ప్రపంచం దృష్టిలో 'అ – ఆయనకి' అణిగి మణిగి, కొన్ని సమయాల్లో అతనికి భయపడుతూనో, మరికొన్నివేళల్లో అతన్ని నేనే భయపెడుతూనో – ఇదేనా ఆడబ్రతుకంటే? ఆడజన్మకి యింతకిమించి ప్రయోజనం ఏమీలేదా? ఆడదాని జీవితానికి యింతకంటే ప్రత్యేకత ఏమీవుండదా?

ఇంకా కావాలంటే యింట్లో అంటగిన్నెలు తోమడానికి బదులు, నాలాగానూ, నా ఎదురుగాకూచుని టైపురేటర్ మీద టైపు చేస్తున్నదే - ఆ టైపిస్టు పిల్లలాగానో; లేకపోతే వేలు నోటిమీద పెట్టుకుని 'యిష్' అంటూ నోట్లోంచి శబ్దం రానివ్వ కుండా, క్షణ క్షణం వాళ్ళేమనుకుంటారో వీళ్ళేమనుకుంటారో అని భయపడి పోతూ, ఆ మంగళసూత్రం బొందుని జాకిట్లో దాచుకుని నక్కి నక్కి తిరగడం; లేకపోతే అతనుకట్టిన ఆ తాళిని లైసెన్సు బిళ్లలాగా నలుగురికి కనిపించేటట్లు తగిలించుకుని, రెండేళ్ళ కొకసారి బానలాంటి పొట్టతో విరుచుకుని తిరుగుతూంటం; కొన్నిరోజులు కళ్ళూ ముక్కూ ఎర్రగా చేసుకుని, 'ఆయన యిలా అన్నారు, అలా అన్నారు' అంటూ ఆఫీసుకే యింటిని తీసుకురావడం; ఎంత చదివితే ఏం? వుద్యోగం చేస్తేఏం? సంపాయిస్తేఏం? సంపాయించకపోతే ఏం? ఆర్. కె. వి. అన్నట్లు 'స్త్రీ జీవితం ముళ్లతో చిక్కులు పడిన దారం.'

ఆనాడు ఆర్. కె. వి. మాట్లాడుతున్నవుడు నేను యీ విషయాలన్నింటినీ గురించి, చాలాసేపు చర్చించాను. నా సంభాషణలో రకరకాల స్త్రీ సమస్యలు దొర్లినాయి.

ఈ ఆరునెలల్లో అతను ఆకథ తరువాత రెండు మూడు కొత్తకథలు వ్రాసారు. అందుచేత మా మాటలు మొట్టమొదట ఆ మధ్యరాసిన కథలవైపు మళ్ళినాయి. నా సంభాషణ ఆ మధ్యరాసిన కథలగురించి ఆరంభించాను. పదినిముషాల్లో ఆ

కథల గురించిన చర్చముగిసింది. ఆపైన నాగురించి రాసిన ఆ కథ దగ్గరకొచ్చి, ఆగిపోయాము.

ఆ తరువాత ఏడున్నర గంటలకి లేచి నిలుచుని ఆయన దగ్గర సెలవుతీసుకొని, బామ్మగారికి నమస్కారాలు చెప్పి బయటకొచ్చాను. అంతసేపటిదాకా ఆ ఒక్క కథగురించే మాట్లాడుతున్నాను. ఎంత మాట్లాడినా, యింకా అడగవలసిందీ, తెలుసుకోవలసిందీ చాలా వుందనిపించింది నాకు.

నేను నాగురించి తెలియనివ్వకుండా నావునికిని బయట పడనీయకుండా దాచుకున్నాను. ఆయన రాసింది నా కథే. అందులో సందేహం లేదు. ఆయన నన్ను గుర్తించలేదు. కాని ఆయనను నేను గుర్తుపట్టేశాను. ఆనాటి నన్ను - యిప్పటి నాతో పోల్చుకోలేకుండా వున్నారా?

ఆర్. కె. వి. అన్న ప్రసిద్ధ రచయిత, యిప్పుడు అందరికీ తెలిసిన ఈ విశ్వనాధన్, మాకాలేజీలో అటెండరు - అని నేను గుర్తుపట్టగలిగాను. ఇందులో పెద్ద గుర్తు పట్టడానికేముందనీ. ఆయన ఈనాటికీ అదే కాలేజీలో, లైబ్రరీలో అటెండరుగా వుంటున్నారు. ఆరోజుల్లో ఆయనకి పెద్ద ముడి వుండేది. రోజూ వుతికిన షర్టు వేసుకొచ్చేవారు. ఇస్త్రీమొహం ఎరగని ఆ షర్టూ, జుట్టుముడివేసుకున్న ఆయన్నీ చూసి ఆడపిల్లలందరూ చుట్టూచేరి ఎప్పుడూ ఏదో అని ఆటలు పట్టించేవారు. ఈయన ముడిని కొబ్బరికాయతో పోలుస్తుండేవారు.

"సార్ - సార్—మీరు క్రాపు చేయించుకునేప్పుడు నన్ను మర్చిపోకండి. మీజుట్టు - అట్లానే నవరం కట్టించి యివ్వండి, మీ జ్ఞాపకార్థం నేను జడలో పెట్టుకుంటాను" అని ఏడిపించింది ఒక అమ్మాయి. అందుకాయన నవ్వుతూ "ఓ తప్పకుండా, తప్పకుండాను - కాని ఎటొచ్చీ అంతుకు ముందుగానే మీరు క్రాపు చేయించుకు రాకుండా వుండాలి" అంటూ నవ్వుతూనే చురక అంటించేవారు.

ఆనాటి ఆయన రూపం యిప్పుడు నాకళ్ల ముందు నిలుచున్నట్లువుంది. ఆయన ఏడో క్లాసో, ఎనిమిదోక్లాసో చదివారనుకుంటా కాని మా లైబ్రేరియన్‌కి తెలియని విషయాలెన్నో ఆయనకు తెలుసు - అని ఆ రోజుల్లో మేమంతా అనుకునేవాళ్లం. ఆరోజుల్లో మా కాలేజీలో ఒకరూల్ వుండేది. క్లాసుకి క్రమంగా రాకపోయినా, క్లాసులో అటెండెన్సు సరిగా లేకపోయినా, లైబ్రరీలో సంతకంపెట్టని రోజుమటుకు వుండేది కాదు. క్లాసుకెళ్లినా వెళ్లకపోయినా ప్రతిరోజూ లైబ్రరీకి మటుకు తప్పకుండా వెళ్లేవాళ్లం. ఎవరికైనా పుస్తకాల మీద అభిలాష వుంది, అని తెలుసుకుంటే చాలు, ఆ పిల్ల అభిరుచి గుర్తించి, ఆమెకి వుపయోగపడే పుస్తకాలు వెతికి తెచ్చివ్వడం యీ విశ్వనాధన్‌కి ఎలా తెలుసో అని అందరం ఆశ్చర్యపోయేవారం.

ఆరోజు సాయంకాలం వారింటి ముంగిట్లో, మల్లె పందిరి కిందుగా రెండు పేముకుర్చీలు వేసుకుని, మేము మాట్లాడుతూ కూచున్నాము. ఇంట్లోని దీపపుకాంతి ఆయన కుర్చీ ముందు పడుతోంది. అందుచేత ఆయన ముఖం నాకు స్పష్టంగా కనిపించడం లేదు. ఆ దీపకాంతి నా ముఖంమీద సూటిగా పడుతూంటంవల్ల, నా ముఖం ఆయనకి స్పష్టంగా కనబడుతూ వుండివుండాలి.

మాట్లాడుతూ – మాట్లాడుతూ సంభాషణ మధ్యలో "మీరు ఎమ్. ఎ. ఎకనామిక్స్ చేశాననికదూ చెప్పారు. ఏకాలేజీలో" గబుక్కున ప్రశ్నించారు.

ఆయన ముఖం చీకట్లో వుంటంచేత, ఆ ముఖంలోని భావం కనిపెట్టలేక పోతున్నాను. ఎందుకడుగుతున్నారో! నా ముఖం మీద వెలుతురు పడటంచేత నన్ను గుర్తించి, యిలా ప్రశ్నిస్తున్నారా? ఒక్క క్షణంపాటు బెరుకు కలిగింది. "నేను తిరుచ్చీలోనూ, చిదంబరంలోనూ మటుకే చదివాను"

"ఓహో ఉద్యోగం దొరికింతరువాత మద్రాసొచ్చారన్నమాట" అని ఆయన అడుగుతుంటే "అవునవును" అంటూ తల వూపాను. ఆ తరువాత మళ్లీ ఆ కథ గురించి సంభాషణ మొదలుపెట్టాం. "ఒకవేళ మీ మద్రాసులో వుండే కాలేజీ పిల్లలకి ఇలాంటిది సంభవించి వుండవచ్చునేమో! నేనంతా మొఫిసిల్ స్టడీస్ గదా. నాకెందుకో యిది నమ్మశక్యంగా లేదు." అంటే నాగురించి నేనే అబద్ధం చెప్పకుంటున్నానా?

ఆయన ఫక్కున నవ్వారు. ఆ చీకట్లో ఆయన పదహారు పళ్లూ తళుక్కుమన్నాయి. ఆయన కూతురు గణేశీ పరుగెత్తుకొచ్చింది. ఆ పిల్లని ఎత్తుకుని వొళ్లో కూచోపెట్టుకుని చెప్పడం మొదలుపెట్టారు.

"ఇలా ప్రశ్నించినవారు మీరొక్కరే. మిగతావాళ్లంతా ఇలా రాయకూడదు. ఇలా రాయవచ్చా అంటూ పోట్లాటకొచ్చారే తప్ప అసలు సంభవమా అన్న పశ్న యింతవరకూ ఎవరికీ రాలేదు. ఇటువంటిది జరిగివుండవచ్చు అన్న ఆలోచనరాలేదు. ఈ కథకు సంబంధించినంత వరకూ ఒక్క ముగింపుమటుకే నేను కల్పించాను. ఆ ముగింపు ఒక్కటే నాకల్పన. మిగతాదంతా పదిపన్నెండు సంవత్సరాల క్రితం మా కాలేజీలో జరిగిన నిజమైన సంఘటన. యదార్థంగా జరిగిన విషయమిది."

ఆర్. కె. వి. ఇంట్లోని దీపకాంతి నా కళ్లలో సూటిగా గుచ్చుకుంటున్నది. దీపం వెలుగులోనుంచి - నీడలోకి నాకుర్చీ లాక్కున్నాను. మల్లె పువ్వులు పందిరినుంచి పూలనరాల వలె ఒక్కొక్కటీ రాలుతున్నాయి. తండ్రి వొళ్లోకూచున్న గణేశీ గబాలున దిగి, వాన చినుకులని చెయ్యిజాచి పట్టుకున్నట్లు కిందరాలబోతున్న ఒక్కొక్క పువ్వునీ, పరుగెత్తి చెయ్యి జాచి పట్టుకుని మల్లె పందిరి చుట్టూ తిరిగి

తిరిగి వస్తోంది. ఆయన నాకథని నాకే చెప్తున్నారు. నా కథలాంటి కథ మరొకటి వుండదు. నా కథ నాకే వినిపిస్తున్నారు.

కథలోని ఆ పిల్ల, అంటే నా పేరు ఆయనకు తెలియకపోయినా, కథలోని అతని పేరు ఆయనకి బాగా తెలుసు. అతనికి యిదే వ్యాపకంట. ఆ విషయం చెప్పి ఏదో యోచిస్తున్నట్లు కొంచెంసేపు నిశ్శబ్దంగా వుండిపోయారు. తరువాత మళ్లీ చెప్పుకొచ్చారు. ఆ సంఘటన తర్వాత అతన్ని కాలేజీ చుట్టుపక్కల మళ్లా చూడలేదుట. ముఖా ముఖి సన్నిహితంగా చూసినపుడు, అతను యిలా ప్రవర్తించ గలడనీ, యిలాంటి పని చేసివుండగలడనీ అనిపించలేదుట.

"ఆ తరువాత ఆ పిల్ల ఏమయింది ?" అని నేను అడిగాను. "తెలియదు" అని ఒక మాటలో బదులు చెప్పారు. అదేదో అంత ముఖ్యమైన విషయం కానట్లుంది ఆ సమాధానం. తరువాత ఆయనే తిరిగి అన్నారు. "ఏమయివుంటుంది. తోటి పిల్లల మాటలనిబట్టి నాకు తెలిసింది. ఆ పిల్లని తల్లీ తండ్రీ అందరూ, ఆ చిన్న పిల్లని తిట్టి, చితకకొట్టి, తన్ని తరిమేశారుట. ఇంట్లోంచి బయటకు గెంటి తలుపులు లోపల ఘడియ పెట్టుకున్నారుట. ఆ తరువాత ఆ పిల్ల కాలేజీలో కనిపించలేదు. అంతే తెలుసు నాకు. ఇవన్నీ విన్న తరువాత నాకు ఆ పిల్ల తల్లిమీద పట్టరాని కోపం వచ్చింది"

"అవును. అయితే మీరు అప్పటికే కథలు రాస్తూండేవారా ?"

"రాస్తూండేవాడిని, కాని ఎవరికీ బాగా తెలియదు. ఇంత పేరు రాలేదనుకోండి. కొన్ని కథలు తిరిగి వస్తూండేవి."

"ఇన్నేళ్లు గడిచిపోయాక ఆ కథ రాయాలని మీకు యిప్పుడెందుకనిపించింది ?" మళ్లీ ఆయన నవ్వారు.

"ఆర్. కె. వి. అన్నతను యిప్పుడు కూడా ఆ కాలేజీలో అటెండరుగా వున్నాడు. అందుచేత ఆ కాలేజీకి కొంత గౌరవం, ప్రతిష్ఠా వచ్చాయి. పెద్ద పెద్ద సమావేశాల్లో, కాలేజీ వార్షిక సభల్లో అన్నిట్లో, ఆర్. కె. వి. అనేటువంటి యీ అటెండరు ప్రముఖ వ్యక్తిగా నిలబడి పూలమాలలు వేయించుకుంటాడు. పెద్ద పెద్ద ప్రసంగాలు చేస్తాడు. ఇతర కాలేజీల నుంచి ఆహ్వానాలు అందుకుంటాడు వాటిల్లో ప్రసంగిస్తాడు. ఆ కథలో వచ్చాడే ఆ విలాస పురుషుడు అతని పేరు ప్రభు. పూర్తి పేరు ప్రభాకర్. ఈ ఏడు కాలేజీ వోపెనింగ్ అయాక, పన్నెండు సంవత్సరాల అనంతరం మా కాలేజీ కాంపౌండులో అతని కారు చూశాను. అతనూ, అతని కూతురూ యిద్దరూ కారులోంచి దిగి ప్రిన్సిపాల్ రూమ్‌కి వెళుతున్నారు. అతనికి షుమారు ముఫై అయిదుకు పైన, నలభైకి లోపున వయసు వుండివుంటుంది. ఆ పిల్లకి పదిహేను సంవత్సరాల వయసు వుండవచ్చు. తండ్రికి తగిన పిల్లలాగా

దర్జాగా వుంది. తన అభిమాన రచయిత అయిన ఆర్. కె. వి. నేనుగా ఆ కాలేజీలో వున్నట్లు తెలుసుకున్న తరువాత ఒక ఫ్రెండుని తీసుకుని, ఒక రోజున నన్ను చూడటానికి వచ్చింది. "మీరు ఎలా రాస్తారండి అల్లాంటి కథలు?" అంటూ అడిగింది. నన్ను చూడటానికి ఎటువంటి రకాలొస్తారో తెలుసా? అందులో మెజారిటీ అంతా యిలాగే అడుగుతూంటారు. అందుకు నేనేం బదులు చెప్పను? ఎలా బదులు చెప్పను. మీరే చెప్పండి? నా ఖర్మ కాకపోతే కథలు గురించి యిలా అడ్డమైన వాళ్లచేత చివాట్లు తింటానా? ఇలా తిట్లుపడమని నా ముఖాన్న రాసిపెట్టి వుంది కాబోలు" అంటూ నవ్వారు. నాకూ నవ్వొచ్చింది.

"మా మామయ్య ఒకాయన వున్నారు మీ పేరు చెబితే చాలు మండిపడిపోతాడు. రోజుకి ఒకసారన్నా మిమ్మల్ని తల్చుకోకుండా వుండలేడు. బాగా తిడుతూంటారు" అన్నాను నేను.

"అట్లానా?" చాలా సంతోషంగా అడిగారు.

"అన్నానికి రావే. ఏడుగంటలయింది, గణేశీ ఎక్కడికి పోయావే" అంటూ మనుమరాలిని వెతుక్కుంటూ ఇంట్లోంచి బయటకొచ్చారు బామ్మగారు. ఆ పాప నా కుర్చీ వెనకాతల వొంగి దాక్కుంది. "నాన్నా చెప్పకు. చెప్పకు నాన్నా" అంటూ తండ్రిని బ్రతిమిలాడుతోంది. ఆ బామ్మగారు గట్టిగా కేకలేస్తున్నారు. 'గణేశీ - గణేశీ' అంటూ అది విని ఆయన చిన్నగా నవ్వుతున్నారు. నవ్వుతూ యిట్లా చెప్పుకొచ్చారు. "ఇలా ప్రపంచంలోని కొందరెని ఏడిపించి వుడికిస్తే నాకు చాలా ఆనందంగా వుంటుంది. ఇది చూడండి. రోజు రోజూ వాళ్ల బామ్మని ఏడిపించుకు తింటూనే వుంటుంది. ఆవిడ దీనిమీద మండిపడిపోతూ తిడుతూవుంటుంది. మళ్లీ మరుక్షణంలో యిద్దరూ ఒకటి అయి - 'బామ్మా' అంటూ పక్కలో దూరుతుంది. మళ్లీ సందు దొరికితే ఆవిడకు వొళ్లు మండేట్లు చేస్తుంది. అందుకనే యీ అవ్వా మనుమరాళ్ల అనుబంధం నాకు తమాషాగా అనిపిస్తుంది. తిట్టుకుంటూ దగ్గిర అవడమే, అవ్వా మనుమరాళ్ల బాంధవ్యానికి మరోపేరు."

ఆర్. కె. వి. మాటలు అక్కడే నిలుచున్న తల్లి చెవిలో దూరి వుంటాయి - కొంత గాలిలో కలిసిపోయివుంటాయి. ఒక్కక్షణం నావంక చూసి "వీడు రాసే కథల గురించి మాట్లాడుకుంటున్నారా? నీలాంటి అమాయకులు మటుకే వీడిని గొప్పగా పొగిడేస్తూంటారు. వీడు ఎలాంటి కథలు రాస్తాడో నన్నడుగు చెబుతా. ప్రతి విషయాన్నీ తల్లకిందులుగా మారుస్తాడు. ఏదీ నమ్మడు. దేనిలోనూ నమ్మకం లేదు. వాడు రాసిన కథలు నాకు ఒకటి కూడా నచ్చలేదు. కాని వాడి దగ్గిర మాట్లాడి నెగ్గుకురాలేను తల్లీ. నీతి నిజాయితీలని నమ్మడు. న్యాయాన్ని అన్యాయం అంటాడు. అన్యాయాన్ని న్యాయంగా మారుస్తాడు. వాడికి సిగ్గులేదమ్మా! వీడి

నాలిక్క నరంలెదు. నాకు స్తోమతు లేకపోయిందిగాని, లేకపోతే వీడిని ప్లీడరు పరీక్షకు చదివించి వుండేదాన్ని. ఎవరు చూశారు - వీడి నాన్న ప్లీడరు గుమాస్తా చేశారు. అయినా యింతే వూరంతా ఒకటంటే - తాను మరొకటి అనేవారు. ఊరంతా ఒక దారి - - - ."

ఆర్. కె. వి. నవ్వుతూ "ఇంతకు ముందు అన్నాను – ప్రపంచంలో కొందరు అని - ఆ కొందరిలోని అంతరార్థం యిదే"

"చాలు నాయనా చాలు. నన్ను చూసి తరువాత నవ్వుదువుగాని - నీ కూతురెక్కడరా ?" బామ్మతనని కనుక్కోలేకపోయిందనే విజయంలో మైమరచి, చప్పట్లుకొడుతూ గంతులేసింది ఆగణేశీ.

"పోవే అల్లరిపిల్లా. నన్ను ఆటలు పట్టిస్తున్నావుటే - వెళ్లి మీ అమ్మను రమ్మని చెప్పు. రాత్రి పదిగంటలదాకా నేనీ వంటింట్లో మగ్గిపోలేనుబాబు. ఏవే అమ్మా మాట్లాడుతూనే వుండిపోయావు. కొంచెం కాఫీ పట్టుకురానా ? తాగు తల్లీ. వాడికిల్లాంటివేమీ తెలియవు. మాట్లాడేందుకు మనిషి దొరికితే చాలు ; అలా ఖబుర్లు చెబుతూనే వుంటాడు -" అంటూ లోపలికెళ్లారు. నా మనసు కథ మీదనే లగ్నమైవుంది.

"ఆ తరువాత? అతని కూతురు వొచ్చి మిమ్మల్ని చూశాక ?"

"అవును – నా కథలంటే ఆపిల్లకి చాలా యిష్టం. ఆ తరువాత ఒక రోజున ఆ పిల్ల తన తండ్రి ఆఫీసులో అదేదో ఎంప్లాయీస్ రిక్రియేషన్ క్లబ్‌అట, దాని వార్షికోత్సవాన్ని ప్రారంభించమని నన్ను కోరడానికి వచ్చింది. ఆ పిల్లతోపాటు ఎవరో చాలా మంది వచ్చారు. ఆ పిల్లని సిఫారసు చెయ్యమన్నారుట."

"ఆ వుత్సవాన్ని నేను ప్రారంభించాను. అప్పుడే నేను అతన్ని ముఖాముఖి ప్రత్యక్షంలో చూడ గలిగాను. ఇప్పుడతను చాలా గౌరవనీయుడు. ఒక పెద్ద మనిషి. నిజంగా అతనిప్పుడో పెద్దమనిషే. కాని నాకు ఆ పెద్ద మనిషి గత చరిత్ర జ్ఞాపకానికి వచ్చింది. నేనింకో నిజాన్ని మీకు చెప్పదలచుకున్నాను. అది ఇంకో కథలో చెప్పబోతున్నాను. అతను ఈ వొక్క పిల్లనే చెడగొట్టాడు, అతనివల్ల ఈ వొక్కమ్మాయే మోసపోయింది, అని మీరు అనుకుంటున్నారు. కాని అది నిజం కాదు, ఇతను పాడుచేసిన పిల్లలు నాకు చాలామంది తెలుసు. ఈ కథ చదివి యింత ఏడ్చారే - ఆకథ చదివాక ఏమైపోతారో చూడాలి. ఏమైనా సరే ఆ విషయం యితివృత్తంగా తీసుకుని - 'అశ్వమేధమ'ని ఒక కథ రాయబోతున్నాను. మీరే చూస్తారుగా. అది చదివి లబో దిబోమని ఏడుస్తారు."

ఆ అశ్వమేధం కథ చెప్పేట్టులేరు. ఎలా రాయబోతారో ? ఆకథ చెప్పండి అని అడిగే చనువులేదు నాకు. ఆయన నోటినుంచి ఏం మాటలు వస్తాయోనని ఆత్రంగా

ఎదురు చూస్తున్నాను. కొందరు బాలా శ్రావ్యంగా పాడతారని తెలిసి, వాళ్లని పాడమంటే ఒకటే బిగుసుకు పోతారు. అదేమాదిరి యీయనా మాటా పలుకూ లేకుండా వుండిపోయారు.

బామ్మగారు కాఫీ తీసుకొచ్చారు. కాఫీ తాగుతున్న సాకుతో, ఆ మౌనం యింకా పొడిగించబడింది. "ఏవోనమ్మా ఎలావుందో ఏవిటో .... కాఫీ అని పేరు తప్పితే రుచా – సచా. శుభ్రమైన పాలే దొరకనంటాయి. మీవైపు దొరుకుతాయా? డిపో పాలా? వేతిపాలా?"

"ఇంటి ముందుకు ఆవును తీసుకొచ్చి పిండుతాడనుకుంటా. పాలవాడి దగ్గర మా అమ్మ దెబ్బలాట వేసుకుంటూంటుంది. ఒకోసారి డిపో పాలూ కొంటూ వుంటుంది."

"మీ యింట్లో ఎవరెవరున్నారు?"

"అమ్మా - నేనూ వున్నాం. అన్నా వొదినా ట్రిప్లికేన్‌లో వున్నారు."

"అదే మంచిది" అంటూ బామ్మగారు కాఫీగ్లాసు పట్టుకెళ్లిపోయారు లోపలికి

"ఆ కథకి 'అగ్నిప్రవేశ' మని పేరు. ఈ కథకి 'అశ్వమేధ' మని పేరా? పేర్లు అమరినట్లుగా వున్నాయి" అన్నాను నేను.

ఆయన నవ్వారు. "నాకు జన్మ నిచ్చింది ఒక ఆడది. మీరుకూడ ఆడవారే. అది మర్చిపోయి చెబుతున్నాను. ఈ రోజుల్లో ముగ్ధ అని చెప్పుకోదగిన, అమాయక మైన ఆడపిల్ల ఎంతవెతికినా కనిపించడంలేదు. ఆడవాళ్లుకూడా కొంత తెగించారనే చెప్పాలి. ఆ తప్పు వారిది కాదు అని చెప్పచ్చు. అది వేరు విషయం. మా కాలేజీ పిల్లలు ఈమాదిరి లేకప్రవర్తనకి స్పెసిమన్స్ అని చెప్పుకోవచ్చు. అఫ్‌కోర్సు 'అగ్నిప్రవేశం' కథలో, ఆ అమ్మాయిని మా కాలేజీలోనే చూశాను. అయినా కూడా అటువంటి పిల్లలుండటం అపురూపమనే చెప్పాలి. ఈ కాలంలో కూడా అటువంటి కాలేజీపిల్లలు వుంటారా? అని చాలామంది అడుగుతూంటారు. అది అడగ వలసిన ప్రశ్నే. నేనెప్పుడూ అపూర్వమైన విషయాల గురించే రాస్తాను."

"మామయ్య అడుగుతూంటారు ఈ పిల్ల అటువంటి తప్పుడు పనులు చేసి వచ్చాక తల్లి దాన్ని దాచిపెట్టిందీ అంటే, ఆ తల్లి ఎటువంటి నీచురాలో తెలియ డంలేదా? ఆ పిల్ల ఆ విషయం దాచిపెట్టి, దొంగచాటు బతుకు గడపగలిగినదై వుండాలి, అప్పుడు కదా యిది వీలయ్యేది" అని, ఆయన నవ్వుతూ "మీ మామయ్యకు ఆడపిల్లలు లేరా?" అని అడిగారు.

"లేరు."

"ఆయన అలా అనక యింకెలా అంటారు?"

నేను యింట్లోకి చూశాను. బామ్మగారు గణేశికి అన్నంపెట్టారు. అది మంచి నీళ్ళగ్లాసు ఎత్తి తాగుతూ, గుండెలమీద, పొట్టమీదా, కిందా పారబోస్తోంది. "కోతి ఎత్తుకు తాగేంత పెద్దదానివయ్యావా? అడిగితే నేను పట్టనా" అంటూ గ్లాసుతో ఒక్కటి వేశారు. "నాన్నా" అంటూ నోటినిండా అన్నంతో గట్టిగా అరుస్తోంది ఆ పిల్ల.

"పిలవ్వే - వాడినే కదా-పిలు. ఒరేయ్ విసూ వచ్చి చూడరా. ఇది చేసిన అగడం చూడు. కిందంతా నీళ్ళు పోసింది. ఆ నీళ్ళలోనే కూచుని తింటూ వుంది తిను. చొక్కా యిప్పేసి వాళ్ళమ్మని ముట్టుకుని కొట్టబోయింది. నేను చెయ్యలేను బాబూ! ఈ రెండు రోజుల్లో నా ప్రాణాలు తీసేట్టుంది."

"ఒసేయ్ గణేశీ - ఏవిటే మీ బామ్మని తిప్పలు పెడుతున్నావా? నా దగ్గరకు రా అన్నం పెడతాను" నా వెనకనుంచి మాటలు వినిపించేప్పటికి తిరిగిచూశాను. ఆర్. కె. వి. భార్య. వెన్నెలలాగా నవ్వుతూ, చేతులో పళ్ళెం గ్లాసూ రెండూ పట్టుకు, గోడవారగా, గోడనాసుకి నిలుచుంది.

ఆర్. కె. వి. భార్యతో అంటున్నారు.

"అది తిప్పలుపెడితే ఏంచేస్తావ్? పదేళ్ళతరువాత కన్నావ్ - ఒక్కదాన్ని ఒక్క పిల్ల - కాస్త గారాబం - అంతే. దానికి ఆరేళ్ళేగదా! అన్నం తింటానికి కాస్త పేచి అంతేగదా! ఆ వసారాలో చూడు - నలుగురు పిల్లలు వంట పూర్తిగా అవకుండానే పళ్ళాలుపెట్టుకు గొడవ మొదలుపెడతారు. పిల్లలుంటే ఒక కష్టం లేకపోతే మరోకష్టం" అంటూ నవ్వుతున్నారు. ఆమె నవ్వుతూ "నెమ్మదిగా మాట్లాడండి. వాళ్ళువింటే గొడవవుతుంది" అంటూ వసారాయింటివైపు తొంగి చూసింది.

టైము ఏడున్నర అయింది. నేను బయలుదేరడానికి లేచి ఆకథల పుస్తకంలో ఆయన్ని సంతకం పెట్టమని అడిగాను. ఇంట్లోకివెళ్ళి సంతకంపెట్టి, పుస్తకం వెనక్కితెస్తూ, చేత్తో ఆ సొవనీర్‌కూడా తీసుకొచ్చారు. రెండుమూడు పేజీలు తిప్పి ఆ ఫొటోచూపించి "ఇలాంటిది జరిగివుంటుందా అనికదూ అడిగారు. ఇతనే నా కథలోని ఆ హీరో."

నేను ఆ బొమ్మని పరీక్షగా చూశాను. ఆ బొమ్మ 'అతనే'నని ఆయన చూపించేసరికి ఆ కళ్ళు నాకు పాముకళ్ళవలె కనిపించాయి.

ఆ తరువాత మరో రెండు మూడు పేజీలు తిప్పాక ఆర్. కె. వి. బొమ్మ ప్రచురించిన పేజీకనిపించింది. ఆయన ఫొటో అడుగుతున్నాననే సాకుతో, "మీ ఫొటోకింద సంతకం పెట్టియివ్వండి" అంటూ ఆ వార్షిక సంచికకూడా యిమ్మని అడిగాను.

"ఇందులో నేనో వ్యాసంకూడా రాసాను. చదివిచూడండి" అంటూ అతను బొమ్మకింద సంతకం పెట్టి, ఆ సంచిక నాచేతికి యిచ్చేశారు.

నా సెక్షన్‌లో నేనుమటుకు ఒంటరిగా కూచునివున్నాను. నేనుకూడా యింక బయల్దేరబోతున్నాను. నేనెవరో అతనికి గుర్తుతెలియదు. ఆ రోజుల్లో నన్ను చూసినవారు ఎవరూ ఈనాడు నన్ను గుర్తు పట్టలేరు. ఇప్పుడు గుర్తంతా తన్తలంలో ఒకరినొకరు పోల్చుకోలేని ఎవరికొరకో, యింకొకరు ఎదురుచూస్తూ నిలుచుని వుంటారు. అలా వేచివుండేవ్యక్తే ఆ 'అతను' - అని కనిపెట్టి తెలుసుకోవాలి.

## 10

అదిగో ఆ కారు నిలబడివుంది. ఇంకా చీకటి పడలేదు. ఆ గ్రౌండ్‌లో యింకా ఎండ పడుతూనేవుంది. ఎవరో డ్రయివింగ్ నేర్చుకుంటున్నారు కాబోలు, ఒక చిన్నకారు ఆ గ్రౌండు చుట్టూ తిరిగి తిరిగి ప్రదక్షిణాలు చేస్తున్నది.

మన్రో విగ్రహం పక్కకి వచ్చాను. ఇంతదూరంనుంచే ఆ కారుని గుర్తించ గలిగాను. పన్నెండు సంవత్సరాల తర్వాత ఆ కారుని మొదటిసారి చూస్తున్నాను.

ఆ కారు ఎలా వుంటుందో ? ఊహించుకుని చూడగలుగుతున్నాను. కాని ఇప్పుడు కూడా అతనెలా వుంటాడో అన్నది వూహించుకోలేకుండా వున్నాను. అతని రూపం నా వూహకికూడా అందటంలేదు.

ఒక మొగవాడిని - యిలా ఒంటరిగా కలుసుకోబోతున్నాను - అన్న సంకోచం నాలో కొంచెంకూడా కలుగలేదు. న్యాయసమ్మతమైన, ధర్మసమ్మతమైన ఒక కార్యం చేస్తున్నట్లుంది గాని, నాలో ఏవిధమైన జంకూ కలుగలేదు.

మెయిన్‌రోడ్‌కి అడ్డంగా నడిచి వస్తున్నాను. ఆ తరువాత రెండు చిన్న రోడ్లు. నాలాగానే ఆ దారమ్మట యిద్దరమ్మాయిలు నడుస్తున్నారు. సెక్రటేరియట్‌లో పనిచేస్తున్నారు కాబోలు. కొందరమ్మాయిలు విడి విడిగా ఒక్కొక్కరే వెళుతున్నారు. ఇద్దరుముగ్గురు అమ్మాయిలు కలిసివెళుతున్నారు. ఆడ మొగ జతలు జతలుగా వెళుతున్నారు. అతను కార్లో కూచుని ఈ పక్కన వెళుతున్నవారందరినీ చూస్తూ వుండి వుంటాడు ఆ పిల్లల్లో నేను ఎవరు అన్నది - అతను ఎలా గుర్తించ గలుగుతాడో ?

అతన్ని నేను గుర్తించడానికి వీలుగావుంటుందనే వుద్దేశ్యంతో ప్రత్యేకంగా తానిప్పుడు వాడుకోకుండా వున్న యీ పెద్ద కారులో నన్ను కలుసుకోవడానికి వచ్చాడు.

మైదానంలోకి దిగి నడుస్తున్నాను. సాయంకాలపు ఎండతో నడుము చుర్రు మంటోంది. నా నీడ పొడవుగా నేలమీదకు పరుచుకుంది. ఇప్పుడు అతను నన్ను గుర్తించాడన్నది తెలుస్తోంది. నా నీడ యింకా పొడవయి నాతోపాటు ఆ మైదాన మంతా చూస్తున్న దేమోననిపిస్తోంది.

అంత పెద్ద మైదానంలో ఆ మూలగా ఆ కారు నిలబడివుంది. చేతిలో హాండ్ బాగ్ పుచ్చుకుని, ఎదుటి వైపునుంచి ఒక స్ట్రెయిట్ లైన్‌లాగా, సూటిగా నడిచి వస్తున్నాను. డ్రయివింగ్ నేర్చుకునే వాడి ఆ చిన్నకారు బొమ్మకారులా గ్రౌండ్ చుట్టూ తిరుగుతోంది. ఇంత పెద్ద మైదానంలో నిలబడివున్న ఆ కారూ, నడిచివస్తున్న నేనూ, గ్రౌండ్ చుట్టూ తిరుగుతున్న ఆ చిన్నకారూ తప్పించి యింకేసందడీ లేదు. మైదానం బోసిగా, ఖాళీగావుంది.

అతను నన్ను గుర్తించానని తెలపడానికా అన్నట్లు కారుతలుపు తెరిచి, తలుపు పడకుండా కాలుజాపి, షూ అడ్డంగాపెట్టి, కూలింగ్‌గ్లాసు తీసి, నావంక తల ఎత్తి చూస్తున్నాడు. నాకింకా అతని మొఖం స్పష్టంగా తెలియడం లేదు.

అతనిని గుర్తుపడితే నాకు వొరిగేదేమిటి? అసలు యితనిని నేనెందుకు కలుసు కోబోతున్నాను? ఇంత శ్రమపడి, యితనిని వెతికి పట్టుకుని, నన్ను కలుసుకోమని దేనికి రమ్మన్నాను? అతన్ని రమ్మని అన్నాను - వచ్చాడు. నేనూ వచ్చాను. ఇక ముందు జరిగేదేమిటి?

కారు దగ్గరవుతున్న కొద్దీ, సమీపిస్తున్న కొద్దీ మనసులో ఏదో భయంగావుంది. లేనిపోని సమస్యలు నెత్తిన వేసుకోబోతున్నానా? అని సంకోచంగా వుంది. తల ఎత్తి సూటిగా చూడలేకుండావున్నాను. కారు దగ్గరకు వచ్చాను.

అతను కారుతలుపు పూర్తిగా తెరిచి, దిగి మైదానంలో నిలుచుని వున్నాడు. తలెత్తి అతన్ని పరిశీలనగా చూస్తున్నాను.

ఎస్ – అతనే - ఈయనే. (ముఖాముఖి చూసింతరువాత నాకంటే వయసులో పెద్దఅయిన ఒకవ్యక్తిని మర్యాదలేకుండా అతను, యితను అని పిలవాలనిపించలేదు)

''హలో'' అంటూ నన్ను చూసి చెయ్యిజాచారు.

'ప్లీజ్ గెటిన్' అని చెప్పి తలుపు తెరిచిన ఆనాటి అతన్నే యిప్పుడు చూస్తున్నాను.

అతను సన్నగా పల్చగా వుండేవాడు. ఇప్పుడు కొంచెం బొద్దుగావున్నారు. ఇప్పుడు కాస్త సమానమైన ఎత్తులో వున్నట్లునిపిస్తున్నారు. బహుశా వొళ్లు రావడం వల్లనేమో! అప్పుడు మరీసన్నగా వొంటికి బట్టలు పట్టుకున్నట్లు వుండేవి. వొళ్లు రావడంవల్ల పొట్టిగా కనిపిస్తున్నారు. రెండు చెంపల దగ్గరా జుట్టు సున్నంపూసి నట్లు తెల్లగా నెరిసివుంది. ఆ కళ్లూ, కనుబొమ్మలూమటుకు ఏమీ మారలేదు. అల్లానే వున్నాయి.

'హలో' అని చాచిన ఆయన చేతిని నేను అంటీ అంటినట్లు పట్టుకు 'హలో' అని తిరిగి విష్ చేశాను. సిగరెట్లు కాల్చికాల్చి కుడిచేతి రెండువేళ్లూ ఎర్రగా పొగచూరినట్లు వున్నాయి. ఆ రెండువేళ్లూ చూస్తే అసహ్యం వేసింది. షేక్ హాండ్ యిస్తున్నపుడు ఆ రెండువేళ్లూ ముట్టుకున్నాను. నాకెందుకో నాచెయ్యి శుభ్రంగాతోమి కడుక్కోవాలని అనిపించింది.

"అయిదున్నర కావస్తోంది. ఇంకా ఎండగానే వుంది. కారులో కూచుని మాట్లాడుకుందామా ?" అని ఆయన అడగగానే, నేనే కారు తలుపుతెరిచాను. అది కూడ ముందుసీటు తలుపు తెరిచాను. ఆయన రెండోవైపుకి వెళ్లి, తలుపు తెరిచి స్టీరింగ్ ముందుకెళ్లి కూర్చున్నారు. నేను తలుపు తెరిచి పట్టుకుని అల్లానే నుల్చున్నాను.

"గెటిన్" ఆ రోజు అన్నట్లుగానే అదేమారిగా వుంది.

ఇద్దరం చాలాసేపు మాటలు లేకుండా, మాటలు రానట్లు కూచున్నాము. ఆయన సిగరెట్ తాగుతున్నారు.

"టెలిఫోన్‌లో నీకు పెళ్లి అయిందా అని అడిగినపుడు నువ్వు ఎందుకలా నవ్వావ్?'

తలవంచుకుని బదులు చెప్పాను. "పెళ్లి అన్నది చాలా సంతోషపడవలసిన విషయం కదా? పెళ్లి గురించి మాట్లాడుతున్నపుడు నవ్వక ఏడుస్తారా? నా పెళ్లి గురించి మీరు అడుగుతున్నపుడు నేను నవ్వకూడదా?" నాటకంలోని పాత్రలాగా మాట్లాడుతున్నాను. నేనుకూడా యిలా మాట్లాడగలనా ?

ఈయన ఎందుకలా నావంక చూస్తున్నారు ? పన్నెండు సంవత్సరాలకి ముందు నేను మాట్లాడటం తెలియని వుత్త మొద్దుని, బహుశా అది జ్ఞాపకం చేసుకుంటున్నారా ?

"మీకు కాలేజీలో చదివేంత వయసున్న కూతురు వుందంటే ఆశ్చర్యంగా వుంది...." కొంచెం ఆగి నేనే అడిగాను. "మీకెంత మంది పిల్లలు ?" అని.

"టెలిఫోన్‌లో మాట్లాడిందే అది నాపెద్ద కూతురు మంజు. దాని తరువాత యిద్దరు మొగపిల్లలు. సుభాష్ - బాబు. సుభాష్‌కి పన్నెండేళ్లు. వాడి తరువాత వాడు బాబు"

ఆయన చెప్పేమాటలు వింటుంటే ఆ పిల్లల వద్ద యీయనకు పెద్ద చేరిక లేనట్లుగా అనిపిస్తోంది. వాళ్లను దగ్గరకు తీయరుకాబోలు.

"మీకు అప్పుడే పెళ్లి అయిపోయింది కదూ! మీ పెద్దకూతురు కూడా పుట్టి వుండాలి - అవునా?" నేను అడుగుతున్నవాటికి ఆయన 'అవును' అంటూ తల వూపుతున్నారు.

"అప్పుడు మీరీవిషయాలేవీ నాదగ్గిర చెప్పలేదు కదూ!" అంటూ కోపంగా చూశాను.

"మనం ఆ సమయంలో ఒకరిని గురించి మరొకరు తెలుసుకుందామని కుతూహలపడలేదు...." అంటూ యింగ్లీషులో అన్నారు. "దట్ యీజ్ గుడ్ నేను కలుసుకున్న వాళ్లందరి గురించీ తెలుసుకోవడం మొదలుపెడితే దానికి ఒక అంతు అంటూ వుండదు. ఇద్దరు వ్యక్తులు కలిసి సంతోషంగా గడిపే సమయంలో, ఒకరి విషయాలు మరొకరి నెత్తిన రుద్దకూడదు. అందుచేతనే ఎవరు ఎవరో తెలియకుండా కలుసుకోవడంలో ఒకవిధమైన ఆనందం వుంటుంది. వుయ్ షేర్ ప్లజర్స్. ఎవరి కష్టాలు వారి దగ్గిరేవుంటాయి. ఒకరి కష్టాలు మరొకరు మొయ్యడానికి వీలవదు. ఎవరి కష్టాలు వారివి -- అందుచేతనే నేను కలుసుకునే అమ్మాయిలని 'మీ పేరేమిటి?' అనికూడా అడగను. నా గురించీ చెప్పను."

"అది మీకు వీలుగానూ, చాలా సౌకర్యంగానూ వుండివుండచ్చు. మీదగ్గిర కొచ్చే వారిని గురించి తెలుసుకోవలసిన అవసరం లేదని మీరు అనుకోవచ్చు. కాని మిగతావాళ్లంతా మీలాగే వుండరనీ, మీమాదిరే ఆలోచించరనీ మీకు తట్టదా అని"

నేను ఏమంటున్నానో ఆయనకు అర్ధం కాలేదనుకుంటా. అర్ధం అయినట్లు తల వూపుతున్నారు.

"నేను చెప్పింది మీకు అర్ధం అవుతోందా?" అని అడిగాను.

"లేదు - ఇంకోసారి చెప్పు" అని తల వూగించి అర్ధంలేని నవ్వు నవ్వాడు. బుర్ర కొంచెం మందంలాగున్నది. కాస్త డల్ టైపు అనుకుంటా. అప్పుడు చాలా బ్రిలియంట్‌గా అవుపించారే. పన్నెండు సంవత్సరాలలో ఎవరు ఎలా నైనా మారవచ్చును కాబోలు.

ఇప్పుడు నేను కొంచెం ధైర్యంతో మాట్లాడటం మొదలుపెట్టాను.

"ఈకారులో మీకూ నాకూ మధ్య ఏర్పడిన అనుబంధం మాదిరిది చాలా మంది పిల్లలతో మీకు ఏర్పడి వుండవచ్చు. మా కాలేజీలో మీకు చాలా మంది గరల్ ఫ్రండ్సు దొరికి వుండవచ్చు. ఒకసారి మటుకే తటస్థపడినవాళ్లూ, తరచూ కలుసుకునేవారూ, అప్పుడప్పుడు కలుస్తూండేవారూ, యిలా ఎంతమందో వుండివుంటారు. అందులో చాలా మందికి పెళ్లి అయివుంటుంది. వారి పెళ్లికి మీకు ఆహ్వానం కూడా వచ్చివుంటుంది. మీరుకూడా బహుమతి తీసుకుని వెళ్లివుంటారు. చాలా పెద్దమనిషిలాగా వధూవరులని ఆశీర్వదించి, అక్షింతలు చల్లి వచ్చివుంటారు. 'సీ హావ్ పీపుల్ టేక్ థింగ్స్ యీజీ" ఇలా తల వంచుకుని

చెప్పడం మొదలుపెట్టి చివరికి తలఎత్తి సూటిగా చూసి అడుగుతుంటే, ఆ ముఖం వెలాతెలా పోవడం మొదలుపెట్టింది.

"అందుచేత మీరు నన్ను అడగ గలిగారు నీకు పెళ్లయిందా? పిల్లలు ఎందరు అని."

నాకిప్పుడు మామయ్య మాటలు జ్ఞాపకం వచ్చాయి. ఆయన చెపుతూంటాడు - "అతను నీ మాటలు నమ్మడు. కారు ఆపి చెయ్యి పట్టుకుని లాగినవాళ్లందరి వెంటా, పడిపోయేదానివనుకుంటాడు."

మామయ్య చెప్పిన విధంగానే నేనూ చెబుతాను. నేను ఒక ఆడపిల్లననే విషయం మర్చిపోయి, నిర్భయంగా చెప్పాను. "కారు ఆపి చెయ్యి పుచ్చుకు లాగినవాళ్లందరితో వెళ్లగలిగేదాన్నయితే నాకీపాటికి పెళ్లి అయివుండేది. అల్లా వెళ్లకండా వుండగలిగినా పెళ్లి అయివుండేది. ఆ రోజు అన్నారే 'ఈ సర్టిఫికేట్ అంతా అక్కర్లేదు' అని" - అది జ్ఞాపకం చేసినా, అర్ధంకానట్లు ప్రశ్నార్ధకంగా కనుబొమ్మలు పైకెత్తి నావంక చూస్తున్నారు.

"సర్టిఫికేట్లా ? నేను అలాంటిదేమీ అనలేదే?" అంటూ ఖంగారుగా చూస్తుంటే నాకు నవ్వొస్తోంది. "మీకు గుర్తుందా ? మనిద్దరం మాట్లాడుకున్న ప్రతిమాటా, మనిద్దరి ప్రతి చేష్టా, ప్రతీదీ నాకు వివరంగా జ్ఞాపకం వుంది."

"మీరు నా బుజాలు పట్టుకుని వణుకుతున్న నన్ను దగ్గరకు లాక్కున్నారు. అప్పుడు నేను 'నాకు భయంగా వుంది - ఇదంతా ఏదో కొత్తగా వుంది' అన్నాను. అప్పుడు మీరు నూతిలోంచి మాట్లాడుతున్నట్లు చాలా నెమ్మదిగా 'యీ సర్టిఫికెట్లన్నీ ఎందుకు' అని అన్నారు. జ్ఞాపకం వుందా ?" ఆయన తలగోక్కుంటూ చూస్తున్నారు.

"అయామ్ సారీ వినుగ్గా వుందా? పన్నెండు సంవత్సరాల క్రితం ఒక సాయంకాలం ఏవిధంగా గడిపారో అదేమాదిరి ఈ సాయింత్రం కూడా గడుపుదామని అనుకుని వుంటారు. పాపం అందమైన యీ యీవెనింగ్ వేస్టయి పోతోందని బాధగా వుందా? మిస్టర్ ప్రభూ వేస్టయిపోయింది ఈ సాయింత్రం ఒక్కటే కాదు. వృధా అయిపోయినది యీ సాయింకాలం ఒక్కటే కాదు - అని మీకు చెప్పడానికే యిలా రమ్మన్నాను"

"నో. నో - అదేంకాదు. మొన్న నీతో ఫోన్‌లో మాట్లాడినందుకు, ఇప్పుడు నిన్ను చూసినందుకు నేను చాలా సంతోషపడుతున్నాను. నాకు యిలా కలుసుకోవడం చాలా ఆనందంగా వుంది. నేను కారులో చాలామంది పిల్లలని తీసుకెళ్లాను, చాలామందితో సంబంధం పెట్టుకున్నాను – కాని నువ్వు అలాంటి అనేకమందిలో ఒకదానివి కాదని ఆనాడే గ్రహించుకున్నాను. 'దట్ యీజ్ వై ఐ ఫెల్ట్ గిల్టీ' నిన్ను జ్ఞాపకం వుంచుకోకూడదనే, యిన్నాళ్లూ ఆ తలంపు రాకుండా

జాగ్రత్తపడ్డాను. ఆ 'యీవినింగ్' తరువాత నిన్ను మర్చిపోడం మంచిదని అనుకుని, కావాలనే మర్చిపోయాను. నేను నీకొక నిజం చెపుతున్నాను నువ్వు నమ్మినా నమ్మకపోయినా ఫరవాలేదు. నా లైఫ్‌లో నా అంతట నేనుగా చెడగొట్టింది నిన్నొక్కదాన్నే. నేను యింతవరకూ నిన్నొక్కదాన్నే పాడు చేశాను. మిగతావాళ్లంతా అంతకుముందే చెడిపోయినవాళ్లు'' అని చెప్పి సిగరెట్ బలంగా పీల్చి, పొగవదిలారు. పొగ వల్లననుకుంటా కళ్లు మండుతున్నాయి. గొంతులో వుక్కిరి బిక్కిరిగావుంది. నన్ను చూడటానికి - మొఖం చెల్లక బయటకి చూస్తున్నారు. నేను కూడా రెండో వైపుకి తిరిగాను.

ఆ గ్రౌండ్‌లో గిర గిరా తిరుగుతున్న ఆ చిన్న కారు యిప్పుడు కనిపించడంలేదు. ఆ మైదానంలో మేము తప్ప ఎవ్వరూ లేరు. పొడవు పొడవుగా పడుతున్న సాయంకాలపు నీడలు, క్రమ క్రమంగా మాయమయి పోతున్నాయి. ఎరుపురంగు ఆకాశం బూడిద వర్ణంలోకి మారి, క్రమంగా నల్లబడుతోంది. ఇది ప్రదోష కాలమా? లేక ప్రత్యూష కాలమా? అని మనసుని మభ్యపెడుతున్నాయి ఆ నీలి నీడలు. తెల తెలవారుతున్నపుడు కూడా యిదే మాదిరిగా చీకటి వెలుగుల కలయిక కనిపిస్తూవుంటుంది. దూరంగా అయిరన్ బ్రిడ్జిమీద దీపాలు కనిపిస్తున్నాయి. బీచ్ రోడ్డంతా దీపాలు వెలిగినాయి. ఇంకా మసక వెలుతురు వుంటంచేత ఆ దీపాలు వెలాతెలా పోతున్నాయి! అవి వెలుగుతున్నట్లు మిణుకు మిణుకు మంటున్నాయిగాని - ప్రకాశవంతంగా లేవు. వాచీ చూసుకున్నాను. టైము ఆరున్నర అయింది.

నేను ఆయన వైపు తిరిగాను. ఈ వైపుకి కాకుండా, ఆవైపు తలుపులోంచి మౌనంగా బయటకి చూస్తున్నారు. లేదు కళ్లు మూసుకుని వున్నారు. తలంతా చెరిగి, వెంట్రుకలు చిందర వందరగా వున్నాయి. ఆ రోజులాగానే ఈయన్ని పరీక్షగా చూస్తున్నాను. ఇప్పుడు అప్పటి మాదిరిగా లేకపోయినా అందంగానే వున్నారు. అప్పటి అందంవేరు. ఒకమాదిరి అప్ టు డేట్ స్టయిల్. ఇప్పుడూ అప్పుడూ, ఎప్పుడూ ట్రిమ్‌గా అందంగా వున్నారు. గాలి ఆవైపు నుంచి యీ వైపుకి వీచినపుడు నన్నగా సెంటు వాసన గుబాళించింది.

ఈయన దగ్గిర వున్న డబ్బుని మైనెస్‌చేసి చూస్తే - యీ అందానికి ఎంత విలువ వుంటుంది? అన్న ఆలోచన రాగానే నాకు జాలివేసింది. డబ్బు లేకపోతే ఈ శరీరాన్ని యింత జాగ్రత్తగా పోషించడానికి వీలవదు. ఆ డబ్బు కూడా యీయన స్వంతం అయివుండదు. జీవితంలో పాడుచేసిన ఆడది - తన్నొక్క దాన్నే అన్నారే 'నాట్ ఎబౌట్ హిజ్ వైఫ్' తాళిగట్టడం వల్ల ఆమెని చెడగొట్టానని ఈయన అనుకోవడం లేదు కాబోలు. ఇటువంటి మనుషుల దగ్గిర వున్న డబ్బుని

చూసి గౌరవించి పుస్తె కట్టించుకుంటారు తప్ప, వ్యక్తిని చూసి కాదు. అసలు గర్వించదగిన సుగుణాలు వీళ్లలో ఏమున్నాయి గనక! ఈయన్ని రమ్మని పిలిచి ఎందుకిలా ఆలోచిస్తున్నాను? ఏవేమిటో మాట్లాడుతున్నాను. నాకు నేనే బోధ పడటంలేదు ఇందులో బోధపడటానికేముంది? ఇలా మాట్లాడటానికి నాకు హక్కు వుంది. యస్ దిస్ యీజ్ మై రైట్. నేను నవ్వుతున్నాను కాబోలు ఆయన టక్కున తిరిగి నన్నే చూస్తున్నారు.

"ఈ పన్నెండేళ్లుగా నా గురించి తలపోస్తున్నావా? నన్ను వెతికి పట్టుకోవడానికి యిన్ని రోజులు పట్టిందా?" అని ఈయన అడిగే తీరు చూస్తే ఈయన నా గురించి లేనిపోనివేవో వూహించుకుంటున్నారని బోధపడుతోంది. మామయ్య చెప్పినట్లు ఈయన నా మాటలు నమ్మకుండా వుండలేదని కూడా అర్థం అవుతోంది. నేను చెప్పే ఒక్కొక్క విషయమూ ఎంత నిజమోనన్నది, వున్న దానికంటే ఎక్కువగానే ఆయన నమ్ముతున్నారు. నేను చెప్పే విషయాలపట్ల ఒక్కసారి కూడా సందేహం వెలిబుచ్చలేదు. పాపం యిలాంటి మనిషిని మోసగించకూడదు.

నేను అన్నాను "నో నో అలాంటిది ఏమీ లేదు. ఆరునెలలనుంచే మీ గురించి తలచుకుంటున్నాను. ఈ ఆరు నెలలనుంచీ మీ కొరకు వెతుకుతున్నది మటుకు నిజం. అంతక్రితం మీ గురించి వెతకాలని అనుకోలేదు. - వెతకనూ లేదు."

ఆయన కొంచెంసేపు ఏదో ఆలోచించి అడిగారు. "ఆ తరువాత నువ్వు కాలేజీకి రావడం మానేశావనుకుంటా. ఎందుకంటే నిన్ను వెతుక్కుంటూ నేను రాకపోయినా, ఆ వైపుకి ఎన్నోసార్లు పనిమీద వస్తూండేవాడిని. అప్పుడు కూడా నువ్వు నా కంట బడలేదు. యామై రైట్?"

నాకు పెద్ద నిట్టూర్పు లాంటిది వొచ్చింది. ఆ తరువాత నేను పడ్డ బాధలు మీకేం తెలుసు? అన్న ఆలోచన వచ్చి, మనసంతా ఏదో బరువుగా వుండి, గుండెలు అదిరిపోతున్నట్లయింది. ఈయనని చివరిసారి చూసిన ఆ క్షణంనుంచి - యిప్పుడు చూసిన యీ మొదటి నిముషందాకా నా జీవితంలో జరిగిన విషయాలన్నీ ఈయనతో చెప్పుకోవాలనే తీవ్రమైన కోరిక కలిగింది. ఒక క్రమతలో వుండక, విషయాలన్నీ గజిబిజిగా, ఒకటి తలుచుకుంటే మరొకటి ముందుకు తోసుకు వస్తున్నాయి. అదేవిధంగా మనుషులు వారి మాటలు తెర తెరలుగా నన్ను చుట్టుముడుతున్నాయి. దెబ్బలూ తిట్లూ, కాలేజీ హాస్టలూ, ఇల్లూ ఫ్రెండ్సూ లెక్చరర్సూ స్టూడెంట్సూ, పాఠాలూ పేపర్లూ అన్నీ చెవుల్లో బిగ్గరగా వినిపిస్తున్నాయి. కళ్లెదురుగుండా స్పష్టంగా కనిపిస్తున్నాయి. నా తల గిర గిరా తిరుగుతున్నది.

నా చుట్టూ ప్రపంచమే గిర్రున తిరుగుతున్నట్లుంది. మనసులోపలా బయటా అంతా వలయాలు తిరుగుతున్నాయి.

కళ్లు మూసుకుని తల సీటు కానించి – ఒక పక్కకు వొరిగాను.

"వాట్ ఈజ్ ది మేటర్" అని ఏదో అడుగుతూ, చేతితో నాతొడని కుదుపుతున్నారు.

"ఛీ" అని వులిక్కిపడి కళ్లు తెరిచాను. 'అయామ్ సారీ' నన్ను నేను సర్దుకుని, నా ముఖంలో వచ్చిన కోపాన్ని మార్చుకుని, శాంత స్వరాన అన్నాను.

పాపం - ఈయన చెయ్యి వణుకుతోంది.

"మీరు మరోలా అనుకోకండి. నేను మిమ్మల్ని గురించి తప్పుగా అనుకోను. ఏదో ఆలోచిస్తుంటే గభాలున మీ చెయ్యి పడటంతో తెలియకుండానే నేను రియాక్ట్ అయాను" అంటూ గబ గబ ఏదో వాగాను.

"మనం యింకెక్కడికేనా వెళదాం. చీకటి పడింది" భయంగా అడిగారు.

"ఓ - యస్"

"ఇట్లా బ్రిడ్జి మీదుగా బీచ్ రోడ్డు కెళ్లి, మెరీనా కాంటీన్‌లో కాఫీ గానీ కూల్ డ్రింక్ గాని తాగుదామా?"

"ఓ – యస్"

పన్నెండేళ్ల క్రితం యిదే విధంగా ఒక సాయంకాలం, యిదే కారులో--ఇప్పుడు నేను ఫ్రంట్ సీట్‌లో కూచుని వున్నాను.... ఈయనతో యీ గ్రౌండ్‌లో యిదేమాదిరి తిరిగివెళ్లిన తరువాత, యీ నిముషందాకా జరిగిందంతా చెరిపిపారేసి, ఈ కారు ముందు సీట్లో నేను వచ్చి కూర్చున్నట్లూ, ఈ రెండు కాలాల మధ్యా ఏమీ జరగనట్లూ, నేను పవిత్రంగా వున్నట్లూ, కొన్ని క్షణాల ముందు ఛీ అని అన్నప్పుడు యీయన బెదిరిపోయి ఖంగారు పడ్డారే - అదే మాదిరి ఆనాడూ ఖంగారు పడ్డట్టూ ఇదంతా వూహించుకుంటున్నాను.

కారు కదిలి వెళుతూంటం నేను యిప్పుడే గమనించాను. ఈ కారుకి మటుకే స్టీరింగ్ ఎడంచేతి వైపున్నది. మిగతా కార్లన్నిటికీ అట్లావుండదు. బస్ స్టాపింగ్స్‌లో మీద పడబోతున్నట్లు నిలిపి, లిఫ్ట్ యివ్వడానికి అనువుగా వుంటుంది కాబోలు.

నేనే మాటలు ప్రారంభించాను. "ఆ తరువాత నేను యీ వూరు వొదిలి వెళ్లిపోయాను. ఆ రోజు మీతో కార్లో వచ్చానే అదే నేను ఆఖరిసారి కాలేజీకి వెళ్లడం. వీధి చివర "అయామ్ సారీ" అని చెప్పి, నన్ను దించి మీరు వెళ్లిపోయారు. ఎవరో నన్ను కొట్టినట్లు ఏడ్చుకుంటూ యింటికెళ్లి జరిగిందంతా అమ్మతో చెప్పి గట్టిగా ఏడ్చాను--"

"ఓ మై గుడ్‌నెస్" నాలిక కరుచుకున్నారు.

"ఎవడే వాడు-చెప్పు" అంటూ అమ్మ కొట్టింది. నేను ఎవరిని చెప్పను? ఆ తరువాత చాలా చాలా జరిగాయి – తరువాత తంజావూర్‌లో వున్న మామయ్య యింటి కెళ్లాను. తిరుచునాపల్లిలో, చిదంబరంలో చదువుకున్నాను. వుద్యోగం దొరికి అయి దారేళ్లయింది. అప్పటి నుంచీ యిక్కడే వున్నాను. నేను పెళ్లిచేసుకోను. నాకు పెళ్లి అవదుకూడాను. అందుకని నాకేం కష్టంగా లేదు. పై పెచ్చు చాలా సంతోషంగా వుంది. కాని పెళ్లిగాని ఆడపిల్లని ఎవరూ గౌరవించరు. పెళ్లి లేకుండా, పురుషుని అండలేకుండా ఒక స్త్రీ బ్రతకగలదు అంటే ఎవరూ నమ్మరు. అలా బతక నివ్వరు కూడాను. అందుకోసమని నన్ను ఎవరినో ఒకర్ని పెళ్లాడి చెడిపోమ్మం టారా చెప్పండి?"

ఈయన నన్నొకసారి తల తిప్పీ తిప్పనట్లు పక్కనుంచి చూశారు. ఈయన ఎక్కడ ఏడ్చేస్తారేమోనని, నాకు భయంగా వుంది.

"ఏమిటి? ఒక్క మాట కూడా మాట్లాడరా?" అని నేనే అడిగాను. ఒకసారి గొంతు సవరించుకున్నారు.

"మాట్లాడటానికి నీకెన్నో సంగతులున్నాయి. నేను ఎందుకూ పనికిరానివాణ్ణి. గుడ్ ఫర్ నథింగ్. నువ్వు ఏదో చదివానని చేప్పావే - ఆ చదువుకి పక్కన నిలుచో డానికి కూడా నాకు అర్హత లేదు. ఇంగ్లీషులో మాట్లాడుతున్నానని అనుకుంటున్నావా? చదివింది హైస్కూలుదాకానే. అయినా కాన్వెంటు ఎడ్యుకేషన్‌కదూ. అయితే ఏం లాభం? గట్టిగా తమిళంలోనూ మాట్లడలేను - ఇంగ్లీషులోనూ మాట్లాడలేను. రెంటికీ చెడ్డరేవడి అయింది నా పని. అంచేత కొన్ని సమయాల్లో మాట్లాడాలంటేనే భయంగా వుంటుంది" అంటూ నవ్వుతూ చెప్పారు. కాని ఆయన ఎంత న్యూనత పడుతున్నారో, ఎంత కష్టపడుతున్నారో నేను గ్రహించగలిగాను. ఇద్దరం కొంచంసేపు నిశ్శబ్దంగా వున్నాము. కారు రెస్టారెంటు లోపలికి వెళుతోంది.

ఆయన అడిగారు. "నువ్వు వెజిటేరియన్‌వా? ఐ థింక్ యు అర్ ఎ బ్రామిన్ మాటలుచూస్తే అట్లాగే అనిపిస్తోంది."

నేను బదులు చెప్పలేదు.

కారు ఆగింది.

వెయిటర్ వచ్చి ఈయనకి సలాంజేసాడు. ఈయనని తెలుసుననుకుంటా - తరుచు యిక్కడికొస్తూంటారా?

"ఏం తింటావ్ - బిస్కట్స్ అండ్ టీ"

"టీ - మటుకే"

"ఒ.కే. టీ మటుకు తీసుకునిరా."

వెయిటర్ వెళ్లాక దీపం వెలుతురిలో నన్ను పరీక్షగా చూశారు. "నిన్ను చూస్తుంటే నాకు ఒకపక్క సంతోషంగా, మరోపక్క బాధగానూవుంది" అని చెప్పి కొంచెంసేపు ఏదో ఆలోచనలో పడిపోయారు. ఆపైన ఇంగ్లీషులో అన్నారు. "ఏదో ఆటకాయితనంగా జరిగింది - ఆ దుర్ఘటనను నువ్వు మర్చిపోవాలి. అందు కొరకని జీవితమంతా వృథాచేసుకుంటావా ? యు షుడ్ టేక్ థింగ్స్ యీజీ యిన్ లైఫ్"

నాకొరకు ఆయన నిజంగానే చాలా బాధపడుతున్నారు.

"యు నో - నేను నిన్ను చూడటానికి వస్తానని చెప్పానే అప్పుడు నేను అనుకున్నది నీకు పెళ్లి అయివుంటుంది. ఇద్దరు ముగ్గురు పిల్లలుంటారు. ఏదో పాతస్నేహితుడన్న అభిమానంతో ఏదన్నా సహాయం అడుగుతావనో, లేక జస్ట్ ఫర్ ఎక్స్పైన్‌టెన్స్ దగ్గరకు వెళ్లిన విధంగానో అనుకున్నాను."

"ఓహో - పెళ్లి చేసుకున్నాకకూడా ఈ విధంగా మిమ్మల్ని పిలిచి కలుసుకునే ఆడవాళ్లు వున్నారా ?" అని నేను కుండ బద్దలుకొట్టినట్లు అడిగాను.

"ఈ ప్రపంచంలో లేనిదేమివుంది ? కాని నీలాగా జీవితాన్నంతా వృథా చేసుకునే మనిషిని - నిన్నొక్కత్తెనే చూసాను." ఆయన మాట్లాడుతుంటే నేను సూటిగా ప్రశ్నించాను.

"అది ఎలా వీలవుతుంది ? నా మనస్సాక్షి సంగతి వదిలెయ్యండి. ఈ మాదిరి చెడిపోయిందని నలుగురికీ బాహాటంగా తెలిసిన ఒక ఆడపిల్లను పెళ్లి చేసు కుంటానని ఎవరైనా ముందుకొస్తారా ?"

"వాట్ ఆర్ యు టాకింగ్ ? చెడిపోవడం, చెడిపోవడం. ఐ కెన్ సే మెనీ కేసెస్— ఒకరితో కలిసి జీవించి, డైవర్సు తీసుకుని, వేరే యింకొకరిని పెళ్లిచేసుకున్నవారు యీకాలంలో కోకొల్లలు. నువ్వు చెడిపోయావని అనుకోవడం తప్ప మనుషులకి వేరే పనిలేదా ? నన్ను కలుసుకోవాలనుకోవడంలో ఏదో కారణం వుండి వుంటుంది. అదేమిటో త్వరగా చెప్పు."

వెయిటర్ టీ తీసుకొచ్చాడు.

ఆయన ఒక కప్పు సాసరు తీసుకుని నాచేతికిచ్చి, తాను మరొకటి తీసుకున్నారు. వెయిటర్ వెళ్లిపోయాడు. మళ్లీ చెప్పడం మొదలుపెట్టారు.

"నీకు మంచి సంబంధం వెతికి పెళ్లిచేయాలని నాకోరిక. రియల్లీ నీలాంటి ఆడపిల్ల జీవితం యిలా మోడువారి వృథా అవడం న్యాయంకాదు. నీకో ఫస్ట్‌క్లాస్ పెళ్లికొడుకుని వెతికి తీసుకొస్తాను చూడు. ఈ చెడిపోవడం - గిడిపోవటం లాంటి విషయాలనన్నిటినీ లెక్కచెయ్యని, చాలా వున్నతమైన వ్యక్తిని తీసుకొస్తాను. దానికి నువ్వేమంటావ్ ?"

అతను పూర్వంలాలేడు. 'చాలా మర్యాదగల మనిషిగా మారిపోయాడు. అవును అతనొక పెద్ద మనిషి' అని ఆర్. కె. వి. ఈయన గురించి చెప్పారు. అది ఇప్పుడు జ్ఞాపకం చేసుకుంటున్నాను.

## 11

రెస్టారెంటు నుంచి బయటకి వచ్చేదాకా ఆయన నా పెళ్ళిగురించే మాట్లాడారు. నేను బదులు చెప్పకుండా అన్నీ వింటున్నాను. వేళగాని వేళలో టీ తాగడంచేత నాకు ఎలాగోవున్నది. మాచుట్టూ కార్లలోనూ, నడుస్తూనూ జనం గుంపులు గుంపులుగావున్నారు. ఆ వెళ్లేవారిలో నన్ను ఎరుగున్నవాళ్లు ఎవరన్నా వున్నారే మోనని వాళ్ళు చూస్తారేమోనని భయం ఒకటి. భయం దేనికి? చూస్తే చూడనీ. అందరూ చూడాలనేకదూ. ఈపని ప్రారంభించింది. ఇందులో భయపడటానకి ఏముంది? ధైర్యంగా తల పైకెత్తి నిటార్గా కూచున్నాను.

కారు బీచ్‌రోడ్‌లో వెళుతోంది. పెళ్లివూరేగింపులా వెళుతోంది. ఈయన కాలుస్తున్న సిగరెట్‌పొగ గాలితోపాటు నన్ను చుట్టుముడుతుంటే, ఆ వాసన ఎంతో బాగుందనిపించింది. ఛీ సిగరెట్‌వాసన బాగుంటుందని ఎవరన్నా అనుకుం టారా? 'అబ్బ కంపు - కడుపులో తిప్పుతోంది' అంటూ ముక్కుమూసుకు చెబితేనే ఆడదానికి అందం. ఈ సిగరెట్‌వాసన బాగుండి వుండకూడదు. ఈ వాసన బాగున్నదీ అంటే ఆపిల్ల మనసు ఎంత చెడిపోయి వుంటుందో! మామయ్య నడిగితే సరి, ఆ విషయంపై ఒక పెద్ద థీసిస్ తయారుచేస్తాడు.

సిగరెట్ అంటే మొగవాడు కాల్చతగినది. అది మొగతనానికి చిహ్నం. ఆ వాసన యిష్టం అని ఎవరేనా ఆడది అంటే - ఆ ఆడదానికి మొగవాడి తోడు అవసరం అనీ, అది మొగవాడి కోసరం పరితపించిపోతోందనీ - కరువు వాచి వుందనీ. - - -

మామయ్య ఆలోచనాస్రవంతి నాకు బాగా తెలుసు. ఆ మనసు ఎలా ఎలా యోచించేది ఎలా తర్కించేది తలచుకు తలచుకు నేను కూడా మామయ్య లాగానే అయ్యాను. మామయ్య చెప్పిన ఆలోచన వల్లనే నేను, ఈయన్ని వెతికి పట్టుకున్నాను. నేను సమర్థురాలని అవునో కాదో రుజువు చేసి మరీ చూపుతాను.

ఇకమీదట మామయ్య నన్ను ఈయనతో కలిసి కారులో తిరగడం చూడ బోతాడు. ఆ అవకాశం నేనే కల్పిస్తాను.

మాట్లాడకుండా కారు నడుపుతున్నారు. ఈయన్ని చూస్తుంటే నాకెందుకో జాలిగా వుంది. ఏదో నేరం చేసి, పశ్చాత్తాపంతో కుమిలిపోతున్నట్లు కనిపిస్తున్నారు. నేనే తిరిగి సంభాషణ ప్రారంభించాను.

"నాకు పెళ్లి అయిపోయింది. పన్నెండు సంవత్సరాల క్రితం, శకుంతలని దుష్యంతుడు చేసుకున్నటువంటి వివాహం - దాన్ని మన శాస్త్రాల్లో గాంధర్వ మంటారు. ఆమాదిరి పెళ్లి- నాకు యీ కార్లో అయింది."

కిర్రుమని శబ్దంతో స్టీరింగ్ బలవంతంగా తిప్పి, సడన్ బ్రేక్ వేసి కారు నిలిపారు. రోడ్డు మధ్యలో ఎర్ర చీరెలో ఒక ముసలమ్మ బుట్టతో యిటు అటు ఖంగారుగా చూసి రోడ్ పక్కకి పరుగెత్తింది. ఈయన చెయ్యి బయటపెట్టి ఆ ముసల్దాన్ని రిక్షావాళ్లు తిట్టినట్లు ఏదో అసహ్యమైన భాషలో తిట్టారు.

'అబ్బా ఛీ ఛీ— యీయన ఇటువంటి పాడు మాటలు అంటున్నారేమిటి ?' అని నా వొళ్లంతా కుంచించుకుపోయి, సిగ్గుతో చచ్చిపోయాను.

మళ్లీ కారు కదిలింది. ఇంకా కోపం పోలేదు కాబోలు, ఆ కోపం నా మీద చూపిస్తూ, "మరి ఏం చెయ్యమంటావ్? నేను ఒక్క నిముషం చూసి వుండకపోతే ఏమైవుండేదో? తాగినట్లుంది. చీకట్లో తడమాడుతోంది. దెబ్బ తగలక్కర్లేదు - కాస్త కారు రాచుకుంటూ వెడితే చాలు లబోదిబోమంటూ గుంపులా వచ్చిపడతారు తెలుసా? దాంతో యీ చుట్టుపక్కలున్న అలగా వెధవలంతాజేరి గలాటా మొదలు పెడతారు. ఒంటరిగా వుంటే - నేనూ ఆ రౌడీల్లో రౌడీనయి దెబ్బలాడి వుందును. కారులో ఆడమనిషి వుంది. అసహ్యంగా వుంటుందని వదిలిపెట్టాను. అందుకనే భయపడిపోయాను."

ఈయన తమిళం మాట్లాడుతుంటే తమాషాగా వుంది. అది స్వచ్ఛమైన మద్రాసు భాషలాగానూ లేదు. ఏదో ఆంగ్లోయిండియన్ మాట్లాడుతున్నట్లు వుంది. ఈయనకి ఇంగ్లీషు మాట్లాడుతున్నప్పుడుండే చొరవ తమిళం మాట్లాడుతున్నపుడు వుండదు. అది తమిళభాషలోని లోపం కాదు. ఈయనకి 'ఆ భాష ఆ మాట్లాడటం చేతకాదు.

"బెటర్ యు టాక్ యిన్ యింగ్లీషు" అన్నాను నేను. ఇంగ్లీషులో చాలా సహజంగా మాటలు ఆరంభించారు. తనలో తాను మాట్లాడుకుంటున్నట్లు రోడ్డు వంక చూస్తూ కారు నడుపుతూ అన్నారు.

"ఐ ఫీల్ టెరిబుల్లీ సారి. ఆ కారులో జరిగిన సంఘటన నీ పెళ్లి అనీ, నేను నీభర్తననీ అన్నావు. నువ్వు అలా అనుకోవడం చేత వివాహక్రతువుని అవమానించడమే కాదు, నిన్ను నువ్వు అవమానించికుంటున్నావు కూడా."

"అది పెళ్లి అని చెప్పి మీ దగ్గర నుంచి నేను ప్రతిఫలం కోరడానికి రాలేదు. ఐ మీన్ లక్‌లీ–. ఇంకొకరి భార్యగా వుండేటువంటి అర్హతను నేను ఏనాడో పోగొట్టుకున్నాను. (ఐ కెన్ ఓన్లీ బి ఎకాంకు బైన్ టు సమ్ వన్ – యస్ నాట్ ఎ వైఫ్ ఎనీ మోర్) నేను ఎవరి పోషణలో నన్నావుండచ్చుగాని, ఎవరికీ సహధర్మచారిణి కాలేను. ఒకవేళ ధైర్యంచేసి, ఎవరికైనా లోబడి వుంటానే అనుకోండి, అది నన్ను నేను అవమానించుకోవడమే అవుతుంది గాని, మనః పూర్వకంగా మటుకు కాదు. అందుకనే మీకోసం యింత తీవ్రంగా వెతికింది. మీకు భార్యగా వుందామనే వుద్దేశం నాకెప్పుడూ లేదు. మీ పోషణలో వున్నాను. మీ వుంపుడు కత్తిగా వున్నాను-అన్నటువంటి ఆ పేరు నాకు కావాలి. దట్ విల్ హెల్ప్ మైలాట్."

"డోంట్ టాక్ నాన్‌సెన్సు. ఆ పేరు వల్ల నీకు ఎటువంటి మంచీ జరగదు. పన్నెండేళ్ల క్రితం నువ్వు నీ జీవితంలో భంగపడి దెబ్బ తిన్నావు – అది చాలదా? ఎందుకింకా న్యూనత పడతానంటావ్? ఇకమీదట నిన్ను నువ్వు కించపరచుకోకూడదు. ఒక స్నేహితుడిగా నీకు ఎటువంటి సాయం కావాలన్నా - చెయ్యడానికి నేను సిద్ధంగా వున్నాను. నీ జీవితం బాగుపడడానికి ఏం చెయ్యమన్నా చేస్తాను. నేను చేసిన పాడు పనితో నీ జీవితం బ్రద్దలు అయింది. అది చాలదా? 'నాకు ఒకపరిపూర్ణమైన జీవితం కావాలి' అని నీలో నువ్వు నిశ్చయించుకున్నపుడు, నీకు వుజ్వలమైన భవిష్యత్ వుంటుంది. అటువంటి భవిష్యత్‌ని ఆశించగల అర్హత కూడా నీకున్నది. అంతేగాని నాపేరు నీపేరు జోడించి - నిన్ను నువ్వు బురదలోకి లాక్కోకు– అసహ్యం చేసుకోకు. నేను ఎవరికీ పనికిరానివాడిని, ఎందుకూ పనికిరానివాడిని, దమ్మిడీకి కొరగాని అయోగ్యుడిని. నిన్ను కలుసుకున్న ఆరోజుల్లో ఏ అర్హతాలేక పోయినా కనీసం బాగా డబ్బూ ఆస్తీ వుండేవి. ఒక లక్షాధికారి కొడుకు నన్న విలువవుండేది. కాని ఇప్పుడు అదికూడా లేదు. నేనిప్పుడు ఒక లక్షాధికారిణికి భర్తని. జస్ట్ ఎ హస్బెండ్ టు ది మిలియనీరెస్. ఇక్కడ కొంచెంసేపు ఆగుదామా? నువ్వు తొందరగా వెళ్లిపోవాలా?"

ఐ. జి. ఆఫీసుకు ఎదురుగావున్న కారు పార్కింగ్ చూపించి అడిగారు. ఒక క్షణంలో ఆ ముఖంలో కలవరపాటూ, లజ్జాభిమానాలూ కనిపించాయి.

"నాకేం తొందరలేదు. నేను ఎవరికీ సంజాయిషీ చెప్పుకోనక్కరలేదు" అన్నాను. బీచ్‌రోడ్‌కి పార్లల్‌గా, లోపలకివున్న రోడ్‌లో కారు ఆపి ఆయన అడిగారు.

"ఆర్ - యు లివింగ్ ఎలోన్?"

"లేదు - నాతో అమ్మ వుంది"

"మీ యిద్దరేనా?"

"ఎస్. ఒక బ్రదర్ వున్నాడు. వాడు విడిగావున్నాడు. ఆరోజుసాయంకాలం నన్నూ మా అమ్మనీ యింట్లోంచి తరిమి వెళ్లగొట్టాడు. రెండు రోజులపాటు జోరున కురుస్తున్న వానలో నేనూ అమ్మా ఆ యింటి అరుగుమీద కూచుని గడిపాము. అమ్మ నన్ను కొట్టింది, తిట్టింది అయినా తనుమటుకే నన్ను విడవకుండా కాపాడింది. ఆకారణం చేతనే నేను ఆమెని ఎవరిదగ్గరకూ పంపక నాదగ్గిరే అట్టేపెట్టుకున్నాను. నా జీవితం యిలా అయిపోడానికి - మా అమ్మే కారకురాలని, ఆమెని వెళ్లగొట్టగలనా ?"

కారు నిలిపి, దిగి బయట నిలబడి ఒక సిగరెట్ ముట్టించారు. ఆకాశంవైపు చూస్తూ పొగ వదులుతున్నారు. కారు చుట్టూతిరిగి, నేను కూర్చున్న వైపుకివచ్చి, కారునానుకొని నిలుచున్నారు. ఒక్కక్షణం ఆగి మాటలు మొదలుపెట్టారు.

"యు ఆర్ రైట్. వాళ్లని మనం వొదులుకోలేము. మా నాన్న నాకేం చేసాడో తెలుసా ?" అని పెద్ద నిట్టూర్పు విడిచారు. ఆయన తన సమస్యలని గురించి ఆలోచించుకు బాధపడుతున్నట్లున్నారు. వాచీ చూసుకుంటున్నారు. నాకు చూడకుండానే తెలుసు టైము ఏడున్నరయింది.

"ఈ టైముకి నేను సాధారణంగా క్లబ్‌లో వుంటాను. ఇంటికెళ్లేటప్పటి రాత్రి పన్నెండవుతుంది కొన్ని రోజుల్లో, ఒకోసారి రెండు మూడు కూడా అవుతూంటుంది. సరిఅయిన టైము చెప్పగలిగే స్థితిలోవుండను. ఐ హావ్ బికమ్ యాన్ ఆల్కాహాలిక్" అన్నారు.

గబుక్కున తల ఎత్తి చూశాను.

"నేను చెబుతున్నది నీకు అర్థం అవుతోందా ? మనవాళ్ల మాటల్లో చెప్పాలంటే నేనొక తాగుబోతును. తాగకపోతే బతకలేననికాదు, ఇది లేకపోతే నాకు గౌరవం వుండదు. చాలా తమాషాగావుందికదూ ! నా వైఫ్‌వుందే - అదే మిలియనీరెస్"....

ఆ మాటలు అంటుంటే ఆయన మొఖంలో ఒకరకమైన క్రోధం, అసహ్యం రెండూ కనిపించాయి

"ఆవిడకు నాపైన భర్త అన్న గౌరవంగాని, చేసుకున్నవాడన్న అభిమానంగాని లేవు. కాని తాగుబోతునన్న భయంమటుకు వుంది. నేను తాగివెడితే అణిగి పడి వుంటుంది. దాన్ని వొంచాలి అంటే నేను తాగాలి. అందుకే నేను తాగుతున్నాను. నేను తాగకుండా వున్న సమయాల్లో అది అరుస్తూ వుంటుంది. తాగినతరువాత నేను అరుస్తాను. అది భయపడుతుంది. నోరుమూసుకుని వూరుకుంటుంది. సో ఐ ఫెల్ట్ యిట్ యీజ్ బెటర్ దాన్ దట్" అంటూ చాలా శాంతంగా, నవ్వుతున్నారు. నా కడుపులో గబగబమంది.

ఆయన ఇంగ్లీషులో అందుకుని మళ్లీ చెపుతున్నారు. "నేను ఒక ఖైదీలాగా జీవితం గడుపుతున్నాను. నా పేరులోవున్న ఆస్తిపాస్తులన్నిటికీ నేను హక్కు

దారునికాదు. వాటికి అధిపతిని నేనుకాదు. ఆస్తిపైన నాకు ఎటువంటి అధికారమూ లేదు. బాధ్యతకూడా లేదు. నాగురించి తెలుసుకోవాలంటే మానాన్న రాసిన విల్లు చదవాలి. ఆ తరువాతకూడా - నేనూ ఒక మొగవాడినని, తలఎత్తుకు తిరుగుతున్నానంటే - నాకన్న హీనమైనవాళ్లు ఎక్కడా వుండి వుండరు.

"హీనతచెందడం, హీనంగా బతకటం నాజీవిత నైజం అయిపోయింది. నాకు అలవాటయిపోయింది." ఆయన యింగ్లీషులో 'ఎ డెడ్ సోల్' అన్నమాట వుపయోగించారు.

మళ్లీ ఆయన అన్నారు. "ఆ విల్లులో మానాన్న నాగురించి ఏం రాశారో చెప్పనా? ఆరంభంలోనే యిలా మొదలుపెట్టారు. 'నా ఏకైక పుత్రుడు ప్రభాకర్ మేలుకోరి యీ విల్లు రాస్తున్నాను. వాడు చెడుసావాసాలకీ, చెడుతిరుగుళ్లకీ అలవాటు పడిన వాడు' యీమాదిరి ఒక పెద్ద లిస్టురాసిపెట్టి, తరువాత నన్నూ నా భవిష్యత్‌నీ కాపాడేందుకని, ఆస్తంతా దాని పేర రాసిపెట్టాడు మా నాన్న. నాకు నెలకింత ఖర్చులకి డబ్బు ఏర్పాటు చేశాడు. ఏ ఏ అయిటమ్ నుంచి ఎంతెంత తీసి ఖర్చు పెట్టుకోవచ్చో, వివరంగా సబ్‌క్లాజు కూడా చేర్చాడు. ఇన్ని చేసి, చచ్చిపోయే ముందు నాచెయ్యిపట్టుకు ఏడుస్తూ 'ఇదంతా నీ మంచికోసమే చేశాను' అన్న ఆ తండ్రిని నేను వెళ్లగొట్టగలిగానా?"

ఆదారంట అయిస్‌క్రీమ్ బండీ వస్తోంది. అది చూడగానే చిన్నపిల్లవాడి మాదిరిగా ఈయన "అయిస్‌క్రీమ్ తింటావా?" అని అడిగారు.

"నో థాంక్సు"

"ఓ ఐ లైక్ యిట్" అంటూ పరుగెత్తికెళ్లి వాణ్ణి పిలిచారు. కారుపక్కగా ఆ బండి వచ్చి ఆగింది. వాడిని ఏవిటేమిటో అడిగి, చివరికి రెండు అయిస్‌క్రీము, ఒక బార్ తీసుకున్నారు. పర్సులోంచి రెండు రూపాయల కాయితం తీసియిచ్చారు. ఇదంతా చూస్తుంటే నాకు తమాషాగా వుంది.

"జస్ట్ టేస్ట్ యిట్ బాగుంటుంది" అంటూ నాచేతికి ఒక కప్పు యిచ్చారు. చేతిలో పుచ్చుకుని బిత్తరపోయి చూశాను. నేను అయిస్ క్రీము తింటూంటాను కాని యిలా రోడ్ మీద, కారులో కూచుని, యింకొకరి ముందు నాకి నాకి తింటం సిగ్గుగావుంది. ఈయన నాఎదురు గుండానే ఒక్క నిముషంలో కప్పు ఖాళీ చెయ్యడమేకాదు, పూర్తిగా గీకేసి చెమ్చాకూడా బాగా నాకి, ఆపైన పుల్లతో వున్నబార్‌ని చప్పరించడం మొదలుపెట్టారు.

"మా మంజు నాలుగు కప్పులు తినేస్తుంది. మాయింట్లో అందరికీ అయిస్‌క్రీమ్ అంటే చాలా యిష్టం. పద్మకు తెలిస్తే తిడుతుంది. అంచేత అందరూ నాదగ్గర చేరతారు."

ఈయన భార్య పేరు పద్మని తెలుసుకున్నాను.

"మీగురించి మీ నాన్నగారు విల్లులో రాసిందంతా తప్పని - మీరు నిరూపించి వుండవచ్చునే." కప్పులో వున్న ఐయిస్‌క్రీమ్‌ని ఆ కర్రచెమ్చాతో తీస్తూ అడిగాను. చెమ్చాతో తిప్పి తిప్పి అది కరిగి, నీళ్లయాక, ఎత్తి నోట్లో పోసేసుకుంటే సరి పోతుందనే వుద్దేశంతో చెమ్చాతో తిప్పుతున్నాను.

"ఏం ఎందుకు నిరూపించాలి?" గబ గబా బార్‌ని చప్పరిస్తూ అడిగారు.

"వాట్ ఎ సింపుల్ పర్సనాలిటీ" అని ఆయన గురించి నాలోనే అనుకున్నాను. ఓ పది నిముషాల ముందు తండ్రి రాసిన విల్లు గురించీ, యింట్లో తనని ఎలా ట్రీట్ చేస్తున్నదీ చాల సీరియస్‌గా, బాధతో చెప్పారు. ఇప్పుడేమో అయిస్‌క్రీమ్ తింటంలో అదంతా మర్చిపోయి 'ఏం నిరూపించాలి' అని అడుగుతున్నారు.

"మీ నాన్న మీ గురించి విల్లులో రాశారే అదంతా తప్పు అని - మీ ప్రవర్తన బట్టి మీరు నిరూపించవచ్చుగా?"

ఆ కాగితం కప్పుని బంతిలాగా చుట్టి, పైకి ఎగరేసి. వొంగి రెండో చేత్తో గట్టిగా కొట్టి నాకు బదులు చెప్పారు.

"ఎందుకు? నాకు యిదే బాగుంది. ఈవిధంగా ఆయన కట్టుదిట్టాలు చెయ్యడంతో, అందులోవున్న సుఖాలనే అనుభవించవచ్చునని నిశ్చయించుకున్నాను. ఆయన చేసింది మంచి కొరకేనేమో! సరి అయినదేమో! అంత కట్టుదిట్టంగా రాసిన విల్లు వున్నాకూడా మొదట్లో పద్మ నా యిష్టానికి తలవూపుతుండేది - దేనికి అడ్డు పెట్టేది కాదు. ఎంతో డబ్బుని మంచినీళ్లలాగా ఖర్చు చేశాను. అది అన్ని విషయాలూ వోర్చుకుని వూరుకునేది. కాని నాకు యితర స్త్రీలతో సంబంధం వుంది అని తెలుసు కున్నపుడు వోర్చుకోలేకపోయింది. ఆ విషయంలో ఆడవాళ్లంతా ఒకటే అనుకుంటా. ఎంతైనా ఆడది ఆడదే. దాంతో అది అబల కాక సబలగా మారిపోయింది. కాని ఒక విషయం, నాకు తటస్థపడిన ఏ ఆడపిల్లా నన్ను ప్రేమించలేదు. నా భార్య మనసు విప్పి మాట్లాడదు. నన్ను ప్రేమించే హృదయం కొరకు వెతికి వెతికి అలిసిపోయాను. ప్రతిసారీ 'యిది నిజమైన ప్రేమ'- అని అనుకుంటాను. కాని ఇది 'ప్రేమ' కాదు అని చివరికి తెలుసుకుంటూంటాను." అందరూ కలిసి తనకేదో గొప్ప అన్యాయం చేసినట్లు, లోకమంతా తనని మోసగించినట్లు బాధపడుతూ చెపుతున్నారు. నాకు నవ్వొస్తోంది - ఆ నవ్వు అపుకుని అడిగాను.

"మిమ్మల్నెవ్వరూ ప్రేమించలేదని అంత ఆవేదన పడుతున్నారే! మీరెవరినయినా మనస్ఫూర్తిగా ప్రేమించారా? మీ భార్యని కాక మరెవరినయినా? మీకు డబ్బుంది; డాబూ దర్జా వుంది; కారు వుంది, బంగళా వుంది, చక్కగా డ్రస్ చేసుకుంటారు, సెంటు రాసుకుని, కూలింగ్‌గ్లాసెస్ వేసుకుంటారు - అందుకని వీధిలో వెళ్లేవాళ్లందరూ

మిమ్మల్ని ప్రేమించాలని అనుకుంటున్నారు అవునా? అవన్నీ మాని కొందరు ప్రేమిస్తున్నాం అంటూ మీదగ్గరకొస్తారు, రావచ్చు అది మిమ్మల్ని ప్రేమించడం అవుతుందా?" ఇలా చెపుతుంటే నాకు ఆర్. కె. వి. రాయపోయే 'అశ్వమేధం' జ్ఞాపకానికికొచ్చింది.

ఈయన నాకంటే ఏడెనిమిదేళ్లు పెద్ద అయివుండవచ్చు. కాని నాదగ్గర పాఠాలు నేర్చుకునేందుకు వచ్చిన చిన్నపిల్లవాడిలా కనిపిస్తున్నారు. ఆయనతో మాట్లాడుతున్నపుడు ఒక మొగవాడితో మాట్లాడేప్పుడు కలిగే భయం గాని, సంకోచం గాని నాకు కలగడంలేదు. ఆయనకంటే నేను ఎక్కువ మనోస్థయిర్యము కలదాన్నిగా అనిపిస్తోంది నాకు. ఇప్పుడే యిలా అనిపిస్తుంటే, పన్నెండేళ్ల క్రితం ఎంత అమాయకంగా వుండేవారోనని అనిపించింది. ఇటువంటి అమాయకుడికి భయపడి నన్ను నేను బలి చేసుకు వచ్చాను అంటే - అప్పుడు నేనెంత అమాయకంగా వుండేదాన్నో ఆలోచించుకుంటున్నాను. మా దృక్పథంలో యీ వ్యత్యాసాన్ని చూడగలంతగా నేను ఎదిగిపోయానన్నమాట. నాకు ఒకే ఆశ్చర్యంగా వుంది. కాలం ఏవిధంగా - ఎలా మారిపోతోంది! కాని కొందరు మనుషులు మటుకు మారనంటారు. ఈయనా అదే తంతు - అలాంటివారే.

ఎనిమిది గంటలయింది. ఆయన బయలుదెరడానికి తొందరపడుతున్నారని గ్రహించుకున్నాను. ఈయన యిప్పుడు క్లబ్‌కి వెళ్లాలి కాబోలు. అది నాకు అర్థమయి "బయలుదేరుదామా? మీకు తొందర పనివుంటే యిక్కడినుంచి వెళ్లిపోండి. నేను టాక్సీ తీసుకుని యింటికి వెళ్లిపోతాను" అన్నాను.

"నోనో- నిన్ను యింటి దగ్గర దింపి వెళతాను. మీ యిల్లెక్కడ?"

"ఎగ్మూరులో"

కారు మళ్లీ బయలుదేరింది. సిగరెట్టుపొగ చుట్టబెడుతోంది. ఆయన ఏం మాట్లాడలేదు. నేనూ మౌనంగానే వున్నాను.

మా వీధిలోకి కారు తిరిగేసరికి గుమ్మం ముందు లైటువేసి, అమ్మ నాకోసం ఎదురుచూస్తూ నిలుచుని వుండటం యిక్కడినుంచే కనిపిస్తోంది. ఇంకా కొన్ని రోజులు పోయాక ఆవిడకు నేనో పెద్ద 'జోల్టు' యివ్వబోతున్నాను. పిడుగులాంటి వార్త చెప్పబోతున్నాను.

కారు మా యింటి ముందు ఆగింది. అమ్మ చూస్తోంది - దీపం వెలుతురు ముందు సీట్లో కూచున్న మా యిద్దరిమీదా ధారాళంగా పడుతోంది. అమ్మ చూస్తున్నది. ఆమె చూడాలనే, ఆమెకి చూసే అవకాశం కలిగించాలనే - నేను నెమ్మదిగా ఆయన దగ్గరనుంచి శలవు తీసుకున్నాను.

"రేపు ఫోన్ చేస్తాను. గుడ్ నైట్ ఢీరియో" నేను కారులోంచి దిగాను. అమ్మ ఇదంతా చూసి చేష్టలుడిగి నుల్చుండిపోయింది.

## 12

పది గంటలు కావస్తోంది. గంగ వస్తున్న జాడ ఎక్కడా కనిపించడంలేదు. అది ఆఫీసుకి బయలుదేరిందిమొదలు, మళ్లీ తిరిగి వచ్చేదాకా మామూలుగానే యింకా ఎందుకు రాలేదని గుండెలు పీచు పీచుమంటుంటాయి. ఇప్పుడు చెప్పనే అక్కరలేదు. నిముషాలు గడచిన కొద్దీ కడుపులో ఏవో పరుగెడుతున్నట్లుగా గాబరాగా వుంది.

ప్రతి రోజూ దాన్ని ఎన్నో ఎన్నో అడగాలనుకుంటుంటాను. అడగబోతాను. కాని అవి నాలిక చివరదాకా వచ్చి ఆగిపోతూంటాయి. ఏమని అడగను? ఎలా అడగను?

అడగడానికి ఏముంది? అడక్కుండానే నా మనసు అంతా తెలుసుకుంటున్నది. నెత్తిమీద నా పెద్ద పిడుగు పడబోతోందని తెలుసు.

ఏటైములో వచ్చినా, ఎక్కడెక్కడ తిరిగినా నేను ఒక్కమాట అడిగానా? నాలోని అనుమానాలని - నాలోనే అణుచుకుని, బాధపడుతూ వూరుకున్నానే తప్ప, దాన్ని గురించి ఎవరెన్ని చెప్పినా నమ్మానా?

గణేశన్ వచ్చి ఎన్నో చెప్పాడు. వాడు అన్నవన్నీ దాని దగ్గిర చెప్పానా? ఎందుకు చెప్పలేకపోయాను? నా బిడ్డ తప్పుడు దోవల పోదన్న నమ్మకం నా హృదయంలో గాఢంగా వుంటంచేత – వాడెన్ని మాటలన్నా యివన్నీ దాని చెవిన పడితే బాధపడుతుందని ఒక్క విషయం కూడా పైకి అనలేదు.

దీన్ని గురించి వచ్చినపుడల్లా ప్రతీసారీ కొత్త విషయం చెపుతుంటే నోరు మూసుకుని నిలుచుని వినేదాన్ని. "దానిని గురించి మాట్లాడటానికి నీకు ఏం హక్కు వుందిరా? అసలు నీకు ఏం రైటుంది?" అని వాడి నోరు మూయించేదాన్ని.

దానికి స్నేహితులంటూ వున్నారా అని? అసలు యిది ఎవరితోనైనా మాట్లాడుతుందా? అని యోచించి యోచించి ఆశ్చర్యపోయేదాన్ని.

కడిగితుడిచినట్లుండే ఆ నుదిటిమీద బొట్టు పెట్టుకుంటే కొంప మునిగిపోతుందా - అనుకునేదాన్ని. పోనీ ఓ శుక్రవారం నాడైనా తలలో రెండు పువ్వులు పెట్టుకో కూడదా అని ఆత్రపడేదాన్ని. పెళ్లిగాని పిల్ల పువ్వులంటే దీనికి యిష్టం ఎందుకు

లేదు? ఎవరైనా యిలాంటి పిల్ల వుంది అని చెబితే నమ్మి వుండేదాన్ని కాదు. కాని యిది అల్లాంటి పిల్లే!

అది వాకింగ్‌కి వెళ్తుంటే, మొగపిల్లవాడిలాగా లక్షణంగా వుద్యోగానికి వెళ్తుంటే చూసి గర్వంతో పొంగిపోయాను. నా గర్వభంగం అయింది. నా సంతోషం చూసి ఆ భగవంతుడికి కళ్లకుట్టాయి. అయిపోయింది. అంతా సర్వనాశనమయిపోయింది.

నా కూతురు ఎటువంటిదో పూర్తిగా తెలిసివచ్చింది. ఈ నిజం నిప్పులాగా నన్ను కాలుస్తున్నది. నలుగురిలో తల ఎత్తుకు తిరగలేను. నలుగురికీ నా మొహం చూపలేను.

గణేశన్ యింతకు ముందే వచ్చి వెళ్ళాడు. వాడు అడిగిన ప్రతి మాటా - నా గుండెల్లో యీటెలవలె గుచ్చుకున్నాయి. దించిన తల ఎత్తలేకపోయాను. ఒక్క దానికీ బదులు చెప్పలేక, తల వంచుకుని ఏడ్చాను. నేను ఏడుస్తే దానికేం? లెక్కా ఏమన్నానా? ఒకో సమయం ఒక్కొక్కరివల్ల యిలా ఏడవమని భగవంతుడు నా నుదుట రాసి పెట్టాడు కాబోలు!

ఇలా జన్మంతా ఏడవడానికి నేనేం గంపెడు పిల్లల్ని కన్నానా? ఏడుగురినా - ఎనిమిది మందినా? ఒక్క కొడుకూ - ఒక్క కూతురూ. ఈ కూతురు చెయ్యరాని వెధవ పనులన్నీ చేసివస్తుంది - ఈ కొడుకు అడగరాని మాటలన్నీ అడుగుతుంటాడు. నేనేం చెయ్యను?

దీనిని గురించి ప్రతివాడూ అన్నవన్నీ నిజాలవుతున్నప్పుడు, నేను బ్రతికేం ప్రయోజనం? ఈ ప్రాణం వుండి ఏం లాభం? అనిపిస్తూంటుంది.

ఈ పిల్ల బుద్ధిపూర్వకంగా చెడిపోతోందని నాకు భయంగా వుంది. ఇదివర కెప్పుడో, ఏదో ఆ క్షణంలో దీనికేదో పిచ్చిబట్టి, ఆ పని చేసిందని సరిపెట్టుకున్నాను. కాని ఆ పిచ్చి యిప్పుడు దీన్ని వదలకుండా పట్టి పీడిస్తోంది. దీన్ని జుట్టు పట్టుకు ఆడిస్తోంది - ఇది ఆడుతోంది. దాన్ని అని లాభంలేదు. దీనికేదో పిచ్చిపట్టే వుంటుంది. లేకపోతే దీన్నిబుద్ధి యింత మందగించదు. నేను నా కళ్లరా చూసాను కాబట్టి నమ్ము తున్నాను. వేరే ఎవరైనా చెపితే చచ్చినా నమ్మివుండేదాన్ని కాదు.

వీధి మ్మాలెక్కి లోపల పాదం పెట్టినప్పటినుంచీ - మళ్లీ వీధి గుమ్మం దిగేదాకా గంగ కజ్జానికి కాలుదువ్వుతున్నట్లుగా వుంటుంది. ఏమాటంటే దెబ్బలాడుదామా అన్నట్లుగా వుంటున్నది దాని పద్ధతి. ఎవరన్నా చెబితే నేను నమ్ముతానా? అది బొట్టు పెట్టుకోదనీ, పెట్టుకుంటే బాగుండుననీ ఎన్నోసార్లు ఆశపడుతుండేదాన్ని. ఇప్పుడో! నాలుగైదు రంగుల్లో అదేమిటో ముద్దరలాగా మొహంమీద గుద్దుకుం టోంది. ఇది పిచ్చిగాక మరేమిటి. కనుబొమ్మలకి కాటుక రాసుకుంటోంది. మా వూళ్లో అమ్మవారికుండే కర్ణాభరణాలలాగా చెవులపక్కనుంచి జుట్టూ జులపాలలాగా వదులుతోంది. కుట్టించుకున్న జాకెట్లన్నీ కట్టకట్టి తీసుకెళ్లి ఆ దర్జీవాడిచేత బుజాలు

దాకా చేతులు పొట్టి చేయించుకుంది. కొత్తగా కుట్టించుకున్న వాటికి చేతులే లేవు. లోపల బాడీల్లావున్నాయి. ఎప్పుడూ యిలా వేసుకునేవాళ్లయితే ఎవరూ ఏమీ పట్టించుకోరు. దీనికి ఏదో కొత్తపిచ్చి పట్టింది. అందుకనే యీ వెర్రివేషాలు వేస్తోంది.

"అమ్మా యీమె నా స్నేహితురాలు" అని యింతవరకూ ఒక్క ఆడపిల్లనైనా యింటికి పిలుచుకునిరాలేదు - అని నాలో నేను పొంగిపోయేదాన్ని. పోయననెలలో ఎవరో ఒక లావుపాటి పొట్టివాణ్ణి తీసుకొచ్చి, సరాసరి లోపలకే తీసుకొచ్చి సోఫాలో కూచోబెట్టింది. ఆ వచ్చినవాడు రైలు యింజనులాగా గుప్పు గుప్పున సిగరెట్ పొగ వదుల్తున్నాడు. ఒకటే వాసన. ఇల్లంతా చుట్టబెట్టేసింది. దాని స్నేహితుడట. ఏజాతి వాడో - ఏకులంవాడో! తురకవాడయి వుంటాడా? కిరిస్టియనువాడేమో! లేక సూద్రుడో? ఇది యిలా చెయ్యడం న్యాయంగా వుందా?

అతన్ని సరాసరి యింట్లోకే తీసుకొచ్చిన తరువాత నేను చెయ్యగలిగేదేముంది? మర్యాదకోసమని ఏడ్చుకుంటూ - కాఫీ తీసుకొచ్చి అతని ఎదురుగుండా టేబుల్ మీద పెట్టాను. నాకు వొళ్లంతా సిగ్గుతో చచ్చిపోయింది. ఇది వాడికెదురుగా కూచుని, వాడికి సిగరెట్లు, కాఫీ చేతికందించి సేవలు చేస్తోంది. నేను లోపలనుంచి యిది చేసే వెధవపనులన్నీ గమనిస్తూనే వున్నాను. ఖర్మ కాఫీగ్లాసు చేత్తో పట్టుకుని కరుచుకు తాగుతున్నాడు. ఎంగిలిచేసేస్తున్నాడు గ్లాసుని. పైగా అదో ఫాషను కాబోలు వోగుక్క తాగేసి మిగతాది వొదిలేశాడు. నారోజు బాగుంది అతను వెళ్లిపోయాక అదే గ్లాసు తోమి కడిగిపెట్టింది. ఆ తరువాత పైన నీళ్లు చల్లి యింట్లో పెటు కున్నాను.

ఇప్పుడంతా వాకింగ్‌కి వెళ్లడం మానుకుంది. ఎలా వెళుతుంది? పొద్దువాలకుండా వీడొచ్చి కూచుంటాడే!

వాడి కారు వీధిలోకి వచ్చింది అంటే చాలు, ప్రతి యింట్లోంచి వీధి గుమ్మాల్లోనో కిటికీ వెనకనుంచో తొంగిచూస్తూంటారు. ఇదేదో పెద్ద వింతలాగా, కారు శబ్దం వినగానే ఆత్రంగా చూస్తూంటారు - వీధులో అంతాను.

సిగ్గు, లజ్జా అన్నీ అది పూర్తిగా వదిలివేసింది. తల పైకి ఎత్తుకుని పెద్ద ఘనకార్యం చేస్తున్నట్లు వాడు పిలుస్తేచాలు గుర్రంలాగా వెనకపడిపోతోంది. అదేదో గర్వించదగిన విషయంలాగా 'నాపేరు నేను పాడుచేసుకుని చూపిస్తాను చూడవే' అని శపథం పట్టినట్లు తిరుగుతోంది.

ఇప్పుడు నేనేం చెయ్యాలి? ఇది నాచెయ్యి దాటిపోయింది. పూర్వంలాగా దీన్ని యిప్పుడు కొట్టగలనా? తిట్టగలనా? గుప్పుచప్పుడు కాకుండా వెంకన్నయ్యకు ఉత్తరంరాసి పడేస్తాను. ఆయన మటుకు దీన్ని మార్చగలుగుతాడా? ఏమో!

ఆయన తరచు అంటూండేవారు. అలా అన్నపుడల్లా నాకు కష్టంగా వుండేది. 'నీ కూతురు గురించి యిలా అంటున్నానని బాధపడకు. దీనికి స్థిరమైన బుద్ధిలేదు. దీనికి కుదురులేదు" అని, ఆయన అలా అంటం అన్యాయం అనుకునే దాన్ని. కాని యిప్పుడిది న్యాయం అయిపోయింది. దీని గురించి ప్రతి ఒక్కరూ వాస్తవాన్నే చెప్పారు. నిజమే చెప్పారు.

ఈ దరిద్రపు పనులన్నీ కళ్ళారా చూడమని భగవంతుడు నానొసట రాసాడు. దీన్ని కన్నపాపానికి, ఈబురద నన్నుకూడా పూసుకోమని నా మొఖాన రాశాడు. కాబోలు.

నా తల్లీ నేనే ఏదో దారి చూసుకుంటాను. నేనే పోతాను తల్లీ. ఎక్కడికో ఒక చోటకి పోతాను. ఈచేసే వంటపని ఎవరింట్లో చేసినా పూటకింత తిండి, కట్టుకుందుకు రెండు చీరెలు యివ్వకపోతారా ?

ఛీ నేనెందుకిల్లా ఏడుస్తున్నాను? అది చేసే వెధవపనులని అడ్డగించడానికి అధికారం లేదని ఏడుస్తున్నాను. కన్నతల్లినన్న గౌరవం దానికి లేకపోయిందని ఏడుస్తున్నాను.

ఈరోజు అదిరాగానే తాడోపేడో తేల్చేస్తాను. "నేను యీ యింట్లో వుండటమో లేక ఎక్కడికైనా పోవడమో యీ రెంటిలో ఏదో ఒకటి నిశ్చయంగా తేలిపోవాలి" అని అప్పుడు కూడా తెమలకపోతే గణేశన్ చెప్పినట్లు దీని విషయంలో నేను చేతులు దులుపుకుని వూరుకుంటాను.

వాడు ఎంతెంత మాటలని వెళ్ళాడో !

పొద్దుట ఆఫీసుకు వెళ్ళిన దాన్ని యిప్పుడు యింటికి వస్తున్నాను. నిజానికి యీ రోజు కొద్దిగా ఆలస్యం అయిందనే వొప్పుకోవాలి. ముందు వాకిట్లో లైటువేసి, అమ్మ గుమ్మాలమీద కూచునివుంది. సాధారణంగా చేతిలో పత్రిక పుచ్చుకుని చదువుకుంటూంటుంది. ఈరోజు వుత్త చేతులతో కూచుని, ఆకాశంలోకి చూస్తూవుంది.

ఈరోజు నేను ఈయనింటికి వెళ్ళివస్తున్నాను. నన్ను డ్రాప్ చెయ్యడానికి ఈయన రాలేదు. మాటల్లో యీనాడు కాస్త ఎక్కువ తాగేశారు. నేనే రావద్దని చెప్పాను.

ఈ పెద్దకారుని డ్రయివర్ తోలుతున్నాడు. నేను వెనక సీట్లో కూచునివున్నాను.

"అదిగో లైటు వెలుగుతోందే, పెద్దావిడ కూచునివుందే - ఆ యింటి ముందు ఆపు" అంటూ అతనికి గుర్తులు చెప్పాను. అతను కారు ఆపి, దిగి, వెనక తలుపు తెరిచాడు.

"నేను వెళ్ళవచ్చునాండి" అని అడిగి నలామ్ పెట్టాడు.

కారు కదిలింది నేను మెట్లు ఎక్కుతుంటే - అదేమిటి? ముఖంమీద చెంగు కప్పుకుని అమ్మ వెక్కి వెక్కి ఏడుస్తోంది? నేనిప్పుడేం చెయ్యాలి? గమనించనట్లు

లోపలికి వెళ్లిపోనా? 'ఇదంతా ఏమిటి?' అంటూ కేకలెయ్యనా? ఎందుకమ్మా ఏడుస్తున్నావని వోదార్చనా?

నాకు ఏం చెయ్యాలో బోధపడడం లేదు. కాని అమ్మ యీ వయసులో ఒక పసి పిల్లలా ఏడుస్తుంటే చూడటానికి బాధగా వుంది. ఆమెని ఏమని పిల్చి ఓదార్చను? 'అమ్మా' అని పిలిచి పన్నెండు సంవత్సరాలయిందని యిప్పుడే నాకు గుర్తుకొచ్చింది.

తిరిగి చూశాను. ఎదురింట్లో కిటికీలోంచి తలకనబడుతోంది.

"ఎదురింట్లోంచి ఎవరో చూస్తున్నారు. ఏదన్నా చెప్పవలసివుంటే లోపలికొచ్చి చెప్పు" అని ముందు లైట్ 'టప్' న ఆర్పేసి లోపలికి వచ్చాను. అమ్మ వీధి తలుపు మూసి లోపల ఘడియపెట్టి, నా వెనకాతలే హాలులోకి వచ్చింది. వెనక్కి తిరిగి ఆమెను చూడటానికి నాకేదో భయంగావుంది. డ్రస్ మార్చుకోడానికి గదిలోకివెళ్లి లోపల ఘడియ పెట్టుకుంటున్నాను.

అప్పుడు అమ్మ అంది. "ఎదురింట్లోంచి ఎవరో చూస్తున్నారన్న విషయం యిప్పుడు మటుకే నీకళ్లకి కనిపించిందా?"

డ్రస్ మార్చుకుంటూ అద్దంలో నన్ను నేను చూసుకున్నపుడు నాకే నవ్వొచ్చింది. వేషంవేసుకుని ఆడుతారే – నేనూ వాళ్ల మాదిరే ఆడుతున్నాను.

ఇంతకంటే పతనం పొందటం నాచేత కాదు. 'చెయ్యలేని పనులు చెయ్యగలను' అన్నట్లుగా నడుచుకుంటున్నాను. అలా చెయ్యలేకపోబట్టే యిన్నాళ్లు నన్నందరూ తెలివి హీనురాలనని అనుకున్నారు. ఇప్పుడంతా నన్ను చూసి భయపడుతున్నారు. కాని అప్పుడుమటుకు నన్ను మంచి మనిషి అని ఎవరూ అనుకోలేదే! ఇప్పుడూ అనుకోవడం లేదు. అప్పుడు చెడిపోయిన మందబుద్ధి అనుకునేవారు. ఇప్పుడు బరి తెగించానని అనుకుంటున్నారు. చెడిపోయానని యిప్పుడూ అనుకుంటున్నారు. కానీ తెలివి హీనురాలినని మటుకు అనుకోవడంలేదు. నాకూ ఒక మొగవాడి అండవున్నదని - యిప్పుడందరికీ తెలుసు.

ఇప్పుడాఫీసులో నన్నెవరూ హేళనగా చూట్టంలేదు. వెకిలిగా నవ్వడంలేదు. నా వెనక హేళనగా, వెకిలిగా మాట్లాడుకుంటున్నారు. ఐ డోంట్ కేర్.

ఏం? నేనుమటుకు పుస్తె తెంచిపోసిన దానిలాగా, బోసిగావుండాలా? ఈ మొద్దువెధవలందరూ అవకాశం దొరికితే మిస్ బిహేవ్ చెయ్యక మానరనే భయంతో యిన్నాళ్లు యిలా పడివున్నాను. నాకిప్పుడు ఎటువంటి భయమూలేదు. ఎవరు ఎన్ని అనుకుంటే నాకేం?

"ఆయన నన్ను వుంచుకున్నాడు" అని అనుకుంటారు. మంచిదే అనుకోమను. అలా అనుకోవాలనే చేస్తున్నాను. అలా అనుకోవడం సహజం కూడాను.

కాని అటువంటి సంబంధం మామధ్య లేదని, నా మనసుకి తెలుసు. ఆయనకీ తెలుసు ఇది మిగతావాళ్ళకి తెలియనక్కరలేదు. అటువంటి అసహ్యమైన జీవితం గడపలేని స్థితికి ఆయనా పెరిగారు.

తననేదో ప్రేమించేస్తున్నాననే నమ్మకంచేతనూ, ప్రేమించకపోతానా అన్న ఆశతోనూ ఆరోజు నన్ను కలుసుకోడానికి వచ్చారు. నేను తనని ప్రేమిస్తున్నాననే భ్రమలో వున్నారనికూడా గ్రహించుకున్నాను. తనని మనస్ఫూర్తిగా ప్రేమించే మరో హృదయం కోసం ఆయన అలమటించి పోతున్నారు. అటువంటి మనసు యీయనకి - యీ జన్మలో లభించదు పూర్ సోల్ !

ఆయనని మనఃపూర్వకంగా ఒక ఆత్మీయుడైన స్నేహితునిగానే తలుస్తున్నాను. కొన్ని సమయాల్లో ఆయన పసిపిల్లవాడిలాగా, కొన్ని కొన్ని సమయాల్లో తండ్రిలాగానూ ప్రవర్తిస్తూ వుంటారు. ఆయన మంజుతో మాట్లాడుతున్నపుడు నేనీ విషయం గ్రహించగలిగాను. నాతో ఎంత వాత్సల్యంతో మాట్లాడుతుంటారో, అల్లాగే ఆ పిల్లదగ్గర కూడా మాట్లాడుతూంటారు. ఈయన భార్యతో మాట్లాడి పదేళ్ళయిందిట. దెబ్బలాడుకోవడం మాట్లాడుకోవడం అవదుగా. అది రోజూ వుండేదే! మనసువిప్పి మాట్లాడి పదేళ్ళయిందిట.

ఈయన కూతురు మంజు అంటే నాకు చాలా యిష్టం. రోజూ ఆఫీసునుంచి సరాసరి వాళ్లింటికి వెళుతుంటాను. ఆయన సీసా గ్లాసూ పుచ్చుకుని డాబామీద కొచ్చి కూచుని తాగడం ప్రారంభిస్తారు. నేనూ మంజూ మాట్లాడుకుంటుంటే అర్థం అయో - అవకో నవ్వుతుంటారు.

నన్ను కలుసుకున్నప్పటినుంచీ ఆయన క్లబ్‌కి వెళ్ళటంలేదుట. అది తలుచుకుంటే నాకేమిటో గర్వంగావుంది. నేనిప్పుడు చేసుకుంటున్న ఫాషన్సన్నీ మంజు దగ్గరే నేర్చుకున్నాను. మంజు స్టయిల్‌గా వుండటం నాకు నేర్పింది. నేను కూడా ఆనందంగా బ్రతకగలను, సంతోష ఆనందాలకి నాకూ ఒక మార్గంవుంది - ఆ మార్గం యిన్నాళ్ళకి తెలుసుకోగలిగాను — అనిపిస్తూంటుంది నాకు.

నేను వచ్చేటప్పటికి అమ్మ ఏడుస్తోంది. ఎందుకని అయివుంటుంది? గణేశన్ వచ్చివుంటాడు. ఆరోజున మా ఆఫీసు గుమ్మంలో ఈయన కారులో ఎక్కి కూచోవడం వాడు చూసాడు. 'బాగా చూడరా' అన్నట్లుగా ఎక్కి ముందుసీట్లో ఆయన పక్క కూచున్నాను. వాడు రోజూ సి. ఐ. డి. పనిచేస్తూ నన్ను వెంటాడుతున్నాడని నాకు తెలుసు. ప్రస్తుతం వాడు ఆ పనిని నెత్తిన వేసుకున్నాడన్న మాట. ఇంటికెళ్ళి వొదినతో నేను కారులో ప్రతివాడితోనూ పోతుంటానని చెపుతాడు. ఒకే స్టయిల్‌గా వుంది అని ఎలావున్నానో వర్ణించిచెపుతాడు. ఆవిడ నేను జుట్టు కత్తిరించుకుని, క్రాఫ్ చేసుకుని, గౌను తొడుక్కుని తిరుగుతున్నానని అందరి దగ్గరా చెపుతుంది.

చెప్పుకోని. వాడు చెపుతున్న ప్రతి ఒక్కటీ నేను చేసి చూపిస్తూంటాను. బాగా డ్రస్ చేసుకుంటే తప్పేమిటి? ఏం ఫాషన్‌బుల్‌గా వుండకూడదా? అది వారి వారి యిష్టాన్నిబట్టి, వాళ్ల వాళ్ల సౌకర్యాన్నిబట్టీ వుంటుంది.

గదితలుపు తెరుచు బయటకి వచ్చాను. ఈ అమ్మ నన్ను తేరిపార చూస్తోందా? చూడనీ – నేనూ చూసాను ఆవిడని.

"నువ్వు చేసేపని నీకేమన్నా బాగుందా?" గొంతుబిగబట్టి కోపంగా అడుగుతోంది అమ్మ. నేను ఏమీ బదులు చెప్పలేదు.

"ఇప్పుడు ఎవరో వీధిలో చూస్తున్నారని చెప్పావే వాళ్లు యిప్పుడే కాదు ఎప్పుడూ మనని యిలాగే చూస్తూవున్నారని నీకు తెలుసా?"

"చూడనీ" అన్నాను నేను.

"సాయంత్రం గణేశన్ నానామాటలూ అడిగిపోయాడు తెలుసా? కన్నతల్లినని మర్యాద వుండుంటే వాడు అలాటి మాటలు అడగగలిగేవాడు కాదు. నీ తిరుగుళ్ల వల్లనే వాడికింత అలుసయింది" మళ్లీ ఏడుస్తోంది.

ఆవిడ ఏడుస్తుంటే నాకు జాలిగావుంది. ఇవతలవైపుకి తిరిగి అన్నాను.

"గణేశన్ యివ్వాళేకాదు పదేళ్లనుంచి అంటూనే వున్నాడు. వాడు ఎప్పుడు నవ్యంగా మాట్లాడాడు గనక? దానికిప్పుడు ఏడుపెందుకు?"

"వాడు ఎప్పుడూ అంటూనేవుంటాడు. కాని నేను ఎప్పుడైనా నిన్నొచ్చి అడిగానా? నీమీద నాకంత నమ్మకంవుంది. వాడు కడుపుమంటతో అంటున్నాడని సరిపెట్టుకునేదాన్ని. కాని యిప్పుడు నీ వేషాలూ, నువ్వు చేసేపనులూ చూస్తుంటే నా కడుపు దహించుపోతోందే! నా కడుపు భగ్గుమంటోంది" అని కడుపుమీద గబ గబ కొట్టుకుంటోంది.

"నీ బుద్ధి చెడిపోయిందే - లేకపోతేయి ల్లాంటి బట్టలు కట్టుకుంటావా? అలాంటి జాకెట్టు వేసుకు తిరగడానికి నీకు సిగ్గుగాలేదా అని? నీకెవరూ స్నేహితులు లేరనుకున్నానే! నువ్వు నాశనమయి పోవడానికే వాడి స్నేహం చేస్తున్నావ్? అయినా ఒక మొగవాడితో ఆడదానికి స్నేహమేమిటని, ఇలా అర్ధరాత్రి అపరాత్రి వాడితో తిరిగి తిరిగి, వాడి కార్లో వచ్చిదిగితే చూసేవాళ్లు నానా మాటలూ అనరా అని? అది తప్పుడుపని కాదుటే? అన్నీ తెలుసున్నదానివి నువ్వే ఇట్లా తిరగడమా?" అంటూ ఏడ్చిఏడ్చి చెబుతుంటే - పళ్లు కరుచుకుని - మారు మాట్లాడకుండా నిలుచున్నాను.

"శనిగ్రహమా! నోరుతెరచి బదులు చెప్పవే! నాపాటికి నేను వాక్కుంటూ పోతున్నాను. నువ్వేమో రాయిలాగా నిలుచున్నావు. నన్నెక్కడికన్నా తరిమెయ్యవే - పోయి నా ఏడుపేదో నేను ఏడుస్తాను."

నేను అటువైపు తిరిగి చూసాను. ఇంకా 'అమ్మా' అని నోటితో అనలేదు. నేను షోకులు నేర్చుకున్నానని తిట్టిపోస్తోంది. ఆ విషయంతో యీవిడికేం పని. నేను చాలా శాంతంగా బదులుచెప్పాను.

"ఆ కారులో వచ్చే అతను ఎవడోకాదు. అతనే 'ఆ అతను'. మీ అన్నయ్య చెప్పాడే 'సమర్థతవుంటే వాడిని వెతికి పట్టుకొచ్చి ఇతనే నా భర్త, యితనితోనే కలిసి బతుకుతానని చెపితే మనం వద్దంటామా' అని. నా సమర్థతచేతనే పన్నెండేళ్ళ తరువాత ఆయన్ని వెతికి పట్టుకున్నాను. కాని మేము మొగుడూ పెళ్ళాంలాగా బతకటంలేదు. మేమిద్దరం స్నేహితులం మటుకే. ఆయనకి పెళ్ళి అయింది. పెళ్ళాం బిడ్డలున్నారు. పెళ్ళీడుకొచ్చిన కూతురుంది. ఆయనే యికనుంచి నాకు తోడూ నీడాను. నీకు లోకంగురించి తెలియదు. అందులో ఆకలిగొన్న ఎన్ని మొగపులులు కాచుకుని వున్నాయి, అదనుకోసం చూస్తున్నాయి. పొంచిపొంచి చూస్తున్నాయి" మామయ్య గురించి నాలిక చివరిదాకా వచ్చింది - అక్కడే ఆపేసుకున్నాను. నేను అంబుజం అత్తకు మాటిచ్చాను. అది తప్పకూడదు.

నా మాటలు అమ్మ నమ్మినట్లులేదు. ఆవిడ మొఖం చూస్తే తెలుస్తోంది. నమ్మటం లేదని. హేళనగా అడిగింది:

"అందుకని యిలా పైలా పచ్చీసుగా వేషం వేసుకు తిరుగుతావుటే, తిరుగు. సాటింపు వేసుకుంటూ తిరగవే. లోకానికంతకూ చెప్పుకుంటూ తిరుగు. నీవేషం, నీ పద్ధతీ యిదంతా నువ్వు చెప్పకుండానే లోకం తెలుసుకుంటుందే!

"షటప్ - (అరే నేను ఏం అన్నాను? ఇది నేను అనకూడని మాట. ఈ మాట అనివుండకూడదు. కాని అనేశానే) నువ్వు మాత్రం? నువ్వుండే పరిస్థితిని బట్టి వుంటున్నావా? ఇట్ యీజ్ వన్స్ వోన్ బిజినెస్ - గ్లాస్కోమల్లు రవిక వేసుకుంటున్నావే? రంగుచీరలు కట్టుకుంటున్నావే? నాన్న చచ్చిపోయినాకూడా జుట్టు వుంచుకున్నావే? వీటన్నిటి గురించీ వొదిన దెప్పుతూనే వుంటుంది. దీనినంతా ప్రపంచం అంటోంది అనే అర్థంచేసుకోవాలా?

అమ్మ అలానే దిమ్మరపోయి కూర్చుండిపోయింది.

ఈరాత్రి నేను భోంచెయ్యలేను. ఆమెని ఏడిపించి, ఆమె మనసుని నా మాటలతో గుచ్చిగుచ్చి పుండుచేసినందుకు ప్రాయశ్చిత్తంగా ఈరాత్రి వుపవాసం వుంటాను.

# 13

ఈయనే ఆ 'అతను' అని చెప్పిన తరువాత, నేను పనికట్టుకు యీయన్ని వెతకడం గురించి అమ్మ ఏమనుకుందో తెలియలేదు.

ఆరోజున మామయ్య ఆవిడ దగ్గర అంటున్నాడే - 'అతన్ని వెతికి పట్టుకుని యీడ్చుకునివచ్చి' . . .

ఆవిడ ఆనాడే అనివుండవచ్చునే. "ఏమిటన్నయ్యా యిట్లా అంటున్నారు? అతను ఎవరో ఏకులమో - ఏజాతో ఎల్లాంటివాడో? తెలివితక్కువతనంగా పిల్లది ఒక తప్పు చేసిందే అనుకో అందుకని దాన్ని అలా తరిమేయగలమా? మీరు చెప్పేది బాగాలేదు. ఇది వెతకనూవద్దు, పట్టుకుని తీసుకు రానూవద్దు" అని అమ్మ అప్పుడే అనివుండవచ్చునే? నోరు ఎత్తకండా ఎందుకు వూరుకుందో? ఆయన చెప్పింది సబబనే అనిపించివుంటుంది. అమ్మ దీనికి ఏం సమాధానం చెబుతుందో నని ఒక నిముషం ఆగి మరీ లోపలికొచ్చాను. ఆయన మాటలతో తను పూర్తిగా ఏకీభవిస్తున్నట్లూ ఆయన మాటలు న్యాయబద్ధంగా వున్నట్లూ మొహంపెట్టి మాట్లాడకుండా వూరుకుందే!

ఒకవేళ ఈవిడకూడా "ఈ మొద్దుకి అతన్ని వెతికి పట్టుకోగల తెలివిలేదు" అన్న నమ్మకంతో మాట్లాడక వూరుకుందా?

మామయ్యకు నా తెలివిహీనతమీద చాలా నమ్మకంవుంది. అదేమాదిరి 'అతని' అయోగ్యతమీద కూడా గొప్ప నమ్మకంవుంది. అతన్ని వెతికి పట్టుకో గలగడం నావల్లకాదనీ, ఖర్మం చాలక వెతికి పట్టుకుంటే 'ఛీ నువ్వెవరు?' అని అతను విదిలించుకుపోతాడనీ ఆయన వుద్దేశ్యం.

ఆ ధైర్యంతోనే మామయ్య అలా అనివుంటాడు. లేకపోతే అతని జాతి ఏమిటో, మతమేమిటో తెలుసుకోకుండా, అతనే నీభర్త అని చెప్పివుండడు.

ఒకవేళ అమ్మా - మామయ్యా యిద్దరూ యిది నమ్మకపోతే? ఈయన ఆ 'అతను' కాదు. ఇది ఎవడినో కొత్తగా అంటించుకొచ్చిన వుండు అయివుంటుంది - అని తిడతారా? తిట్టుకుంటే తిట్టుకోని.

నాకుమటుకు ఒక సమస్య తీరిపోయింది. ఇప్పుడు నాకు ప్రశాంతంగావుంది. హాయిగా, ఆనందంగాకూడా వున్నాను. నాకు ఏకొరతాలేదు, నేను చెడుదారిన నడవడంలేదు.

ఇలా ఎందుకు చేస్తున్నాను? ఎందుకని యిలా వున్నాను. అన్నది ఇతరులను బాధించే సమస్య. అది నా సమస్యకాదు. ఎవరు ఏమన్నా నాకు బాధ లేదు.

ఆఫీసులోనూ బయటకూడా మాగురించి ఏమనుకుంటూంటారో నాకు బాగా తెలును. వారు అలా అనుకోవడంలోనే నా విజయం యిమిడివుంది.

ఈయన చాలా మంచిమనిషి. ఈ కొద్ది రోజుల పరిచయంతోనే, నేనూ ఆయనా చాలా సన్నిహితులమయాము. ఇది మానసికంగానూ, స్నేహ పూర్వకంగానూ తప్ప లోకం అనుకున్నట్లు తప్పుడు దారినమటుకు కాదు.

ఆఫీసులో అందరికీ యిప్పుడిప్పుడే నేను నార్మల్‌గా వున్నట్లు తోస్తున్నది. మొదట్లో ఒకవారం రోజులపాటు రోజూ కార్లో తీసుకొచ్చి దించి, సాయంకాలంవేళ తిరిగి తీసుకెళుతూంటే - వీళ్లందరికీ ఆశ్చర్యంగానేవుంది. ఇప్పుడు అలవాటయి పోయింది. ఎవరూ అంతగా యీ విషయాన్ని పట్టించుకోవడంలేదు. పూర్వంలాగా కారు వచ్చేసరికి గుంపు గుంపుగా గుమిగూడి చూడటమూలేదు.

ఈనెలరోజులలో ఒక్కరోజు కూడా విడవకుండా - రోజూ వుదయం తొమ్మిది తొమ్మిదిన్నర అయేవేళకి యింటికొస్తున్నారు. నేను స్నానంగాని, భోజనంగాని చేస్తూంటే వచ్చేదాకా హాల్లో సోఫాలో కూచుని సిగరెట్టు కాల్చుకుంటూ నాకోసం కాచుకునివుంటారు. ఇక్కడ హాల్లో సిగరెట్ పొగవాసన రాగానే అమ్మకి వంటింట్లో మనసు గప్పున మండిపోతూ వుంటుంది. నేనేం చెయ్యను? నోరెత్తకుండా ఎటూ చెప్పలేక తలవంచుకుని వచ్చేస్తాను.

పోయినవారం సోఫాసెట్ మధ్యలో టీపాయ్ మీదవున్న ఆ యాష్ట్రేని పదిహేడు రూపాయలకి కొని తీసుకొచ్చాను. లేకపోతే ఆయన యిల్లంతా సిగరెట్ నుసి దులుపుతారు, ఎక్కడ కాల్చిన పీకెలు అక్కడ పడేస్తూవుంటారు. అలా వదిలేసి ఆఫీసుకి వెళ్లిపోవాలంటే మనసు వొప్పుకునేది కాదు. పాపం అమ్మకి యీ ఎంగిలి పీకలన్నీ ఎత్తిపోస్తుంది. అని.కష్టంగా వుండేది.

"మీరెళ్లి కార్లో కూచోండి. ఒక్క క్షణంలో వస్తున్నాను" అంటూ ఏదోపని వున్నట్లు లోపలికొచ్చి, గబగబ సిగరెట్ పీకలు ఏరి తుక్కుబుట్టలో పోస్తూవుంటాను. ఒకసారి అది చూసి "అయ్యో ఖర్మ - ఎవరి మొఖాన్నా ఏం రాసిందో" అంటూ అమ్మ నుదురు కొట్టుకుంది. అప్పుడే నాకు యాష్ట్రే తెచ్చి పడెయ్యాలనే ఆలోచన వచ్చింది. ఆ తరువాత యాష్ట్రే కొని తీసుకొచ్చి సోఫాసెట్టు మధ్య బల్లమీద పెట్టాను. "ఇది ఎంగిలి మంగలం - ఎంగిలిపీకలు వేసుకునేదాన్ని నట్టింట్లో పెడితే ఎవరన్నా చూసి ఏమనుకుంటారు?" అంటూ అమ్మ టేబుల్‌మీద పెట్టగానే నా ముఖంమీద అని, కదలకుండా చూస్తూ నిలుచుంది. ఆ తరువాత యాష్ట్రేని నా రూమ్‌లోకి తీసుకెళ్ళి పెట్టుకున్నాను. ఆయన రాగానే యిది ముందు హాల్లోకి వస్తుంది - ఆయన బయలుదేరగానే తిరిగి నా రూమ్‌లోకి వెళ్ళిపోతుంది.

ఇల్లా ఎన్నో విషయాల్లో నేను సరిపెట్టుకుంటూవచ్చి, యీరోజు మళ్లీ మొదటికే వచ్చేశాను.

ఈయనకి ఈ జీవితం అంటే చాలా చికాకనుకుంటా. ఆయన మాటల్లో చాలా సార్లు 'బోర్' అన్న భావం కనిపిస్తూంటుంది. నా స్నేహాన్ని ఉడుములాగా విడవకుండా పట్టుకున్నారు. ఏదో పేరుకు ఆఫీసంటూవుంది ఈయనకు. ఈ నెల్లాళ్లనుంచీ జాగ్రత్తగా ఆఫీసుకంటూ రోజూ వెళుతున్నారనుకుంటా. ఈయన పేరుకిమటుకే జాయింట్ మేనేజింగ్ డైరెక్టరనుకుంటా. ఆ మొగరాయుడులాంటి ఆడదానికి యీయన భర్త అన్న మర్యాదతప్ప ఆఫీసులో యింకేంలేదు. ఆరోజున ఆయన చెపుతున్నపుడు వింటానికి బాధగానూ, ఆయన పరిస్థితి జాలికరంగానూ అనిపించింది. చెక్కుల మీద సంతకాలన్నీ యీయన చేస్తారుట కాని వాటన్నిటినీ యింటికి తీసుకొచ్చి, భార్య కౌంటర్ సిగ్నేచర్ తీసుకుంటేగాని పాసవవు. ఇది విన్నపుడు బాధగా అనిపించినా, కొంచెం ఆలోచించిచూస్తే యీయన విషయంలో యీ ఏర్పాటు చాలా మంచిదే అయిందనిపిస్తుంది.

ఆ యింట్లో సుబాసు, బాబుతోపాటు యీయన కూడా మూడోపిల్లవాడిలాగా వుంటూవుంటారు. ఆయన భార్య పద్మకి యీయన ఒక 'స్పాయిల్ట్ ఛైల్డ్' ప్రతీక్షణం. ఈయన మిగతా పిల్లలని ఎక్కడ చెడగొట్టేస్తాడోనన్న భయంతో, ఆ పిల్లలిద్దరినీ, యీయన దగ్గరనుంచి దూరంగా, తండ్రి ప్రభావంనుంచి కాపాడుకుంటూ వస్తుందనుకుంటా.

ఆ యింట్లో ఎదిగిన మనుషులు యిద్దరే. ఒకరు పద్మ రెండు మంజు. ఈయన చెప్పినట్లు ఆ పిల్ల చాలా బ్రయిట్ గరల్. మంజుకి తండ్రిమీద ప్రేమే కాదు - సానుభూతికూడా వుంది. ఒక్కొక్కపుడు ఆ తండ్రీ కూతుళ్లని చూస్తుంటే - వీళ్ల తల్లీ కొడుకులా? ఇందులో ఎవరు పెద్ద అన్న సందేహం కలుగుతూంటుంది. తండ్రిని చిన్నపిల్లవాడిలాగా, వాత్సల్యంతో చూస్తుంది మంజు. తండ్రీ కూతుళ్ల మధ్యనున్న ప్రేమాభిమానాలు చూసి పద్మ అంతరాంతరాల్లో అసూయపడుతోందా- అన్న సందేహం కలుగుతూ వుంటుంది. తండ్రిని చాలాసార్లు డబాయించి చిన్న పిల్లవాడిని కేకలేసినట్లు, బెదిరిస్తూ వుంటుంది మంజు.

"చాలు యివ్వాళ చాలా తాగేశారు" అంటూ సీసాగ్లాసూ తీసుకుని వెళ్లిపోతుంటే ఈయన "ప్లీజ్ ప్లీజ్" అంటూ బ్రతిమాలుతూ, చేతిలోంచి సీసా లాగేసుకుంటున్నపుడు.

"దెన్ ఐ వోంట్ టాక్ టు యు" నేను నీతో మాట్లాడను, అంటూ కోపగించుకొని వెళ్లబోతుంటే....

వెళ్ళిపోతున్న కూతురివంక ఒకసారి, చేతిలో సీసావంక మరొకసారి జాలిగా, ఆశగా చూస్తూ "మంజు మంజు" అంటూ పిలుస్తూ ఆ పిల్ల వెనకాతలేవెళ్లి "ఇదిగో

చూడు అల్లాగే వుంది. నేను ఒక్క చుక్క కూడా ముట్టుకోలేదు. తీసుకెళ్లిపో - కోపంగావుంటే వొద్దులే" అంటూ ఆపిల్లచేతికి సీసా తిరిగి యివ్వబోతుంటే - - - -

ఆపిల్ల చిన్నగా నవ్వుతూ 'ఇట్ యీజ్ ఆల్ రైట్ - ఎ లిటిల్' అంటూ కొంచెం గ్లాసులో పోసి తానే సోడా కలిపియిస్తే, ఆయన తీసుకు థాంక్సు చెబుతుంటే - - -

ఆ యింట్లో ఈయనకి మించి పసిపిల్లవాడు యింకెవరూ లేరనిపిస్తుంది నాకు.

పదిహేను రోజులక్రితం వాళ్లింటికి నేను తొలిసారి వెళ్లాను. అది జ్ఞాపకం చేసుకుంటే తమాషాగా వుంటుంది. ఈయన నన్ను కలుసుకున్నప్పటినుంచీ తమ యింటికి రమ్మని పిలుస్తూనే వున్నారు. నాకేమిటో భయంగావుంది. అయినా ఈయనకి - నేను తన కూతురిని చూడాలనీ, ఆ పిల్లా నేనూ స్నేహంగా వుండాలనీ ఏదో వుబలాటం. ప్రతిసారీ యీ విషయం చెబుతూ నన్ను రమ్మని బలవంతం పెడుతూంటే, 'ఏం మనిషికన్న కూతురిని యిలా పొగిడేస్తున్నారు' అనుకునే దాన్ని. కాని ఆ పిల్లని కలుసుకున్నాక, చూసి మాట్లాడేక నాకు చాలా సంతోషం వేసింది. నిజంగా మంజు చెప్పుకోదగిన పిల్ల.

నాగురించి ఆ పిల్లకి ముందే చెప్పారనుకుంటా. ఏం చెప్పివుంటారో తెలియదు కాని అన్నీ తనకి తెలుసునన్నట్లు ఆ అమ్మాయి ప్రవర్తించింది. నేను సిగ్గుతో చిమిడి పోయాను. ఈ చిన్నపిల్లదగ్గిర మా మధ్య జరిగిందంతా ఆయన చెప్పివుంటారా?

నేను వాళ్లింటికి మొదటిసారి వెళ్లినపుడు మటుకే పద్మని చూడటానికి వీలయింది. నవ్వుమొఖంతో ఎదురొచ్చి, 'రండి - రండి' అంటూ లోపలికి తీసు కెళ్లింది. నాకేమిటో మనసులో సంకోచంగావుంది. నేను వస్తానని ఆయన ముందుగానే చెప్పివుంటంచేత, ఆవిడ నాకోసం ఎదురుచూస్తోంది.

డాబాలో వెన్నెల్లో డిన్నర్ ఏర్పాటుచేశారు. పొడుగ్గా టేబుల్‌వేసి, దానిపైన తెల్లటి టేబుల్‌క్లాత్ పరచి, రెండుపక్కలా వరసగా కుర్చీలువేశారు. టేబుల్‌కి పొడవులో ఎదురుబదురుగా మరో రెండు కుర్చీలు వేశారు. లాస్ట్ సీటులో పద్మ కూచుని, ఆమెకి ఎదురుగావున్న కుర్చీలో నేనూ కూచున్నాను. నాకు కుడిపక్క మంజూ బాబూ కుచున్నారు. పద్మకి కుడిపక్క సుభాష్ యీయనా కూచుని, పండువెన్నెలలో డిన్నరు ప్రారంభించాము.

ఈ యింట్లో ప్రతిదీ ఆడంబరంగానే జరుగుతుంది. మేము ఆరుగురం భోంచేస్తుంటే, నలుగురు వడ్డించారు. నేను నాన్‌వెజిటేరియన్ కాకపోవడం పద్మకు చాలా విచారం కలిగించింది.

"మీరు గుడ్డు కూడా తినరా? అంటూ నన్ను చూసి ఏదో విచారపడుతున్నట్లు

అడిగి, ఈ రోజుల్లో అందరూ, అన్నీ తింటం ప్రారంభించారు. నన్ను అడిగితే గుడ్డు తింటంలో తప్పులేదంటాను."

అందుకు ఆయన బదులు చెప్పారు. అప్పటికే ఆయన బాగా వేసినట్లున్నారు. మాటలు ముద్దగా వస్తున్నాయి.

"గుడ్డులో మటుకు ప్రాణం లేదా? ఈవిడకు సైన్సు తెలియదు. చలనం లేదు కాబట్టి దానికి ప్రాణం లేదనుకుంటోంది."

మంజు నవ్వుతోంది. ఈలాటి సమయాల్లోనే పద్మ భర్త మాటలని గౌరవంగా వింటుంది కాబోలనిపించింది. అది గ్రహించుకుని, కావాలనే తప్ప తాగినట్లుగా ఏదో ఒకటి అసందర్భంగా మాట్లాడుతూంటారీయన. భర్త మాటలు విననట్లుగా, ఆయన చెప్పేవి తనకి సంబంధించనట్లు, పద్మ జవాబు చెప్పలేదు. ఆయన వునికిని కూడా గుర్తించనట్లు అటు వైపుకి తిరిగికూడా చూడలేదు.

ఈయన చెప్పేవి వింటూ మంజు నవ్వుతుంటే, ఆవిడ నా వైపు చిరునవ్వుతో చూస్తూ, స్పూనుతో ఏదో తీసుకుని తింటోంది. ఆ తరువాత అయిదు నిముషాలసేపు ఆవిడ ఏం మాట్లాడలేదు. కాస్సేపటికి అదే విషయం గూర్చి మాట్లాడటం మొదలుపెట్టింది.

"సైన్సులో చెప్పేదే నేనూ చెపుతున్నాను. గుడ్లలో ప్రాణం వున్న గుడ్లు వుంటాయి, లేనివీ వుంటాయి. పౌల్ట్రీకి వెళ్లి అడిగి కొనుక్కోవచ్చు. ప్రాణంలేని గుడ్డు పొదిగినా పిల్ల అవదు. అది తింటం పాపం కాదుట.

"పాపం అని కాదు. నాకు అలవాటు లేదు. అంచేత తినను" అని బదులు చెప్పాను."

ఒక అయిదు నిముషాలు వ్యవధి యిచ్చి యీ విషయం చెప్పడం - ఆయన మాటలకు బదులు యివ్వడం కాబోలు. అనిపించింది. వెంటనే మాట్లాడితే యీయనకు సూటిగా జవాబు చెప్పినట్లు వుంటుందని, కాస్త ఆగి మరీ చెప్పింది ఆవిడ. యిలా అన్యాపదేశంగా చెప్పదలచుకున్న విషయం చెప్పెయ్యడం ఈయన పట్ల గౌరవంతో కాదనీ, యీయన పట్ల పూర్తి నిర్లక్ష్యమనీ తెలుస్తోంది. నేనింకో విషయం కూడా గమనించాను. ఈయన ఏదన్నా మాట్లాడితే ఒక అయిదు నిముషాలపాటు ఆమె నిశ్శబ్దంగా వుంటుంది. బదులు చెప్పదు - కల్పించుకుని మాట్లాడదు. ఇది అవమానకరంగా ఈ బుద్ధావతారం, అయామ్ సారీ ఈయన అనుకోవడంలేదు సరిగదా, మధ్య మధ్య ఏదో మాట్లాడుతూనే వున్నారు. ఆమెని విసిగించడంలో యీయనకు ఆనందం వుందనుకుంటా. ఈ మంజు మహాచెడ్డ పిల్ల. తల్లితండ్రుల మధ్యన జరుగుతున్న యీ ప్రచ్ఛన్న పోరాటాన్ని గ్రహించే

ఎరగనట్లు నవ్వుతూంటుంది. తనేదో ఘనకార్యం చేసినట్లు యీయన పొంగి పోతూంటారు.

పద్మని ఆ ఒక్కసారి కలుసుకున్నప్పుడే, నాకు ఆమె పైన చాలా వున్నతమైన అభిప్రాయం కలిగింది. ఆమె పిల్లలని చాలా జాగ్రత్తగా పెంచుకొంటున్నది. సుభాషూ, బాబూ డిన్నర్ అయిపోయేదాకా ఒక్కమాట మాట్లాడలేదు. ఒకసారి - మంజు నవ్వుతున్నపుడు వాళ్లు కూడా ఆ పిల్లతోపాటు నవ్వబోతే, పద్మ నేను చూడకుండా వాళ్లిద్దరి వంకా పరకాయించి చూసింది. దాంతో ఆ పిల్లలు నవ్వను కూడా లేదు.

డిన్నర్ ముగిశాక బాల్కనీలో కూచుని అందరం ఖబుర్లు చెప్పుకుంటున్నాము. ఆ యిద్దరు మొగపిల్లలు తల్లికి గుడ్ నైట్ చెప్పి, ముద్దు యిచ్చి, తండ్రిని లక్ష్యపెట్టకుండా వెళ్లిపోతూ, 'గుడ్ నైట్ ఆంటీ' అంటూ నాకు గూడా చెప్పి - లోపలికి పరుగెత్తారు.

ఈయన ఆ పిల్లలిద్దరూ తనని లక్ష్యపెట్టకండా వెళ్లిపోయారన్న విషయాన్ని గ్రహించినట్లు లేదు. మంజు కూడా లేకపోతే యీయన జీవితం ఎంత కష్టభాజన మయేదో! ఆ పిల్ల ఒక్కతే యీయన స్థితిని అర్థం చేసుకుని, చేరువగా వచ్చి ఆదరిస్తున్నది. ఆ విషయమైనా యీయన గ్రహించుకుంటున్నారో లేదో? ఈయనకి యిది స్పష్టంగా అర్థం అయినా కాకపోయినా, అంతరాంతరాల్లో ఎక్కడో తెలుసుననుకుంటా! ఆ పిల్ల చూపే వాత్సల్యం, మమత హృదయాన్ని సూటిగా స్పృశిస్తున్నాయనుకుంటా. అందుకే ఎప్పుడూ ప్రతి విషయానికీ 'నా డాటర్ మంజు - మంజు' అంటూ చెప్పుకుంటూ వుంటారు.

ఎప్పుడు చూసినా పద్మ పక్కన ఒక ట్రాన్సిస్టర్ పెట్టుకుని వుంటుంది. సినిమా పాటలంటే ఆవిడకు ప్రాణం కాబోలు. భోంచేస్తున్నంతసేపూ, మేము బాల్కనీలో కూచున్నంతసేపూ అది పక్కనుంచి సన్నగా పాడుతూనే వుంది. మాతో మాట్లాడుతూనే, ఆవిడ ఆ పాటలు విని ఆనందిస్తున్నది. ఇల్లూ సామానూ, యివి యింత దర్జాగా వున్న ఆవిడ మటుకు చాలాసింపుల్‌గా వుంది. ముక్కులకీ చెవులకీ పెట్టుకున్నవి నిజమైన రవ్వలే. అందుకు సందేహం లేదు. అవి కూడా చిన్నవిగా, ధగ ధగమంటూ అమరిగ్గా వున్నాయి. సదా తమలపాకులు నములుతూ వుంటుంది. కాని తాంబూల చర్వణంతో ఆ పళ్లు ఎర్రబడలేదు. తెల్లగా ధగ ధగ మెరుస్తున్నాయి. సినిమాల గురించి విపరీతంగా - మాట్లాడుతూంటుంది. నాకు వాటి గురించి ఏమీ తెలియదు. మంజూ ఆవిడా కలిసి తరుచు సినీమాలకి వెళుతుంటారు. కాని అన్ని సినిమాలకీ మంజుని తీసుకెళ్లదు. ఆ పిల్లకి అన్నీ నచ్చవు.

ఈయనకి తప్పించి ఆ యింట్లో అందరికీ ఏదో ఒక ప్రిన్స్‌పల్ అంటూ వుంది.

బాల్కనీలో కూచుని మాట్లాడుతుంటే, _ మ్ ఎనిమిదిన్నర కూడా అవలేదు. ఈయన సోఫాలో జారగిలపడి గురక మొదలుపెట్టారు. అది చూసి పద్మకు కోపం వచ్చిందని తెలుస్తోంది. అది బయట పడనివ్వకుండా, ఆ గురక నేను వినకుండా వుండటానికని ట్రాన్సిస్టర్ వాల్యూమ్ హెచ్చించింది. నేనూ ఆవిడ తృప్తికోసం, ఈయన వైపే తిరక్కుండా, ఏమీ ఎరగనట్లు ఆవిడతో మాట్లాడుతున్నాను.

నేను బాగా చదువుకున్న దాన్నీ ఆఫీసరుననీ ఆవిడకు నా పట్ల గౌరవాభిమానాలున్నాయి. అయినా కూడా "ఆయనకూ మీకూ ఎలా పరిచయం అయింది" అని అడుగుతుందేమోనని నాకు ఒకటే భయం. నా రోజు బాగుంది యీ క్షణం దాకా ఆ ప్రశ్న నన్ను ఎవరూ అడగలేదు.

నేనూ మంజూ కలుసుకున్నపుడల్లా ముఖ్యంగా ఈయన గురించే ఎక్కువగా మాట్లాడుకుంటూంటాం. ఈ పదిహేను రోజుల నుంచీ యించుమించు అన్ని సాయింకాలాలూ వాళ్లింటికి వెళుతూనే వున్నాను. మంజూ నేనూ ఖబుర్లు చెప్పుకుంటూంటాము. ఎనిమిదిన్నరకల్లా నేను వెళ్లడానికి లేస్తాను. వీలుంటే యీయన దిగబెడతారు. లేకపోతే డ్రయివరు వచ్చి దిగబెట్టి వెళతాడు.

మంజు తండ్రిని బాగా అర్థం చేసుకుంది. తల్లిని కూడా అర్థం చేసుకుందనే చెప్పాలి. కాని ఆ పిల్లకి తండ్రంటేనే సానుభూతి, ఆయన వైపే ఆ పిల్ల మొగ్గుతుందని మాటలబట్టి గ్రహించుకున్నాను. తల్లి తన తండ్రిని ఆవిధంగా తీసిపారేసినట్లు, చులకనగా చూడటం ఆపిల్లకి కష్టంగానేవుంది. కాని యింతకిమించి మరో దారిలేదని కూడా ఆ పిల్లకు తెలుసు.

నిన్నో మొన్నో చెప్పింది. ఈయనతో కలిపి మంజుని బయటికి పంపడానికి తల్లి వొప్పుకోదుట. ఆయనతో వెళ్లనివ్వదుట. అసలు తండ్రితో మాట్లాడటం యిప్పుడిప్పుడేనట. అదికూడా ఒక్క మంజుకే చనువట. మిగతా పిల్లలని ఆయన దగ్గరకు వెళ్లనివ్వదుట. ఈ విషయం చెప్పినపుడు మంజు తల్లి కఠిన ప్రవర్తన చూసి కష్టపడుతోంది అనుకున్నాను. ఆ తరువాత, తల్లి చేసిన పని ఎట్లా సమర్థనీయమైనదో కూడా మంజే చెప్పుకుంటూ వచ్చింది.

ఒక రోజున యీయన తాగుతున్నపుడు సుభాష్ ఆయన గదిలోకి వెళ్లాడుట. ఈ మనిషి ఆ పసిపిల్లవాడికి తను తాగేది గ్లాసులో పోసిచ్చి 'తాగరా వంటికి మంచిది' అంటూ ఖబుర్లు చెప్పి, వాడిచేత తాగించి, తమాషా చూద్దామని బాగా గ్లాసు మీద గ్లాసు తాగించారుట బలవంతాన. పాపం కుర్రవెధవ తల గిర్రున తిరిగి, వూక్కుంటూ తల్లి గదిలోకి పోయి భళ్లున తాగిందంతా కక్కిపోశాడు. "నాన్నేగదా

తాగమని యిబ్చారు" అంటూ ఏడుస్తున్నాడు. అదేదో పెద్ద హాస్య సంఘటనలాగా వాడి ముందుకొచ్చి నిలుచుని, 'హా - హా' అంటూ నవ్వడం మొదలుపెట్టారుట ఈయన. ఇది చూస్తున్నపుడు కన్నకడుపుకి ఎలా వుంటుంది? అప్పుడు కూడా పద్మ యాయన్ని పల్లెత్తు మాట అనలేదు, తలఎత్తి చూడలేదు. ఆయనముఖం వైపు చూడలేదు. సుభాష్‌ని మటుకు బావబాదిందట. లేకపోతే యాయన్ని కొట్టి దండించలేదు కదా? పిల్లవాడి వీపుమీద చారలు చారలుగా పడి పొంగిన తన వేళ్ల గుర్తులు చూసి రాత్రి తెల్లవార్లూ వాడి తల నిమురుతూ, తల్లి అలా ఏడుస్తూనే కూచునుంది అని మంజు చెప్పింది.

క్లబ్‌లో పేకాటలో ఒకోసారి సాయింత్రం అయేసరికి వెయ్యిరూపాయల దాకా వోడిపోతూంటారుట ఈయన. ఆ సమయంలో తనచేతిలో డబ్బు లేకపోతే, పద్మను అడగడానికి భయపడి, ఆవిడ బీరువాలోంచి తీసి యివ్వమని మంజుని అడుగుతూంటారుట.

"రాత్రి - ఆ డబ్బంతా తెచ్చిస్తాను. మీ అమ్మకు తెలియకుండా తిరిగి పెట్టేద్దాం" అని బతిమిలాడుకుంటారుట. ఈ విషయం నాదగ్గర మంజు నవ్వుతూ చెప్పింది. "సుబాషూ, బాబూ నాన్నకి ఎక్కడ చేరిక అయిపోతారో అని నాకు భయంగా వుంటుంది, మీరే చెప్పండి హౌ మమ్మీ యీజ్ రాంగ్."

మంజుకి నేనంటే యిష్టమొక్కటే కాకుండా, రోజూ సాయంకాలం వేళ వాళ్లింటికి రమ్మని పిలవడానికి మరో కారణం కూడా వుంది. నేను అక్కడికి వెళుతున్న యిన్ని రోజుల నుంచీ ఆయన క్లబ్ సంగతి మర్చిపోయారు.

నేను ఆ విషయం తెలిసి చాలా సంతోషపడ్డాను. నా అమాయకత్వాన్ని ఆధారంగా తీసుకు ఈయన నా జీవితాన్ని చెడగొట్టారు. అయినప్పటికీ నేను నా మంచితనం వల్లనేమీ, సమర్థత వల్లనేమీ యీయన జీవితాన్ని ఒక సక్రమ మార్గాన నడప గలిగితే నాకు యింకా సంతోషం కలుగుతుంది.

మా యిద్దరి మధ్యానున్న యీ అభిమానం, స్నేహం యివి నామటుకు నాకు ఏ హద్దుల్లో వుండాలో నిశ్చయంగా తెలుసు. ఈ స్నేహం గురించి నేనొక అభిప్రాయానికి ఎప్పుడో వచ్చేశాను. ఆయన కూడా అది గ్రహించుకుని వుంటారు.

ఆ మొదటి రోజున, మేము అయిలాండ్ గ్రౌండ్‌లో కలుసుకోవాలని నిర్ణయించుకున్నామే ఆరోజు, ఈయన మనసులో నా మీద కోరికతోనే వచ్చి వుంటారు. నాతో మాట్లాడిన తరువాత, నాతో బాగా పరిచయం అయాక ఆయన మనసులోని ఆ కోరిక పూర్తిగా నశించి పోయింది.

పద్మ పక్కన బ్రతుకుతూ యీయన పూర్తిగా తన వ్యక్తిత్వాని కోల్పోయి, పిరికివాడు, వ్యర్థుడూ అయారు. సహజమైన దేహికవాంఛనీ, మానసికమైన దుర్బల

తనీ కట్టుకోలేక కనపడ్డ స్త్రీల వెనకపడి, వెళ్లరాని చోట్లకంతా వెళుతున్నారు. వేరు మార్గంలేక ఆయన యీపక్కదార్లు తొక్కుతున్నారు - అంతవరకూ వొప్పుకోవచ్చు. నా పట్ల ఆయన అటువంటి ఆశను అనాడే చంపుకుని, నాయిష్ట ప్రకారం మా స్నేహాన్ని కొనసాగించేందుకు సిద్ధమయ్యారు. ఆయన ఎక్కడ తిరిగితే నాకేం!

కొన్ని సమయాల్లో ఈయన నన్ను తీసుకొచ్చి విడిచాక తమ యింటికే నరానరి వెళుతున్నారనుకోను. ఎందుకంటే వస్తూ కారులో సీసా తీసుకు మరీ బయలుదేరుతున్నారు. ఎందుకు? ఎక్కడికో వెళ్లి రాత్రంతా గడుపుతారనికదా - దీనికి అర్థం! అయినా నేను ఆ విషయాలు ఎప్పుడూ అడగలేదు. నాకెందుకు? ఎక్కడెక్కడ తిరిగితే నాకేం?

నాకేం పోయిందా? అయ్యో నేనేం కోల్పోతున్నానో నాకిప్పుడిప్పుడే అర్థం అవుతోంది. నన్ను యింటి దగ్గిర దించడానికని బయలుదేరిన మనిషి మరునాడు వుదయానికి గాని యిల్లు చేరుకోకపోతే మంజు నాగురించి తప్పుగా అనుకోదా? ఈయన ఎక్కడికో వెళ్లి రాత్రంతా గడిపారని అనుకుంటారా? నాదగ్గిర రాత్రంతా వున్నారనుకోరా? మిగతావాళ్ళు ఎలా అనుకున్నా ఫరవాలేదు. గాని మంజు నా గురించి ఆవిధంగా అనుకోకూడదు. అలా అనుకునేందుకు నేను అవకాశం యివ్వకూడదు. ఇటువంటివాటిలో నాకేం సంబంధంలేదని నేను ఎలా సరి పెట్టుకోను? ఈ విషయం గురించి ఆయనతో మాట్లాడుతాను.

ఏమని చెప్పను? ఎలా చెప్పను? ఛీ యిలాంటి విషయాల గురించి కూడా నేను మాట్లాడాలా? నాకు ఒకటే గాబరాగా వుంది. రాత్రి నేను భోజనంకూడా చెయ్యలేదు. అమ్మ మనసుకి బాధ కలిగించినందుకు ప్రాయశ్చిత్తంగా రాత్రి అన్నం తినలేదు. కడుపులో ఎలాగో వుంది. నిద్ర రావడంలేదు. ఎప్పుడు తెల్లవారుతుందా ఎప్పుడు కాఫీ తాగుదామా అని వుంది.

అమ్మని సముదాయించేందుకు ఏదన్నా మాట్లాడనా? అమ్మ ఏడుపు తలుచుకుంటే నాకు జాలిగా వుంది.

మాట్లాడకుండా వుండే నాలిక మాట్లాడటం మొదలుపెట్టి ఏదేదో వాగింది.

తెల్లవారు ఝామున కొంచెం నిద్ర పట్టినట్లుంది. బయట వెలుతురు వచ్చింది. అమ్మ కాఫీ చేసివుంటుంది.

బాత్‌రూమ్‌లోకి వెళ్ళి పళ్లతోముకుని, టవల్‌తో ముఖం తుడుచుకుంటూ, వంటింట్లోకి వెళ్లిచూశాను. అమ్మ కనుపించలేదు పొయ్యి రాజేసి లేదు. పాలు తీసుకున్నవి, తీసుకున్నట్లే వున్నాయి.

బయట తలుపు తెరిచి చూద్దామని వెళ్లాను. నారోజు బాగుంది. బయట తాళం పెట్టివెళ్లింది. తిరిగి వస్తుందన్నమాట.

అదిగో వస్తోంది, తలుపు తెరుస్తున్న శబ్దం వినిపిస్తున్నది. నాకు కోపంగా వుంది. నేలమీద పడున్న ఆనాటి పేపరు ముఖానికి అడ్డు పెట్టుకున్నాను. ఆవిడ ఎక్కడికి వెళ్లివస్తోందో? కొట్టుకెళ్లి వస్తోందా అని - చూశాను.

'అయ్యో' అన్న శబ్దం నాకు తెలియకుండా నానోటంట వచ్చేసింది. ఆవిడని చూడలేక మొఖం దాచుకున్నాను.

తడిసిపోయిన ఒక తెల్లచీరెచుట్టుకుంది. ఆ తడిచీరెలోంచి నీళ్లు బొట్లు బొట్లుగా నేలమీద పడుతున్నాయి. వంటిమీద రెవిక లేదు. తలమీద జుట్టు లేదు. తల వెంట్రుకలు పూర్తిగా తీయించేసుకుని, నెత్తి మీద ముసుగు వేసుకుని వచ్చి నిలుచుంది.

చాలా శాంత స్వరాన చెప్పడం మొదలుపెట్టింది. "ఇప్పుడేమయిందని? నేనసలు యిలాగేగదా వుండాల్సింది? మాఅమ్మ, అత్తగారు అందరూ యిలాగేగదా వున్నారు? చాలా రోజులబట్టి నేనే అనుకుంటున్నాను. అది నీనోటంట రావాల్సివుంది. నేను కోపంతో యీ పని చెయ్యలేదు. ఇంకా పెందరాడే వెళ్లివద్దామనుకున్నాను. వుండు కాఫీ కాచి తీసుకొస్తాను" తడి చీరెను పిండుకొంటూ అన్నది.

సాయంకాలం వస్తూ గ్లాస్కో తానొకటి కొనుక్కొని రావాలనుకున్నాను.

అమ్మని ఆరూపంలో చూసేటప్పటికి నాకు ఏడుపు రాలేదు. కాని ఏదో గాఢగా అనిపించింది.

## 14

మంజు కాలేజీనుంచి యింటికి వచ్చిన అరగంటలో గంగ ప్రభూ యిద్దరూకూడా యిల్లు చేరుకుంటారు. సాధారణంగా మంజు ఎనిమిదింటికి తన క్లాసుపాఠాలు చదవడం ఆరంభిస్తుంది.

మొదట్లో గంగ వచ్చేప్పటికి మంజు తన చదువు సంబంధమైన విషయాలు ఎత్తేదికాదు. కాని యిప్పుడు చదువు విషయాల్లో గంగ సహాయం పొందుతూంటం వల్ల సాయంత్రం ఆరు అయేసరికి చదవడం ప్రారంభిస్తోంది. ఇదివరలో మంజుకి క్లాసుపుస్తకాలు చదువుతున్నపుడు ఏవన్నా సందేహాలువస్తే, తెలియని విషయాలు చెప్పించుకునేందుకు యింట్లో ఎవరూ వుండకపోవడంచేత, తన స్నేహితురాలికెవరికయినా ఫోన్‌చేసి అడుగుతుండేది. పాఠంలో వచ్చిన సందేహాలు అడిగేందుకయితే ఫోన్‌చేసేదికాని, ఖబుర్లు ఇటూ అటూ అన్ని విషయాలపై తిరిగి, పక్కా గంట ఫోన్‌లో మాట్లాడి అసలు విషయం మర్చిపోయి, అడగాల్సింది అలాగే

మిగిలిపోతూండేది. దాంతో ఆ రోజుకి పాఠాలు కట్టిబెట్టేసి, హాయిగా పడుకుని నిద్దరపోయిన రోజులుకూడా వున్నాయి.

ఈ యింట్లో అందరికంటే ఎక్కువ చదివిందీ, చదువుకుంటున్నదీ మంజు ఒకతే అవడంవల్ల ఆ పిల్ల సందేహాలు తీర్చేవాళ్లు వుండేవారుకాదు. గంగ వచ్చిందంటే ఆ అమ్మాయి మనసులో సందేహాలు, ప్రశ్నలు, తెలుసుకోవలసిన విషయాలు యివన్నీ వరసగా ఒకటి తరువాత ఒకటి ఎలా అడిగి తెలుసుకోవాలో కూర్చి పెట్టుకునేది. గంగకూడా ఆపిల్ల ఎన్ని విషయాలు అడిగినా, వాటన్నిటికీ వివరంగా లెక్చరర్ చెప్పినట్లు తడుముకోకుండా, నిదానంగా, ఆ పిల్లకు అర్థమయేట్లు విడమరిచి చెప్పేది. ఒక్కసారికూడా 'నాకు తెలియదు' అని తడబడి ఎరగదు. క్లాసులో లెక్చరర్స్ చెప్పినపుడు అర్థంగాని విషయాలు కొన్ని గంగచేత చెప్పించుకుని అర్థంచేసుకునేది మంజు.

ఇప్పుడు గంగ మంజుకి ట్యూషన్ చెప్పే ట్యూటర్‌లాగా వాళ్లింటికి వచ్చి వెళుతోంది.

సాయంకాలంపూట గంగ వచ్చేదాకా ఎదురుచూస్తూవుంటుంది మంజు. ఆమె రాగానే తన రూమ్‌కి తీసుకెళ్లిపోతుంది. ఆమె తన రూమ్‌లో వున్నపుడే మరునాటి పాఠాలకి కావలసిన వర్కంతా పూర్తి చేసుకుంటుంది.

ఆ యింట్లో మేడమీద వున్న మూడు గదుల్లో ఒకటి పద్మది - రెండోది ప్రభుది, మూడోది మంజుది. మిగతావారికి ప్రత్యేకంగా కిందభాగంలో ఎవరి గదులు వారికున్నాయి.

మంజుగది శుభ్రంగా దుమ్ము ధూళి లేకుండా పరిశుభ్రంగా అమర్చినట్లుంటుంది. పుస్తకాలన్నీ పొందిగ్గా అమర్చి చదువుకునే పిల్ల గదిలావుంటుంది. ప్రభుగదిని వరండాలో నిలుచున్నపుడు గంగ రెండు మూడుసార్లు చూసింది. అక్కడినుంచి చూస్తున్నపుడు ఆ గదిలో సామాను చిందరవందరగా పడివుండటం గమనించింది. ఒకోసారి మంజు తండ్రిని సామాను సుభ్రంగా వుంచుకోలేదని అదమాయిస్తుంది. అప్పుడు మటుకు అతను గదిలో సామాను జాగర్తగా సర్దివస్తూంటాడు.

పద్మగది ఏర్‌ఖండీషన్ చేయబడింది. అది ఎప్పుడూ మూసేవుంటుంది. అంచేత ఆ గది ఎలా వుంటుందో గంగకి తెలియదు.

గంగని తీసుకొచ్చి యింట్లోదించి, ప్రభు స్నానం చెయ్యడానికి వెళ్లాడు. స్నానం చేసి బట్టలు మార్చుకు రావడానికి అతనికి పక్కా గంటసేపు పడుతుంది. కొన్ని సమయాల్లో బాత్‌రూమ్‌లోని 'టబ్' లో పడుకుని స్నానంచేస్తూ అతను చేసే శబ్దాలతో యిల్లు ప్రతిధ్వనిస్తూంటుంది. 'లాలా' అంటూ సంగీతంకూడా పెద్దగా పాడుతూంటాడు. అది విని గంగ తనలో తాను నవ్వుకుంటూ వుంటుంది. ఒకోసారి

మంజు బాత్‌రూమ్ దగ్గిరకెళ్ళి, నెమ్మదిగా పాడుకోమని మందలిస్తూవుంటుంది.

మంజుకి పాఠాలు చెప్పడంలోనూ, ఆ పిల్లకి చదువు విషయంలో వచ్చే సందేహాలు తీర్చడంలోనూ గంగకి పొద్దుతెలిసేదికాదు. సాయంత్రాలు యిట్టే గడిచిపోతున్నాయి. అప్పుడప్పుడు ఆపిల్లతోపాటు గంగ కారెక్కి బీచ్‌కనీ, హోటల్‌కనీ వెళుతూవుంటుంది. ఆ పిల్ల ఏన్సియెంట్ హిస్టరీ, మోడరన్‌హిస్టరీ రెంటినీ ఒకదానితోనొకటి పోల్చి మాట్లాడుతుంటే, గంగకి తన కాలేజీరోజులు జ్ఞాపకం వస్తూంటాయి. అనాడు తను నేర్చుకున్నవన్నీ ఈనాడు యీ పిల్లకు చెబుతూంటుంది.

ఒకగంటసేపు అయాక, చేతిలో సీసాలువున్న పెట్టె పట్టుకుని ప్రభు బాల్కనీలోకి వచ్చి కూచుంటాడు. గంగ మంజు గదిలోంచి మర్యాదకోసం బయటకొచ్చి అతనికి సాయంగా మరోకుర్చీలో కూచునివుంటుంది.

ఏదో తలవంచుకుని రాసుకుంటున్న మంజు గొంతుఎత్తి 'మిస్ గంగా ఒక నిమిషం' అంటూ ఏదో సందేహంవచ్చి పిలుస్తుంది. వెంటనేలేచి ఆ పిల్ల దగ్గిరకెళ్ళి సందేహానికి వివరంగా సరిఅయిన సమాధానంచెప్పి, తిరిగి బాల్కనిలో కొచ్చి అతనికి పక్కన కూచుంటుంది.

'మిస్ గంగా ఒక సందేహం' అని పిలిచినపుడల్లా, ఆ పిల్ల ఏమడుగుతుందోనని గంగకి భయంగా వుంటుంది.

"మీకూ నాన్నకీ ఏం సంబంధం? మానాన్న మీకెలా తెలుసు?" అని అడగబోతుందా? అలా అడిగితే ఏం బదులు చెప్పాలి? అని కళవెళ పడుతూంటుంది గంగ.

పద్మా మంజూ వారిద్దరూ తన గురించీ, తన రాకపోకల గురించీ ఏమనుకుంటున్నారో? పద్మ తనని తేలిగ్గా అనుకుంటుందా? తనగురించి నిర్లక్ష్యంగా వుంటున్నట్లు గ్రహించుకుంది.

ఆమె తన మనసులో తనని పద్మస్థానంలో వూహించుకుని, తనని ఎలా అవమానించవచ్చో వూహించుకుంటుంది.

ఎన్ని అవమానాలయినా భరించడానికి తను సిద్ధంగావుంది. తనకి యివేమీ అంటవు, అని మళ్లీ తనకుతాను ధైర్యం చెప్పుకుంటూ వుండేది.

ఆదివారాలువస్తే గంగా మంజూ యిద్దరూ కలిసి పగలంతా ఒక్క చదువులూ పాఠాలేగాక మిగతా ఎన్నో విషయాల గురించి చర్చిస్తూ గడుపుతూంటారు. రేడియోగ్రాములో పాటలు వింటుంటారు. షాపింగ్‌కి వెళుతూంటారు. వాళ్లతో కలిసి ఒక సినిమాకి కూడా వెళ్లింది గంగ.

ఈ కుటుంబంతో యింత స్నేహంగా, సన్నిహితంగా వచ్చినా పద్మమటుకు

గంగ విషయంలో దూర దూరంగా ముభావనగా వుంటుంది. గింగకూడా పద్మ వట్ల గౌరవంతో జాగర్తగా వుంటుంది.

అర్. కె. వి. కథలగురించిగాని, తాను ఆయనను కలుసుకున్న విషయంగాని, ఈ మంజు అర్. కె. వి. అభిమాని అన్న విషయం తనకు తెలుసుననిగాని, యివేమీ తెలియవన్నట్లు ప్రవర్తిస్తుండేది గంగ.

"మీరు అర్. కె. వి. కథలు చదువుతూంటారా? ఆయన కథలంటే నాకు చాలా యిష్టం. 'అగ్నిప్రవేశం' చదివారా? అది ఒక్కటే నాకు నచ్చలేదు. మిస్ గంగా, మీకు తెలుసా అతను మాకాలేజి లైబ్రరీలో అటెండరుగా వున్నారు"

ఈ అమ్మాయి గభాలున అర్. కె. వి. విషయం ఎందుకు ఎత్తుతున్నదో వూహించ లేకపోతున్నాను. పైగా ఆ కథ గురించే చెబుతోంది; బ్రతికాను ఆ కథ తనకు 'నచ్చలేదు' అని అంటోంది 'అలాటివి నీకు నచ్చక్కరలేదు' అని మనసులోనే అనుకున్నాను. తమ కాలేజీలో ఆయన లైబ్రరీలో అటెండరుగా వున్న విషయం నాకు తెలిసినట్లు ఒప్పుకోనా? లేక తెలియనట్లు ఊరుకోనా? ఎటూ నిశ్చయించుకో లేకుండా వున్నాను. అదేకాలేజీలో నేనూ చదివిన విషయం ఈ పిల్లకు తెలుసా? తెలియదా? ఆ విషయం తెలియబరచవచ్చా కూడదా? ఈయనకీ నాకూ ఏవిధంగా పరిచయం అయిందీ వీళ్లకి చెప్పారా లేదా? చెబితే ఏం చెప్పారో? ఇవేమీ నాకు తెలియవే?

"మీరేం మాట్లాడటంలేదు. మీరు ఆ కథ చదవలేదా? మా కాలేజీలో ఆ కథ గురించి ఒకే కాంట్రవర్సీ. మేమంతా ఆయన దగ్గిరకు నరాసరి అడిగేందుకు వెళ్లాం. కొందరయితే పోట్లాడి మరీవచ్చారు. కాలేజీ పిల్లలందరినీ అవమానపరచినట్లుగా వుంది యీ కథ. అందులోనూ ఒక ఆడపిల్లల కాలేజీలో పనిచేస్తున్న ఒక రచయిత యిలా రాయడం హాస్యాస్పదంగావుంది. హవ్ రిడిక్యులస్?"

"వాట్ యీజ్ రిడిక్యులస్ ఎబౌట్ యిట్" అని కాస్త ఘాటుగానే అడుగుదామని అనిపించింది క్లాసురూమ్‌లో తప్పుచేసిన విద్యార్థిని దండించినట్లు. దేనికి అడగడం? అసలు విషయం ఆ పిల్లకి తెలిసివుండదు. అంచేత నవ్వి వూరుకున్నాను.

"మీరు ఆ కథ చదవలేదనుకుంటా. కాలేజీపిల్లలను అవహేళన చెయ్యడానికి రాసివున్నట్లుంది" అంటూ ఆ కథ గురించి తిరిగి తిరిగి చెపుతోంది. నేను నోరు మూసుకుని వూరుకోలేక "నేను చదవలేదు – ఆ కథ ఏమిటి?" అంటూ అడిగాను. ఈ అమ్మాయి తన ధోరణిలో కథ ప్రారంభించింది. ఆ కథ మీద ఈ పిల్లకి సానుభూతిలేదని మొదటినుంచీ తెలుస్తూనేవుంది. కథ చెప్పడం మొదలుపెట్టింది:

"జోరున వర్షంట. కాలేజీముందు బస్టాప్‌ట. పిల్లలందరూ వెళ్లిపోయారుట. ఒకే ఒక అమ్మాయిమటుకు ఒంటరిగా నుల్చునివుందిట. అప్పుడు ఒకతను కారు

నడుపుకుంటూ వస్తాడు. అతను లిఫ్ట్ యిస్తానంటాడు. ఈపిల్ల కారెక్కుతుంది. ఈ పిల్లకు ఏమీ తెలియదుట, వృత్తి అమాయకురాలుట, పసిపాపట, అతను ఎక్కడికో తీసుకెళ్లి యీ పిల్లను పాడుచేస్తాడుట. ఈపిల్ల ఏడుచుకుంటూ తల్లిదగ్గరకెళ్లి అంతా చెప్పేస్తుంది. వాట్ ఎ నాన్‌సెన్సు. తమిళ సినిమా కథలను మించిపోయింది. ఈ రోజుల్లో, ఇట్లాంటిది సంభవమా అని? 'షో మి ఎ గరల్ లైక్ హర్' అంటూ కుడిచేతి చూపుడువేలుతో నన్ను చూపిస్తూ పోట్లాటకొస్తున్నది.

నాకేమీ తెలియనట్లు తెల్లబోయి చూస్తున్నాను.

చచ్చాం ఈ కథ యీయనకూడా విన్నారు కాబోలు. పక్కనవచ్చి నిలుచున్నారు. సరిగ్గా యీయనకూడా యిప్పుడే రావాలా? ఆయన రాకని గమనించనట్లు- ఆ పిల్లని అడిగాను.

"దెన్ వాట్ - అంతేనా కథ?"

పద్మ మాట్లాడుతున్నప్పుడు కావాలని అసందర్భపు ప్రశ్నలువేసే యీయన యిప్పుడుకూడా ఏదో అడిగి ప్రసంగం ఏవైపుకి లాగుతారోనని నాకు మనసులో పీచు పీచు మంటోంది. ఒకవేళ ఈయన అసందర్భంగా మాట్లాడితే ఎలావుంటుంది? నాలో నేను వూహించుకుంటున్నాను.

"ఆ తరువాత ఏం జరిగిందో తెలుసా? అన్నా అమ్మా యిద్దరూకలిసి యీ పిల్లని తిట్టారు కొట్టారు. 'ఆ అన్న నీకూతుర్ని తీసుకు ఎక్కడికైనా పో' అంటూ ఆ తల్లిని పిల్లనీ యింట్లోంచి తరిమికొట్టాడు. ఆ తరువాత వాళ్లిద్దరూ ఒక అంకుల్ యింటికెళ్లి వున్నారు. ఆపిల్ల బాగా చదువుకుని, పానయి వుద్యోగంచేస్తూ, పెళ్లి చేసుకోకూడదని నిశ్చయించుకుంది. చివరకి ఒకరోజున అతన్ని వెతికి పట్టుకుంది, కారులో తీసుకెళ్లి ఆ పిల్లని పాడుచేసాడే ఒక బ్లాగార్డ్.. అతన్ని .. ఇది జరిగి పది పన్నెండేళ్లయింది, అందులో 'అయిరనీ' ఏమిటంటే ఇప్పుడు అతని కూతురే ఆపిల్ల దగ్గిరకువచ్చి 'షో మి ఎ గరల్ లైక్ హర్' అని అడుగుతున్నది. దానికి ఏం బదులు చెప్పాలో తెలియక ఆపిల్ల గుడ్లుమిటకరిస్తోంది. ఇదిగో ఎదురుగుండా నుల్చునుంది చూడు" అని తనని తానే వేలుపెట్టి చూపించుకోవాలా?

ఈ విధంగా చెబితే ఎలావుంటుంది? అసలు యిప్పటికే జరిగిందంతా చెప్పేసి వుంటారా? ఈ కథ గురించి యీపిల్ల నా దగ్గిర చెప్పడం, అది వింటున్నట్లు యీయన వచ్చి నిలుచోవడం ఇటువంటి పిల్లని చూపించండి అంటూ నా మొఖం ఎదురుగుండా, నన్నే వేలుపెట్టి చూపించడం – యిదంతా ఒక నాటకంలాగా తోస్తున్నది.

"ఏమిటి? ఏం కథ? సినిమాకథా? తమిళమా? ఇంగ్లీషా?" అని అడుగుతూ కూచోబోతున్నారు.

"నాన్నా యూ జస్ట్ లిజన్ మేమిద్దరం ఒక విషయం గూర్చి మాట్లాడు కుంటున్నాము" అని ఆయన్ని కల్పించుకోనివ్వలేదు. ఈయన సిగరెట్ అంటించి కూచుని వింటున్నారు మా వివాదాన్ని. తండ్రిని అలా అన్నందుకు ఆయన బాధపడు తున్నాడేమోనని, ఆయనని కూడా మా వివాదంలోకి లాగుతున్నట్లు.

"అది నాన్నా - ఆర్. కె. వి. అని మీ అఫీసు ఫంక్షనుకువచ్చి మాట్లాడారే ఆయన రాసిన కథ గురించి మాట్లాడుకుంటున్నాము."

"చాలా బాగా మాట్లాడుతారు. గంగా యు డోంట్ బిలీవ్ యిట్ 'ఆర్. కె. వి.' అన్నాయన మీ కాలేజీలో అటెండరో. ప్యూనోట. అదంతా ఒక గిఫ్ట్" అంటూ ఆర్. కె. వి. ని పొగడటం మొదలుపెట్టారు యింగ్లీషులో.

"కొందరు నోట్లో వెండిచెమ్చాతో పుడతారుట. కొందరు బంగారు నాలికతోనే పుడతారు. మీ కాలేజీలో అందరికీ ఆయనంటే చాలా గౌరవం. మంజు ద్వారా నాకాయన పరిచయం అయ్యారు."

ఈయన నాతో "మీకాలేజీ - మీకాలేజీ" అని అంటుంటే మంజు అర్థం కానట్లు తెల్లపోయి చూస్తోంది.

"మిస్ గంగా మీరు మాకాలేజీ స్టూడెంటా ?" "కొత్త విషయం తెలుసుకున్నట్లు అడుగుతున్నది. 'యస్' అన్నాను వేరుదారిలేక. "అట్లాయితే మీకు ఆర్. కె. వి. తెలిసివుండాలే ?" అంటూ జలగలాగా పట్టుకుంది. "ఇంచుమించు యిరవైఏళ్ల నుంచీ ఆయన మన కాలేజీ వుంటున్నారట. ఆయన పూర్తిపేరు ఆర్. కె. విశ్వనాధశర్మ ...."

"అప్పుడంతా నాకు ఆయన విశ్వనాధన్ అనే తెలుసు. ఆయనే ఆర్. కె. వి. అని యిప్పుడే కొద్ది రోజులక్రితం తెలుసుకున్నాను. ఆయన మాకాలేజీ లైబ్రరీలో పనిచేసే వారని కూడా తెలుసు - కాని వీటన్నిటినీ - మనం ప్రత్యేకంగా మాట్లాడుకోలేదు. వాటిని గురించి ఆలోచించే అవసరమూలేదు" అంటూ నిజమూ అబద్ధమూ రెండూ కలిపి చెప్పి తప్పించుకున్నాను.

నాతో పరిచయం ఎలాఅయిందో వీళ్లకి చెప్పివుంటారా ? లేదా ? అన్న సందేహం యిప్పుడుకూడా నన్ను పీడిస్తూనేవుంది. అదిమటుకు నాకు పూర్తిగా బోధపడ కుండావుంది. ఇంత స్వేచ్ఛగా దాపరికం లేకుండా కలిసి మెలసి వుంటున్నపుడు నేను మటుకు ఏదో తప్పుచేసినట్లు వొంగి వొంగి ఎందుకుండాలి ? తండ్రి ఎదురు గుండానే మంజుని యీ విషయమై సూటిగా అడిగేస్తాను.

"మంజూ మీనాన్నకు నాతో పరిచయం ఎలా అయిందో నీకు ఎప్పుడయినా చెప్పారా ?" అంటూ మంజుని అడిగి, ఆయనవైపుకి తిరిగి ఇంగ్లీషులో అడిగాను.

"హావ్ యు ఎవర్ టోల్డ్ హర్ ఎబౌట్ అవర్ ఫస్ట్ మీటింగ్?" ఇట్లా నేను గబుక్కున అడిగేనరికి ఈయనకి కాళ్లకింద జంపుకానా లాగేసినట్లయింది కాబోలు. నేను మంజు ముఖంలోకి చూస్తున్నాను. ఆపిల్ల మొఖంలో మేము ఎలా కలుసు కున్నామో తెలునుకోవాలన్న కుతూహలం తొంగిచూస్తోంది. ఆ విషయం గురించి చెప్పవలసింది ఏమీ లేదన్నట్లు ఆయనవంకే చూస్తున్నాను. ఆయన ఆ విషయాన్ని అక్కడికి తుంచేస్తున్నట్లు కఠినంగా మొహంపెట్టి -

"వై షుడ్ ఐ? దిస్ యీజ్ మై హౌస్. నా ఫ్రెండు అని చెప్పాను. అది చాలదా? ఒక్కొక్క ఫ్రెండునీ తీసుకొస్తున్నపుడు ఎలా కలుసుకున్నాము? ఎప్పుడు కలుసు కున్నాము? ఎందుకు కలుసుకున్నాము ఈ కథంతా వివరంగా చెప్పడానికి అవు తుందా? నా ఫ్రెండ్సులో డీసెంటుగా వున్నవాళ్లని మటుకే యింటికి తీసుకొస్తానని, మిగతావాళ్లని నేనేవెళ్లి కలుసుకుంటాననీ వీళ్లందరికి తెలుసు."

"మా నాన్నకి కూడా గౌరవనీయమైన ఫ్రెండ్సు వున్నారని మిమ్మల్ని చూశాకనే తెలిసింది." మంజు నా చెవులో నెమ్మదిగా చెప్పింది.

"ఏయ్ మంజూ నా గురించి ఏదో చెవుతున్నావ్? ఏమిటంటోంది" నన్ను అడుగుతున్నారు.

"నా దగ్గిర రహస్యంగా చెప్పింది మీ దగ్గిర చెప్పచ్చా? అయినా మన యిద్దరికీ పరిచయం ఎలా అయిందో నేనిప్పుడే చెప్పేస్తాను" అంటూ మంజు వైపు తిరిగి మొదలుపెట్టాను.

"ఒక రోజున పెద్ద వర్షంలో కాలేజీకి తడిసి వెడుతున్నాను. బస్ రాలేదు. మీ పెద్దకారు లేదూ! అది డ్రయివ్ చేసుకుంటూ ఈయన వస్తున్నారు. నాకు లిఫ్ట్ యిచ్చారు. ఆ తరువాత నేను తిరుచ్చికి వెళ్లిపోయాను. పోయిన నెలలో ఆఫీసు పనిమీద ఒక రోజున మా సెక్షను కొచ్చారు. అప్పుడు కూడా ఆయన నన్ను గుర్తించలేదు. నాకు మటుకు ఆయన చాలా జ్ఞాపకం వున్నారు. దాంతో గుర్తించి పలకరించాను. ఇదీ జరిగింది, ఇందులో పెద్ద కథ లేదు."

ఈయన మొఖం ఎలా ఎలా రంగులు మారుతూ వున్నదో! నా వెనకగా వున్నారు అందుచేత చూడలేకపోయాను.

"గంగా నేను బయటకు వెళుతున్నాను. కావాలంటే నిన్ను డ్రాప్ చేసి వెళతాను. లేకపోతే కొంచెంసేపు వుండి ఎప్పుడు కావాలంటే అప్పుడు వెళ్లచ్చు" అంటూ గబ గబ బయలుదేరబోతుంటే అది చూసి మంజు "ఎక్కడికి క్లబ్‌కా?" అని అడిగింది.

"నో కాదు - ఏదో పని మీద వెళుతున్నాను. ఒకవేళ క్లబ్‌కి వెళ్లినా వెళతాను. చాలా రోజులయింది."

"వెళ్లండి. కాని పేకాడకండి."

"పేక ఆడేతీరుతాను"

"ఆడండి. అయితే నన్ను డబ్బు మటుకు అడక్కండి."

"అడుగుతాను - నీ బాబు సొమ్మా?"

"అవునవును - నా బాబు సొమ్మనే చెపుతూంట" మంజు నవ్వింది. ఆయనా చిన్నపిల్లవాడిలాగా నవ్వారు.

రోజూ రాత్రిళ్లు అమ్మ నాకోసం ఎదురు చూస్తూ కాచుకుని వుంటం నాకు కష్టంగా వుంది. ఈరోజు నన్నా కాస్త పెందరాడే వెళతాను - అనుకుని నేనూ బయలుదేరాను.

"ఎస్ - నేనూ వస్తాను. ఇంట్లో కాస్త పనుంది" అంటూ ఆయనతోపాటు నేనూ బయలుదేరాను. మంజు బాల్కనీలోంచి చెయ్యి వూపింది.

## 15

ఆయనతో కొంచెంసేపు ఏకాంతంగా మాట్లాడాలని వుంది. అందుకోసమనే తనతోపాటు నేనూ బయలుదేరాను. ఈ మధ్య యీయనతో ప్రత్యేకంగా మాట్లాడటానికి అవకాశం దొరకడం లేదు. ఆఫీసునుంచి యింటికి తీసుకొస్తున్నపుడు కారులో మాట్లాడవచ్చు. కాని ఆకాస్త సమయం చాలదు. మాట్లాడటం మొదలుపెడితే ఏ బీచికో, కాఫీ హొటల్‌కో వెళ్లి మాట్లాడుకోవాలి. ఇంటికెళ్లేసరికి మంజు పాఠం చెప్పించుకునేందుకు రెడిగా వుంటుంది. ఈయన స్నానం చేసి సీసా పట్టుకు తాగడం ప్రారంభిస్తారు. అలా తాగుతున్నపుడు యీయనతో మాట్లాడటం సాధ్యం కాదు. అసలే యీయన తెలివితేటలు అంతంత మాత్రం. ఇంక తాగినప్పుడు చెప్పనే అక్కర్లేదు. ఆ పరిస్థితిలో యీయన్ని చూస్తే నాకు జాలి వేస్తూవుంటుంది. మనుషులెందుకు యిలా తాగుతారో? ఈయన్ని చూస్తుంటే తాగటం వల్ల యీయనకి పెద్ద ఆనందం కలుగుతున్నట్లు అనిపించదు. ఫిజికల్‌గా కూడా చాలా బాధపడుతున్నట్లు తోస్తుంది. తల పట్టుకుని కణతలు రుద్దుకుంటారు. కళ్లు ఎర్రబడుతూంటాయి నోరు అరిపోతున్నట్లు, నాలికతో పెదవులు తడుపుకుంటూంటారు. కొన్ని సమయాల్లో డోకులు కూడా వెళుతుంటాయి. అగి అగి నిట్టూర్పులు విడుస్తూంటారు. తాగేవాళ్లంతా యిలానే వుంటారనుకుంటా. ఇల్లాంటి తాగుడుకి మనుషులెందుకు బానిసలవుతారో?

తాగేవాడికి, నంధి బుట్టినవాడికి, పిచ్చిహాడికి యీ ముగ్గురి మధ్యా నాకు అట్టే తేడా కనిపించదు. ఈ త్రాగుడులో గొప్ప ఆనందం వుందని భ్రమించడమే ఒక్క మత్తు కాబోలు అనిపిస్తుంది నాకు. మనిషి దేహం యీ మద్యాన్ని భరించ లేదు. అందుకే దేహం తిరగబడుతుంది - ఎదురు తిరిగి పోరాడుతుంది. అందుకనే మనుషులు అందులో షోడా కలిపి, అయిసు ముక్కలు వేసి, ఖారం పులుపూ చిరుతిళ్లు తిని, బుజ్జగించి దీన్ని గొంతులోకి బలవంతాన పోస్తూంటారు. ఇన్ని చేసినా యిది లోపలికి పోయి రివోల్ట్ అవుతూనే వుంటుంది. దీనిలోనే ఆయన ఆనందం వుందని అనుకుంటున్నారు. కడుపులోని ఆ గడ బిడ సంతోషమనుకుంటున్నారు. 'వో హౌ యిగ్నోరెంట్ -' ఇంతకిమించిన అజ్ఞానం మరొకటి వుంటుందా?

తాగుడు మైకంలో వున్నవారిని తేలిగ్గా పల్టీ కొట్టించవచ్చు. ఏ మాటనైనా తేలిగ్గా వినిపించవచ్చు. ఈ సమయంలో ఏదన్నా పని చేయించుకోవాలంటే సులభంగా వీరిని మాటల్లో వోడించి కార్యం సాధించుకోవచ్చు. అంతేగాని వీళ్లు ఏదో ఆలోచించి మాట్లాడుతారని, అలా మాట్లాడాలనీ ప్రయత్నించాలని అనుకోవడం వుత్త అవివేకం. వీరి మాటల్లో పనుల్లో ఏమీ వుండదు. తాత్కాలికమైన ఆవేశం తప్ప.

నేను మాట్లాడాలనుకున్న విషయం గురించి ఎత్తకుండా వుండటానికి యిదొక్కటే కారణం కాదు. నాకు అనుభవం లేనిది, నాకు సంబంధించనదీ అయిన ఆయన వ్యక్తిగత విషయం గురించి ఎలా మాట్లాడను. ఎక్కడ మొదలుపెట్టను అని మధన పడుతున్నాను.

ఏది ఏమైనా యీ విషయం గురించి మాట్లాడక తప్పదు. మా యిద్దరి మధ్యా దాచవలసిన విషయాలు లేవు. నేను పరాయి వ్యక్తినని ఆయన అనుకోవడంలేదు - ఈయనతో కార్లో తిరిగే అందరి పిల్లల వంటిదాన్ని కాదనీ, ఈయన మీద నాకేదో ప్రత్యేకమైన అధికారం వుందని అనిపించడంవల్లనే ఈ విషయం మాట్లాడాలని నిశ్చయించుకున్నాను. ఆయన వ్యక్తిగత విషయాల్లో కల్పించుకోగల స్వతంత్రం నాకున్నట్లే, ఆయనా నా వ్యక్తిగత విషయాల్లో కల్పించుకోవచ్చు. మాటల్లోకి యిమడ్చలేనటువంటి ఒక అనుబంధం, ఒకరి మంచి చెడ్డల గురించి మరొకరు ఆలోచించే అధికారం మా యిద్దరిలో ప్రతివొక్కరికీ వుంది. ఆ అధికారంతోనే మాట్లాడబోతున్నాను.

అందుకోసమని యీ సాయింకాలం బీచికో, హోటల్‌కో వెళ్లినా ఫరవాలేదు.

కారులో ఎక్కినప్పటినుంచీ యీ క్షణందాకా నేను పెదవి మెదపలేదు. ఈయన కారు నడిపేవైఖరి చూస్తుంటే నన్ను సరాసరి మా యింటికే తీసుకెళ్లి

దించేట్టుగావుంది. ఈ మనిషికి యీ సాయంత్రం ఏదో స్పెషల్ ప్రోగ్రాం వున్నట్లుంది. చక్కగా తయారయి మరీ వచ్చారు. ఈ రోజు తీర్థాన్ని బయట సేవిస్తారు కాబోలు. ఈ సాయంత్రపు సత్కాలక్షేపాన్ని నేను చెడగొడుతున్నానా? ఛీ - నేనిల్లా ఆలోచిస్తున్నానేం? నా జీవితాన్ని బలిగొన్న యీయన గురించి నేను చాలా నాజూగ్గా ఆలోచిస్తున్నాను. 'వయ్ నాట్ ఐ స్పాయిల్ హిస్ యీవెనింగ్' నేను యీ సాయంత్రాన్ని ఛెడగొట్టదలచుకున్నాను.' ఒక్క సాయంకాలమే గదా నేను చెడగొట్టబోతున్నది. జీవితం అంతా కాదు గదా, ఏం చెడగొట్ట కూడదా?

స్పర్‌టాంక్ రోడ్డులోకి తిరగబోతుంటే "నాకు కాఫీ తాగాలని వుంది" అన్నాను.

సరిగ్గా విననట్టూ, విన్నా అర్థంకానట్లూ నావంక చూశారు. నేను కాఫీ తాగుతాను అంటే అది ఫక్తు కాఫీయే అని కాదు అర్థం - దానికో పెద్ద తదంగం వుంటుంది. ఆ చెట్టు కింద కారు ఆపాక వాడువచ్చి 'ఏం కావాలి?' అని అడగడానికి పది నిముషాలు పడుతుంది. ఆ తరువాత వాడు లోపలికెళ్ళి అడిగినవి తీసుకొచ్చి, మేము కాఫీ తాగి బిల్లు చెల్లించి - యిదంతా అయేసరికి గంటసేపు పడుతుంది. పని తొందరలో వెళ్ళేవారు యిక్కడ కాఫీ తాగడానికి రారు. ఈయనకి బయటకెళ్ళి తాగడమనే తొందర పనివుందే!

"ఎక్కడికన్నా వెళ్ళి ఏదన్నా తిని వెళదాం. మీతో కొంచెంసేపు మాట్లాడాలి. అర్ యు యిన్ ఎ హర్రీ?"

కారు ఆగింది. నా అంతట నేను యిలా అడుగుతానని యీయన అనుకుని వుండరు. మొహంలో ఆశ్చర్యం కనిపిస్తోంది. ఎంత పనివున్నా - ఎంత తొందర పని అయినా - నేను అడిగిన విషయం అతి ముఖ్యమనీ, కాఫీ తాగడం చాలా ముఖ్యమైనదన్నట్లూ, మిగతాపని తరువాత అన్నట్లూ కారు రివర్సు చేసివెనక్కు తిప్పారు.

"అయామ్ సారీ యింట్లో కాఫీ టిఫినూ ఏం తీసుకోలేదా? చాలా ఆకలిగా వుందా? మొహం వాడిపోయివుందే! "వాట్ ఎ యిడియట్ అయామ్" అంటూ నేనేదో ఆకలితో గిల గిలలాడిపోతున్నట్లు బాధపడిపోతున్నారు.

"నో నో అదేం లేదు. మీతో కొంచెంసేపు మాట్లాడాలి. అంతేగాని పెద్ద ఆకలి అనికాదు. అంటూ సమాధానం చెప్పినా ఆయన వినిపించుకోలేదు.

"ఎక్కడికెళదాం. డ్రైవిన్‌కి వెళ్దామా? కారులో కూచుని తింటూ మాట్లాడుకోవచ్చు లేకపోతే యింకెక్కడికయినా వెళ్దామా?"

"డ్రైవిన్‌కే వెళదాం" అన్నాను.

కారు వెళుతోంది. నేను హోటల్‌కి పిలవగానే ఆయన తన ప్రోగాం గురించి మర్చిపోయినట్లున్నారు. నా మీద యీయనకి చాలా గౌరవం. ఇంటికి వెళదాం

అని నేను అనగానే మిగతా పనులు వెనక్కినెట్టి నన్ను దించడానికి వస్తారు. నావల్ల యీ సాయంకాలం ప్రోగ్రాం చెడిపోయినా, దాన్ని యీయన లెక్క చెయ్యలేదు. ఈయన చాలా మెత్తని మనిషి. ఇటువంటి మంచి మనిషిని అంత తెలివైన పద్మ ఎలా దూరంగా వుంచగలుగుతున్నదో నాకు భోధపడలేదు. నేను అలా చేయగలనా? ఒక గీతగీసి 'యీ గీత మీరు దాటకూడదు' అంటే ఆయన దాటకుండా వుంటారు. ఈయన్ని కాస్త అనునయంగా, మంచి మాటలతో వద్దు అని వారిస్తే ఆ తాగుడుకూడా ముట్టరు. కాని పద్మ చెబుతే వింటారా అన్నది సందేహమే! మంజు చెప్పిన మాట ఈయన జవదాటరు. అదే పద్మ యీయన చేత చెప్పి చేయించలేదు. ఎందుచేత? "మీరు యింతకు మించి తాగుతే నేను మీతో మాట్లాడను" అంటే చిన్నపిల్లవాడిలా తాగడం మానేస్తారు. ముందు గ్లాసులో వంచుకు తాగుతారు. ఆపైనా సీసా తీసుకు వెళ్లిపోతూంటారు గదిలోకి. వెనకాతలే వెళ్లి అది పట్టుకొచ్చేస్తుంది. ఆ తరువాత మళ్లీ వంచుకుని తాగబోతూంటే "అది తాగుతే మీతో మాట్లాడను. నేను మాట్లాడకపోయినా ఫరవాలేదు అనుకుంటే తాగండి" అంటుంది నెమ్మదిగా, తాగనా వద్దా అన్న డైలమాలో పడిపోతారు. దట్ యీజ్ ది సీక్రెట్. అట్లా కాకుండా తన చేతుల్లోంచి ఆయన ఎలా సీసా లాక్కుని పోయారో, అదేమాదిరి తనూ అలానే సీసా ఆయన చేతుల్లోంచి లాక్కుని పోదామనుకుంటే ఏమవుతుంది? ఆయనే జయిస్తారు. పోటీ పెట్టుకుని ప్రతి విషయంలో యీయన యిలా అయిపోతున్నారు.

మంజుకి తండ్రి అన్న ప్రేమవుంది. నన్ను ఆయన చెడగొట్టినా మామయ్య చెప్పినట్లు యీయనే నా మనిషి - అన్న మమత నాకూవుంది. తను కన్నకూతురని మంజు మీద యీయనకి మమకారం వుంది. తనవల్ల జీవితం మోడువారి పోయిందని నాపైన సానుభూతి గౌరవం వున్నాయి. అది గౌరవమేనా? కాదు అంతకు మించిన ఏదో ఆత్మీయత అనుబంధమూ కూడా నాపైన వున్నాయి.

డ్రయివిన్ రెస్టారెంటులోకి చేరుకుంటున్నాము. నేను యీయన్ని అడిగాను.

"మీకు యింకేదో ప్రోగ్రాం వున్నట్లుంది. నావల్ల ఆలశ్యం అవుతున్నదా?"

'ఆ' అని నవ్వుతూ చూస్తున్నారు. ఏదో ఆలోచిస్తున్నారు. అర్ధవంతంగా నవ్వుతూ కారు చెట్టుకింద ఆపారు.

"నా ప్రోగ్రామ్స్ లేటయిన కొద్దీ మరీ బాగుంటాయి. యిట్ యీజ్ టూ ఎర్లీ"

వెయిటర్ వస్తున్నాడు. 'ఏం తింటాం' అడుగుతున్నారు.

"ఏదో ఒకటి మీరే ఆర్డరివ్వండి"

"స్వీట్"

"ఊఁ"

"ఎన్నా స్వీట్ అతనికి ఏదో చెప్పారు" అతను వెళ్లాడు.

నేను చెప్పదలచుకుంది ఇక అరంభించాలి. ఎలా అరంభించాలో తెలియడం లేదు. ఈ విషయం గూర్చి ఆయన దగ్గర మాట్లాడనా? వద్దా? వద్దు మాట్లాడను.

"నాతో ఏదో చెప్పాలన్నావ్? ఏవిటి సంగతి?" అంటూ ఆయన రెట్టించడం మొదలుపెట్టారు. నేను వెర్రి నవ్వు నవ్వాను కాబోలు. ఆయన ముఖంలో నా నవ్వు ప్రతిఫలిస్తోంది.

"ఏం లేదు" అంటూ మొదలుపెట్టబోయాను. నాకు మాటలు తడబడు తున్నాయి. సరి అయిన మాటలు దొరకడంలేదు. మాటలకోసం తడుముకుం టున్నాను.

ఆయన నవ్వుతూ అంటున్నారు: "ఈ మంజుతో స్నేహంచేసి నువ్వుగూడా దానిలాగా తయారవుతున్నావు. ఏదో విషయం చెప్పాలి అంటూ ప్రారంభించి, ఆ ఏం లేదు అంటూ తెల్లమొహం వేస్తుంది. ఐ నో షి ట్రీట్స్ మి లైక్ ఎ ఛైల్డ్. నన్ను తండ్రిలాగా అనుకోదు. దానికంటె చిన్నవాడయిన తమ్ముడిని చూసినట్లు చూస్తుంది. 'అది చెయ్యకు ఇదిచెయ్యకు అక్కడికెళ్లకు - యిక్కడికెళ్లకు' అంటూ ఆర్డర్లు వేస్తుంది. నువ్వుకూడా అలాంటిదేదన్నా మొదలుపెట్టబోతున్నావా? అయితే చెప్పు. నువ్వు కూడా మా అమ్మాయిలాంటిదానివే. యస్ నాకు మంజూ నువ్వూ యిద్దరూ సమానమే"

ఈయన ఎందుకిలా అంటున్నారు. నాకళ్లు చెమర్చొస్తున్నాయి. నా తండ్రిలాటి వాడినని అంటున్నారు. నేను మా నాన్నని కళ్లారా చూడలేదు. నాకు నిజంగానే తండ్రి అన్న భావం కలుగుతోంది యీయన మీద. నెరిసిన ఆ జుట్టు, సాధు స్వభావం యివన్నీ చూస్తుంటే ఏదో పెద్దమనిషిని చూస్తున్నట్లు వుంది. ఈ మనిషే మరోనిముషంలో అయిస్‌క్రీమ్ కొనుక్కుని చీక్కుతింటూ వుంటారు. ఈ రెండు స్వభావాల కలయికే యీ వ్యక్తి. నేను చెప్పదలచుకున్నది చెప్పేస్తాను.

"ఏమీ లేదు నాకు నిన్న గభాలున ఒక సందేహం వచ్చింది. నాకు అటువంటి అనుమానం లేకపోయినా, మిగతావాళ్లకి కలుగవచ్చునేమోనని సందేహం కలుగు తోంది. మనం అటువంటి అపోహలకి చోటు యివ్వకూడదు"

"నువ్వు అనేదేమిటి?"

"ఉండండి యిప్పుడేకదా చెప్పడం ప్రారంభించాను"- అని ఒక్కక్షణం ఆగాను. ఆక్షణంలో ఆయన నావంక సూటిగా చూస్తున్నారు. మా మధ్యనున్న ఆత్మీయత, స్నేహం ఆ చూపులో ప్రతిబింబిస్తున్నాయి. ఈయన దగ్గర మనసు విప్పి మాట్లాడవచ్చు. ఏది కావాలన్నా సంకోచం లేకుండా చెప్పెయ్యవచ్చు. మిగతా మొగవాళ్లవంటివారు కాదు. మా పేర్లు జోడించి అందరూ మాట్లాడుకుంటున్నారు-

9

అన్న విషయం యీయనకు తెలుసునా? తెలియదా? ఈ విషయం తెలిస్తే నా జీవితాన్ని ఇంకా చెడగొడతాననే బాధతో, భయంతో నన్ను కలుసుకోవడం మానేస్తారా? అటువంటి ఆలోచనలు యీయనకు రావు లేవుకూడాను. కాని బాధ పడతారు. అలా అనుకున్నవాళ్లతో పోట్లాడుతారు. ఈయనకు యీ విషయం జాగ్రత్తగా అర్థం అయేట్లు చెప్పాలి. ఈ విషయం సాహసించి పైకి చెప్పడం యిద్దరికీ మంచిది. అంచేత నేను చెప్పదలచుకుంది చెప్పేస్తాను.

"మనిద్దరి గురించీ అందరూ ఏమనుకుంటున్నారో తెలుసా?" అని అడిగాను. అటువంటి విషయం యీయనకి తట్టలేదని, దాన్ని గురించి ఆలోచించలేదనీ గ్రహించుకున్నాను.

"అందరూ అంటే ఎవరెవరు?"

"చెపుతున్నా వుండండి. అదిగో స్వీటూ కారం రెండూ ట్రేలో పెట్టుకుని తీసుకు వస్తున్నాడు కనిపిస్తోందా? ఆ వెయిటర్; అదిగో ఆ ప్రక్క కారులో కూచుని మనిద్దరిని గుర్రు గుర్రుమని చూస్తున్నాడే ఆ రిటయిర్డ్ జంటిల్‌మాన్ అయనా; మీరు నన్ను రోజూ ఆఫీసుకు వెంటబెట్టుకు తీసుకుని వెళుతుంటారే అది రోజూ చూసే మా ఆఫీసువాళ్లు అంతదాకా ఎందుకు? రోజూ రాత్రి-పదిగంటలవేళ మీరు నన్ను యింట్లో దింపు తున్నపుడు చూసే మా అమ్మ, కారులో సీసాలు పెట్టుకుని నన్ను యింట్లో దించుతానని బయలుదేరి మరునాడు వుదయానికి తిరిగి యింటికి చేరుకునే మిమ్మల్ని చూసి మీ భార్య, మంజు వీరంతా"

రాసిపెట్టుకున్న పాఠాన్ని వల్లించినట్టు చెప్పుకుపోతూంటే, ఆ వెయిటర్ కారు దగ్గిరకు వచ్చాడు. నేను మాట్లాడటం ఆపేశాను.

"ఏయ్ ట్రే" అంటూ వెయిటర్ గట్టిగా అరిచాడు. కాకిచొక్కా వేసుకున్న పిల్లవాడు ఒకడు పరుగెత్తుకుంటూ వచ్చి, కారుతలుపుకి ట్రే తగిలించాడు. వెయిటర్ పదార్థాలని అందులో సర్ది 'కాఫియా సార్' అనిఅడిగాడు. ఈయన తలఅడించేసరికి వెళ్లిపోయాడు.

ఈయన స్వీట్ తీసి నాకు అందించారు. ఏదో ఆలోచిస్తూ తింటున్నారు. నావంక చూడకుండానే అన్నారు.

"ఐ డోంట్ కేర్"

"మనం కేర్ చేయకుండా వుండవచ్చు కాని వాళ్లు ఏమనుకుంటున్నారో తెలుసా; అని కదా అడుగుతున్నది. తెలిసి లెఖ్ఖచెయ్యకుండా వుండగలిగితేసరి; కాని తెలియకుండా మటుకు వుండకూడదు."

"ఏమిటి ఏమనుకుంటున్నారు?" అంటూ నన్ను చూస్తున్నారు. నేను ఆయన్ని తిరిగి చూశాను. అయిదు లెక్కపెట్టేదాకా నోరు తెరవలేదు. తరువాత మళ్లీ అన్నాను.

"మీరు నన్ను వుంచుకున్నారని"

"స్టుపిడ్. ఎవరా మాట అనేది? పేరు చెప్పు చెప్పుచ్చుకు కొడతాను."

"మా అమ్మే అనుకుంటోంది."

"సారీ" అని తలవంచుకున్నారు. "ఐ విల్ ఎక్స్‌ప్లైన్ హర్ ఎవ్విరిథింగ్. అప్పుడే మంటారు? నేనే వచ్చి ఆవిడతో మాట్లాడితే - అన్ని సర్దుకుంటాయి. డోంట్ వర్రీ."

ఈయన్ని చూస్తుంటే నాకు జాలి వేస్తోంది.

"మీ పద్మ మటుకు అనుకోకుండా వుంటారా?" అడిగాను. ఆ మాట చెవుల్లోంచి తోసిపారేస్తున్నట్లు, తల వొక్కసారి విదిలించి 'ఫూ' అంటూ చాలా తేలిగ్గా అనేశారు.

"మంజు?"

"మై. షి యీజ్ జెస్ట్ ఎ ఛైల్డ్ అది వొట్టి పసిపిల్ల."

మీకంటేనా? అని మనసులో అనుకుని పైకి నవ్వి ఇంగ్లీషులో అన్నాను.

"సో మీకు సంబంధించినంతవరకూ యీ సమస్య తీరిపోయిందనే చెప్పాలి. అసలు యిది సమస్యే కాదంటారు - అవునా? సో సింపుల్. మా అమ్మతో మాట్లాడి అంతా సరిచేసెయ్యవచ్చు. పద్మ విషయంలో 'ఫూ' అని కొట్టిపారెయ్యొచ్చు. మనిద్దరం చాలా తెలివైవాళ్లం."

ఈయన యింగ్లీషులోనే జవాబు చెప్పారు. "ఐ డోంట్ కేర్ మనగురించి అనుకునేవాళ్లంతా బుద్ధిలేనివాళ్లు. మనం ఏం చెయ్యలేని కొన్ని విషయాలని పైకి పెళ్లగించుకోవడం తెలివిగలవాళ్లు చేసేపనికాదు. నామటుకు నేను చేసే ఏపనికీ బాధ్యుడను కాదు. ప్రతి విషయం బుజాలకెత్తుకునేటువంటి శక్తి నాకు లేదు. నాకంత స్థయిర్యమూ లేదు. అయామ్ నాట్ సో స్ట్రాంగ్. నా లిమిటేషన్సు నాకు తెలును. నాకూ కాస్తో కూస్తో తెలివితేటలున్నాయి, మరీ బొత్తిగా మొద్దును కాను నా గురించి ఎవరు ఏమనుకున్నా ఫరవాలేదు. ఇప్పుడు కొత్తగా చెప్పుకునేందుకు ఏముందని? బట్ అయామ్ వర్రీడ్ ఎబౌట్ యు. నీ పేరు అనవసరంగా నలుగురి నోళ్లలో పడుతుందనే నా బాధ. నీకు చెడ్డపేరు రావచ్చు. దానికి కాదు- అనవసరంగా, అకారణంగా చెడ్డపేరు కోరి ఎందుకు తెచ్చుకోవాలి - అని నా బాధ. ఇట్ యీజ్ నాట్ టూ లేట్. ఇప్పుడైనా మించిపోయింది ఏమీలేదు. ఏమీ కొంప మునగలేదు. నీకోసం లక్షణమైన పిల్లవాడిని వెతికి తీసుకొస్తాను, నువ్వు శుభ్రంగా పెళ్లిచేసుకో. అన్ని సమస్యలూ చక్కబడుతాయి. ఎవ్విరి థింగ్ విల్ బి ఆల్ రైట్"

ఈయన మాటి మాటికీ నా పెళ్లిమాట ఎత్తుతారేం? ఇది సులభంగా జరిగే పని కాదని తోచడంలేదా? ఈయన మనసులో ఏమనుకుంటున్నారు? లేకపోతే ఎవరినైనా మనసులో పెట్టుకు మాట్లాడుతున్నారా?

"ఇందులో రెండు విషయాలున్నాయి. మొదటిది నేను పెళ్లి చేసుకునేందుకు యిష్టపడటం అన్నది. నాగురించి తెలిసీ నన్ను పెళ్లి చేసుకునేందుకు ముందుకు ఎవర్వొస్తారన్నది రెండో విషయం. ఇది చెప్పకుండా దాచిపెట్టి చేసుకోవడం న్యాయమా ?" అని అడిగాను.

"నో - నో. యిట్ యీజ్ నాట్ రైట్. అది చాలా తప్పు. ఎంతో మంది వున్నారు. ముందు ఐ వాంట్ యువర్ కనసెంట్. నువ్వు ఊ అని ముందు వొప్పుకో."

అనవసరంగా చిక్కులో పడ్డానే. ఇదేదో బోనులో పడ్డట్టుగా వుంది. నేను తాపీగా అన్నాను.

"ఆ విషయం అక్కడికి వదిలెయ్యండి. నేను మీతో చెప్పేదేమిటంటే మన చుట్టూ వారు మనగురించి ఏం మాట్లాడుకున్నా నాకు లెక్కలేదు. మా అమ్మ కానీయండి, ఆఫీసులో కానీండి మనగురించి ఎవరు ఎట్లా అనుకున్నా - మీరు పద్మని గురించి చెప్పారే నేనుకూడా అలా 'ఫూ' అని విదిలించి పారెయ్యగలను. కాని మంజు విషయంలో మటుకు అలా వూరుకోలేను. మంజు కూడా మనగురించి అలా అనుకుంటున్నదేమోనని నా బాధ. తను అట్లా అనుకునే పిల్లకాదు, అయినా అలా ఎప్పుడేనా అనుకుంటే - - - అది తల్చుకుంటేనే నాకు భయంగా వుంది. సమయం, సందర్భం వచ్చినపుడు మనిద్దరిమధ్యావున్న అనుబంధం తనకి చెప్ప దలచుకున్నాను. అటువంటి సమయం రాకూడదనే అనుకుందాం. ఒకవేళ వస్తేమటుకు నేను వున్నది వున్నట్లు చెప్పదలచుకున్నాను. కాని యీలోపలే అటువంటి అవకాశం రాకముందే, మంజు మనసు విరిగిపోతే - ఆ తరువాత నేను నిజం చెప్పినా – అది నిజంగా అనిపించదు - అబద్ధంగా తోస్తుంది. అప్పుడు ఆ అమ్మాయి నన్ను యిలా గౌరవంగా చూస్తుందా ? ప్రపంచ మంతా నా గురించి ఎలా అనుకుంటున్నారో తనూ అదే అనుకుంటుంది. అందుకోసమనే మిమ్మల్ని యీ సహాయం చేయమని కోరుదామని వచ్చాను."

"అందుకు నన్నేం చెయ్యమన్నావో చెప్పు" కైకేయిని దశరథమహారాజు రెండు వరాలు కోరుకోమని అడిగినట్లు, గంభీరంగా అడిగేశారు.

"మీరు నాతో బయటకొచ్చి, నన్ను యింటి దగ్గిర దించి, మళ్లీ మీ యింటికే సరాసరి తిరిగివెళ్లండి. కావాలంటే మీయింటి దగ్గిరనుంచి ఎక్కడికైనా వెళ్లండి. అంతేగాని నన్ను దించాక యిటూ అటూ తిరగవద్దు – ఇది చాలా ముఖ్యం" అన్నాను.

# 16

తోజూ యింటికి చేరేవరికి రాత్రి పది అవుతోంది. అమ్మ నాకోసం ఎదురు చూస్తూ కూచుంటుంది. ఈరోజునన్నా పెందరాడే యింటికి వెళదామని త్వరగా బయలుదేరాను. అయినా పదిగంటలయితేగాని యిల్లు చేరుకోలేకపోయాను. ఈయనకేం అలస్యమైనకొద్దీ ప్రోగ్రాం రంజుగా వుంటుందట. నేను అడిగానని అలా చెప్పారుగాని, నాతో మాట్లాడుతున్నంతసేపు తను వేసుకున్న ప్రోగ్రామ్ గురించి మర్చిపోయినట్లే వున్నారు. కొంచెంసేపు అయాక నేనే జ్ఞాపకం చేశాను. ఆయన వెళ్ళవలసిన విషయం గురించి, అదేం ఫరవాలేదు. నిన్ను మీ యింట్లో దించి వెళతాను" అంటూ మొదలుపెట్టారు. నేనే వద్దని టాక్సీస్టాండులో కారు ఆపమని ఆయన్ని పంపేశాను.

ఇంటి గుమ్మందగ్గిర టాక్సీ ఆగేనరికి పది కొట్టింది. టాక్సీకి డబ్బిచ్చి లోపలికి వస్తున్నాను. వీధివాకిట్లో కూచుని ఎదురుచూస్తూ వుండే అమ్మ – గుమ్మంలో కనిపించలేదు. తలుపు తెరిచివుంది. ఒహెూ వెంకు మామయ్య వచ్చాడు. ఈజీ ఛైర్లో కూచుని నన్ను చూస్తున్నాడు. నేను ఆయన వంక చూసేనరికి మొహం తిప్పు కున్నాడు. ఈయన చూసిన విషయం నేను గమనించలేదనుకుంటున్నారా ?

ఎప్పుడూ వచ్చినట్లే వచ్చాడా ? లేక అమ్మ వుత్తరం రాసి పిలిపించిందా ? ఎట్లా అయితే నాకేం ? కాని నా కొక్కటే విచారం. ఈరోజు నేను ఆయన కారులో కాక టాక్సీలో వచ్చానే అని.

సాధారణంగా నన్ను చూడగానే నేను రావడానికి ముందు నాగురించి ఎంత కోపంగా మాట్లాడుతున్నా - నన్ను చూడగానే "రా - వచ్చావా; రా గంగా" అంటూ కంఠం మామూలుగా మార్చి నవ్వుతూ తప్పుచేసి వచ్చిన పసిపిల్లని అనున యిస్తున్నట్లు పిలిచే మామయ్య యిదేమిటి – ఏమీ అనకుండా వుండగలిగాడే !

నావంక తిరిగి చూడకుండా ఎక్కడో నూన్యంలోకి చూస్తున్నట్లు 'గుర్' మంటూ కూర్చునివున్నాడు. అమ్మ తలమీద మునుగు ముందుకు లాక్కుని, కొంగు కింద నోరుదాచుకొని, నావంక చూస్తోంది. ఆవిడ ఏమి వూహించుకు చూస్తోందో ? ఎందుకు చూస్తోందో అర్థం అవడంలేదు. సరే ఈవిడ ఏమనుకుంటే నాకేం నేను యిదేం గమనించనట్లు మామూలుగా వుంటాను.

"ఎప్పుడొచ్చారు ?" మామయ్యను అడిగాను.

మామయ్య నన్ను చూశాడు. ఈయన మనసులోని కోపాన్ని, బాధని అణిచి పెడుతూ :

"మధ్యాహ్నం" అంటూ ఒక్కమాటలో బదులుచెప్పాడు. ఆ తరువాత ఏం అడగాలో నాకు తోచక మాట్లాడకుండా నా గదివైపుకి తిరిగాను. స్తంభానికి ఆనుకుని

నిలుచున్న అమ్మ నావంకే చూస్తోంది, నెత్తిమీద ముసుగు మొహం మీదకు జార్చు కుంటున్న యీవిడను చూస్తుంటే నాకు కొత్తగా భయంగా వుంది. ఎవరో కొత్త మనిషిని చూస్తున్నట్టుంటుంది. ఒకోసారి ఆవిడ ముఖం మనిషి ముఖంలా కనిపించదు. నేను గదిలోకి వెళ్లి తలుపు మూసుకున్నాను.

గదిలో యిలా ఒంటరిగా వుంటే మనసుకి విశ్రాంతిగా వుంది. డ్రస్ మార్చుకుని తలుపు తెరిచి బయటకివెళ్లాలి. ఫోంచెయ్యాలి, ఈ మామయ్యతో ఖబుర్లు చెప్పాలి. అడిగే ప్రశ్నలన్నిటికీ బదులు చెప్పాలి; తర్కించే విషయాలన్నీ వింటూ వూరుకోవాలి. ఈ మామయ్య చేసిన సహాయాలన్నీ తలుచుకుంటూ, కృతజ్ఞతతో అణిగి మణిగి వుండాలి. ఇవన్నీ మనసులో మెదిలినపుడు ఈ తలుపులు తెరిచి బయట కెళ్లాలి అంటే భయంగా వుంది.

నాకు చీరె మార్చుకోవాలని అనిపించలేదు. కాళ్లూ చేతులూ కడుక్కోవాలని కూడా అనిపించడంలేదు. ఆకలి వెయ్యడంలేదు. నిలుచుని వున్నానే – యిలాగే నిలుచుండి పోవాలని అనిపిస్తోంది. తెల్లవారేదాకా యిలా యీ గదిలో నిలుచో మంటే, సంతోషంగా నిలుచుండిపోతాను. ఎదురుగావున్న బీరువా అద్దంలో నన్ను నేనే చూసుకుంటూ నిలుచున్నాను.

ఈ అలంకారమంతా చూసి మామయ్య ఏమనుకుంటాడో? నన్ను చూసినపుడు యిదంతా ఆయన గమనించాడో లేదో! ఇదంతా కొత్తగా విచిత్రంగా అనిపించి వుంటుంది. ఆయన్ని రమ్మనమనే కాకుండా, అమ్మ నాగురించి ప్రతివిషయం వివరంగా రాసివుంటుంది ఆ వుత్తరంలో.

అయితే యీ విషయాలన్నిటి గురించి ఆయన ఏమంటాడు? ఏమార్గం తీసుకుంటాడు? ఏలైను తీసుకోబోతాడు – నేను తప్ప ఎవరూ చెప్పలేరు.

జరిగిందంతా సరిఅయినదనీ నేను చాలా కరక్టుగా చేశాననీ చెబుతాడు. ఇందుకొరకు జాతినుంచి కులంనుంచి వెళ్లగొట్టాలని చెబుతాడు. ఆ తరువాత నా పక్కన ఎవరూ లేకుండా చూసి 'జాతికోసం కులంకోసం చెయ్యాల్సినదంతా చెయ్యాలి' అని విడిగా అంటాడు.

ఏవంటాడో చూస్తానుగా! తన గుప్పెట్లో ఎలాగో అలా చిక్కుతానని అనుకుంటున్నాడా?

గదిలోకి వచ్చి అయిదు నిముషాలు దాటింది. అల్లాగే నిలుచుని వున్నాను. అన్ని పనులుగా మొండిధైర్యంతో చేశాను. అయినప్పటికీ మనసులో ఏదో పిరికిగా వుంది. రేపు వుదయం అయేప్పటికీ ఆయన యీ యింట్లో యిక్కడే నిలుచుంటారు. అప్పుడు యీయన్ని చూసి మామయ్య ఏమంటాడో? లేక ఏమీ అనకుండా నిశబ్దంగా వుంటాడా?

ఈయనే 'ఆ అతను' అని అమ్మ చెప్పేసి వుంటుందా? లేకపోతే ఆవిడ అనుమానించినట్లు 'అతను' అన్న పేరుతో ఎవడినో యీడ్చుకొచ్చి వాడితో తిరుగుతున్నానని ముందే చెప్పేసి వుంటుందా?

ఎంతసేపు యిలా ఘడియపెట్టుకుని గదిలో కూర్చుని వుండను. తనకి భయపడి నేను యీ గదిలో దూరికూచున్నానని మామయ్య అనుకుంటాడా? మామయ్య అనుకున్నా లేకపోయినా, అమ్మమటుకు నేను భయపడి దాక్కున్నాననే అనుకుంటుంది. అందుకనేకదా మామయ్యకి వుత్తరం రాసింది. ఆయనేదో వచ్చేసి, వెంటనే నడుంలోంచి కత్తిదూసి 'పటక్' అని నాశిరచ్ఛేదం చేసేస్తాడని అనుకుంటోంది కాబోలు.

నెత్తిమీద ముసుగుజార్చి, మొహం మూసుకుని చూస్తూ "వచ్చేశాడే తల్లీ - ఆయనతో మాట్లాడవే అమ్మా" అని చూస్తున్నట్లుంది.

ఊ మాట్లాడుతాను. ఆయనతో చర్చించరాని విషయం ఏముందని? దేన్ని గురించి చెప్పకండా వున్నాను గనక. ఇందులో తప్పేంలేదు. తప్పో వొప్పో ఈ విషయం గురించి నేనే మాట్లాడుతాను. ఐ షుడ్ ఫేస్ హిమ్.

గబగబ చీరమార్చుకుని గడియతెరిచి హాల్లోకి వచ్చాను. అమ్మ భోజనానికి అన్నీ రడీగాపెట్టి, వంటగదిలో నిలుచుని ఎదురుచూస్తోంది.

"మీరు భోంచేశారా?"

"ఓ - యస్ నువ్వెళ్లి భోంచెయ్యి. పదిన్నర అయింది. అంటూ చాలా సహజంగా మాట్లాడాడు మామయ్య. 'భోంచేసి రాని అప్పుడు మాట్లాడుకోవచ్చు' అనుకుంటున్నాడుకాబోలు. మాట్లా ఁవలసిన పాయింట్లు మనసులో కూర్చుకుంటున్నాడు కాబోలు. ఎలా పట్టుకుందామా-ఎక్కడ పట్టుకుందామా? అని యోచిస్తు వుండివుంటాడు. ఎగిరి గంతేసి నన్ను మాటల్లో పట్టుకుందామని ఆలోచిస్తున్నాడు. ఆ పట్టులో నేనెలా చిక్కుకుంటానో చూడబోతున్నట్లుంది అమ్మ. నాగురించి ఆవిడకేం తెలుసు? నేను మామయ్య పెంపకంలో పెరిగినదాన్ని - ఈయన సంగతి నాకు బాగా తెలుసు.

మాట్లాడకుండా కూచుని తలవంచుకుని భోంచేస్తున్నాను. సాయంకాల రిస్టారెంటులో తిన్నది యింకా గొంతులోనే వుంది. ఏం తింటున్నానో నాకే తెలియదు. గబగబ తింటున్నాను. పూర్వంలాగా అమ్మ 'యింకొన్త తిను - కొంచెం తిను' అంటూ తరిమితరిమి గుమ్మరించలేదు కాబట్టి బతికిపోయాను. కంచంనిండా మజ్జిగ పోసుకుని పదార్థాలన్నీ పిసుక్కుని ఎత్తుకు తాగేశాను. 'కనిపించిన నానాచెత్తా తినివుంటుంది. అందుకే తిండి సొక్కడంలేదు' అని అమ్మ అనుకుంటూ వుంటుంది.

మామయ్యకు సాధారణంగా నేనే పక్కవేస్తూంటాను. "చాలా టైమయింది మీకు పక్కవెయ్యనా?" అంటూ అడిగి నా రూమ్‌లో చుట్టిపెట్టివున్న ఆయన పరుపు తీసుకురావడానికి వెళ్లాను.

"అవును చాలా టయిమయింది" అంటూ తలవూపాడు. ఆయన పరుపు తీసుకొచ్చి పరిచి, దుప్పటితో శుభ్రంగా దులిపాను. దుమ్ముపోయేటట్లు గట్టిగా విదిలించాను. మామయ్య పడక తయారుచేశాను. నాపని అయిపోయింది. నా గదిలోకివెళ్లి తలుపు వేసుకుంటే తెల్లవారేదాకా గొడవవుండదు. మామయ్య ఏమీ మాట్లాడకుండా నిశ్శబ్దంగా వుండటంచూస్తే, యీయన అవలురంగంలోకి దిగడానికి తయారవు తున్నాడు కాబోలనిపిస్తున్నది.

మామయ్య పరుపుమీద బొద్దెంక పరుగెడుతోంది. ఎనిమిది నెలలయింది ఆ పరుపుతీసి. ఆ బొద్దెంకని చూడగానే నావళ్లు జలదరించి వెలవరంతో నిలుచుండి పోయాను. అక్షణంలో మామయ్య యీజీ ఛైర్‌లోంచి, పక్కదగ్గిరకొస్తున్నాడు.

'కూచో' అంటూ వేత్తో సౌజ్ఞచేస్తూ పక్కమీద బాసింపీట వేసుకుని ఒక్కక్షణంపాటు కళ్లుమూసుకుని, ధ్యానంచేసి 'సాంబశివా మహదేవా' - అని కళ్లు తెరిచాడు. గోడకానుకుని పక్కమీద కూచున్నారు. ఎడంకాలు ముడుచుకుని, మోకాలిచిప్పని చేత్తో రానుకుంటున్నాడు. ఆయన అలా నావంక చూస్తూ మోకాలు రానుకుంటుంటే, నావీపురాసినట్లుగా వుంది.

"కొంచెం కాలు పిసుకుతావా ?" అంటూ కాలుని నాముందుకు జాపాడు. నేను ఆయన పక్కగా నేలమీద చతికిలబడి కాలుపట్టడం ప్రారంభించాను. కాలు నొక్కినపుడల్లా 'అబ్బా - అమ్మా' అంటూ నెప్పులు పడుతున్నాడు మామయ్య.

అమ్మ వంటగదిలో పడుకుంది. అయినా ఆవిడ నిద్రపోలేదు. నిద్రపోయి వుండదు. మామయ్య ప్రారంభించబోయే కేసు విచారణకొరకు ఎదురుచూస్తూ వుంటుంది. ఇప్పుడుకదా ఆయన అసలు విషయంలోకి రాబోయేది.

'అబ్బా - అమ్మా' అంటూ అదేదో మంత్రంలాగా జపిస్తూ మామయ్య కళ్లు మూసుకుని పెద్ద నిట్టూర్పు విడిచాడు. కళ్లుతెరిచి నావంక పరిక్షగా చూస్తున్నాడు. ఏదో తలచుకుంటూ నవ్వాడు : నాకూ నవ్వొచ్చింది కాని నేను నవ్వలేదు.

"అవునూ నువ్వు చేసేపనులన్నీ చేసేసి చివరికి నా తలమీద రుద్దుతున్నావేమిటి ? అసలు సంగతేమిటి ?" అంటూ చాలా సహజంగా శాంతంగా అడిగాడు : ఆయన దేన్ని గురించి అడుగుతున్నాడో గ్రహించేందుకు ఒక నిముషం పట్టింది. దానికి నేను బదులు చెప్పేలోపునే - ఆయనే మళ్లీ అందుకున్నాడు.

"నువ్వు ఏమన్నా పసిపిల్లవా ? నువ్వు చేరుకున్న యీ హెూదాలో ఏ పని చేసినా చెల్లుతుంది. నిన్నెవరూ దండించడానికి వీల్లేదు. ధర్మం, న్యాయం, నీతి, యోగ్యత యీ మాటలు పట్టుకు వెళ్లాడేవారు నిన్నేదన్నా ప్రశ్నిస్తే - 'వాటితో నాకు పనిలేదు' అని నీ- యిష్టం వచ్చినట్లు నువ్వు వుండవచ్చు. ఉండబోవచ్చు. ఎవరేం చేయలేరుకూడా. ఆ రోజుల్లో కాబట్టి గణేశన్ నిన్ను వెళ్లగొట్టాడు.

ఇప్పుడు కనకం నిన్ను అలా వెళ్లగొట్టగలుగుతుందా? నువ్వు చేసే పనులు హర్షించలేకపోతే నీ యిల్లు వదిలి ఎక్కడికైనా వెళ్లిపోవచ్చు. నీకు నచ్చింది - నువ్వు కావాలనుకున్న విధంగా చెయ్యి బాగుంది. అంతేగాని మధ్యలో నన్నెందు లాగుతున్నావని? నేనేదో చెప్పినట్లూ దాన్నిబట్టి అతన్ని చెయ్యి పట్టుకుని లాక్కొచ్చినట్లూ, చెబుతున్నావుట? నే నెప్పుడైనా అలా చెప్పానా? నీ దగ్గిర చెప్పానా? నీ దగ్గిర నేను చెప్పిందంతా ఏమిటి? ఒకవేళ అతన్ని వెతికి తీసుకొచ్చినా అతను నిన్ను నమ్మడు, నీ మీద అతనికి గౌరవం వుండదు అని, అందులో వున్న చిక్కులన్నీ వివరంగా చెప్పాను. అంతేగాని అతన్ని వెతికి తీసుకువచ్చి అతనితో 'త్తై' మని ఆడమని చెప్పానా?" గద్దిస్తున్నట్లు విసిని కర్ర ముందుకు జాపి నన్ను అడుగుతున్నారు. నేను చిన్నపిల్లలాగా తలవంచుకుని నెమ్మదిగా జవాబు చెప్పాను.

"ఆ రోజు మీరేకదూ - అమ్మ దగ్గిర చెబుతూవున్నారు - 'దీనికి చేతనయితే అతన్ని వెతికి పట్టుకుని - - -"

"చాలా బాగుందే పిల్లా చాలా బాగుంది" అంటూ గొంతు చించుకుంటున్నాడు మామయ్య. నేను మాట్లాడటం మధ్యలో ఆపేశాను. ఆయనే మళ్లీ అందుకున్నాడు.

"నేను నీ దగ్గిరకొచ్చి చెప్పానులే? మీ అమ్మతో ఏదో మాటల్లో అన్నాను. మేమేదో మాట్లాడుకుంటున్నాం. అదేమో దొంగచాటుగా విని, యిప్పుడీ పనులన్నీ ఆ మాటలు వినబట్టేచేశానని అంటం చాలా బాగుంది. మంచి అసాధ్యురాలివే! కాని అందరూ నీ గురించి ఏమనుకుంటున్నారో తెలుసా? ఎవడినో పట్టుకొచ్చి వాడితో తిరుగుతున్నావని. ఇతను 'అతనే' అని నువ్వు ఎలా నిరూపిస్తావ్? అనవసరంగా నీ పేరు చెడగొట్టుకోకే పిల్లా. ఇదేం గ్రహచారమే" అంటూ విసన కర్రతో నెత్తిమీద ఒక్కటి వేశాడు.

కొంచెంసేపు నేను ఏం మాట్లాడలేదు. ఆయనా మాట్లాడలేదు. ఎక్కడో రేడియోలోంచి 'జన గణ మణ' వినిపిస్తోంది. ఆ పాట అయేదాకా నేను నోరు మెదపలేదు. పాట ఆగిపోయింది. రేడియో ఆపుచేసినట్లు టక్‌న శబ్దం వినిపించింది.

"మిగతా వాళ్లందరికీ నేనెందుకు నిరూపించాలి? అతనే 'ఈయన' అని మిగతావాళ్లు నమ్మితే మటుకు ఏమవుతుంది? అందువల్ల ఏం వొరుగుతుంది?"

"మిగతావాళ్లంటే నేను వీధిలో పోయేవాళ్లగురించి అంటున్నాననుకుంటున్నావా?" అని అడిగి ఏదో ఆలోచిస్తున్నట్లు యింటి పైకప్పువైపు చూసి రహస్యము చెబుతున్నట్లు గొంతు తగ్గించి, నా దగ్గిరగా జరిగి చెవులోకి చెబుతున్నాడు.

"మీ అమ్మే- అతను యితనని నమ్మలేదు" అంటూ కన్ను గీటాడు. నావొళ్ళు సిగ్గుతో చచ్చిపోయింది. "మీరు మటుకు నమ్ముతున్నారా?" అని అడగాలని పించింది. అసలు ఎందుకడగడం ? ఈ మామయ్య నమ్మనూ నమ్మడు - ఆ విషయం గురించి ఆలోచించనూ ఆలోచించడు.

"నాలుగు వైపులకీ మీ అమ్మ వుత్తరాలు రాసేసింది. దానికి తలకొట్టేసినట్లుంది. మనసు కష్టపెట్టుకుంటోంది. 'మీరొచ్చి ఒకదారి చూపించాలి' అని రాసింది నాకు తీసి యిస్తాను నువ్వే చదువుకో. దాని స్థితి చూస్తే చాలా బాధగా వుంది" అంటూ చెపుతూ నాచెయ్యి పుచ్చుకొని అలవాటు ప్రకారం వేళ్లు విరవడం మొదలుపెట్టాడు. నాదగ్గిరగా వచ్చి ఆనుకుని కూచున్నాడు. ఆయన అలా దగ్గిరగా కూచుని చూస్తుంటే, నన్నేదో నమిలి మింగుతున్నట్లుగా అనిపిస్తోంది. ఆయన మనసులో ఎటువంటి భావాలు పరుగుదీస్తున్నాయో నేను వూహించుకోగలను. ఆయన అలా ఆనుకునే చెబుతున్నాడు.

"నువ్వు చాలా మారిపోయావు. నీకు వొళ్లొచ్చింది" అంటూ నాచెయ్యి పట్టుకు నొక్కుతున్నాడు. ఆయన మనసులో ఏమేమి వూహించుకుని యిలా అడుగుతున్నాడో అర్థమవుతోంది. చాలా నెమ్మదిగా, రహస్యంగా యింగ్లీషులో అడుగుతున్నారు. 'ప్రికాషన్సు' (ఇబ్బందులు రాకుండా) అవీ తీసుకుంటున్నావా ?"

"ప్రికాషన్స్ ఎగెనెస్ట్ వాట్ ? ఏ యిబ్బందులు రాకుండా ?"

"కనసెప్షన్" అంటూ మళ్లీ కన్నుగీటాడు. నాకు భగ్గుమంటోంది. కడుపులో భగభగమంటోంది. వీధిలోకెళ్లి కాండ్రించి వుమ్మివెయ్యాలనిపిస్తోంది. జవాబు చెప్పకుండా వూరుకున్నాను. తొడపట్టుకుని గిల్లుతున్నాడు నెప్పిగావుంది.

"నో" లేదు అని చెప్పాను. ఈ 'నో' అన్నదానికి అర్థమేమిటో ఆయనకి అంతుపట్టటంలేదు. ఈయన గిల్లుతున్నాడే అది ఆపేందుకు అంటున్నానా? లేకపోతే 'కడుపు' రాకుండా ప్రికాషన్స్ ఏమీ తీసుకోవడం లేదని చెపుతున్నానా? దేనికో అర్థం చేసుకోలేక మథన పడతున్నాడు. అలా గిజ గిజ లాడాలనే నేనూ మాట్లాడకుండా వూరుకున్నాను.

"డోంట్ గెట్ యిన్ టు ట్రబుల్స్" 'చిక్కుల్లో యిరుక్కోకు' అని హెచ్చరించాడు మామయ్య నేను అందుకూ బదులు చెప్పలేదు - ఆయన చేతుల్లో పడుతున్న హింస చాలు - దీనికి మించిన చిక్కులుంటాయా ?

ఆయన చెయ్యి పక్కకి తోసెయ్యడం యిదే మొదటిసారి. "నాకు నిద్దర వస్తోంది. మీరూ పడుకోండి - చాలా టైము అయిపోయింది" అంటూ లేచాను. మామయ్య వావినుగుని గ్రహించుకున్నాడు.

"కొంచెం మంచి తీర్థం తెచ్చిపెట్టు" అంటూ లేచి కూచున్నారు, వంటింట్లోకి వెళ్లి, మంచినీళ్ల చెంబూ గ్లాసూ తీసుకొచ్చి ఎదురుగుండా పెట్టి వెళుతుంటే నా చెయ్యి పుచ్చుకుని అడుగుతున్నాడు.

"ఐ వుడ్ లైక్ టు మీట్ దట్ జంటిల్‌మాన్." ఆ జంటిల్‌మాన్ని మామయ్య కలుసుకుంటాడుట.

మామయ్యకి ఈయన్ని కలుసుకోవాలనివుంది. ఆ విషయం నాకు ఆశ్చర్యం కలిగించలేదు. కాని ఈయన్ని 'జంటిల్‌మాన్' అంటే మటుకు నవ్వొస్తోంది. అదే మామయ్యలోవున్న క్వాలిటీ అనండి లేక ప్రత్యేకత అని అన్నా సరే. ఎవరిని కలుసుకున్నా ఆయన తన లాజిక్‌నంతా వుపయోగించి మరీ మాట్లాడుతాడు. ఎవరినయినా సరే లాజికల్‌గానే అప్రోచ్ అవుతాడు. ఆయన ప్రతీదీ తర్కబద్ధంగా చూస్తాడు. అందరూ నన్ను తరిమికొట్టినపుడు ఈ లాజికల్ ఎప్రోచ్ వల్లనే దగ్గిరకుతీసి, నాకు సహాయం చేసింది. అది మామూలుగా అందరూ చేసే పనికాదు. ఇటువంటి ప్రత్యేకమైన వ్యక్తిత్వం అందరికీ వుండదు. ఆ ప్రత్యేకత వల్లనే ఇంత అయింతరువాత కూడా నాకు కావలసినవాడు, నాకు యిష్టుడూ అని గ్రహించుకోగానే మిగతా అందరిలాగా ఆయన్ని నిందించకుండా, ఆయన్ని ఒక జంటిల్‌మాన్ అంటున్నాడు. తను ఆయన్ని కలుసుకోవాలంటున్నాడు. ఇటువంటి కొన్ని ప్రత్యేకమైన క్వాలిటీస్ వుండటంచేతనే మామయ్యని యిప్పటికీ నేను గౌరవిస్తూంటాను.

"ప్రొద్దునే వస్తారు" అన్నాను.

"అవునవును రోజూ వస్తున్నాడని మీ అమ్మ రాసిందిగా" కోపంగా అన్నాడు.

హాల్లో వెలుగుతున్న పెద్ద లైటు ఆర్పేసి, నీలం బల్బ్ వెలిగించి, నా రూమ్‌లోకి వెళ్లి లోపల ఘడియ జాగర్తగా వేసుకున్నాను.

నిద్రరావడంలేదు, అయినా సరే లైటు ఆర్పేసి పక్కమీద పడుకున్నాను. నిద్ర వస్తోందని చెప్పి, మామయ్య దగ్గిరనుంచి వచ్చేశాను. ఇప్పుడు లైటు గనక వెలిగిస్తే నేను నిద్రపోవడం లేదని అనుకోడా ?

చీకట్లో సీలింగ్ ఫాను చారలు చారలుగా తిరుగుతున్నది. కళ్లముందు పెద్ద పెద్ద ఆకారాలు ; గుండ్రం గుండ్రంగా తిరుగుతూ, కిందా పైనా, మీద జర జర పాకుతున్నట్లు భ్రమ కలుగుతోంది. దట్టమైన చీకటి నన్ను నిలువునా చుట్టుముడుతోంది. వూపిరి శలపనట్లుగా వుంది - ఈ కాటుకలాంటి చీకటి. లైటు వేసుకుంటే బాగుండును కాని లైటు వేసుకోవాలని అనిపించలేదు. కిటికీ తలుపులు తెరిస్తే.

లేచి కిటికీ తలుపులు తెరిచి కొంచెంసేపు అలానే నిలుచున్నాను. ఎదురింట్లో దీపం యింకా వెలుగుతూనే వున్నది.

ఈ సాయంకాలం ఆయన మాట్లాడిన మాటలన్నీ జ్ఞాపకం వస్తున్నాయి. ఎటువంటి నీచుడినైనా దగ్గిరనుండి చూసినపుడు అతన్ని మనం పరమనీచుడు అని అనుకోవడం చాలా తప్పు అని తెలుసుకున్నాను.

ఈ సాయింత్రం యీయన తన గురించి చాలా సంగతులు చెప్పారు. ఆయన చెప్పిన అన్ని మాటల్లో "నేను బాధ్యత తీసుకుని ఏపని చెయ్యను. నేను చేసే పనులకి నేను బాధ్యుడని కాను" అన్నారు. హౌ డేంజరస్ యిట్ యీజ్. ఆయనతో కలిసి బతికేవాళ్ళకేకాదు, ఆయనవల్ల ఆయనకే ప్రమాదం. ఒక పనిచేసి ఆపైన మంచి చెడ్డలు తనవికావు - అవి తన బాధ్యత కాదు అనుకోవడం ఎంత ప్రమాదం.

## 17

ఈ సాయింత్రం రెస్టారెంటులోనూ, ఆ తరువాత బీచ్‌లో కారులో కూచుని - యీయన తన గురించి చెప్పిన విషయాలన్నీ యిప్పుడు మళ్ళీ నెమరు వేసుకుంటున్నాను. తన గురించి చెబుతున్నపుడల్లా ఈయన తన తండ్రి గురించి చాలా తలచుకుంటూంటారు. తండ్రి అంటే ఈయనకి చాలా ప్రేమ. తండ్రి గురించి మాట్లాడుతున్నపుడు - నేను పరీక్షగా చూస్తూంటాను. ఈయన కళ్లు రెండూ తళ తళ మెరుస్తూంటాయి. తండ్రి మూర్తి ఎదురుగా నిలుచున్నట్లు మాట్లాడుతూంటారు. చుట్టూ పరిసరాలని మర్చిపోయినట్లు ప్రవర్తిస్తూ వుంటారు. ఇందాక ఈయన అన్నారు :

"నాకు మా మదర్ ముఖం కూడా తెలియదు. దెన్ అయి వాజ్ టూ యంగ్. మా అమ్మ పోయాక నాన్న రెండోపెళ్ళి చేసుకోలేదు. నాకోసమనే ఆయన మళ్లీ పెళ్లి చేసుకోంది. నాతో సూటిగా ఎప్పుడూ అనలేదుగాని, యితరులతో ఆయన అనే మాటలనిబట్టి, ఆయన నాకొరకే పెళ్లి చేసుకోలేదని అర్థం అవుతూంది. ఎవరన్నా పెళ్లి విషయం ఎత్తుతే "ఇదంతా ఎందుకయ్యా? రాజాలాంటి పిల్లవాడిని నా చేతుల్లో పెట్టి అది వెళ్ళిపోయింది. నాకు యింతే ప్రాప్తం అనుకుని కాలం వెళ్లబుచ్చుకోవాలి. అంతేగాని యింకో ఆడదాన్ని కట్టుకుని, దానికి మరో యిద్దరు పిల్లలని కని 'నీ డబ్బా - నా డబ్బా?' అనుకుంటూ ఎందుకొచ్చిన జంఝాటన" అంటూ వుండేవారు. ఇప్పుడు అనుకుంటూ వుంటాను ఆయన నామీద ఎంత ప్రాణం పెట్టుకున్నారో అని. నా కిప్పుడిప్పుడే అర్థం అవుతోంది. ఆయన నన్నెంత ప్రేమించిందీని. నామీద ఎంత ప్రేమ లేకపోతే,

నా కోసరం తన సుఖంకూడా వొదులుకుని రెండో పెళ్లి చేసుకోకుండా వుంటాడు.. మా నాన్న పెద్ద చదువూగిదువూ వున్న మనిషి కాదు. కాని మంచి బిజినెస్ మైండ్. వ్యాపార విషయాల్లో చాలా గట్టివారు. ఒకవిధంగా చూస్తే అంత అలవిగాని ప్రేమ కొడుకుపైన చూపించడం మంచిది కాదేమోననిపిస్తుంది. ప్రేమకీ, వాత్సల్యానికీ కూడా కొంత హద్దులు వుండటం మంచిది. నేవొక విషయం చెప్పనా? నేను యిలా ఎందుకూ పనికి రాకుండా అవడానికి ఆయనే కారణం. నా మీద అవధుల్లేని ఎంత ప్రేమ కురిపించాడో, చివరి రోజుల్లో ఆయన అంతగానూ నావల్ల కష్టాలు పడ్డాడు. 'ఓ హౌ హి కర్స్‌డ్ మీ' నన్ను తిట్టి శపించి పోశేవారు. మళ్లీ ఆయనే తను అన్నమాటలు తలుచుకుని బాధ పడేవారు.

రుమాలు తీసుకుని - నుదురు తుడుచుకుంటున్నట్లు తుడుచుకుంటూ కళ్లు కూడా అలాగే వత్తుకున్నారు. నేను ఏమి అడిగానని? ఎందుకీ విషయాలన్నీ మొదలుపెట్టారు? అని మథన పడుతున్నాను.

"ఇంతకు ముందే చెప్పారుగా : 'నేను చేసే ఏ పనికి నేను బాధ్యుడనుగాను - ఆ బాధ్యత మోసే శక్తిలేదు. అయామ్ నాట్ సో స్ట్రాంగ్' అని.

ఇది చాలా ప్రమాదకరమైన ఆలోచనని - నేను ఆయనతోనే అనేశాను.

"మీరు చేసే పనులకి మీరు బాధ్యులు కారు అనుకుంటే - దానివల్ల తక్కిన వాళ్లే కాదు మీరుకూడా కష్టాలు పడాల్సి వస్తుంది. మీరెంత నిర్బాధ్యతా యుతంగా మాట్లాడుతున్నారో తెలుసా?" అని అడిగేసరికి తప్పు చేసినట్లు చిన్న పిల్లవాడిలా నావంక బెరుగ్గా చూశారు. ఇంగ్లీషులో ఆయనకి బాగా అర్థం అయేటట్లు 'యు ఆర్ యాన్ అడల్ట్' మీరు పసిపిల్లవాడు కాదు. వ్యక్తిం తెలిసిన వారు, పెద్దవారు అది మరచిపోకండి. చిన్న పిల్లలకీ పెద్దవాళ్లకీ మధ్యనున్న తేడా యిదే! పిల్లలు తప్పులు చేస్తే ఆ తప్పుకు వాళ్లు బాధ్యులు కారు. కాని పెద్దల విషయం అలా కాదే! ఎవరు చేసిన తప్పుకి వారే బాధ్యులు. వారు చేసే పనుల బాగోగులు వారే అనుభవించాలి. అంతేగాని చిన్న పిల్లవాడు తల్లి దగ్గిర చెప్పినట్లు. 'నేను చేసిన పనికి నేను బాధ్యత తీసుకోలేను' అని చెపుతున్నారే అని నవ్వాను. నా నవ్వుచూస్తే ఈయనకి తల్లి జ్ఞాపకం వచ్చివుంటుంది.

పొద్దు పూర్తిగా వాలిపోయి చీకట్లలోకి జారిపోయింది. మా చుట్టూ వరస వరసగా కార్లు పేర్చినట్లున్నాయి. ఆ మూలవున్న దీపాలు అక్కడా అక్కడా డిమ్‌గా తమాషాగా వున్నాయి. అదీ ఒక అలంకరణే కాబోలు. ఆ దీపాలకాంతి బారులు తీర్చిన కార్ల టాపులపైన ప్రతిఫలించి తళ తళ మంటున్నాయి. ఎదురుగా వున్న కొన్ని కార్లు హెడ్‌లైట్సు వేసుకుని మా పక్కనుంచి తప్పుకు వెళుతుంటే-

ఆ దీపాలకాంతి కళ్లల్లోకి సూటిగా గుచ్చుకుంటోంది. అలాటప్పుడు యీయన నోటికొచ్చినట్లల్లా ఆ కారు నడిపేవాడిని తిడుతూంటారు. ఈయన పెద్ద మాట్లనీ, తిట్లనీ చాలా తేలిగ్గా అనేస్తూంటారు. అలా అనటం ఆయనకి సర్వ సాధారణంగా వుంటుంది. తనేం మాట్లాడుతున్నారో ఆయనకే తెలియదు. ఈ మాటలు చెవినబడి అవతలవాళ్లు పోట్లాటకొస్తారేమోనని నాకు పీచు పీచు మంటూంటుంది. ఒకోసారి యీ తిట్లకి నేను సిగ్గుబడి ముఖం విట్లించుకోవడం చూసి 'అయామ్ సారి' అని నా దగ్గిర మటుకు క్షమార్పణ వేడుకుంటారు. సిగరెట్ తాగుతూ మాట్లాడకుండా ఏదో ఆలోచిస్తున్నారు. ఆ ఆలోచన అలాగే ఆగిపోయి, అది నిట్టూర్పుగా మారి, ఆ తరువాత అది మాట అవుతుంది. యాష్‌ట్రేలోకి బూడిద దులుపుతూ నావంక చూడకుండా ఇంగ్లీషులో ఆరంభించారు.

"నేను చాలా దురదృష్టవంతుణ్ణి. పెద్ద మేడ, కారు, డబ్బు యివి వుంటే చాలా? అందువల్లనే నేను అదృష్ట హీనుడనని అంటున్నాను. నీలాగా ఎక్కడో సాధారణ కుటుంబంలో పుట్టివుంటే, నేను యింతకంటే హాయిగా వుండేవాణ్ణి. ఆ రోజుల్లో స్కూలుకు వెళుతుంటే ఖర్చుకని మా నాన్న పది రూపాయలు యిచ్చేవారు. అంతకు ముందు రోజుకి రూపాయి యిస్తూండేవారు. ఒక రోజున - ఆయనకు తెలియకుండా నేను డబ్బు దొంగిలించాను. అది తెలుసుకున్నాకనే నాన్న నాకు రోజుకు పది రూపాయలు యివ్వడం మొదలుపెట్టారు. "నీ కెంత కావాలన్నా యిస్తాను. ఖర్చు పెట్టుకో. అంతేగాని దొంగతనం మటుకు చెయ్యకు. ఇంకెప్పుడూ దొంగిలించనని వొట్టెయ్యి" అని నాచేత వొట్టు పెట్టించుకున్నారు. గంగా 'డు యు నో వన్ థింగ్ ? నీకు ఒక విషయం తెలుసా?" అని అడిగి నావంక చూస్తున్నారు. ఆ నన్నని చీకట్లో ఆయన వంక పరీక్షగా చూస్తున్నాను. ఆయన కళ్లు తళ తళ మంటున్నాయి. వెనకవైపు నుంచి వెలుతురు పడుతోంది. ఆ వెలుగులో ఆయన చెంపకిందుగా చెవీ, ఆ వెనక జుట్టూ తళ తళ మెరుస్తున్నాయి.

"నేను యిప్పుడు కూడా దొంగతనం చేస్తూనే వున్నాను. నా డబ్బుని నేనే దొంగిలిస్తున్నాను. హౌ అన్‌ఫార్చునేట్". నేను మొదటిసారి దొంగతనం చేశానే ఆ రోజునే నాన్న - నన్ను నాలుగు తన్నివుంటే బాగుపడి వుండేవాడిని. నన్ను బాగు చెయ్యడానికైనా కొట్టివుండాల్సింది. ఆయన అది చెయ్యలేదు. చెయ్యలేక పోయారు. ఆయనకి నాపైన అంత ప్రేమ. పన్నెండేళ్ల పిల్లవాడికి, కాన్వెంటుకి కారులోవెళ్లి వచ్చే పిల్లవాడికి, పాకెట్‌మనీ పది రూపాయలు యివ్వటా - అదీ రోజుకి పదిరూపాయలా? అని ఆలోచించలేదు. ఈ రోజుల్లో కూడా పద్మ అంత డబ్బు నా పిల్లలకు యివ్వదేమో! ఇవ్వడానికి వీల్లేదంటుంది....

నేనో ఫ్రెండ్సు అందరినీ తీసుకెళ్ళి హొటల్లో పెట్టిస్తూ వుండేవాడిని. అదేదో గొప్ప విషయంలాగా వుండేది. అలా గొప్పలకు పోయి రోజూ ఆ పది రూపాయలూ ఖర్చు చేస్తూవుండేవాడిని. కొన్నిరోజుల్లో ఆ పదికూడా సరిపోయేది కాదు. ఆలోచించి చూడు పాతికేళ్ళ క్రితం పదిరూపాయలంటే ఎంత గొప్ప - ఎంత విలువ? మీలాంటి కుటుంబాలకి రోజుకి పదిరూపాయల ఆదాయం కూడా వుండివుండదు. 'యామ్ మై రైట్ ?' అంటూ నా ముఖం మీదికి చూపుడు వేలుతో సూటిగా ప్రశ్నిస్తున్నారు.

'ఎస్ యు ఆర్ రైట్' అన్నాను. అప్పుడు మా కుటుంబం ఏ పరిస్థితిలో వుండేదో ఒక్కక్షణం తలుచుకుని చూశాను. పాతికేళ్ళ క్రితం నాన్న బతికే వున్నారా? ఆయనకి ఎనభై రూపాయలు జీతం అనుకుంటా. ఆ తరువాత గణేశన్ వుద్యోగంలో జేరాడు. అప్పుడు గూడా వాడికి నెలకి డెభై రూపాయలు జీతం యిస్తూండేవారు. పదిహేడు రూపాయలు యింటి అద్దెయిస్తూ, ఆ ఆదాయంతో అమ్మ కుటుంబాన్ని ఎలా లాక్కొచ్చేదో! ఎంత కష్టపడి వుంటుందో? పాపం!- - - -

ఈయన అంటున్నారు.

"ఆ పదిరూపాయలు నేను ఖర్చుపెట్టుకోకుండా, ఖర్చు పెట్టుకున్నా మిగిలింది నేను దాచిపెట్టుకోవాలట. అలా దాచిపెట్టడం మా నాన్నకి ఒక సరదా. అదంతా లెక్కగట్టి గుమాస్తా దగ్గిర చెబుతూండేవారు. పైగా నన్ను పిలిచి 'ఏరా - అంతేగదూ దాచిపెడుతున్నావు గదూ' అంటూ అడుగుతూండేవారు. నేనూ బుద్ధిమంతుడిలాగా తల వూపుతూండేవాడిని. వంద రూపాయలు పెట్టి, రెండొందలుపెట్టి ఏవన్నా సామాను కొని తెస్తూవుండేవాడిని. ఇది కొంటానికి దొంగతనం చేస్తూండేవాడిని. పాకెట్‌మనిలో మిగుల్చుకుని, కూడబెట్టి, ఆ డబ్బుతో కొన్నానని మానాన్న సంతోష పడుతూండేవాడు. ఎవరినైనా మొదలంటా నాశనం చెయ్యాలంటే, మళ్లీ లేవకుండా మొదలంటా నరికెయ్యాలంటే, కొన్నాళ్లపాటు అడిగినప్పుడల్లా డబ్బు యిస్తూనేవుంటే చాలు. ధారాళంగా చేతినిండా డబ్బు యిస్తూండాలి, ఖర్చు పెట్టగలిగినంతా యిస్తూ, 'టక్'న ఒక మంచిరోజున యివ్వడం ఆపెయ్యాలి. బొమికలు పట పట విరిచెయ్యడానికి యింతకిమించిన ఆయుధం మరొకటి వుండదు. మానాన్న అలాగే నన్ను పాతాళంలోకి అణిచివేశాడు."

ఇన్ని తెలిసి, యింత మాట్లాడే మనిషి ఎందుకిల్లా ప్రవర్తించారు? ఎందుకీ విధంగా చెడిపోయారు? అని నాలో నేను అనుకుంటున్నాను. నా మనోభావాన్ని పసిగట్టినట్లుగా ఆయన బదులుచెప్పడం ఆరంభించారు.

"ఈ తెలివి, యీ ఆలోచన - యివన్నీ యిప్పుడే వచ్చినాయి. అదికూడా నీలాటి మంచి మనుషులు ఎదురుగా వున్నప్పుడు మటుకే వస్తాంటాయి. కొన్నాళ్లగా నీగురించి ఆలోచించి, ఆలోచించి నేను బాధపడుతున్నాను. మనం చేసిన పనులకి మనమే బాధ్యత వహించాలి అంటున్నావు బాగుంది. ఇప్పుడు నీవల్ల చేసిన అపచారానికి ఎలా బాధ్యత వహించను? దానికి ఏదన్నా దారి చూపించు. ఆ తప్పును వొప్పుచెయ్యడానికి ఒక్కదారికూడా కనపడటంలేదు. 'అందుకనే నేను చేసే ఏ పనికీ బాధ్యత వహించను' అని వొప్పుకుంది. నాకు బాధ్యత లేదు అని తప్పుకోవచ్చు. అంతవరకూ సరే! కాని ఆ చేసిన పాపం పూరికేపోతుందా? ఆ పాపం తగలకుండా పోతుందా? అని యిప్పుడు ఆలోచనలు వస్తున్నాయి. కాని ఒక విషయం మటుకు నిజం - అది నేను తెలిసిచేసిన పాపంకాదు. నాకు మల్లే నీవుకూడా అదేదో తమాషా కిందా, సరదా కిందా తీసుకుంటా వనుకున్నాను. అలా అనుకోవడం తప్పని ఆనాడే తెలుసుకున్నాను - కాని ఏం లాభం? అప్పటికే అంతా మించిపోయింది. సరి -- ఇన్నాళ్లు అయాక, నావల్ల నువ్వు యిలా మోడువారిపోయాక, నేను నీకు ఏం సాయం చేయగలను? నీ జీవితాన్ని ఎలా సరిదిద్దగలనూ? ఐ మీన్ అటాన్‌మెంట్-. ఎలా చెయ్య గలను? బట్ ఐ షుడ్ డూ సమ్‌థింగ్ ఇప్పటికే మనిద్దరి గురించీ రకరకాలుగా అనుకుంటున్నారు. అందుకు మనం అవకాశం యిచ్చాము కూడాను. నువ్వు ఎందుకు ఈ అపవాదు నెత్తిన వేసుకుంటున్నావో - నాకు అంతుపట్టడంలేదు. నీకు నామీద వ్యామోహం వుందనికూడా నేను అనుకోవడం లేదు. ఎందుకంటే అలాంటిదైతే నేను ముందే గ్రహించుకోగలను. నీకు అలాంటి వుద్దేశం లేదని నాకు స్పష్టంగా తెలుసు. మరి దేనికొరకు? దేనికోసం యిటువంటి చెడ్డ పేరు తెచ్చుకుంటున్నావ్? మంజు మటుకు చెడుగా అనుకోకూడదని అంటున్నావు బాగానే వుంది. ప్రస్తుతం చెడుగా అనుకోకపోవచ్చు కాని రేపు అనుకోవచ్చుగా! ఎవరు ఎలా అనుకున్నా నాకేం ఫరవాలేదు. నేను దేన్నిగురించీ లెక్కచెయ్యను. బాధ్యత పెట్టుకోను. నేను నీవైపు నుంచి ఆలోచిస్తున్నాను. ఎంత ప్రయత్నించినా నిన్ను అర్థం చేసుకోలేకుండా వున్నాను."

మా చుట్టూ కార్లన్నీ ఒకటొకటే వెళ్లిపోయాయి. దూరంలో అక్కడొకటీ అక్కడొకటీ మిగిలివున్నాయి. కాకిబొక్కా అబ్బాయివచ్చి, 'ట్రే తియ్యమంటారా సార్' అని అడుగుతున్నాడు. ఈయన 'సరి' అనగానే ట్రే వూడదీసుకుని వెళ్లిపోయాడు. చాలా సేపు యిక్కడే వుండిపోయినట్లున్నాము. ఈయనతో అన్నాను.

"ఇంకెక్కడికయినా వెళదాం. ఇక్కడే కూచుని వుంటే విసుగ్గా వుంది". ఆయన ఆశ్చర్యంగా చూస్తున్నారు నా వంక.

"బీచికి వెళదామా?" అని అడిగారు.

"ఓ – యస్."

## 18

కారు కదిలింది. కారు నడుపుతూ ఆయన అడుగుతున్నారు. 'ఈ రోజు నీకేమిటయింది? సాధారణంగా బీచికి హొటల్‌కి పిలుస్తే రానంటావు, ఈ రోజు నీఅంతంట నువ్వే వెళదామని అంటున్నావ్? వాట్ ఈజ్ ది మేటర్?' అంటూ నన్ను చూసి నవ్వుతున్నారు. ఈయన యిలా నవ్వుతుంటే చిన్నపిల్లవాడు నవ్వినట్లు వుంటుంది. మంజు కూడా యిలానే అమాయకంగా నవ్వుతుంది. ఈ నవ్వు విషయంలో తండ్రికీ కూతురికీ ఒకే పోలిక.

తలవంచుకు నవ్వి బదులు చెప్పాను. "మీతో కాసేపు మాట్లాడాల్సింది వుందని ముందే చెప్పాను గదా?"

"ఓ యింకా వుందా? మాట్లాడాల్సింది అయిపోయిందనుకున్నాను. ఎని మోర్ ఎడ్వైజెస్?"

"నోనో అదేం లేదు" అన్నాను. ఇద్దరం ఎవరి ఆలోచనల్లో వాళ్ళమున్నాము. కారు మటుకు వెళుతోంది. ఈయనతో మాట్లాడాల్సిన విషయాలు యింకా ఏమైనా వున్నాయా? అని ఆలోచిస్తున్నాను. ఈటైముకి పాపం ఎక్కడైనా, ఎవరితోనైనా హాయిగా తాగుతూ సంతోషంగా వుంటారేమోనని అసూయగా వుందా? ఇందులో నేను ఓర్వలేకపోవడానికి ఏముంది? మాట్లాడాలనే సాకుతో వెళ్ళకుండా చెయ్యాలని యిలా వెంట తీసుకువచ్చానా? ఈయన ఎక్కడికెళితే నాకేం? నాగురించి మంజు ఏదో అనుకుంటే నాకేం పోయింది? ఇటువంటి అసత్యపు వార్తల్లో నేనెందుకు చిక్కుకుంటున్నాను. 'ఇదే నిజమని' అని నేనెందుకు వొప్పుకోలేకుండా వున్నాను. వాట్ యీజ్ రాంగ్ యిన్ యిట్? ఈయన ఏమీ కాదు అనలేదు. నేనే 'కాదు' అని వొప్పుకోంది. నా విషయంలో మామయ్య తీసుకున్న పాటి చనువుకూడా యీయన చూపించడంలేదు. ఈయనేం మహా మడిగట్టుకు కూచున్నాడా? మిగతా వాళ్ల విషయంలో యీ బెట్టు చూపించేటట్లు తోచదు. ఒక రాత్రి కూడా యింట్లో గడపరు - నాదగ్గిర మటుకు యీ నిగ్రహం ఎందుకో?

నేనెందుకిలా ఆలోచిస్తున్నాను? నేనేం కావాలనుకుంటున్నానో నాకే అంతు పట్టటంలేదు. ఈయనపై నాకు కాంక్ష కలుగుతోందా? ఛీ ఛీ యిది అబద్ధం. ఈయనకి నామీద అనురక్తి కలగాలని ఎదురు చూస్తున్నానా? ఒకవేళ అలా వాంఛ కలిగితే ఒప్పుకుంటానా? ఈయనకు నాపైనా - నాకు ఆయన పైనా

పరస్పర వ్యామోహం కలుగుతే బాగుండును. కాని అటువంటి వాంఛ నాకు యీయన పట్ల కలగదనుకుంటా. ఈయనకి ఒకప్పుడు నా మీద యిటువంటి వ్యామోహం కలిగి వుండవచ్చు. ఆ కాంక్షతోనే కదా ఆ సాయింత్రం నన్ను కలుసుకోవడానికి వచ్చింది. నేనే ఆ ఆశని తుంచి పారేశాను. అందుచేత యీయనకి నా మీద అటువంటి వ్యామోహం కలగదు. ఈయనకేం? (వెన్ మిల్క్ యీజ్ సో చీప్ వై షుడ్ ఐ బై ఎకౌవ్?) పాలు చవకగా దొరుకుతుంటే గేదెను కొనుక్కోవడమెందుకన్న ఆ ఇంగ్లీషు సామెత యీయనకి పూర్తిగా వర్తిస్తుంది. నాకో? ఈయనపై నాకు ఏదో కాంక్ష కలుగుతోంది. ఆయనకీ నా మీద రక్తి కలుగుతున్నట్లుంది. కాని ఒకటి మటుకు నిశ్చయంగా అనిపిస్తోంది. నన్నెవరు బలాత్కరిస్తే వారికి లొంగిపోవ డానికి సిద్ధంగా వున్నాను. నన్నెవరయినా బలాత్కరించి, లొంగతీసుకుంటే బాగుండుననిపిస్తున్నది. ఈయన తప్ప, యింకెవరూ నన్ను బలవంతపరచకూడ దని కూడా అనిపిస్తున్నది. ఇటువంటి బలవత్కార సంఘటన సంభవించినపుడు అది యీయనే కావాలన్న తీవ్రమైన కోర్కె నాలో రేగుతున్నది. అందుకొరకే నేను ఈయన పక్కకి వచ్చి నక్కి నిలుచుని వున్నాను కాబోలు. పరపురుషుల నుంచి యీయన నన్ను రక్షిస్తారనే వుద్దేశంతో మటుకు కాదు. ఈయన నన్ను లొంగ దీసుకోవాలనేటువంటి, ఆ బలమైన కోర్కెనుండి నన్ను నేను రక్షించుకోవడానికి యీయన పక్కన వొచ్చి నిలుచున్నాను కాబోలు. యికనుంచీ నేను చేసే ఏ పనికీ నేను బాధ్యురాలను కాదు. ఓ హౌ డేంజరస్ యిట్ యీజ్.

చంద్రబింబం ఎదురుగా కనిపిస్తోంది. ఇక్కడి నుంచి చూస్తుంటే చంద్రబింబం చుట్టూ కాంతి పరుచుకుంటూ, భూమిలోంచి ఆకాశంలోకి తేలివస్తున్నట్లు అనిపిస్తోంది. ఆధవళ కాంతిలో సముద్రజలం కనిపించడం లేదు. నిన్నగాని మొన్నగాని వచ్చి వుంటే పూర్ణబింబాన్ని చూసివుండేవాళ్లం. ఈయన కారు యిక్కడికి తీసుకువొచ్చి ఎప్పుడు నిలిపారో కూడా నేను గమనించలేదు. నేను ఆలోచనాస్రవంతిలో గుడ్డిగా వుండిపోయాను – మనసులో వేలాది ఆలోచనలు సుళ్లు తిరుగుతున్నాయి. కావాలను కున్నవీ, అక్కర లేవనుకున్నవీ - అన్ని ఆలోచనలూ గజిబిజిగా తిరుగుతున్నాయి. ఆలోచనలు లేని స్థితి వుంటుందా? ఇవన్నీ వృధా ఆలోచనలు కాక మరేమిటి?

"ఏదో మాట్లాడాలని అన్నావే? చెప్పు?" అంటూ కారు తలుపు తెరిచి, ఒకకాలు ఆ తలుపు మీద చాచి ఎత్తిపెట్టి, హాయిగా వెనక్కి జారగిలపడి, సిగరెట్ అంటించారు. ఆ పొగ నన్ను ఆత్మీయంగా చుట్టబెడుతోంది. ఏదో ఒక రోజున నేను కూడా సిగరెట్ కాల్చి చూడాలి. ఏమవుతుంది? సిగరెట్ కాలుస్తే ఏమవుతుంది? హెడ్ క్లర్క్ మిసెస్ మాన్యూల్ వుండే ఆవిడ తాగుతుంటే చాలాసార్లు చూశాను. ఆవిడ ముఖం చూస్తుంటేనే సిగరెట్ తాగుతుందని కనిపెట్టవచ్చు. పెదిమలు నల్లగా

కమిలినట్టువుంటాయి. సిగరెట్ కాల్చడం అంటే మొగలక్షణం కదా! ఊరికే అనుకుంటాను కాని నేనెక్కడ కాల్చ గలుగుతాను? ఏం కాల్చుదామని అనుకో కూడదా? సీటు మీద ఆయనకూ నాకూ మధ్యనున్న ఆ సిగరెట్ పాకెట్ చేతులోకి తీసుకుని చూస్తున్నాను. ఏదో అలవాటైన వాసన వస్తోంది.

"ఈ సిగరెట్ వాసన నీకు పడుతుందా?" అని అడిగారు.

"ఇందులో పడటానికి ఏముంది? కొందరు అక్కడ తాగుతుంటే యిక్కడ కడుపులో తిప్పుతుంది. ఇది అట్లాలేదు. అంతే" ధైర్యంగా అబద్ధం చెప్పాను.

ఏదో ఒకటి మాట్లాడాలని మిసెస్ మాన్యుల్ సిగరెట్ తాగుతుందన్న విషయం ఈయనతో అన్నాను. అది విని ఈయన ఆశ్చర్యపడినట్లు లేదు. సిగరెట్ తాగేటువంటి ఆడవాళ్లేం ఖర్మ! ఈయన దగ్గరకొచ్చే ఆడవాళ్లు బ్రాంది విస్కీకూడా తాగుతారు కాబోలు. అలాంటివాళ్లు ఈయనకి చాలామంది తెలుసున్నట్లుంది. నేను చెబుతున్నది వినిపించుకోనట్లు, చందమామను చూస్తున్నారు.

"ఏదో మాట్లాడాలని చెప్పి తీసుకొచ్చి అర్థం పర్థంలేకుండా వాగి విసిగిస్తున్నానా?" అని అడిగాను.

"నో – నో" అని నావంక చూస్తూ అన్నారు. "వినుగేంలేదు. నిన్ను ఎలా అర్థంచేసుకోవాలో బోధపడటంలేదు. మొదట నువ్వు నాకెందుకు ఫోన్ చేశావ్? ఎందుకు నన్ను రమ్మనమని చెప్పావ్? నా పేరుతో నీ పేరు కలుపుకు – నువ్వెందుకు - నిన్ను దుమ్ములోకి లాక్కుంటున్నావ్? నీ ఫ్యూచర్ గురించి నువ్వు ఎప్పుడైనా ఆలోచిస్తావా? అని నాలో నేను ప్రశ్నించుకుంటున్నాను. ఇన్ వాట్ వె ఐ కెన్ హెల్ప్ యు?" అని అడగడం చూస్తుంటే ఈయనని నేను బాధపెడుతున్నాను కాబోలు అనిపించింది.

ఈయన వేసిన ప్రశ్నలన్నిటికీ నేను బదులు చెప్పలేకుండా వున్నాను. కాని ముందే నిర్ణయించుకుని, ఒక పట్టుదలతో యీ పనులంతా చేస్తున్నాను. అందులో సందేహములేదు. ఏదో ఒక కాంక్షతో, ముందు వెనకా ఆలోచించు కోకుండా ఆనాడు – యీయన నన్ను కార్లో తీసుకుని వెళ్లిపోయారు. ఆపైన ఎర్పడే ఫలితాల గురించి యోచించకుండా నన్ను లాక్కెళ్లిపోయారు. అదే విధంగా ఈయన్ని ఏదో ఒక తీరని కోరికతో, ఆశతో పట్టుకుని వచ్చానా? అని నాలో నేను తర్కించుకుంటున్నాను.

నాకే తెలియని, ఒకానొక నిజాన్ని అనుకోకుండా, గభాలున పైకి అనేశాను. ఏదో ఒక మత్తులో నన్ను నేనే మర్చిపోయి అన్నాను.

"నాకు కొన్ని రోజులుగా ఏదో భయంవేస్తోంది. నన్ను ఎవరేనా 'రేప్' చేస్తారేమోనన్న భయం కలుగుతోంది. నన్నెవరేనా బలవంతాన లోబరచే

కుంటారేమోనన్న భయం. ఆ భయం వల్లనే మీ దగ్గరకు చేరాను." ఈ మాటలు నేను పైకి అనివుండకూడదని అనిపించి, సిగ్గుతో తలవంచుకున్నాను. వళ్లంతా వణుకుతోంది.

"డోంటు బి సిల్లీ" అని నాకు బదులుచెప్పారు. "నువ్విప్పుడు చిన్న పిల్లవికాదు. నన్ను అడిగావే – అలానే ఆర్ యు నాట్ ఏన్ అడల్ట్? నువ్వొక ఆఫీసరువి, చదువుకున్నదానివి, వ్యక్తిత్వం వున్నదానివి. అందులోనూ నీకు యిష్టంలేకుండానా? 'ఇట్ యీజ్ ఎ బేసిలెస్ ఫియర్' లేనిపోని పిచ్చి పిచ్చి భయాలు పెట్టుకోకు"

నాకు కళ్లంట నీళ్లు వస్తున్నాయి. మనసుని పరిశుభ్రం చేసేవి యీ కన్నీళ్లే. నామనసు చెడిపోయిందనుకుంటా. నాలోని చెడు ఆలోచనలన్నిటినీ యీ కన్నీరు ప్రక్షాళనం చేస్తుంది కాబోలు. సర్దుకుని కన్నీళ్లు తుడుచుకుని అన్నాను.

"ఒకసారి యిలా అవటంచేత నామీద నాకు నమ్మకం పోయింది. నా యిష్టానికి వ్యతిరేకంగా ఎవరన్నా ఏదన్నా చేస్తారేమోని భయం కలుగుతూంటుంది. ఇటువంటిది ఏదేనా నా ముఖాన రాసిపెట్టివుంటే – అదెవరో ముక్కు మొహం తెలియనివాడుకాక, మీరే అవాలని, ఆ వ్యక్తి మీరే అయివుండాలని, మిమ్మల్ని వెతికి పట్టుకున్నాను."

"డోంట్ టాక్ సచ్ నాన్‌సెన్స్ నా కంఠంలో ప్రాణం వుండగా అలాంటిది జరగదు" అంటూ నొక్కి యింగ్లీషులో చెప్పారు. నేను ఆయనవంక పరిశీలనగా చూస్తున్నాను.

"నీకు తెలుసుకదా! నేనేదో పెద్ద మడిగట్టుకున్న వాడిని కాదని. దొరికిన ఆడవాళ్లతో పోతుంటాను. కాని ఒక విషయం. ఇష్టంలేని ఏ ఆడదాన్ని నేనింతవరకూ బలవంతపరచి పాడుచెయ్యలేదు. అటువంటి తప్పు నీ వొక్కదాని పట్లే జరిగింది. అదికూడా నువ్వు యిష్టపడుతున్నావని పొరబడ్డాను. అంచేతనే నీతో అట్లా ప్రవర్తించ కలిగాను. నువ్వు ఒకసారి జ్ఞాపకం తెచ్చుకుని చూడు. "నిన్ను నేను బలవంతపెట్టానా?" అదేదో నేను సవ్యంగా ప్రవర్తించానని సమర్థించుకోవడానికి చెప్పటంలేదు. అటువంటి అన్యాయం నేను పొరబాటుగా అర్థం చేసుకోవటంవల్ల జరిగింది తప్ప - కావాలని చెయ్యలేదు. . . . . అని నీకు విశదపరచడానికి . . . ." ఈయన చాలా రోజులబట్టీ యీ సంఘటన గురించి యోచిస్తున్నారు కాబోలు. ఇంగ్లీషులోనే చెబుతున్నారు.

"నేను పూర్తిగా చెడిపోయాను. నన్నెవరూ బాగుచెయ్యలేరు. చిన్నవయసులోనే నేను యీ అనుభవాలన్నీ రుచి చూశాను. నా మాదిరిగా అంత చిన్నవయసులో

యిటువంటి అనుభవానికి గురిఅయినవాళ్లు సాధారణంగా వుండరనుకుంటా. నా బాల్యంలోని మాయింటి పరిస్థితులే దీనికి కారణం. 'యు నో - ఐ వాజ్' ఈ మాటలు చెబుతుంటే ఆయన కంఠం వొణుకుతోంది. గొంతు బొంగురుగావుంది. 'అయి వాజ్ స్పాయిల్డ్ ఎట్ మై ట్వెల్త్ యియర్' యస్ నాకు అప్పుడు పన్నెండో ఏడు."

నాకు పారిపోవాలనిపిస్తోంది. ఈ విషయం గురించి వివరంగా చెపుతారా? ఇప్పటికే తలెత్తలేకుండా వున్నాను. నా రోజు బాగుంది. అక్కడితో ఆ విషయం ఆపేసి, జ్ఞాపకాలతో సిగ్గు పడుతున్నారు. మొఖంలో అసహ్యం, వెరుపు కనిపిస్తోంది. ఆయన ఏదో ఆలోచిస్తున్నారు. ఆయన ఆలోచించే విషయం గురించి నా మనసులో మెదలగానే ఎలాగో అనిపించింది.

ఇలాంటి విషయాలు మాట్లాడేందుకు యీయన్ని యిక్కడకు తీసుకుని వచ్చానా? నాకు కొంచెంకూడా బుద్ధిలేదు. నన్ను నేనే తిట్టుకుంటున్నాను. కాని యీ తిట్టుకోవడం కూడా అబద్ధమని నాకు తెలుసు, ఏదో తెలుసుకోవాలన్న కుతూహలం నన్ను ముందుకు తోస్తున్నది.

పెద్ద నిట్టూర్పుతోపాటు గుప్న పొగ వదిలారు. ఈయన గాలి పీలుస్తున్నారా? లేక పొగ పీలుస్తున్నారా - అన్న అనుమానం కలుగుతూంటుంది అప్పుడప్పుడు. ఎప్పుడు చూసినా సిగరెట్ చేతిలో లేకుండా వుండరే!

"నేను 'మదర్‌లెస్ ఛైల్డ్‌ని'. తల్లిలేని పిల్లవాడిని అవడం దీనికంతకూ కారణమనుకుంటా. నన్ను ఒక ఆయా పెంచింది. నాకు తల్లి అంటే ఆ ఆయా ముఖమే జ్ఞాపకం వస్తూంటుంది. ఆ ఆయా రెండేళ్ల క్రితందాకా బతికేవుంది. ఆ ఆయాకి ఒక కూతురు వుండేది. ఇప్పుడామనిషికి యాభైఏళ్లుంటాయి. మనుమలు కూడా వున్నారనుకుంటా. ఇప్పుడెక్కడో పల్లెటూరిలో వుంది. నువ్వు భయపడుతున్నావే - ఆ విధంగా అయి వాజ్ రేప్డ్ బై హర్. చాలా చిన్నప్పుడే నేను చెడిపోయాను. అయినా నేను కావాలని ఎవరినీ చెడగొట్టలేదు. కాని డబ్బుందే - ఆ డబ్బు అదే దీనికంతకూ మూలకారణం. దట్ యీజ్ ది డెవిల్ - లేకపోతే హైస్కూల్లో చదివేవాడికి గరల్ ఫ్రెండ్సా? అది కూడా కాలేజీలో చదివే ఆడపిల్లలు దొరకడమా? నా కారుని ఆపి లిఫ్ట్ అడిగే ఆడపిల్లలు వున్నారు. అయిస్‌క్రీమూ, మ్యాటినీసినిమా యీ రెండూ జీవితంలో చాలా పెద్దవన్న విషయం తెలుసుకున్నాను. అందుచేతనే నువ్వూ అల్లాంటి దానివే అనుకున్నాను. కాని నేను ఎవరినీ బలవంతపరిచి, నా కోర్కె తీర్చుకోలేదు. ఇప్పటికీ నేను రాత్రిళ్లు వూరుమీద తిరుగుతూనే వున్నాను. ఎందుకంటావ్? పద్మ తనని ముట్టుకుంటే కూడా భరించలేదు. అసలు నాస్పర్శనే అసహ్యించుకుంటోంది - అని తెలుసుకున్నాక తను నాకు పరాయిమనిషి అయింది. తను నాకు భార్యే

కావచ్చు అంతమాత్రంచేత ఆమెని బలవంతపరిచి, నేను లొంగదీసుకోగలనా ? ఐ కెనాట్ రేప్ ఎనీ వన్ - నో అయి కెనాట్'' అంటూ పళ్లు బిగబట్టి అంటున్నాడు.

ఈయన మాటలు వింటున్నకొద్దీ ఏదో బాధగా వుంది. గొంతు నరాలు బిగబట్టు కున్నట్లున్నాయి. ఏడుపు వస్తే బాగుండును. కాని ఏడుపు రానంటుందే !

నా మనసులో నేనే నవ్వుకుంటున్నాను. ఆ నవ్వుకు అర్థం సంతోషంకాదు.

నేను కోరుకున్నా కూడా మరొకసారి చెడిపోవడమన్నది జరగదు కాబోలు. ఈయనని ప్రేమించలేని నన్నూ, కోరుకున్నా కూడా బలవంతపరిచి, లోబరుచుకో తెలియని యీ మనిషీ, మేమిద్దరం ఒకరికొకరం తటస్థపడి, విడదియ్యరాని చిక్కుల్లో పడ్డాం. ఈ పరిస్థితిని తల్చుకుని జీవంలేని నవ్వు నవ్వుతున్నారు.

ఈయనలాగానే పళ్లుకొరుక్కుంటూ నా మనసులో అనుకున్నాను. 'ఐ కెనాట్ లవ్ యు - అదే మాటని ఈయనతో అనేశాను.

''నేనెవరినీ ప్రేమించలేను''

''ఇజ్ - యిట్ అట్లాగా ?'' అని నన్ను తేరిపారజూసి యింగ్లీషులో అన్నారు.

''ఐ సీ. ఎవరినీ ప్రేమించే అర్హత నీకు లేదని అనుకుంటున్నావు. అంతే కాదు నీకు బలాత్కరింపబడటానికి తప్ప, ప్రేమింపబడటానికి అర్హత లేదని, నిన్ను నీవే అవమానించుకుంటున్నావు. అందుచేతనే అలాంటిదేదన్నా సంభవించాలని కోరుకుంటున్నావు. (యు షుడ్ నో వన్‌థింగ్ దట్ వజ్ నాట్ ఎ రేప్) ఆ రోజు కారులో నువ్వు వొప్పుకున్నాకనే కదా! మరుక్షణంలో నువ్వు ఇష్టపడలేదని కూడా నాకు తెలుసు. కాని అంతకు ముందు, ఒక క్షణంముందు నువ్వు సమ్మతించావు. అది అబద్ధం కాదు. నువ్వు అమాయకతవల్ల వొప్పుకుని వుండవచ్చు. అది కాదనను. ఆ విషయం అక్షణంలోనే గ్రహించుకున్నాను. అందుకని అది 'రేప్' అని నువ్వు అనుకోకూడదు. నువ్వు అలా అనుకోబట్టే మీా అమ్మ దగ్గిరకెళ్లి చెప్పావు. (అండ్ దేర్ ది ట్రబుల్ స్టార్టెడ్) కష్టాలన్నింటికీ అదే కారణం. ఇంకా నువ్వేదో వూహించుకుని మళ్లీ కష్టాలు తెచ్చుకోకు. నువ్వు నా దగ్గర ఈ విషయాలన్నీ యిలా చెప్పావే - నేనేగనక రోగ్‌నయి వుంటే నీపని ఏమయివుండేది ? నీలోని ఈ బలహీనతని అదనుగా తీసుకుని మళ్లీ మిస్‌బిహేవ్ చేసివుండే వాడిని. అందుకని నీ మనసులో ఈవిధమైన బలహీనత ఎక్కడో దాక్కుని వుందని అంటున్నాను. ఈ వీక్‌నెస్‌ని వేళ్లతోపాటు సమూలంగా పీకిపారెయ్య మంటున్నాను.'' ఇంగ్లీషులోనే చెప్పుకుపోతున్నారు. ''యు షుడ్ ఎరాడికేట్ దట్ వీక్‌నెస్ ఫ్రం యువర్ మైండ్''

'అరే బాబా - ఈరోజు నీకిదంతా ఎందుకు చెప్పాననుకుంటున్నావ్? ఈ బలహీనతని గ్రహించి నువ్వు ఎడ్వాన్‌టేజ్ తీసుకోవాలనేకదా! ఇదికూడా అర్థం అవలేదా?' మనసులో ఆలోచనలు సుళ్లు తిరుగుతున్నాయి.

ఎదురుగుండా హెడ్ లైట్సు వేసుకుని ఒక కారు వస్తోంది. నేను కళ్లు మూసుకున్నాను. కారు దగ్గరకు రాగానే కళ్లు తెరిచి చూశాను. 'యల్ బోర్డు' వేసివుంది. తలనిండా మల్లెపువ్వులు పెట్టుకుని, మధ్యవయస్కురాలు ఒకామె కారు నడుపుతోంది. పక్కన భర్త కాబోలు కూచునివున్నాడు. పిండి మిషన్‌లాగా 'ఓ' అని అరుస్తూ ఆ కారు మా కారు పక్కన టక్కున ఆగిపోయింది.

ఆ భర్త పళ్లు పట పట కొరుకుతూ, కొట్టేటట్లు చెయ్యి ఎత్తి తిడుతున్నాడు. "యూ ఫూల్ - గేర్ మార్చేటప్పుడు క్లచ్ నొక్కమని ఎన్నిసార్లు చెప్పాను." తల మీద ఒకటి వేశాడనుకుంటూ. మేమీ కారులో వున్న విషయం ఆయన చూడలేదనుకుంటూ. పాపం ఆవిడను చూస్తే జాలేసింది. ఆవిడ నావంక చూస్తుంటే నేను ఎరగనట్లు మరోవైపుకి ముఖం తిప్పుకున్నాను. ఇదంతా చూసి ఈయన ఎక్కడ పైకి నవ్వేస్తారోనని నాకు భయంగావుంది. ఆవిడ కారు స్టార్ట్‌చేసి వెళ్లిపోయింది. ఆ కారువంక చూస్తున్న యీయన నా వైపుతిరిగి అడిగారు.

"నువ్వు డ్రయివింగ్ నేర్చుకో. నేను నేర్పుతాను. మా సుభాష్‌కు కాలుకూడా అందదు. అయినానరే పెద్దకారు నడుపుతానని తయారవుతాడు. పద్మ బాగా డ్రయివింగ్ చేస్తుంది. మంజుకి డ్రయివింగ్ నేర్పుతా రమ్మని పిలుస్తే రానంటుంది. నువ్వు మొదలుపెట్టావంటే, అదీ నేర్చుకుంటుంది" అంటూ వుత్సాహంగా అడుగుతున్నారు.

"ఇదివరకంతా నేను పొద్దుటా సాయంత్రం వాకింగ్‌కి వెళ్ళేదాన్ని. ఇప్పుడు తీరిక వుండటంలేదు" అంటూ నోరుజారి అన్నాను పైకి.

"తెల్లవారు ఝామునలేచి బీచికి వస్తే చాలా బాగుంటుంది కదూ! మంజుని కూడా లేపి తీసుకొస్తే దానికి డ్రయివింగ్ నేర్పవచ్చు. బీచ్‌రోడ్‌లో నెమ్మదిగా యిలా వాకింగ్ వెళ్లవచ్చు" అంటూ సలహాచెప్పారు.

నేను నవ్వుతూ "మీకు తెల్లవారుఝామని ఒక కాలంవుందని తెలుసా?" అడిగాను.

"వాట్ ఆర్ యు టాకింగ్. సాధారణంగా నేను ఆటైముకేగా యిల్లు చేరుకునేది. ఇంట్లో వున్నాకూడా ఆటైముకి మెళుకువగానే వుంటాను. అసలు నేను నిద్రపోతేగదా అని. ఒకవేళ కునుకుపట్టినా వెంటనే మెళుకువ వచ్చేస్తుంది" అంటూ ఇంగ్లీషులో చెప్పారు.

ఇలా అయితే యీాయన ఆరోగ్యం ఏమయిపోతుంది ? భాధలన్నీ అలా మనసులో దాచుకుంటారు. సహజంగా వచ్చే నిద్దరకూడా ఈయనకి కరువు అయిందికాబోలు. రోజంతా తప్పతాగుతారు. దానివల్ల శరీరం ఎందుకూ కాకుండా చెడిపోతోంది. దానికి తోడు ఒక్కరోజునన్నా కంటినిండా నిద్రకూడా పోరుట. ఈయన ఒక్కరోజునన్నా సుఖంగా నిద్రపోతారా ?

"మీరు డాక్టరుని కన్సల్ట్ చెయ్యకపోయారా? మీ డాక్టరుని అడగలేదా ?" అని ప్రశ్నించాను.

"ఓ యస్ తాగడం మానెయ్యమంటాడు. తాగడం మానేసి ప్రాణంతోవుండే కంటే తాగి తాగి చచ్చిపోవాలని వుంది నాకు. ఇట్ యీజ్ ఆల్ రైట్" అంటూ చాలా నిర్లక్ష్యంగా పొగవదులుతున్నారు.

రోజూ వుదయం లేచి బీచికి రావాలని యిద్దరం నిశ్చయించుకున్నాము. నేను వస్తానని తెలుస్తే మంజుకూడా వస్తుందట. మేము కారు ఆపుకునివున్నామే, లోపల రోడ్డు - ఆ రోడ్డుమీద మంజుకి డ్రయివింగ్ నేర్పుతారట. గాంధీశిలావిగ్రహం నుంచి, అయిరన్ బ్రిడ్జిదాకా సరాసరి వాకింగ్‌కి వెళ్లి తిరిగి మళ్లీ యిక్కడికే వస్తాను. అప్పుడందరం కలిసి డ్రయివిన్‌కి వెళ్ళి కాఫీతాగుతాము. ఎనిమిదింటికి ఈయన నన్ను యింట్లో దింపి వెళ్ళిపోయి, పదింటికి ఆఫీసుకు వెళుతూవచ్చి, నన్ను వెంటబెట్టుకెళ్ళి మా ఆఫీసులో దించుతారు. తెల్లవారుఝామున అయిదున్నరకల్లా నన్ను రెడీగావుండమన్నారు.

అప్పుడే రెండు కొట్టింది. ఎలాగో అలా నిద్రపట్టించుకోవాలని పక్క మీదకి వాలాను. చాలా సేపు కళ్ళుమూసుకునే వున్నాను. ఎప్పుడు నిద్రపట్టిందో తెలియలేదు. నిద్రపట్టిందా ? లేక వూరికే కళ్ళుమూసుకుని పడుకున్నావా ? గుమ్మంలో హారన్ వేస్తున్న శబ్దం వినిపిస్తోంది. లేచి లైటువేసి, అద్దంలో ముఖం చూసుకుంటే, కళ్ళలో నిద్రలేని బడలిక కనిపించింది. కారులో మంజుకూడావుంది. కిటికీలోంచి కనిపిస్తోంది. మొట్టమొదటిసారి మాయింటికొచ్చింది. లోపలికి రమ్మని పిలవనా? కిటికీలోంచి చూస్తున్న - తనూ నావంకచూసి 'గుడ్ మార్నింగ్' అంది.

"ఇంకా నిద్రా? అయిదున్నరకల్లా రెడీగా వుంటానన్నారుట. నవ్ యిట్ యీజ్ సిక్స్" అంటూ అక్కడినుంచే అరుస్తోంది.

గబగబ తల పైపైన దువ్వుకుని, హడావుడిగా చెప్పులువేసుకుని గదితలుపు తెరిచాను.

మామయ్య పక్కమీదనే కళ్ళుమూసుకుని కూచుని వున్నాడు. జపంకాబోలు ఇదే మంచి సమయం అనుకుని బయటపడ్డాను. మంజుని వచ్చేటప్పుడు లోపలికి పిలవవచ్చు.

వంటగదిలో కుంపటి విసురుతున్న అమ్మ కారుహారన్ వినగానే, తననే ఎవరో పిలుస్తున్నట్లు, హాలులోకి పరుగున వచ్చి, నన్నుచూసి అక్కడే ఆగిపోయింది.

"నేను కొంచెం బయటకి వెళుతున్నాను. ఎనిమిదింటికి తిరిగివస్తాను. మామయ్యతో చెప్పు" అంటూ బయట తలుపుతెరిచి వీధిలోకి వచ్చాను.

ఎదురింట్లో వీధిలో ముగ్గులు పెడుతున్నావిడా, పక్కింట్లో పాలుపితికేచోట గిన్నెలు పెట్టుకునుల్చున్నావిడా, వీళ్లంతా నన్ను చూస్తున్నారు. 'టక్' మని ఎదురింటి కిటికీతలుపు తెరుచుకుంది. కిటికీలోంచి ఒక ముఖం నావైపు చూస్తోంది.

కారులో వెనకసీట్లో కూర్చున్నాను.

"మీ యిల్లు చిన్నదిగా చక్కగా వుంది" అంది మంజు.

"లోపలికి పిలుద్దామనుకున్నా. ఇప్పటికే ఆలస్యం అయిపోయింది. వచ్చేటప్పుడు దిగి లోపలికివచ్చి చూసివెళ్లాలి."

"ఓ యస్ - నాకు యిలాంటి చిన్న యిళ్లంటే చాలా యిష్టం. మా యిల్లు బీస్ సాల్ బాద్‌లో బంగళాలా వుంటుంది. నాన్నా మనం అడయారింటికి మారిపోదాం."

"అదంతా మీ అమ్మదగ్గిర చెప్పుకో" అంటూ స్పీడ్‌గా కారుపోనిస్తున్నారు. గుప్ గుప్‌న పొగవదుల్తున్నారు.

"అది జరగని పని అయిందే! అమ్మని యీ యింట్లోంచి కదిలించగలమా?"

"అయితే నోరుమూసుకు వూరుకో"

"ఏం? మీ అమ్మ కదలకపోతే ఏం? రేపు నువ్వు పెళ్లిచేసుకు అత్తవారింటికి వెళ్తావే - అప్పుడు మీ ఆయన్ను చిన్నయిల్లు చక్కటిది చూడమను" అంటూ నేను పరిహాసంచేశాను. ఆ మాటలకు మంజు సిగ్గుపడలేదు.

"ఏమిటీ? పెళ్లి చేసుకున్నాకకూడా యిక్కడే వుంటాననుకున్నారా? ఒక ఏడాది హనీమూన్. స్విట్జర్లాండో పారిస్సో వెళ్లిపోతాంకాదు నాన్న"

"ఓ - యస్ - తప్పకుండా. అట్లానే మీ అమ్మను కూడా లాక్కుని వెళ్లు" అంటూ నవ్వుతున్నారు.

"నాన్నా మీరూ అమ్మా హనీమూన్‌కి ఎక్కడికెళ్లారు?" అంటూ మంజూ ప్రశ్నలు ఆరంభించింది.

"ఆ వెళ్లాం. వూటీకి వెళ్లాం. ఎక్కడికెళ్లి ఏం లాభం? వస్తూ పోట్లాడు కుంటూ మరీవచ్చాం" అంటూ మామూలుగా చెప్పారు.

ఐ. జి. ఆఫీసుకుముందు కారు ఆగింది. వాకింగ్‌కి వెళ్లడానికి దిగాము.

కారు దిగి నిలుచున్న నన్ను చూస్తే మంజులకి గొప్ప అయిడియా వచ్చింది. "నాన్నా ముగ్గురం కలిసి వాకింగ్‌కి వెళ్దాం. డ్రయివింగ్ తరువాత నేర్చుకుంటాను. మన డ్రయివరు నేర్పుతాడులేద్దూ. వాకింగ్‌కి వెళ్లడం మీకు

కూడా చాలా మంచిది. ఫిజికల్‌గా నీకు ఎక్సర్‌సైజ్ వుండదు. కమాన్'' అంటూ చెయ్యి పట్టుకు లాగడం మొదలుపెట్టింది.

''అమ్మయ్యో - నేను నడవలేనబ్బా - ఇక్కడనుంచి అయిరన్‌బ్రిడ్జిదాకానా ? మై గుడ్‌నెస్ - నో - కావాలంటే నువ్వు వెళ్లు'' అంటూ చిన్న పిల్లవాడిలాగా బిగ్గరగా అంటున్నారు.

''అదేంకాదు మంజు చెప్పింది. రైటే. నడవడం మీరు ఎంజాయ్ చేస్తారు'' అంటూ నేనూ అన్నాను. కొంచెంసేపు తటపటాయించి 'సరి' అంటూ కిందకిదిగి, చేతిలో సిగరెట్‌పెట్టె పట్టుకుని తలుపు లాక్ చెయ్యబోతున్నారు.

''నో - సిగరెట్స్'' అంటూ అది లోపల పడేసి తాళం పెట్టమన్నాను. ఆయన ముఖం కొంచెం విసుగ్గా పెట్టారు. అయినా నేను చెప్పానుగదా అని లోపలికి పెట్టె విసిరేసి, కారు లాక్‌చేశారు.

పేవ్‌మెంటు మీద ఒక కుంటి బిచ్చగాడు కూచుని వున్నాడు. అయామ్ సారి అతను కుంటివాడేగాని, బిచ్చగాడు మటుకుకాదు, ఎందుకంటే అతను ఎవరినీ డబ్బులు అడగడంలేదు. చూసి సలాం పెట్టి నవ్వుతున్నాడు అంతే. ఈయన పర్స్‌లోంచి చిల్లరతీసి వాడికిచ్చారు. వాడు పుచ్చుకున్నాడు.

''పొద్దుటే మొదటిపని ధర్మం చెయ్యడం కాబోలు''అంటూ మంజు పరిహాసంచేసింది.

''ఏం - చేస్తే తప్పేం? ఇందులో తప్పువిషయం ఏంలేదు. రేపటినుంచీ పొద్దుటే యిక్కడకువచ్చి ఇతనికి ధర్మంచేసి, ఆపైనే యింకోపని చేస్తాను. మిగతా పనులు ఎల్లాంటివైనా మొదటిదైనా మంచిపని చేస్తాను.''

ఇద్దరూ వాదనలోకి దిగారు.

''నాకు వీటిల్లో నమ్మకంలేదు'' అంటోంది మంజు.

''నాకు వీటిల్లో నమ్మకం వుంది.''

''ఇలా బిచ్చం వేస్తే పెద్ద పుణ్యం వస్తుందా? దీనివల్ల యీ బిచ్చగాళ్ల సమస్య తీరుతుందనుకోను.''

''హు సెడ్ సో? మీ యింటికొచ్చిన వాళ్లందరికీ కాఫీ యిస్తున్నావు బాగానేవుంది. నువ్వు కాఫీ యిస్తావనే వాళ్లంతా వస్తున్నారా ? పోనీ కాఫీ తాగడానికి అవకాశం లేనివారే వస్తున్నారని అనుకుందాం. మనం యిచ్చే ఆ కప్పు కాఫీతో నువ్వు చెప్పావే - ఆ 'సమస్య' అది తీరిపోతుందా? ఇవ్వన్నీ మర్యాదలమ్మా. అంతే. ఎవరన్నా ఫ్రెండు కనిపిస్తే కాఫీకి రమ్మని పిలుస్తాం. అలానే ఎవరన్నా బీదవాడు కనిపిస్తే - మనకి తోచింది . . . .''

''ఈ వూళ్లో ఎంతమంది బీదవాళ్లు వున్నారో తెలుసా? వాళ్లందరికీ యివ్వండి''

"ఇదిగో అర్థం పర్థం లేకుండా అన్నీ నీకే తెలిసినట్లు వాదించకు. అందరికీ అందరూ యివ్వాలనీ, యిస్తారనీ అనలేదు. అసలు మిగతావాళ్ల సంగతి యిక్కడ అనవసరం. ఇలా యివ్వడంతో వాళ్ల దరిద్రం తీరిపోతుందని ఎవరూ అనలేదే! నేను యిచ్చాను - అతను పుచ్చుకున్నాడు. ఇదేదో బిచ్చగాళ్ల సమస్య అనీ, దీని మంచి చెడ్డలు ఆర్గ్యూ చెయ్యక్కరలేదు. కనిపించిన ప్రతీ విషయం గురించీ, వాదించడం ఈరోజుల్లో ఫాషనయిపోయింది."

"మీ యిద్దరూ వాదించుకోండి నేను వినను. ఎటొచ్చీ వాకింగ్‌కి వెళుతున్నపుడు మటుకు వద్దు. కొంచెం స్పీడు పెంచండి. తిరిగి వచ్చేటప్పుడు బాగా చెమట పడుతుంది. అట్లా అయితేనే వాకింగ్‌కి వెళ్లినందువల్ల ప్రయోజనం వుంటుంది."

ముగ్గురం చేతులు వూపుకుంటూ నడక మొదలుపెట్టాం.

## 19

వెంకట్రామయ్యారు ఒంటరిగానే వాకింగ్‌కి వెళ్లివచ్చారు. వచ్చి స్నానంచేసి, తిరుచూర్ణం దిద్దుకుని, జపతపాలన్నీ ముగించుకుని, కాఫీతాగి, కుడిచేతులోకి పేపరు పుచ్చుకుని హాల్లోకి వచ్చి కూర్చోబోతుండగా, క్రితం రోజు గంగ రావడంతో మధ్యలో ఆగిపోయిన సంభాషణని పూర్తి చేద్దామన్నట్లు వచ్చి నిలుచుంది కనకం. ఆవిడ యీ విషయం గురించి ఆలోచించి, ఆలోచించి పిచ్చిదయిపోతోంది. కంఠ స్వరం బొంగురుగా మారింది, కళ్లంట నీళ్లు ప్రవాహంలాగా కారుతున్నాయి, చీరె కొంగుతో కళ్లు వొత్తుకుంటూ, ముఖం తుడుచుకుంటూ రోదన స్వరంతో మొదలు పెట్టింది.

"అన్నయ్యా – మీరు వూరికి వెళ్లేలోపునే నాకేదో దారి చూపించి మరీ వెళ్లండి. తల ఎత్తుకోలేక చచ్చిపోతున్నాను. ఈ పిల్లని కని నేను పడ్డ అవమానాలు చాలు. దాంతో మాట్లాడి నేను గెలవలేను. గంగను వచ్చి అనరాని మాటలన్నీ అని, వుచ్చరించరానివన్నీ అడుగుతుంటే వాళ్ల దగ్గర నోరు ఎత్తలేకపోయాను. నారాత ఎలాగ వుందో చూశారా? ఇలాంటి పిల్లనీ పిల్లవాడినీ కని, వాళ్లిద్దరూ నన్ను సుఖ పెట్టకపోతే పోయే, అవమానించి అనరాని మాటలు అంటున్నారు. ఈ జన్మకిది చాలు - యిలాటి శిక్ష పగవాళ్లకికూడా వద్దు."

కనకం ఏడుస్తూ మాట్లాడుతోంది. ఆ ఏడుపు హెచ్చుతోందేగాని తగ్గడం లేదు. కుళ్లికుళ్లి ఏడుస్తోంది. నెమ్మదిగా పేపరు విప్పుతూ వెంకట్రామయ్యారు ఆవిడ వంక జాలిగా చూస్తున్నారు. ఆమె పరిస్థితి చూస్తుంటే ఆయనకి చాలా అనుతాపంగా

"సరి నువ్వు యిప్పుడెందుకు ఏడుస్తున్నావో చెప్పు. ఏడ్చి గోలపెట్టి ప్రయోజనం? నొసటి వ్రాత చెరిపి తిరిగి వ్రాయడం మన తరమవుతుందా?" అంటూ సానునయంగా కనకాన్ని వోదారుస్తున్నారు.

"ఏదో ఒకసారి తెలియక బుద్ధి గడ్డితిని పొరపాటుచేసినా నా పిల్లలాటిది మరొకత్తె వుండదు అంటూ తలెత్తుకు గర్వంగా తిరిగానే" అంటూ గుండెల మీద చెయ్యివేసుకుని అర్థంలేకుండా వాగుతోంది కనకం.

"ఏం చెయ్యగలం చెప్పు? పూర్వంలాగా చిన్నపిల్ల కాదుగదా? మంచితనంగా మాట్లాడి దారికి తీసుకురావడానికి ప్రయత్నిస్తాను. కాదు అని మొండికెత్తుతుంది - దానిదారిన అది పోతే మనదారి మనం చూసుకోవాలి" అంటూ ముగింపు పట్ల ఆయనకే నమ్మికలేనట్లు చెప్పారు. తను చెప్పి మార్చగలనన్న నమ్మిక ఆయనకే లేనట్లుంది. కనకం నిదానంగా చెప్పడం మొదలుపెట్టింది.

"దానికి అర్థం నెత్తిన గుడ్డేసుకుని పొమ్మనేకదూ. దీనికోసం అన్ని కష్టాలుపడి, మనుషులని, వూరు వాడా ప్రపంచం అంతటిని ఎదిరించి, దానివెంట వచ్చినది యిందుకేనా? మీరు చేసిన సహాయం మర్చిపోయింది. విశ్వాసం లేకపోతే పోనీ కనీసం మీ మాటమీద గౌరవమన్నా చూపక్కరలేదా? పోనీ మర్యాదవద్దా అని. ఇది చేసే అక్రమాలు మనుషులు సహించవచ్చు, పైన భగవంతుడు లేడా అని - వాడు ఇది చేసేపనులు చూసి వూరుకుంటాడా? దీన్ని సర్వనాశనం చేస్తాడు. ఇది బాగుపడదు" అంటూ శపిస్తున్నట్లు గుండెలు బాదుకుంటోంది కనకం. అది చూసి ఆయన మందలిస్తున్నట్లు.

"ఇదిగో కనకం నువ్విల్లా అనకూడదు. కడుపున పుట్టిన పిల్లలు తప్పుచేస్తే తిట్టచ్చు, కొట్టచ్చు, దండించవచ్చు. అంతేగాని యిలా శాపనార్థాలు పెట్టగూడదు" అంటూ మందలించారు.

"నేనేం చెయ్యను? నాకడుపు మండిపోతోంది. నేను మహాపాపం చేసుకున్నాను. కాబట్టి యిటువంటివన్నీ చూడవలసి వస్తోంది. ఇప్పుడు చూడండి - ఎనిమిదింటికి వస్తుంది. మీరే చూడండి వాడూ వస్తాడు. వెధవ మొహం వేసుకుని ఎప్పుడు చూసినా నోట్లో గుప్ గుప్ మంటూ నిలుచుని వుంటాడు: ఆ పొగ చూస్తే - నా వళ్లు భగ భగ మండుతుంది" అంటూ కొంచెంసేపు వూరుకుని కంఠం తగ్గించి రహస్యం చెపుతున్నట్లుగా మళ్లీ అరంభించింది.

"ఏదో పోనీ మనవాళ్లయినా ఫరవాలేకపోను. పెళ్లయినవాడయినా, ఆమొదటి పెళ్లాం కాళ్లూ కడుపులూ పట్టుకుని, వాడికే కట్టిబెట్టి వుండేవాళ్లం. వీడిని చూస్తే కులం చెడినవాడిలాగా వున్నాడు. ఈ పిల్లకి పోగా పోగా బుద్ధి బుగ్గయిపోతోంది. మీరు అంటూనే వున్నారు దీనికి కుదురులేదని. ఆ మాట అన్నపుడల్లా 'అన్నయ్య

యిలా అంటున్నాడే' అని మనసులో గింజుకునేదాన్ని. ఇప్పుడు నాకు బాగా తెలిసొచ్చింది. దీని స్వభావం అర్థంచేసుకుని మరీ చెప్పారు. రాత్రి మీరింకా గట్టిగా కేకలేస్తారనుకున్నాను. ఇప్పుడొస్తుంది - వాడూ వస్తాడు. మీరు యీ యింటికి యజమాని. మీరు ఆశ్రయమిచ్చి, పెంచి పెద్దచేసి, వృద్ధిలోకి తీసుకొచ్చిన పిల్ల యిది. ఆ అధికారంతోనే మీరు చెప్పండి. ఈ పనులు అమర్యాదకరమైనవని దానికి తెలిసేటట్లు చెప్పండి. మొగదిక్కులేని యిల్లనుకుంటున్నాడేమో – మీరు వాడికి బాగా తెలిసి వచ్చేటట్లు బుద్ధి చెప్పి, మళ్లీ యీ పక్కలకి రాకుండా చివాట్లు వెయ్యండి'' అంటూ ఏవేమి అనాలో ఆయనకి చెప్పి పెడుతోంది కనకం.

ఆవిడ అమాయకత్వానికి లోలోన నవ్వుకుంటున్నారు వెంకట్రామయ్యరు.

వెంకట్రామయ్యరు కళ్లు మూసుకుని యోచిస్తున్నాడు. వోడిపోయే కేసయినప్పటికీ బలమయిన వాదంతో చివరిదాకా ప్రయత్నించడం తన విధి అనుకుంటూ కళ్లు తెరిచి, ఒక్కసారి నిట్టూర్చి చిరునవ్వుతో కనకం వంకచూసి, ఏదో చెప్పబోతున్నారు. ఇంతలో బయటనుంచి కారు హారన్ వినపడటంతో, యిద్దరూ మాటలు ఆపేసి బయటకు చూశారు. కనకం లోపలికి వెళ్లిపోయింది.

వాకింగ్‌కి వెళ్లి తిరిగివస్తూ యీయన డ్రయివిన్ లోపలికి కారు తిప్పుతుంటే, నేనే వద్దని వారించాను. అసలు మా ప్లాన్ ఏమిటంటే వాకింగ్‌కి వెళ్లి, తిరిగి వచ్చేప్పుడు డ్రయివిన్‌కెళ్లి కాఫీ తాగాలని. కాని మొదటిసారిగా మా యింటికొచ్చిన మంజుని వీధిలోంచే పంపెయ్యనా? ఇంటికొచ్చి అందరూ కాఫీ తాగి వెళ్లవచ్చునని నేనే ప్రోగ్రాము మార్చాను. ఈయన వెంటనే 'సరి - సరి' అంటూ వొప్పుకున్నారు. మంజుకి మా యింటి లోపలికొచ్చి చూడాలని కుతూహలంగా వుంది.

మేము వచ్చేప్పటికి మామయ్య దగ్గిర నిలుచుని ముచ్చట్లు చెబుతోంది అమ్మ. కారుని చూడగానే ముఖం తిప్పుకుని లోపలికి వెళ్లిపోయింది. ఏం ముచ్చట్లు చెబుతోందో? తిరిగి తిరిగి నా విషయం దగ్గరకే వచ్చివుంటుంది.

మామయ్య పేపరు మడిచి చేతిలో పట్టుకుని 'యీ జెంటిల్‌మాన్‌ని' ఆహ్వానించేందుకన్నట్లు నిలుచునివున్నారు. ఇంట్లో కొత్త మనిషిని చూసి ఈయన ఒక్కక్షణంపాటు తడబడి నిలుచుండిపోయారు. ఆ ఖంగారు గ్రహించుకుని నేను నెమ్మదిగా యీయనకి మటుకే వినిపించేటట్లు పరిచయం చేశాను.

"మా మామయ్య వూరినుంచి వచ్చారు" అంటూ చెప్పి - మంజు చెయ్యి పుచ్చుకుని లోపలికి తీసుకెళ్లాను.

ఈయన గురించీ, నాగురించీ ఏమీ తెలియనట్లూ, ఏదో పెళ్లివారింట్లో ముందు నిలబడి అతిధులని ఆహ్వానిస్తున్నట్లు నవ్వు ముఖంతో నిలుచుని వున్నాడు మామయ్య.

మామయ్యకు యీయన్ని పరిచయం చేశాను.

"మామయ్యా యీయన నా ఫ్రెండు మిస్టర్ ప్రభాకరన్. ఈ అమ్మాయి యీయన కూతురు మంజు" అని

మామయ్య చాలా సంతోషంగా 'రండి రండి' అంటూ లోపలికి ఆహ్వానించాడు.

"అమ్మాయి కాలేజీలో చదువుతోందా?" అంటూ మంజుని గురించి వాకబుచేసి. "కూచోండి" అంటూ అందరినీ హాలులో వున్న సోఫాల దగ్గరకు తీసుకొచ్చారు. వంటయింట్లోకెళ్లి అమ్మని కాఫీ పెట్టమని చెప్పాను. ఆవిడ జవాబు చెప్పలేదు, కాఫీకి నీళ్లు పడేసింది.

హాల్లోకి వచ్చి మంజుని నా గదిలోకి తీసుకెళ్లాను. మామయ్యా యీయనా వాకింగ్ కెళ్లడం గురించి మాట్లాడుకుంటున్నారు.

ఈయన స్కూల్లో చదివే చిన్నపిల్లవాడిలాగా భయభక్తులతో మామయ్య అడిగినవాటికంతా బదులు చెపుతున్నారు.

మంజు రూమ్ లోపలికొచ్చి నా పుస్తకాల షెల్ఫ్‌ని చూస్తూ "మీ యిల్లు చాలా బాగుంది. ఇలాంటి చిన్న యిల్లూ, చిన్న చిన్న గదులూ అంటే నాకు చాలా యిష్టం. మీరు చక్కగా నీట్‌గా పెట్టుకున్నారు. వుడ్‌హౌస్ మీకు చాలా యిష్టమా? అన్ని పుస్తకాలూ వున్నట్లున్నాయే! మిమ్మల్ని చూస్తుంటే మీకు వుడ్‌హౌస్ అంటే యిష్టం అని అనుకోలేకపోయాను."

"ఏం?" అడిగాను.

"మీకు సీరియస్ రీడింగ్ యిష్టమని అనుకున్నాను."

నేను బదులు చెప్పలేదు. చేతిలో ఒక పుస్తకం తీసుకునిలుచుని, అక్కడే చదవడం ప్రారంభించింది మంజు.

"కావాలంటే తీసుకెళ్లి చదువుకో" అన్నాను.

'థాంక్స్' అని సంతోషంతో పుస్తకం మూసి పట్టుకుంది. "మీదగ్గిర యింత మంచి పుస్తకాలుంటాయని అనుకోలేదు" అని చెప్పి మంచంపైన నా పక్కమీద కూచుని 'అయామ్ సారి' అని లేవబోయింది.

"నో నో - ఇట్ యీజ్ ఆల్ రైట్" అని ఆ పిల్లని మంచం మీద కూలవేశాను.

"నేను రోజూ మీ యింటికి వస్తూనే వున్నానుగా - యికనుంచీ నువ్వే రావాలి మా యింటికి. ఖబుర్లు చెప్పుకుందాం సరదాగా"

"ఓ యస్" అంటూ మళ్లీ పుస్తకం తెరిచింది.

ఈసరికి కాఫీ రెడి అయివుంటుంది. సిద్ధంగా వున్న శబ్దం వినిపిస్తోంది. చక్కెర వేసి చమ్చాతో కలుపుతున్న శబ్దం.

లోపలికెళ్లి అమ్మ వరసగా నింపిపెట్టిన కాఫీగ్లాసులు పళ్లెంలో పెట్టుకున్నాను.

"మామయ్యకు ?"

"ఆయన యిప్పుడే తాగారు."

"ఫరవాలేదు. ఇంకో గ్లాసులో పోసియ్యి" అంటూ అదికూడా తీసుకుని పళ్లెంలో పెట్టుకు హాల్లోకి వస్తుంటే - 'వారు పెళ్లి చూపులకి వచ్చినట్లూ, నేనే ఆ పెళ్లికూతురయినట్లూ విచిత్రంగా వూహించుకుని, ఆ వూహకి నాలో నేనే నవ్వుకున్నాను.

మంజు గదిలోంచి హాలులోకి వచ్చి సోఫాలో కూచుంది. అమ్మ వంటగది వదిలి బయటకివచ్చేట్లు లేదు అనుకుని, మంజు పక్కన సోఫాలో కూచుని కాఫీ తాగుతున్నాను.

వంటింటి గుమ్మంలో అమ్మ నిలుచునివుంది. వీళ్లని పరిచయం చేసుకోవడం ఆవిడకు యిష్టంలేదు కాబోలు. మామయ్య ఏవన్నా అడుగుతారేమోనని, ఆయన అడగబోయే విషయాలు విందామని అక్కడికి వచ్చి నుంచునివుంది కాబోలు. కాని నాకు బాగా తెలుసు మామయ్య యిప్పుడేం మాట్లాడరని. ఇప్పుడే కాదు ఎప్పుడూ ఆయన యిలాంటివి అడగరని నాకు తెలుసు. మర్యాదకి యీ మాటా ఆ మాటా మాట్లాడుతున్నారు. ఆయన బదులు చెపుతున్నారు.

మంజుని తీసుకువెళ్లి యిల్లంతా చూపించాను. ముందు డాబా మీదకు వెళ్లాం. డాబాలో నిలుచుని చూస్తే చుట్టుపక్కల యిళ్లన్నీ చక్కగా కనిపిస్తాయి. నేను పగలెప్పుడూ డాబామీదకు రాను. మంజు కుతూహలంతో చుట్టుపక్కల చూస్తోంది. ఆ వయసులో అన్నీ ఆశ్చర్యంగానే వుంటాయి.

కొన్ని క్షణాలు నిలుచున్నాము అలానే. టైము ఎనిమిదిన్నర అయింది. నేనింకా స్నానం కూడా చేయలేదు. ఈ రోజు సోమవారం ఆఫీసువుంది.

"మీ కివ్వాళ కాలేజీ లేదా ?" అని అడిగాను. మూడో యింటి డాబా మీద పిండివడియాలు పెడుతున్నారు. వారు ఎలా పెడుతున్నారో పరీక్షగా చూస్తోంది మంజు.

"మధ్యాహ్నం గాని వెళ్లను"

"ఏం ?"

"మధ్యాహ్నం టెస్ట్ వుంది. ఇంతవరకూ ప్రిపేర్ అవలేదు. చదువుకోవాలి అనుకుంటూనే అశ్రద్ధ చేశాను."

"నిన్నంతా ఏం చేశావ్ ?" నాకేదో పెద్ద అధికారమున్నట్లు అడిగాను.

ఆ పిల్ల చాలా మర్యాదగా బదులు చెప్పింది. "నిన్న సాయంకాలందాకా మీరే వున్నారు. ఆ తరువాత చదువుకుందామని కూచున్నాను. అమ్మ సినిమాకి బయలు

దేరింది. రేపు చదువుకోవచ్చులే అని తన వెంట పడిపోయాను. ఇవ్వాళ వాకింగ్‌కి బయలుదేరాం. ఇంక వెళ్తాం" అంటూ డాబా మెట్లు దిగుతోంది. నేను ఆ పిల్ల వెనకాలే దిగుతున్నాను.

"మీట్ మై మదర్" అంటూ వంటింటి దగ్గరకు తీసుకెళ్లాను. ఈ పిల్ల లోపలికి జొరబడిపోతుందేమో నన్నట్లు, అమ్మ వంటింటి గుమ్మంలో అడ్డుగా నిలుచుంది. మంజు భయభక్తులతో రెండు చేతులూ ఎత్తి నమస్కారం బెట్టింది. అమ్మ తెల్లపోయి నవ్వింది.

"నాన్నా వెళదామా నాకు టెస్టు వుంది చదువుకోవాలి."

ఎప్పుడొచ్చి పిలుస్తుందా అని కాచుకు కూచున్నట్లు గభాలున లేచి బయలు దేరారు ఆయన.

"మిమ్మల్ని కలుసుకోవడం చాలా సంతోషంగా వుంది" అంటూ మామయ్య బయటదాకా వచ్చి పంపారు. నేనూ అమ్మా మంజుని పంపిస్తున్నాము. ఈయన మామయ్యా యిలా వుంటారని అనుకోలేదు. ఈ పదినిముషాల్లో మామయ్య యీయన్ని శల్యపరీక్ష చేసివుంటాడు. అందుకనే ఈయన్ని కలుసుకోవాలి అని నాతో అన్నాడు.

ఈ సాయంకాలమో, ఈ రాత్రో నాతో యీ విషయం గురించి వంటరిగా మొదలుపెడతాడు. మామయ్య ఎప్పుడు మాట్లాడినా నాకు అభ్యంతరంలేదు.

వాళ్లని కార్లో ఎక్కించి కాంపౌండ్ గేటు దగ్గర నిలుచున్నాను. కారు స్టార్ట్ చేస్తూ "రెడీగావుండు పదింటికి వస్తాను" అన్నారు నాతో.

మంజు చెయ్యి వూపుతోంది. గేటు మూసి, ఆ పై కొక్కెం వేసి వెనక్కి తిరిగే సరికి అప్పటిదాకా గుమ్మంలో నిలుచున్న మామయ్య, నాకంటే ముందే లోపలికి వెళ్లిపోయారు. హాలులోకి వెళ్లానంటే నాతో ఖబుర్లు మొదలుపెడతాడని దుడుగ్గా వుంది. ఆయన ఏం మాట్లాడుతాడోనని భయంకాదు, ఇప్పుడు ఖబుర్లు వేసుకుంటే పదిగంటలకల్లా నేను తయారు అవడానికి వీలుపడదు.

ఆలస్యం అయిపోతోంది. స్నానానికి తయారవుతున్నాను. ఆయన మాటల్లో చిక్కుకోకుండా తప్పించుకునేందుకు, బాత్‌రూమ్ లోపలకి వెళ్లి ఘడియ పెట్టుకున్నాను.

వంటింట్లో వంటపని చూసుకుంటూ ఏవో గిన్నెలు కడుగుతోంది అమ్మ. హాలులో వున్న మామయ్యకు వినబడేటట్లు గట్టిగా మాట్లాడుతోంది. గొంతు చించుకు అరుస్తోంది. అమ్మ యింత బిగ్గరగా మాట్లాడటం నేనెప్పుడూ వినలేదు. గణేశన్ వచ్చి ఏదేనా చాడీలు చెపితే పట్టలేక అరుస్తూ వుంటుంది తప్ప యిలా ఎప్పుడూ బిగ్గరగా మాట్లాడదు. అందులో మామయ్య యింట్లో వున్నాడంటే చాలా

మర్యాదగా, నెమ్మదిగా మాట్లాడుతుంది. అల్లాంటిది యిలా అరుస్తోందే? మామయ్యా ఈయనతో మర్యాదగా మాట్లాడి, పై పెచ్చు కాఫీ కూడా తాగడం ఆవిడ భరించలేకపోయింది. అందుకే అరుస్తోంది.

అమ్మ అరుస్తోంది. వంటిమీద నీళ్ల పోసుకుని, నబ్బు రుద్దుకోకుండా, ఆవిడ ఏమిటంటోందోనని వింటున్నాను - -

అమ్మ అరుస్తోంది. "నాకు నెలకి యాభైరూపాయలు యివ్వమని చెప్పండి. వా. కొడుకు దగ్గిరకి కెళ్లిపోతాను. నాకడుపున పుట్టిన ఖర్మానికి వాడు నాకింత గంజి పొయ్యకపోడు. దీనికోసం వాడిని చెండాడుకున్నానే! ఇప్పుడు ఏముఖం పెట్టుకుని వాడింటి మీద పడి తినను ? వూరికే వెళ్లి వాడింటి మీదపడి తింటాననంటే యీకాలనికి వీధిలోకి తరుముతాడు. దీన్ని పెంచి పెద్దదాన్నిచేసి, చదువు చెప్పించి యింతదాన్ని చేసినందుకు కూలిగానన్నా నా మొహాన యాభైరూపాయలు విసిరిపడెయ్యమని చెప్పండి. వుంటే వాడిదగ్గిర వుంటాను లేకపోతే ఏపంచనో యింత వుడకేసుకు తింటాను. దీనికి కావాలన్నపుడు కాఫీ చేసిపెట్టి, తింటానన్నపుడు వండివార్చే వంటపనికి తప్ప, దానికి నేనంటే లక్ష్యంలేదు. దీని విదిలింపులు పడటానికి నేనేం పురుగునుకాదు. బయటమర్యాదపోయి, యింట్లో లక్ష్యంపోయి ఎందుకీ బతుకు? ఎవరి మర్యాదలు వాళ్లు చూసుకుంటున్నపుడు. (ఇది మామయ్యను గురించి) నాగోడు ఎవడిక్కావాలి. నా మర్యాద ఎవరిక్కావాలి! నాలిక పీక్కుని చచ్చిపోదామని అనిపిస్తోంది. ఇది సంసారులుండే కొంపకాదు. దీనికంటే సానికొంప నయం. నీయిల్లు, నీనంగతి నీకెల్లా కావాలంటే అల్లావూరేగు. నేనీయింట్లో యింకోక్షణం కూడా వుండను. మీరేదోవస్తారు - మంచి చెడ్డాచెప్పి, మందలిస్తారనే పేరాశతో వున్నాను. ఈ వున్నలక్షణం చూస్తుంటే నోరుతెరిచి మాట్లాడటానికి దమ్ములుంటాయా? ఈ సాయంత్రమే వెళ్లిపోతాను. నాఖర్మ అనుకుంటా. చచ్చినట్లు కాలానికి తలవంచుకు పడివుండమని కాబోలు. మీరెవ్వరూ నాకేమి వొరిగించ నక్కరలేదు. ఎవరూ నాకు దారి చూపించక్కర్లేదు. నా పాట్లేవో నేను పడతాను. పన్నెండేళ్లుగా యిదిచేస్తున్న అవమానాలన్నీ నహిస్తూవచ్చాను. ఇది తప్పుడుపనిచేసి నెపం నామీద వేస్తున్నది. 'తప్పుదానిది - దండన నాదినా?' బాగుంది. అమ్మా అని అది నోరు తెరిచి పిలిచి ఎన్నేళ్లయింది ? నాతో ఒక్క నాడన్నా నోరు విప్పి మాట్లాడిందా ? ఇవన్నీ ఎందుకు నహించాను ? ఇది నవ్యంగా నడుస్తుందనే నమ్మకంతోనేకదా ? ఇన్ని అవమానాలు భరించింది. దీని గుణం బాగా తెలిసింది. నాకు బాగా బుద్ధివచ్చింది. నాదగ్గిరే దీని మిడిసిపాటంతా. నువ్వు ఆఫీనరవయితే ఆ గొప్ప నీదగ్గిరేవుండనీ. చదువుకుంది. నంపాయిస్తోంది. ఏంచేసినా చెల్లుతుందనే దిమాకి ...."

ఈవిడ అగదనుకుంటా. గొంతు నెప్పిపుట్టటం లేదుకాబోలు. ద్వేషంతో వుడికిపోతోంది. నామీద పూర్తిగా అసహ్యం కలిగింది. కొడుకింటికి వెళ్లి వుండాలని యీవిడకు ఆశగావుంది. ఈ పరిస్థితిలో యీవిడను వోదార్చి వూరుకోపెట్టడం అసాధ్యం. అసలు నేనెందుకు యీవిడను సమాధాన పరచాలి? నేను చేసిన పనికి నేనేగదా శిక్ష అనుభవిస్తున్నాను. ఈవిడపైన నేరం మోపడంలేదే? నేను తిరుగుబోతునట! నాదగ్గిర ఎటువంటి సానివేషాలు చూసిందో? ఎంత లోకువ కట్టిందో! నాకు మర్యాద వుంటేకదా పోవడానికి? తనని నేను గౌరవించడం లేదుట. ఇంకా ఎంత గౌరవం చూపాలో! 'నన్ను నువ్వు చూడు - నిన్ను నేను చూస్తాను' అంటూ పన్నెండేళ్లుగా యిద్దరం ఒకరి మొఖాలొకరం చూసుకుంటూ గడిపాం. నాకు యీ జీవితం విసుగ్గావుంది. రోజులు గడవక విసుగుతో చచ్చిపోతున్నాను. ఎన్నాళ్లు యిలా కూచోగలను? ఆడజన్మ ఎత్తి యిల్లా వంటరిగా ఎన్నాళ్లు గడపను? నేను ఆడపిల్లననే విషయం యీవిడ మర్చిపోయినట్లుంది. ఈయన నా ఫ్యూచర్ గురించి అంత ఆరాటం పడుతున్నారే - తల్లి అయివుండి నా జన్మనిచ్చిన యీవిడకు నా గురించి అటువంటి ఆదుర్దా లేదా? నేను యిలా సన్యాసినిలాగా జీవితం గడపడం యీవిడకు సంతోషంగాను, అనువుగాను వుందనుకుంటా. ఇప్పుడు మటుకు ఏమయింది? ఇప్పుడు కూడా 'ఏమీ లేకుండానే' గడుపుతున్నానుగదా. 'ఏమీలేదని' వీళ్లకి నేనెందుకు నిరూపించాలి? ఏమీ లేదన్నదేగదా నా అసలు సమస్య. న్యాయంగా చూస్తే నేను. ఆయనకు 'కాంకుబైన్' వంటిదాన్ని. ఇలావుంటం వాళ్లకి అప్రదిష్టగా వుందికాబోలు. వుండనీ నేనేం చెయ్యాలి? ఏం చెయ్యను? నాకు లభించిన జీవితాన్ని నేను అందుకోబోతున్నాను. అందులో తప్పేమిటో నాకు అర్థంకావడంలేదు. దీనిని సహించలేనివారు, యీ యిల్లు వదిలి వెళ్లిపోవచ్చు. అని చెప్పడం తప్ప వేరు మార్గంలేదు. నిజంగా నేను కోరుకున్నది లభ్యమైనపుడు యిలాగే చెప్పివుండేదాన్ని. లభ్యమైనదో లేదో అన్నది నా సమస్య. అది వారికి సంబంధించినదికాదు. 'ఇట్ యీజ్ ఆల్ రైట్' ఎవరూ లేకుండా వంటరిగా బతకమని, నాముఖాన్న రాసినపుడు ఎవరూ తప్పించలేరు. 'లెట్ మీ యాక్సెప్ట్ దట్ ఛాలెంజ్'-కోపమో, బాధో యీరెండూ మర్చిపోయి ప్రస్తుత నా స్థితినిబట్టి ఆలోచిస్తే, నేను తీసుకున్నటువంటి యీ మార్గం సరిఅయినదని తోస్తున్నది. నా జీవితాన్ని యింకా ముళ్లల్లోకి లాగబోతున్నానా? ఇంతకు మించి వేరు మార్గం లేదు. ఈ చిక్కులు నేను కావాలని కోరుకుని తల మీద వేసుకున్నాను. ఇటువంటి వొడుదుడుకులవల్ల ఒక విచిత్రమైన, వక్రమైన ఆనందం కలుగుతోంది. దీనికోసం మిగతా వాళ్లకి కష్టం కలిగించడం నా అభిమతంకాదు వారి యిష్టా అయిష్టాలన్నీ, కోపతాపాలనీ, నేను మన్నిస్తాను. అమ్మమీద నాకు

గౌరవం వుంది. అందుచేతనే ఆవిడ మనసును కష్టపెట్టేకంటే, ఆమెని పంపించి వెయ్యడమే సరిఅయిన మార్గం అని తోస్తోంది.

స్నానంచేసి బయటకొచ్చాను. అమ్మ యింకా ఏదో సాధిస్తూనేవుంది. రూమ్‌లోకి వెళ్ళి బట్టలు కట్టుకున్నాను. టైము తొమ్మిదిన్నర అయింది. బయటకొచ్చి మామయ్యను పిలిచి యిద్దరం భోజనానికి కూచున్నాము. అమ్మ మాట్లాడకుండా వడ్డిస్తోంది. మామయ్య కూడా మౌనంగా భోంచేస్తున్నారు.

భోంచేసి చెయ్యి కడుక్కుంటుంటే అమ్మ మళ్ళీ ఆరంభించింది. వెనక్కి తిరిగి ఆమె వంక చూశాను. కళ్ళూ ముఖం ఎర్రగా వున్నాయి. నాకు కూడా కన్నీళ్లు వస్తున్నాయి. బలవంతాన ఆపుకున్నాను. ఆమెని అమ్మా అనిపిలుస్తే ఏమవుతుంది? కడుక్కున్న చేతిని టవల్‌తో తుడుచుకుంటూ, ఆవిడ వంకే చూస్తున్నాను.

నా మనసు చాలా ప్రశాంతంగా వుంది. తేలిగ్గాకూడా వుంది. నాకు యీవిడ మీద కోపంగాని, ద్వేషంగాని ఏమీలేవు. ఈవిడని యిన్నాళ్ల 'అమ్మా' అని ఎందుకు పిలవకుండా వున్నాను? ఎన్నేళ్లయింది? అలా పిలిచే అర్హత లేదని అనుకుని వూరుకున్నానా? నేనిప్పుడు యీమెని 'అమ్మా' అని నోరారా పిలుస్తాను. ఇదిగో అంటున్నాను.

"అమ్మా"

అమ్మ నావంక సంభ్రమంగా చూస్తోంది. ఆవిడ దేహమంతా పులకించి, కంపించి పోతున్నది.

"అమ్మా - ఎందుకు అనవసరంగా అలా నోరు పారేసుకుంటావ్? నీకెల్లా యిష్టం వుంటే అల్లా చెయ్యి. యాభై రూపాయలేమిటి-నెలకి నూరు రూపాయలిస్తాను. నీకొడుకు దగ్గరకు వెళ్లాలనివుంటే వెళ్లు. ఎక్కడ వుండాలంటే అక్కడికి వెళ్లివుండు. నీకెప్పుడు రావాలనివుంటే అప్పుడు తిరిగిరా - ఇది నీ యిల్లు" అని చెప్పాను. అమ్మ 'ఓ' అంటూ మొఖం మూసుకుని ఏడుపు మొదలుపెట్టింది.

"నువ్వు చేస్తున్నపని నీకు బాగుందా? ఇది న్యాయంగా వుందిటే?" అంటూ రెండు చేతులూ ఎత్తి అడుగుతోంది.

నేను చాలా నెమ్మదిగా చెప్పాను. "బాగున్నదో లేదో - నా మనసుకి న్యాయమని తోచింది కాబట్టే చేస్తున్నాను" అన్నాను.

"ఆ పాపిష్టివాడు నీమనసు విరిచేశాడు. నీకేదో మందు పెట్టాడు" అంటూ మళ్లీ అరవడం మొదలుపెట్టింది.

"అనహ్యంగా మాట్లాడకమ్మా" అంటూ బయటికి వచ్చాను.

వీధి వాకిట్లో కారు నిలుచునివుంది. హారన్‌శబ్దం వినిపిస్తోంది. టైముచూశాను. పది గంటలయింది.

అమ్మ గణేశన్ యింటికెళ్ళి ఒక వారం అయింది. గణేశన్ వచ్చి అమ్మని వెంటపెట్టుకుని వెళ్ళాడు. ఆరోజు యింట్లో పెద్ద సీన్ అయింది.

నన్ను కొట్టబోయాడు గణేశన్. అమ్మ అడ్డుకుని వాడిని పక్కకి యీడ్చుకెళ్ళింది. "వీడు కొట్టదలుచుకుంటే కొట్టనీ. బాగా కొట్టమను. వీడిచేత దెబ్బలు పడలేదా ? నన్ను కొట్టే అధికారం లేనివాడా ?" అనుకుంటూ మాట్లాడకుండా చేతులు కట్టుకు నిలుచున్నాను. చిన్నితనంలో పరికిణీ జాకిట్టూ కట్టుకునే వయసులో, ఆటలకి వెళ్ళవద్దని కొట్టడానికి వచ్చే పెద్దమనిషి వీడు. నేను ఏడుస్తూ 'పోరా' అంటూ ఎదిరించేదాన్ని. ఆరోజులు మనసులో మెదిలి మాట్లాడకుండా నిల్చున్నాను. వాళ్ళంతా ఏమి మాట్లాడుకుంటున్నారో నాకు బోధపడటంలేదు. భాష తెలియని సినిమా చూసినట్లుంది నాకు. మాటలు మటుకు వినిపిస్తున్నాయి. వాళ్ళ ఆగ్రహం, ఆవేశం, అధికారం యివిమటుకు నాకు కనిపిస్తున్నాయి. ఒక్క మాటకూడా మాట్లాడకుండా జరగవలసింది జరుగుతుందని వూరుకున్నాను.

నాకు కోపంగాని, వుడుకుమోత్తనంగాని, ఆఖరికి ఏడుపుగాని రావటంలేదు. వాళ్ళకి కోపం, ఆవేశం కలగడానికి తగినంత కారణం వుంది. అందుచేతనే నాకు వాళ్ళ ఆగ్రహం చూస్తుంటే బాధకలగలేదు.

ఆఫీసునుంచి యింటికి వచ్చేప్పటికి గణేశన్ వసారాలో నిలుచుని వున్నాడు. మామయ్య వూరికి బయలుదేరుతున్నాడని, నాకోసం ఎదురు చూస్తూంటాడని, వస్తూ టాక్సీలో వచ్చాను. ఆ టాక్సీలో ఆయన స్టేషనుకి వెళ్ళాలి. కాని టాక్సీని తిప్పి పంపేశారు. ఈ గొడవలు యిలావుండగా తనదారిన తాను వెళ్ళిపోతే బాగుండదని ప్రయాణం ఆపుకున్నారు కాబోలు. వచ్చినప్పటి నుంచీ గణేశన్ నిలుచునే వున్నట్లువున్నాడు. అలాగే అరుస్తూ వున్నట్లున్నాడు. అమ్మ బట్టలన్నీ పెద్దమూటగా కడుతోంది. లాగిలాగి మూటకడుతూ ఏడుస్తోంది. ఏదో పాట పాడుతున్నట్లు యీడ్చి యీడ్చి మూటకడుతూ రాగాలుతీస్తోంది. ఆవిడను చూస్తుంటే మనసంతా ఎలాగో అయింది. లోపలికొచ్చి ఆవిడను చూస్తూ నిలుచుండిపోయాను.

అప్పుడే గణేశన్ నావైపుకి తిరిగి పళ్ళు పటపట కొరుకుతూ, బిగ్గరగా ఏదో అరిచి చెపుతున్నాడు - వాడేం చెబుతున్నాడో అర్ధంకాలేదు. కాని వాడి కోపం మటుకు స్పష్టంగా తెలుస్తోంది. అమ్మ ముఖం తుడుచుకుంటూ నావంక చూస్తోంది. నాకేం చెప్పాలో తోచడంలేదు, ఈ పరిస్థితుల్లో ఎలా ప్రవర్తిస్తే బాగుంటుందో అంతుపట్టడంలేదు. మాట్లాడకుండా నిల్చున్నాను.

ఇన్నాళ్లనుంచీ వూరుకుని ఈనాడు 'అమ్మా' అని పిలిచాను. దగ్గరకు రావాల్సిన సమయంలో యిద్దరం విడిపోయి దూరమయిపోతున్నాం.

"అమ్మా నన్నిలా వంటరిగా వదిలేసి ఎక్కడికీ వెళ్లకు" అని నేను అడగాలా?

"అమ్మా నన్ను వదిలి ఎక్కడికీ వెళ్లకు" అని నేను ఏడవాలా?

వీళ్లందరూ నేను అది చెబుతాననేకదూ ఎదురుచూస్తున్నారు. నేను అలా అంటానే అనుకుందాం. అక్కడితో ఆగిపోతుందా! ఆ తరువాత ఖండీషన్లు ప్రారంభిస్తారు. ఈయన్ని నేను చూడకూడదంటారు. వాళ్లింటికి నేను వెళ్ల కూడదంటారు. ఈయన్ని యిక్కడికి రానియ్యకూడదంటారు. ఇలా ఆంక్షలు పెట్టి, ఇంతటి అసహ్యకరమైన పనిచేసినవాడితో నువ్వు ఎలా బతుకుతావ్? అంటూ ధర్మపన్నాలు ప్రారంభిస్తారు. అప్పుడేం చేయగలుగుతాను.

ఇవన్నీ ఆలోచించే నేను మాట్లాడక వూరుకున్నాను. అమ్మ నన్ను వదిలి వెళ్లిపోవడం నాకు సంతోషకరంకాదు, అది సౌకర్యమూకాదు. కాని ఆవిడ నన్ను వదిలి వెళ్లిపోతానని అంటం న్యాయమే! ఆవిడ వెళ్లిపోవడం నాకెంత యిబ్బందిగావున్నా, ఆ యిబ్బందిని భరించేశక్తి తెచ్చుకుంటాను. తప్ప ఆవిడకు అగౌరవం కలిగేటట్లు, ఆవిడ కళ్లెదురుగుండా యీయనతో కలిసి తెరగలేను. ఈ పరిస్థితులకి తలవొగ్గి, సరిపెట్టుకోమని ఆమెని అవమానించలేను. తను ఈ పనులు సహించలేక తప్పుకుంటున్నానని వెళ్లిపోవడం అమ్మకీ నాకూ యిద్దరికీ గౌరవం.

అందుకనే ఆవిడ ఎన్నిసార్లు ధర్మం సంగతి ఎత్తినా నేను వినిపించుకోలేదు. అమ్మను వెళ్లవద్దు అని ఆపలేదు. మాట్లాడకుండా నా గదిలోకి వెళ్లిపోయాను. గణేశన్ హాల్లో నిలుచుని అరుస్తూనే వున్నాడు. మామయ్య వాణ్ణి సమాధాన పరుస్తున్నాడు.

కొంతసేపు అయాక నేను బయటకు రాబోతున్నాను. మామయ్య నాకెదురుగా వచ్చి "గంగా మీ అమ్మను నువ్వేదో వెళ్లగొట్టినట్లు వీడు మాట్లాడుతున్నాడు. తనంతటతనేగదా పొద్దుటనుంచీ 'వెళ్లిపోతా వెళ్లిపోతా' అంటూ గొడవచేస్తోంది. ఇక్కడేం పుట్టిమునగలేదు అమ్మ యిక్కడే వుంటుంది - అని నీనోటితో వాడికి చెప్పు" అంటూ మామయ్య నన్ను యిరికించాలని చూస్తున్నాడు.

పెదిమలు బిగబట్టుకుని మామయ్య వైపు చూస్తున్నాను. అమ్మ మామయ్య మాటలు లక్ష్యపెట్టనట్లు బట్టల మూట నడ్డిమీదకు ఎత్తుకుని, బయలుదేర బోతున్నది.

వెనక్కి తిరిగి అమ్మవైపు చూసి నవ్వుతూ "అమ్మా నువ్వూ నేనూ దెబ్బలాడు కున్నామా? ఎందుకమ్మా అంత కోపం? ఎందుకింత హడావుడిగా బయలుదేరావ్?

ఎక్కడికెళతావ్? ఇలారా - నీతో కాస్త మాట్లాడాలి" అంటూ ఆవిడ చెయ్యి పుచ్చుకున్నాను. వదలకుండా అలానే నా గదిలోకి లాక్కెడుతున్నాను.

ఆవిడ ఏమీ చెప్పలేకపోతోంది. చిన్న పిల్లలాగా మారుమాట లేకుండా నా వెనకనే వస్తోంది.

గణేశన్ ఆవిడని ఆపేందుకు ఏదో అంటున్నాడు. దానికేదో ఆవిడ జవాబు చెప్పి, అది వాడు వినేలోపలే నాతోపాటు గదిలోకి వచ్చింది. నేను లోపల ఘడియపెట్టాను.

తలుపు మూసెయ్యగానే ఆ గదిలో నేనూ ఆవిడా ఒక ప్రత్యేకమైన ప్రపంచంలోకి వచ్చినట్లు, గౌరవం, మర్యాద, అసహ్యం అదీ, యిదీ అంటామే అవన్నీ దాటిపోయి, తల్లీ కూతుళ్ళమన్న యీ బంధానికి అతీతమయినట్లు, యిద్దరు ఆడవాళ్ళంగా మటుకే నిలుచున్నట్లు నా కనిపించింది.

అమ్మ మటుకు ఆడదికాదా? ఆవిడ ఫుడుతూనే తల్లి అయిందా? ఆవిడా ఒకప్పుడు నా మాదిరిగానే ఆడపిల్ల కదా! ఒక ఆడపిల్ల పరిస్థితి, ఆ పిల్ల నుంచి వెడ్డలు, అవసరాలు యివన్నీ అమ్మకు అర్థం కావా? ఇవన్నీ చెబితే అర్థం చేసుకుంటుందా? అర్థం చేసుకునేట్లు చెయ్యగలనా? కూతురి మనోభావాలని విడమరిచి చెప్పినా కూడా అర్థంచేసుకోలేని తల్లి - ఒక తల్లా?

నేను అమ్మవంక చూస్తున్నాను. అమ్మకూడా నావంక చూస్తోంది. నా కళ్లు చెమరుస్తున్నాయి.

అమ్మ వీపు వెనకాతల తలుపు ఘడియవేసి వుంది. చేతికింద బట్టల మూట యింకా అల్లానే వుంచుకు, చెప్పేటువంటి విషయం విని, వెంటనే బయలుదేరి వెళ్లి పోయేందుకు తయారుగా నిలుచుంది అమ్మ. ఆవిడతో చెప్పవలసిన విషయాలు ఒక రోజంతా చెప్పినా కూడా సరిపోదు అనిపిస్తున్నది.

"ఏవిటే చెప్పదలచుకున్నావ్? అన్నట్లు నిలుచుంది అమ్మ.

"నేను నిన్ను వెళ్లిపొమ్మంటంలేదు. కాని ఎక్కడికైనా వెళ్లివుంటం నీకు గౌరవంగా వుంటుందని నేనూ అనుకుంటున్నాను. నేనిల్లా చెపుతున్నందుకు లేని పోని అసహ్యమైన అర్థాలు తియ్యకు. నేను అలాంటి చెడుపనులు చెయ్యాను చెయ్య లేను. నేను కావాలనే యిటువంటి చెడ్డ పేరు తెచ్చుకుంటున్నాను. ఇట్లాటి పేరు అయినా, నాకు వుండకూడదా? నాకు జన్మ యిచ్చిన నువ్వు నమ్మతావని చెపుతున్నాను. నేను ఈయనతో యిలాగే జీవితం గడపదలచుకున్నాను. కాని దానికి భార్యా భర్తలుగా బతుకుతున్నామని అర్థం కాదు. అటువంటి సంబంధం మా యిద్దరి మధ్యా లేదు. అలా బతకడానికి మాలో ఏ వొక్కరం తయారుగా లేము. నా జీవితం ఈ రకంగా తప్ప మరోవిధంగా అవడానికి వీలులేదు.

అలాంటి జీవితాన్ని ఆమోదించమని నేను అంటంలేదు. అందుకనే నువ్వు ఎక్కడి కయినా వెళ్లివుండు - కానీ ఎవరికీ భారం మటుకు అపకూడదు. ఈ యిల్లు, నేను, నా సంపాదన అంతా నీ కోసమే. నువ్వు ఎవరి ముందూ చెయ్యి జాపి నిలుచోనక్కరలేదు నీకు ఎప్పుడు కావాలంటే అప్పుడు రావచ్చు. ఏది కావాలంటే అది తీసుకెళ్లచ్చు. గణేశన్ నామీద కక్ష సాధించడానికి, కసి కొద్దీ నిన్ను తీసుకెళ్లినా, ఒకప్పుడు నా కోసం వాడిని వొదులుకున్నావనే విషయం మర్చిపోడు. రేపటినుంచీ నిన్ను మాటలతో గుచ్చి గుచ్చి బాధిస్తాడు. వాడు అనకపోతే వొదిన అంటుంది. వాడిచేత అనిపిస్తుంది. వాడు అలా అనటంలో తప్పులేదు. ఎందుకంటే వాళ్లు ఎదురు చూసినట్లుగానే -- నేనూ అవుతున్నాను గనుక. వాళ్లిద్దరూ యీ సంగతులు ఎత్తినపుడల్లా నువ్వు ఏటూ చెప్పలేక బాధపడి పోతూంటావు. వాడు చెప్పింది నిజమేమోనని కూడా నీ మనసుకి అనిపిస్తూంటుంది. అందుకని నేను చెప్పేదేమిటంటే - నా మీద కోపంతోనూ, నాతో పోట్లాడి వెళ్లాననుకోకు, నా పద్ధతులు నచ్చక, నా యిష్టం వచ్చినట్లు నేను వుండటం నీకు నచ్చక, నువ్వు నీ కొడుకు యింటికి వెళుతున్నావు. ఇందులో పోట్లాటదేనికి? అరుపులు దేనికి? ఏడుపు దేనికి? మధ్యవర్తులెందుకు? వెళుతూ వెళుతూ వృత్త చేతుల్తో వెళ్లకు. గణేశన్ పిల్లలు గలవాడు" అంటూ బీరువాలో వున్న డబ్బు తీసియిచ్చాను. ఎంత వుందో లెక్క చూడలేదు. ఇదంతా ఆలోచించి చెప్పడానికి అరగంటపైన పట్టింది.

అమ్మ భ్రమ తొలగిపోయినట్లు, నావంక ఆశ్చర్యంగా చూస్తూ, నోరు మెదప కుండా, నేను చెప్పే విషయాలు వింటోంది. ఏదో తలచుకుని కళ్లు తుడుచుకుంటోంది.

ఇచ్చిన డబ్బు జాగ్రత్త చేసుకుంది.

'చెప్పడం అయిందా యింకా వుందా?' అన్నట్లు నావంక చూస్తోంది.

కాస్త ఆగి మళ్లీ నేనే అన్నాను:

"మామయ్య వూరికి వెళదామని బయలుదేరాడు. నీకోసం ఆయన ప్రయాణం ఆపుకున్నట్లున్నాడు, నేను ఒక్కదాన్నే వండుకు తిని ఆఫీసుకు వెళ్లడమే కష్టం, దానికి తోడు యీయన్ని కనుక్కోవడం నావల్ల కాదు, ఆయన్ని వూరికి పంపి ఆ పైన నువ్వు వెళ్లు. నువ్వు ఎక్కడికో పోవటంలేదు. ప్రక్కనున్న ట్రిప్లికేన్ కేగా! మామయ్యగనక వూరినుంచి వస్తే నీకు ఖబురు చేస్తాను. అప్పుడు నువ్వు వస్తావుగా?" అని అడుగుతూ గది తలుపు తెరిచాను.

'దాంతో మాటలేమిటి?' అన్నట్లు గణేశన్ అమ్మమీద మండిపడుతున్నాడు. ఆవిడేదో బదులు చెప్పి వాడి నోరు నొక్కింది.

"అన్నయ్యా మీరు వూరికెళ్లాలి కదూ. ఆ విషయం మరిచేపోయాను. ఈ నరుకునే హడావుడిలో పిల్ల విషయం మర్చిపోయాను. ఒక్కక్షణం వుండు -

కాఫీ కలుపుతాను. అన్నయ్యా మీరు భోజనానికి రండి" అంటూ అమ్మ పిలుస్తోంది. ఆవిడ కంఠంలోని కొత్తధ్వని నా కొక్కదానికే తెలుసు.

బట్టల మూట సోఫాలో పడేసింది. మామయ్య ఫోంచెయ్యడానికి లోపలికెళ్లాడు.

మామయ్య స్థితి బోనులో చిక్కిన అడవిపులిలాగా వుంది. అమ్మను ఎలా నమాధాన పరచాలో ఆయనకు అంతుపట్టడంలేదు. అదీగాక ఈయన్ని ముఖాముఖీ కలుసు కున్నాక, మామయ్యలో ఒకవిధమైన కాంప్లెక్సు ఏర్పడిందని నా అనుమానం. అమ్మలాగా గోలచేసి, పోట్లాడి, లాభంలేదని ఆయన గ్రహించుకున్నాడు. ఈ 'జంటిల్‌మాన్' ని కలుసుకున్న తరువాత, నాతో మాట్లాడటానికి ఆయనకి వ్యవధి దొరకలేదు. అమ్మ నన్ను వదిలి వెళ్లిపోవడం ఆయనకి యిష్టంగానే వుంది. లేకపోతే ఒక్క మాటతో ఆమెని ఆపివుండేవాడు. తన మాటని అమ్మ ఎదిరించదని ఆయనకు తెలుసు. మనసులో మరో ఆశ పెట్టుకుని అమ్మ వెళుతుంటే వూరుకుండిపోయాడేమో! నేను వంటరిగా వుండటం ఆయనకు వీలుగావుంటుందన్న భావంతో వూరుకున్నాడా ?

ఆరోజు సాయింత్రమే మామయ్య వూరికి బయలుదేరాడు. వెళ్లేముందు నా రూమ్ కొచ్చి, నా రెండు రెక్కలూ పట్టుకున్నాడు. వంగి నమస్కరిస్తున్న మనిషిని లేవదీసి పట్టుకుని ఆశీర్వదిస్తున్నట్లు నారెండు జబ్బలూ పట్టుకొని 'యు హావ్ వన్ ది గేమ్ నువ్వు జయించావు. కాని జాగ్రత్తగా వుండు. నీతో మాట్లాడాల్సింది చాలా వుంది, వచ్చేవారం వస్తాను. అప్పుడు మాట్లాడుకుందాం. నేను వెళ్లిరానా? బుద్ధిగావుండు నువ్వు తెలివయినదానివే' అంటూ రెండు జబ్బలూ గిల్లి మరీవదిలాడు.

బయటకొచ్చి అమ్మతో అంటున్నాడు "నీ మనసుకి విశ్రాంతిగా వుంటుంది. కొన్నాళ్లపాటు గణేశన్ దగ్గిర వుండిరా. ఈ విషయంలో అంతకుమించి నేను ఏం చెప్పలేను. వాడిమీద నీకు విరోధమా ఏమన్నానా? గణేశా - నేపస్తాను."

మామయ్య గణేశన్‌తో ముభావంగా వుంటాడు. వాడికి మర్యాదలేదని అంటుంటాడు. ఆరోజుల్లో నన్ను యింట్లోంచి వెళ్లగొట్టాడే అప్పుడు మామయ్య మమ్మల్ని తీసుకెళ్లడానికి వచ్చినపుడు వీడు చాలా అమర్యాదగా మాట్లాడాడట.

మామయ్య వెళ్లిపోయాడు. కాసేపటికి అమ్మా గణేశన్ యిద్దరూ వెళ్లిపోయారు.

ఈ వారంరోజుల నుంచీ నేను వంటరిగా వున్నాను. వంటరిగా చివరిదాకా పోరాడబట్టే నాకు ఫలితం దక్కింది. ఒంటరిగా వుండాలంటే చాలాకష్టంగా భయంగా వుంటోంది. నేను ఎప్పుడూ వంటరిగానే వుంటున్నాను. అది నాకు అలవాటే. ఫిజికల్‌గా వుండే ఈ వంటరితనం, వంటరిగా వున్నానన్న భావంవల్ల భయం, బెరుకు ఏర్పడుతున్నాయి. ఈ చిన్న యింట్లో, నా గదిలో, అర్థరాత్రిలో, చీకట్లో తలపైన తిరిగే 'ఫాన్' వంక భయంగా చూస్తూ పడుకునివున్నాను. ఈ వంటరితనం చాలా వేదనగా వుంది.

వీధిలోంచి కిటికీద్వారా పడుతున్న వెలుగులో, ఫాన్‌లో చిక్కుకుని చిన్న దారంపోగు గిరగిర తిరగడం కనిపిస్తోంది. దాన్ని చూస్తూ వెల్లకిలా పడుకుని వున్నాను. నాపక్కన పొడుగ్గా ఒక దిండు, కాలుకింద ఒక దిండు. పక్కన వున్న దిండుని చేత్తో తడిమి, దానిని ఒకపిల్లలాగా వూహించుకుని నవ్వుకున్నాను.

ఎలాగన్నా ఒక పిల్లని కంటే ఏమవుతుంది? నాకూ ముప్ఫైఏళ్లు వచ్చాయి. అమ్మ ఎన్నాళ్లు నన్ను కనిపెట్టుకుంటుంది? ఆవిడ పోయింతరువాత నాపనేమిటి? నా సంపాదన ఎవరికోసం? నన్నెవరు చూస్తారు? గణేశన్ పిల్లలకోసమా? గణేశన్ పిల్లల్లో ఎవరినైనా పెంపకం తెచ్చుకుంటే? వాడు వొప్పుకోడు. నేనొక పిల్లవాణ్ణి కంటే ఏం? నేనా? ఈయనవల్లా? ఛీఛీ. మరిఎట్లా? పిల్లలకీ సెక్సుకీ సంబంధం లేకుండా వుంటే ఎంత బాగుండును. ఇప్పుడంతా ఫామిలీ ప్లానింగ్ గురించి తీవ్రంగా ప్రచారం చేస్తున్నారే అదేమిటి? సెక్సు వేరు పిల్లలు వేరు అనికదా చెబుతున్నారు. సెక్స్ కావాలి పిల్లలు వద్దు అంటున్నారు. మరి నేను - పిల్లలు కావాలి సెక్స్ వద్దు అంటున్నాను. సెక్స్‌లేకుండా పిల్లలు సంభవమా? ఈజ్ యిట్ పాసబుల్. ఎస్ యిట్ యీజ్ పాసబుల్. ఇది సంభవనీయం కాదు. ఎందుకుకాదు? సంపర్కం లేకుండా పిల్లలు కలుగవచ్చునని నిరూపిస్తున్నారే! సంతానం లేని దంపతులు సెక్స్ లేకుండా పిల్లలు కనవచ్చునని అంటున్నారు. ఇంజక్షన్ ద్వారా సంభవమంటున్నారు. సృష్టి కణాలని జాగ్రత్తపరిచి వాటిని, తల్లి కావాలనువారికి యింజక్షన్ చేస్తారుట. అటువంటివారు మామూలుగానే గర్భం ధరించి, తొమ్మిది నెలలు అయాక తల్లులవుతున్నారుట. అలాటిదేదన్నా నేనూ చేయించుకుంటే - మనదేశంలో యిలాంటివి నమ్మరు. ఒకవేళ నేను యిలాటి యింజక్షను చేయించుకుని పిల్లనికంటే, ఈయనవల్ల కన్నాననుకుంటారు. అనుకోని నాకేం? ఇలా అందరినీ వెర్రివాళ్లని చేస్తే తమాషాగా వుంటుంది, హౌ ఫెంటాస్టిక్!

ఇలా అర్ధం పర్ధం లేనివి - గుడ్డిగా ఆలోచిస్తూ పడుకున్నా. వంటరిగా యింకా ఆరేడు గంటలు పడుకుని వుండాలి. ఆ తరువాత పాలవాడు వస్తాడు. పాలు తీసుకుని యింట్లో పెట్టి, ఈయన కోసం మంజూ కోసం ఎదురుచూస్తూ కూచుంటాను. ఆ తరువాత వాకింగ్‌కి వెళతాం. వచ్చి గబగబ వంట ముగించుకుంటాను. మొన్న కుక్కరు కొనుక్కొచ్చాను. దాంతో వంట సమస్య తీరిపోయింది. నిముషాల్లో వంటయిపోతోంది.

ఆ రోజున యిల్లు తాళంబెట్టి వాకింగ్‌కి బయలుదేరుతుంటే యీయన అడిగారు.

"ఇంట్లో అమ్మగారు లేరా?"

"అన్నయ్య యింటికెళ్లిందని" బదులు చెప్పాను.

నిన్న మళ్లీ అడిగారు. "ఏమన్నా పోట్లాడుకున్నారా? అమ్మ కోపం వచ్చి వెళ్లిపోయారా?"

"అదేంలేదు" అని నేను అన్నాను. కాని ఆయన గ్రహించుకున్నారనుకుంటా— కష్టాలు పడివున్న మనిషికదూ!

వచ్చే ఆదివారంనాడు మంజునీ యీయన్నీ యిక్కడికి రమ్మని పిలిచాను. నిన్న ఆదివారం, నిన్న కూడా వాళ్లింట్లోనే గడిపాను. కాని నిన్న ఒక అసాధారణమైన విషయం జరిగింది. ఎప్పుడూ బయట కనిపించని పద్మ నిన్న చాలాసార్లు గది విడిచి బయటకొచ్చింది. నాతో మాట్లాడలేదు - గాని నన్ను చూసి మర్యాదకి సన్నగా నవ్వింది. అది కూడా మనస్ఫూర్తిగా నవ్వినట్టు లేదు. పద్మకి నన్ను చూస్తే యిష్టం లేదనుకుంటా. ఎలా యిష్టమవుతుంది? రోజులు, రోజులు, గంటలు గంటలు వచ్చి వాళ్లింట్లో గడుపుతుంటిని. పద్మకే కాదు ఎవరికీ యిష్టముండదు. అందుకే మంజుని ఈయన్ని మాయింటికి రమ్మనమని పిలవాలని నిశ్చయించుకున్నాను. ఇక్కడా ఎవరూ లేరు. మేము స్వతంత్రంగా వుండవచ్చు. అందుకు నాందీగా "వచ్చే సండే మా యింట్లో కలుసుకుందాం. మంజూ నువ్వు అక్కడికి వచ్చెయ్యి" అంటూ పిలిచాను. మంజు సంతోషంగా తల వూపింది.

"వూరికే రమ్మంటున్నావా? లేక విందూ గిందూ ఏమన్నావుందా?" అని అడిగారాయన.

"విందుకేముంది. ఏదన్నా హొటల్‌కెళ్లి తిందాం" అంది మంజు.

"వై? ఎందుకు? మా యింట్లోనే విందు చేస్తాను. నేనే అన్నీ తయారుచేస్తాను. మంజు నాకు సాయం చేస్తుంది. ఏం మంజూ?" అని అడిగాను.

"ఓ యస్ - మీకెటువంటి సాయం కావాలన్నా చేస్తాను. నాన్న భాషలో విందూ అంటే నాన్‌వెజిటేరియన్ భోజనం అని. అందుకే హొటల్‌కి వెళదామని అన్నాను" అని వివరించింది మంజు.

"ఐ కెనాట్ హెల్ప్ యిట్" అంటూ చేతులు ఎత్తేశాను.

"నో నో, మీ యింట్లో విందులో అలాంటివన్నీ కావాలనుకుంటానా? గంగ చేత్తో ఏం వండినా, ఏం చేసిపెట్టినా అది నాకు విందు భోజనమే" అన్నారు ఈయన.

నిద్దర రావడం లేదు. ఆదివారానికి యింకా అయిదు రోజులున్నాయి. ఆదివారంనాడు విందుకి ఏం వొండాలోనని యిప్పటినుంచే ఆలోచన ప్రారంభించాను.

# 21

పాలవాడి కేక వినిపించేదాకా పక్కమీదనే పడుకుందామని విశ్వప్రయత్నం చేస్తున్నాను. ఇంకా అర్ధరాత్రి అయినా అయిందో లేదోనని సందేహంగా వుంది. లేచి వెళ్లి గడియారం చూడటానికి బద్ధకంగా వుంది. చూసిమటుకు ప్రయోజనం ఏమిటి? నెమ్మదిగా తిరగనీ.

గబుక్కున ఒక ఆలోచన వచ్చింది. వీధితలుపు వేసి లోపల సరిగ్గా ఘడియ పెట్టానా లేదో? అదేవిధంగా దొడ్డితలుపు కూడా లోపల ఘడియ వేశానో లేదో! అన్న అనుమానం పట్టి పీడించడం మొదలుపెట్టింది. ఒకవేళ ఘడియ పెట్టడం మర్చిపోయానేమో! ఇప్పుడు వెళ్లి చూడనా? వద్దు. అయిన ఆలస్యం ఎలాగో అయింది. పాలవాడి కేకకు లేస్తానుగా అప్పుడు చూస్తాను. ఈలోపల దొడ్డివెపునుంచి దొంగ ఎవడైనా వంటింట్లోకి జొరబడి సామాను వూడ్చుకెళ్లి పోతాడేమో! పట్టుకెళితే పట్టుకెళ్లనీ. నేను యింట్లో ఒంటరిగా వున్నానన్న వార్త యీ వీధి కంతటికీ అప్పుడే పాకిపోయివుంటుంది. ఈరోజు కాకపోతే మరో రోజు ఎప్పుడో ఒకప్పుడు యీ యింటికి దొంగ రాకుండా వుంటాడా? రానీ. వచ్చి వాడి కేది కావాలో పట్టుకుపోనీ. ఈ గదిలోకి మటుకు రాకుండా వుంటే చాలు. ఈ గదిలోకి కూడా వస్తాడా? దొంగతనానికి వచ్చినవాడు యీ వొక్క గది మటుకు ఎందుకు వొదులుతాడు? దొంగతనానికి వచ్చినవాడు యింట్లోవాళ్ల కళ్లబడకుండా కదా దొంగిలించేది. తలుపు కొట్టి దొంగతనానికి వచ్చానని చెపుతాడా?

దొంగని గురించి ఎందుకిలా వెర్రిగా ఆలోచిస్తున్నాను? ఒంటరిగా వుంటం చేత యిన్నాళ్లనుంచీ లేని భయాలు, పిచ్చిపిచ్చి వూహలు వస్తున్నాయి. అమ్మ యింట్లో వున్నపుడు నాకిలాంటి ఆలోచనలు వచ్చేవికావు. ఆవిడ లేకపోవడంచేత ఈ బాధ్యతంతా నా నెత్తిన పడింది. ఇదేదో అరువుసొమ్మన్నట్లుగా తప్ప, ఇది నా స్వంతం, నా యిల్లూ అని నాకు అనిపించడంలేదు. కాస్త యింగువ పలుకు కావాలంటే అల్మరాలోని అన్నీ డబ్బాల మూతలుతీసి వెతకాల్సి వస్తోంది. ఇప్పుడు యింగువ డబ్బా ఎక్కడుందో కనుక్కున్నాను గాని, మెంతులు డబ్బా ఎక్కడుందో మరిచి పోయాను. అన్ని డబ్బాల మీదా చీట్లు రాసి అంటిస్తే. ఏ డబ్బాల్లో ఏం వుందో హాయిగా తెలుస్తుంది.

ఎవరినయినా ఒక వంట మనిషిని తోడుగా పెట్టుకుంటే. కాస్త పెద్దావిడగా చూసి కుదుర్చుకుంటే యింట్లోనే వుంచుకోవచ్చు. నేను ఎక్కడకెళ్లి వెతకను? ఎవరిని అడగను? ఖర్మం జాలక అలా ఎవరైనా పెద్దావిడ వంటకి దొరికీ, నేను పెటుకుంటే అమ్మ చూస్తూ వూరుకోదు. భగ్గుమని ఆ మనిషిని వెళ్లగొట్టేదాకా

నిద్రపోదు. అలా పెట్టుకుని చూడనా? అమ్మ 'రియాక్షన్' ఎలా వుంటుందో తెలుసుకునేందుకైనా ఒక వంట మనిషిని పెడతాను. లేకపోతే అమ్మతోనే ఎవరినైనా వంటకి వెతకమని చెపితే! ట్రిప్లికేన్‌లో యిలాంటివాళ్లు దొరకొచ్చు. అమ్మకు తెలిసినవాళ్లని ఎవరినేనా కుదర్చమంటాను. యిట్ యీజ్ ఎ గుడ్ అయిడియా. నాకు సాయంగానూ వుంటుంది, యీ యింటిపని గొడవా తగ్గుతుంది. లేకపోతే మామయ్య గభాలున వూడిపడితే అదో తంటా. ఆయనకి వొండిపెడుతూ కూచోవాలి. పైగా కాళ్లు నొక్కుతూ ఈ యింట్లో వంటరిగా మామయ్యతో వుండాలి. ఆ విషయం తలుచుకుంటేనే ఎలాగో వుంది. ఇంట్లోకి దొంగ జొరబడినంత భయంగా వుంది ఆ ఆలోచనే. తెల్లవారగానే ముందు అమ్మ దగ్గిరకెళ్లి ఎవరినైనా వంటకి మనిషిని వెతికిపెట్టమని చెబుతాను.

వాకింగ్ వెళ్లి వచ్చేప్పుడు చూసి చెపితే, ఈయన కార్లో వెళ్లి గణేశన్ యింటి ముందు ఆగి, దిగి చెప్పిరావడమే! ఛీ ఛీ వొద్దు. కావాలని తనని అవమాన పరచడానికి యీయన కార్లో వచ్చానని వాడు మొహం మీదనే అడిగేస్తాడు. అసలు కార్లోంచి దిగడం చూశాడంటే 'ఏవే నా మర్యాద మంట గలపడానికి వచ్చావుటే అంటూ కొట్టడానికి రావచ్చు. కొట్టనూవచ్చు. వాకింగ్ నుంచి వస్తూ పైక్రాఫ్ట్స్ రోడ్డులో దిగితే సరిపోతుంది. దిగి నేను గణేశన్ యింటికి వెళతాను. పన్నెండు సంవత్సరాల తర్వాత నా అంతట నేను వాడి గుమ్మం తొక్కనా? బాగుంది ఎన్ని అనుకున్నా వాళ్లిద్దరూ తల్లీ కొడుకులు కాబట్టి అన్నీ మరచిపోయి వుండచ్చు. వాడు కొడుకు ఆవిడ తల్లి. నేను అల్లా అవుతానా? వెళ్లి వీధి గుమ్మంలో నిలుచుని చెప్పి వచ్చేస్తాను. నేను వచ్చిన విషయం చెప్పేస్తే సరిపోతుంది. అంతకు మించి ఏముంది గనక. నడిచి వెళ్లక్కర్లేకుండా పైక్రాఫ్ట్స్ రోడ్‌లో టాక్సీ తీసుకుని, గుమ్మంలో ఆపుకుని, పిలిచి చెపుతాను. ముందు భాగంలోనే కదా వుంటున్నాడు. కిటికీలోంచి వాడినో, గణేశనో లేకపోతే పిల్లలో ఎవరో ఒకరు కనబడకుండా వుంటారా?

టైమెంత అయివుంటుందో? ఇంకా ఎప్పటికి తెల్లవారుతుంది? రాత్రివేళ యింతసేపు వుంటుందా? ఇంత దీర్ఘంగా వుంటుందా? అవును పగలెంతసేపో, రాత్రి అంతసేపే కదా! తొమ్మిది గంటలకి పడుకున్నాను. అయిదు గంటలదాకా - అంటే ఎనిమిది గంటల సేపన్నమాట. ఇదే పగలుగనక అయితే యీ ఎనిమిది గంటల సమయంలో ఎన్ని పనులేనా చెయ్యవచ్చు. ఒక్క పనికూడా లేకుండా పొద్దుట తొమ్మిదినుంచి, సాయింత్రం అయిదింటిదాకా మంచంమీద పడుకుని వుండమంటే ఎంత విసుగ్గా వుంటుందో! నిద్రపోకుండా పడుకుని వుండచ్చు. రాత్రయితేనేం? పొగలయితేనేం? సమయం ఒక్కటేకదా!

కొంచెం కునుకు పట్టిందనుకుంటా. తెల తెలవారుతున్నట్లుంది.

అదిగో స్పర్‌టాంక్ రోడ్‌లో బస్ వెళుతున్న శబ్దం వినిపిస్తోంది. అది లారీ యేమో! కాకులు అరుస్తున్నాయే! ఈ మద్రాసులో కాకులు ఎప్పుడుబడితే అప్పుడే అరుస్తూంటాయి. రాత్రి తొమ్మిదింటికి అరవడం నేను చాలాసార్లు విన్నాను. వీధిలో మనుషులు తిరగడం ఆరంభమయింది. ఎవరో ఆవును తోలు కెడుతున్న శబ్దం వినిపిస్తోంది.

'అమ్మా పాల్' పాలవాడి కంఠం. రెండు మూడిళ్ల అవతలనుంచి వినిపిస్తోంది. ఎక్కడనుంచో వాకిట్లో కళాపు చల్లుతున్న శబ్దం వినిపిస్తోంది. గచ్చు నేలమీద కొబ్బరి చీపిరితో వత్తి తుడుస్తున్నారు ఎవరింట్లోనో! లేచి మంచం మీద కూచుని కిటికీలోంచి బయటకు చూస్తున్నాను. ఇంకా సన్నగా చీకట్లు అలుముకునే వున్నాయి. పూర్తిగా వెలుతురు రాలేదు. అయినా తెల్లవారింది. టైమెంతయిందో? నాలుగూ ముప్పావు.

ఉదయంవేళ మనసు సంతోషంగా వుంది. ఆహ్లాదంగా వుంది. రాత్రి బాగా నిద్ర పట్టలేదు. అయినా తేలిగ్గావుంది. లేచి గది తలుపు తెరుచుకుని హాల్లోకి వచ్చి లైటు వేశాను. మొట్టమొదట దొడ్డి తలుపు ఘడియపెట్టానో లేదో అని చూసి వచ్చాను. గడియ సరిగానే వేశానే! వేసికూడా అర్థంలేని ఆలోచనలతో, భయాలతో రాత్రంతా బాధపడ్డాను. నన్ను నేనే తిట్టుకున్నాను యీ వెర్రి ఆలోచనలకి. బాత్‌రూమ్‌లోకి వెళ్లి మొహం కడుక్కున్నాను. రాత్రి వండిన గిన్నెలన్నీ అలా పడివున్నాయి. పాల గిన్నె మటుకు తోమి తీసుకొచ్చాను.

అదిగో పాలవాడు వచ్చేశాడు. పాలు పుచ్చుకోవడానికి వెళ్లినపుడు వీధి తలుపు తీశాను. బాగా వెలుతురుగా వుంది. ఎదురింట్లో ముగ్గులు పెడుతున్నారు. పాలు తీసుకొచ్చి లోపలపెట్టి, రెండు ముగ్గుకర్రలు నేనూ పెట్టాలి. వీటన్నిటికీ అమ్మ పని మనిషిని పెట్టివుండకూడదా! పాపం. అంత చాకిరీ వంటరిగా తనే చేసుకునేది. నేనో పనిమనిషిని కుదుర్చుకుంటాను. ఈ వారం రోజులు ఈ పనంతా నేనే చేసుకుంటున్నాను. ఎప్పుడూ యీ చాకిరీ అంతా చేసుకోవాలంటే చాలా కష్టం. ఈ పని ఒక్కటే అని ఏమిటి? అన్ని పనులూ చేసుకుంటూ పోవాల్సిందే! "జీవితమంతా గిన్నెలు తోమి తోమి, చింతపండు పిసిగి పిసిగి ప్రాణం విసిగిపోయింది" అని అమ్మ అంటూండేది. కాని ఆవిడకు యిదొక్కటే పని. నేను యింటిపని చేసి బయట పనికీ వెళ్లాలే!

"అమ్మా పెద్దమ్మగారు యింకా రాలేదా?" అని పాలవాడు అడుగుతున్నాడు పాలు పోస్తూ.

"లేదు ఆవిడ కొడుకింటికి వెళ్లింది" అన్నాను నేను.

వాడేదో గ్రహించుకున్నట్లున్నాడు. ఈ వీధిలో అన్ని యిళ్లలో వీడే పాలు పోస్తూంటాడు. వెళ్లిన అన్నిచోట్లా రకరకాలు మాట్లాడివుంటారు. అందులోనూ

వీడు యీ యింట్లో పాలు పోస్తూంటాడని తెలుసుకు, విడి దగ్గిర ఏదేనా అని వుండకపోతారా?

పాలు పోయించుకు వచ్చేప్పటికి పేపరు వచ్చింది. పాలగిన్నె లోపలికి తీసుకెళ్లి మూతపెట్టి, పేపరు పట్టుకుని హాల్లోకి వచ్చి, సోఫాలో కూచుని పేపరు విప్పాను.

బయట కారు ఆగిన శబ్దం అయింది. ఈయన వచ్చారేమోనని లేచి చూశాను. టాక్సీ. వచ్చాను - మామయ్య వస్తున్నాడు. చేతిలో బాగ్ పుచ్చుకు దిగుతున్నాడు.

అవునవును 'పైవారం వస్తానని' చెప్పి వెళ్లాడుగా. ఆ విషయమే జ్ఞాపకంలేదు. వారం గిర్రున తిరిగిపోయింది. ఇప్పుడెల్లా? అమ్మని తీసుకురాక తప్పదు. ఈ రోజే తీసుకురావాలి.

మామయ్య చాలా కుతూహలంతో వస్తున్నాడు.

"నిన్న సాయింత్రం బయలుదేరాను. 'ఠాం' అని అయిదూనలభై కల్లా పట్టుకొచ్చి ఎగ్మూర్‌లో పడేశాడు. ఈ రైలు ఫరవాలేదు. ఛార్జీలు కూడా తక్కువే. కులాసాగా వున్నావా?" అంటూ చెయ్యి పుచ్చుకు అడుగుతున్నాడు.

"నువ్వెక్కడ వాకింగ్‌కి వెళ్లిపోతావో వీధిలో నిలుచుని వుండాలి గావల్ను అనుకున్నాను. మంచి టైముకే వచ్చాను."

"కూర్చోండి, కాఫీ కలిపి తీసుకువస్తాను" అంటూ అక్కడినుంచి కదిలి వంటింట్లోకి వెళ్లి గిన్నెలు తోముతున్నాను - మామయ్య హాల్లో కూచుని పేపరు చదువుతున్నాడు.

ఈ మామయ్యకు మెడ్రాసులో యిప్పుడు పని యేమీలేదని నాకు తెలుసు. నాతో వంటరిగా గడపవచ్చుననే ఆశతో పరుగెత్తుకొచ్చాడు. నాకు బాగా బోధపడుతోంది. అమ్మని పంపించి ఈవారం రోజులనుంచీ - నేను యీయనతో వంటరిగా, జల్సాగా వుండి వుంటానని వూహించుకు నిట్టూర్పులు విడుస్తూ వుండి వుంటాడు. ఇక మనసు పట్టలేక రాత్రి రైలెక్కి వుంటాడు. తను పొద్దున్నే వచ్చేసరికి 'యీయన' కూడా యిక్కడే వుంటారేమో చూడవచ్చు అనుకుని వుంటాడు. ఈ మామయ్య బుర్ర ఎలా పనిచేస్తుందో నాకు బాగా తెలుసు.

గిన్నెలు తోమిపెట్టి, కాఫీ తీసుకొచ్చి మామయ్యకిచ్చాను. మామయ్య నన్ను గుచ్చి గుచ్చి చూస్తున్నాడు.

"కనకం ఆవేళ వెళ్లిపోయాక మళ్లీ వచ్చి చూసిందా?" అని అడిగాడు.

"లేదు. నేనే వెళ్లి ఈరోజు చూసివస్తాను" అన్నాను. ఆయన బదులు చెప్పకుండా కాఫీ తాగుతున్నాడు. నిలుచుని నేనూ కాఫీ తాగుతున్నాను. ఏదో చెప్పబోతున్నాడు. అందుకొరకే నేనూ ఎదురుచూస్తున్నాను. ఆయన ఏం చెప్పబోతున్నాడో .... "నువ్వు ఆ యింటికి ఎందుకెళతావ్: కావాలంటే తనే వస్తుంది" అని చెప్పబోతున్నాడు.

కరక్ట్. నేను అనుకున్నదే చెప్పడం మొదలుపెట్టాడు.

"గణేశన్ బయటకి పొమ్మని నిన్ను తరమేశాక - నువ్వు మళ్ళీ ఆగడప తొక్క లేదనుకుంటా! అవునా?" అని అడుగుతున్నాడు.

"అవును" అన్నాను నేను.

"వాడుమటుకు యిక్కడికి వస్తూవుండేవాడా?" అని అడిగాడు.

"వాడి తల్లి వుంది కాబట్టి - అమ్మను చూట్టానికి వస్తూవుండేవాడు. మామ్మని చూడటానికి మనుమలు వస్తూండేవారు" అన్నాను నేను.

"ఓ అదేవిధంగా నువ్వు మీ అమ్మని చూడటానికి వెళ్తున్నావన్నమాట" ఎద్దేవా చేస్తున్నట్లు సాగతీసి, కాళీగ్లాసు అందించాడు. అది అందుకుని చెప్పాను.

"నేను వాళ్ళింటికి వెళ్ళను. బయట నిలుచుని 'మామయ్య వచ్చారు యింటికిరా' అని ఒక కేకవేసి వచ్చేస్తాను" అంటూ అసలు విషయం బయటపెట్టేసి వంటింటి వైపుకి వెళ్ళాను. మామయ్య వెనకాలే వస్తున్నట్లున్నాడు. వంటింటి గుమ్మం దగ్గిర నిలుచుని అన్నాడు.

"అంటే నువ్వు నాకోసం అక్కడికి వెళుతున్నావా?" అని అడిగాడు.

"అవును ఆరోజు అమ్మ వెళుతున్నపుడు చెప్పింది. మీరుగనక వస్తే వచ్చి చెప్పమని."

"ఓహెూ.... నేను నీతో విడిగా మాట్లాడాలని ప్రత్యేకంగా యిప్పుడొచ్చానే"

"దాందేవుంది. మనం విడిగా మాట్లాడుకోడానికేముంది. అమ్మ మననే కనిపెట్టుకుని కూచోదుగా. నాతో ఏదన్నా మాట్లాడమని మీతో చెప్పిందా?" తన మనసు అర్థంకానట్లు అమాయకంగా అడిగాను.

మామయ్య నవ్వుతున్నాడు. ఎందుకు నవ్వుతున్నాడో? కావాలనే దొంగనవ్వు నవ్వుతున్నాడా? "నువ్వు చాలా పెద్దపిల్లవయిపోయావు" అంటూ గిల్లటానికి దగ్గిరకొస్తున్నాడు.

బయట హారన్ శబ్దం అవుతోంది.

"బాయిలర్ అంటించాను. మీరు స్నానం చెయ్యండి. లోపల ఘుడియ వేసుకోండి నేను త్వరగా వచ్చేస్తాను" అంటూ రూమ్‌లోకివెళ్ళి తల పైపైన దువ్వుకు, చెప్పులు వేసుకుని, రూమ్‌కి తాళంబెట్టి, మామయ్యకి 'టాటా' చెప్పి గబగబ బయలుదేరాను.

అయన ఏం సమాధానం చెప్పారో - ఆయన ముఖం ఎలావుందో కూడా నేను గమనించలేదు.

అమ్మ వచ్చింది. పొద్దుటే ముందు అనుకున్నట్లు పైక్రాఫ్ట్సు రోడ్‌లో ఒక టాక్సీ తీసుకునివెళ్ళి, బండిలోంచి కిందకు దిగకుండా, సంగతి చెప్పి వచ్చేశాను. గణేశన్ కూతురు శాంత నన్ను చూసి 'అత్త' అంటూ పరుగెత్తుకొచ్చింది. కారు లోపలికి చెయ్యిచాపి, నాచెయ్యి పట్టుకు 'లోపలికిరండి' అంటూ లాగుతోంది. నన్ను పట్టుకు వదలనంటోంది.

"మామ్మను పిలు" అని చెప్పాను. "మామ్మా మామ్మా అత్తొచ్చింది" అని అరుచుకుంటూ లోపలికి పరుగెత్తింది. ఆ పరుగులో పరికిణీ ఎక్కడ బందాలు పడుతుందోనని భయంవేసింది.

ఎవరెవరోవచ్చి తొంగిచూస్తున్నారు. ఇదివరకున్న పాతమొహాలు చాలామటుకు మాయమయి పోయినట్లున్నాయి. పరిచయంలేని కొత్త మొహాలు చాలా కనిపించాయి. అమ్మ వస్తోంది. ఏమయిందో ఏమిటోనని భయపడుతూ వస్తోంది.

"ఏమిటే? ఏమయింది?" అంటూ ఖంగారుగావచ్చి కారుపక్కన నిలుచుని అడుగుతోంది.

"ఏం లేదు. మామయ్య వచ్చాడు. ప్రొద్దుట ఎలాగో వండి ఆఫీసుకు వెళతాను. మధ్యాహ్నం నువ్వు యింటికి వచ్చెయ్యి" అని చెప్పాను.

అమ్మ ముఖంలో కొంచెం గర్వంతో కూడిన నవ్వు కనిపించింది. తను లేకుండా నాకు గడవదని విజయ గర్వం, అనుకోని.

వంగి చెవులోకి రహస్యంగా చెపుతున్నట్లు "యిప్పుడే చెబుతున్నాను. నేనున్న ఆ రెండురోజులూ వాళ్లెవరూ రావటానికి వీల్లేదు. అల్లాయితేనే వస్తాను" అంటూ కండీషన్ పెట్టింది.

"సరి" అన్నాను.

ఇలా మాటతీసుకోవడంలో ఆవిడకోవిధమైన తృప్తి కాబోలు అనుకున్నాను.

మామయ్యని వూరుకోపెట్టేందుకు యింటికి వచ్చిరాగానే గబగబ కుక్కర్ ఎక్కించి, స్నానానికి వెళ్లాను. స్నానం చేసివచ్చి మామయ్యకు భోజనం వడ్డించాను. నా వంటని మామయ్య చాలా మెచ్చుకున్నాడు. "ఆఫీసుకు లీవు పెట్టు" అన్నాడు. "అయ్యో యివ్వాళ ముఖ్యమైన పనులున్నాయే" అని అబద్ధంచెప్పి బయటపడ్డాను.

ఈయన తీసుకెళ్లేందుకు వచ్చారు. అప్పుడు మామయ్య బయటకొచ్చి నిలుచుని యీయన్ని విష్‌చేశారు. ఈయన చాలా మర్యాదగా కారులోంచిదిగి, 'గుడ్‌మార్నింగ్' చెప్పి, 'ఎప్పుడొచ్చార'ని క్షేమ సమాచారాలు విచారించారు. మామయ్య దగ్గిర శలవుతీసుకుని, నన్ను కార్లో తీసుకెళుతున్నపుడు, యింత కాలానికి యీరోజున, యీ విషయం గురించి అడగాలని తోచింది కాబోలు

'అవునూ - మీ మామయ్య నా గురించి నిన్నేం అడగలేదా? వీడెవడో మాపిల్లను వూరికూరికే కార్లో తీసుకెడుతున్నాడని అడగలేదా?'

నవ్వుతూ అన్నాను. "హి నోస్ ఎవ్విరిథింగ్. ఆయనకు అంతా తెలుసు. మనగురించి పూర్తిగా తెలుసు. మీరెవరో - ఏమిటో అన్నీ తెలుసు"

ఈయన 'షాక్' తిన్నట్లు నోరు తెరుచుకు చూస్తున్నారు.

"వాట్ డు యు మీన్"

"అయి మీన్ – వాట్ అయి సే నేను అన్నదే అనుకున్నదీ -" అని ఆయనకు విడమర్చి చెప్పాను. "సో వాట్? తెలిస్తే ఏం? ఆయన తెలిసీకూడా తెలియనట్లు గుంభనగా ప్రవర్తిస్తున్నపుడు మనమూ అలాగేవుండాలి. ఆయన ధైర్యంచేసి ఏదేనా 'డేర్ డెవిల్‌గా' కుండ బద్దలుకొట్టినట్లు అడిగినపుడు 'అవును' అని నేను ధైర్యంగా చెబుతాను . . . ."

"అదెట్లా? ఆయనలాటి ఒక పెద్ద మనిషి దగ్గిర . . ." అంటూ యీయన తల గోక్కుంటున్నారు.

'ఏం మీరుమటుకు ఎవరు? పెద్దమనిషి కాదా? అందుకోసమనే ఆయన మీదగ్గిర మర్యాదగా ప్రవర్తిస్తున్నారు. ఆయన చాలా నాగరికుడు. మిమ్మల్ని మాటిగా ఏమి అడగడు" అంటూ ధైర్యం చెప్పాను.

ఆఫీసునుంచి యింటికొచ్చేటప్పటికి వంటింట్లో శబ్దాలు వినిపిస్తున్నాయి. అమ్మ వచ్చేసింది.

"ఈ కుక్కరూ గిక్కరూ వీటితో నేను వండలేను బాబూ" అంటూ ఏదో గొణుగుతోంది అమ్మ.

మామయ్య నేను ఎప్పుడొస్తానా అని ఎదురుచూస్తున్నాడు కాబోలు. పొద్దుట ఆఫీసుకు బయలుదేరుతుంటే 'తొందరగా వచ్చెయ్యి' అంటూ చెప్పి పంపాడు. నేనుకూడా అందుకనే యీయన్ని రావద్దని, టాక్సీలో యింటికొచ్చాను.

ఇప్పుడంతా నేను బస్సులో వెళ్లటంలేదు. నేను వేసుకునే బట్టలూ, చేసుకునే ఫాషన్సూ వీటికి యీ బస్ ప్రయాణం తగదు.

"రా - పెందరాడే వచ్చావే - రా" అంటూ ఆహ్వానించాడు మామయ్య.

అమ్మ టిఫిన్ చెసింది. వుప్మా తయారుచేసింది. అమ్మ యింట్లోవుంటే నాకు సంతోషంగా, ప్రశాంతంగా కూడా వుంది.

మామయ్యా నేనూ హాల్లో కూచుని టిఫిన్ తింటున్నాము.

తరువాత మామయ్య డాబామీదకు రమ్మని పిలిచాడు.

"రావే పైకెళ్ళి హాయిగా చల్లగాల్లో కాసేపు కూర్చుందాము. నీతో మాట్లాడాల్సినప

12

చాలా వున్నాయి. విడిగా మాట్లాడాలి" అంటూ అమ్మకు వినిపించేటట్లు, డాబా మెట్లుమీద నిలుచుని పిలిచాడు.

నేను వెళ్లాను.

వరానికి తడిసి, ఎండకు ఎండి, రంగుపోయి, పనికిరాకుండా పడివున్న పేముకుర్చీలో మామయ్య కూచునివున్నాడు.

"ఈ కుర్చీ బాగానే వుందే! ఎందుకిట్లా వృధాగా పారేశారు. పెయింట్ వేస్తే యింకో పదిసంవత్సరాలు హాయిగా వాడుకోవచ్చు" అంటూ ఆ కుర్చీని పట్టుకు పట్టుకు చూస్తున్నాడు.

ఆ తరువాత నన్ను చూసి "హౌ యీజ్ లైఫ్?" అని అడిగి కన్ను గీటాడు.

"ఫైన్" అని నేనూ నవ్వాను.

## 22

మామయ్య వూరికెళ్లిపోయారు. అమ్మ గణేశన్ యింటికి వెళ్లిపోయింది. నేను మళ్లీ వంటరిదాన్ని అయిపోయాను. అంతా యిప్పుడివ్వుడే వెళ్లిపోయారు.

బంధాలు, ప్రేమలు యివన్నీ యింతేగదా! రక్తంపంచుకు పుట్టినా, కడుపునపుట్టినా చివరకి అంతా యింతే. చివరిదాకా విడదియ్య వీలులేని, ముడిబడివుండే బంధం - భార్యాభర్తల మధ్య బంధమొక్కటే. ఇష్టం వుండో, ఇష్టం లేకనో యిద్దరూ ఒకరి కొకరు కట్టుబడివుండేది, చివరిదాకా ముడిబడి వుండేది ఆ దాంపత్య బంధం వొక్కటే. డైవర్స్ యిచ్చుకుంటేమటుకేం? ఒక బంధానికి డైవర్సు యివ్వడం యింతకంటే గట్టిబంధం ఏర్పరచుకునేందుకేగదా! అల్లాకాకుండా మరోబంధం లేకుండావుంటే, అది ఏ అనుబంధమూలేని జీవితం అవుతుందికదా! ఆ ఒక్క అనుబంధం కనుకవుంటే ఎవరువున్నా - ఎవరు లేకపోయినా బతకవచ్చు. ఆ అనుబంధమే లేనపుడు తోడపుట్టినవాళ్లు, జన్మయిచ్చినవాళ్లు, రక్తసంబంధీకులు ఎంత మంది చుట్టూవున్నాకూడా వంటరిగా వున్నట్లేవుంటుంది. ఆ జీవి వంటరిజీవి మటుకే.

ఈ ఒక్క బంధాన్నే డైవర్సుచేసి తెంచుకోనూవచ్చు, ఆపైన మళ్లీ మరో బంధాన్ని ఏర్పరచుకోనూవచ్చు. అయినప్పటికీ యిది అతిముఖ్యమైనదీ, జీవితాన్ని నిలబెట్టేటువంటిదీ అయిన అనుబంధం. మనం కావాలనుకున్నా వద్దనుకున్నా ఏర్పడే అనుబంధం. రక్తసంబంధాలన్నీ వున్నమీదట ఏర్పడేవి, ప్రతీవ్యక్తీ కావాలని ఆరాటపడేది యీ అనుబంధమేకదా!

అందుచేతనే అమ్మనుగాని, అన్నయ్యనుగాని, మామయ్యనుగాని - వీరెవ్వరినీ విసర్జించనూ లేకుండావున్నాను - కావాలని ఆదరించనూ లేకుండావున్నాను.

కాని యీ అనుబంధం అలాకాదు. ఇది చాలా ముఖ్యమైనది. మిగతావాటి కంటే తీవ్రమైనది. అన్నిబంధాలకీ ఆధారమైనది. అందువల్లనే మనుషులు యీ బంధంకొరకు ఆరాటపడుతూంటారు. కావాలని అందులో చిక్కుకునిపోతారు.

నాకు ఈ అనుబంధంకూడా లేదు. అందుచేతనే ఏబంధాలూ లేనిదాన్ని అయ్యాను.

ఇకమీదట మామయ్య రాడు. ఆ బంధానికి నేను విడాకులు యిచ్చేసినట్లే. ఈ విషయం నాకొక్కదానికే తెలుసు. అంచేత యికమీదట అమ్మకూడా రాదు. ఏదన్నాపని కల్పించుకుని ఆమెని రమ్మని పిలవాలి. అమ్మ నాతో వుంటే నాకు బాగుంటుంది. కాని ఎలా? ఏం చెయ్యను?

అమ్మ కూచున్నట్లే నేనుకూడా బయట లైటువేసుకుని వీధిగుమ్మంలో మెట్ల మీద కూచునివున్నాను. ఇంట్లో ఒంటరిగా తలుపులు వేసుకుని కూచోవాలంటే తలనొప్పిగా వుండేది కాబోలు అమ్మకి. అందుకనే ఆవిడా యిలావచ్చి వీధి గుమ్మంలో కూచుంటుండేది. ఇలా ఒంటరిగా వుండటం అనుభవమయాక అమ్మ ఎందుకిట్లా వీధిమెట్లమీద కూచునివుండేదో బోధపడుతోంది. కొంచెంసేపు అలా వీధంతా కలయచూస్తే బాగుండునని అనిపిస్తోంది. కాని ఎలా? ఈవీధంతా నన్ను వింతగా చూస్తున్నది. ఈ వీధివారికి నేనొక కథానాయకురాలిని కాబోలు. కథలు కథలుగా నా పురాణం చెప్పుకుంటూంటారా? తొంగి తొంగి చూస్తూంటారు కాబోలు.

చేతిలో పుస్తకం పుచ్చుకుని ఇవన్నీ గమనించనట్లు పరిశీలిస్తున్నాను.

ఏం పుస్తకంరా బాబు! ఏం బాగాలేదు - చదవడం మొదలుపెట్టినప్పటినుంచీ బాగా లేదు అనుకుంటూనే పూర్తిచేస్తానా? బాగాలేదు బాగాలేదు అంటూనే చివరి దాకా చదువుతానా? ఎక్కడన్నా కాస్తన్నా బాగుందా? చదివినకొద్దీ ఎక్కడా సెన్సు అంటూ కనిపించటంలేదు. పేజీలు పేజీలు తిప్పుకుంటూ పోతున్నాను.

రేడియో ఒకటి కొనుక్కుంటే, రేడియో మీద నాకెప్పుడు అభిలాషలేదు. ఉంటే అది కొనటం ఒక లెక్కా? రేపే ఒక రేడియో కొని పట్టుకొస్తాను. పక్కయింటి వాళ్లు – వాళ్ల రేడియో సంగీతాన్ని నా చెవుల పడేస్తూంటారు. మాయింట్లోంచి కూడా వాళ్ల చెవుల తుప్పు ఎగరగొడితేసరి. ఒంటరిగా వున్నపుడు యిది తోడుగా శబ్దంచేస్తూ వుంటుంది. మాటలయితే పర్మాలేదు - ఎటొచ్చీ పాడితే భరించలేను. పాటలేమిటి? సంగీతమేమిటి? అన్నీ ఒకటే!

వీధిగుమ్మంలో కూచునివున్నాను. లోపలికి వెళ్ళబుద్ధి పుట్టడంలేదు, లోపల శూన్యంగా వుంది. అమ్మ పనిలోపని అని సాయంత్రానికి కూడా వండిబెట్టి వెళ్లింది. అంచేత వంటపనికూడా లేదు. లేకుంటే ఆసాకుతో కొంతసేపు కాలక్షేపంచేసి వుండేదాన్ని. కాలంగడవక కూచునివున్నాను. ఒకసారి మంజుని చూసివస్తేనో! ఛీ – అనుకోగానే పరుగెత్తడమా! పైగా యీయన్నీ - యీరోజు రావద్దని నేనే చెప్పాను. అమ్మకి తృప్తిగా వుంటుందని. ఆవిడ అమాయకంగా అడిగిన మాటకు, కట్టుబడి వుండేందుకు - ఏదో కారణం కలిపించి ఈయన్ని యీ రెండు రోజులూ యీవైపుకి రావద్దన్నాను. పెందరాడే యింటికొచ్చి వీళ్లన్ని పంపించేశాను. ఒంటరిగా వున్నాను. నాకెవ్వరూలేరా? అంతా ఖాళీగా, శూన్యంగా వుంది. ప్రతిదీ అర్థహీనంగావుంది. పైగా ఈ పుసకంవొకటి విసిగించి చంపిపారేస్తోంది. చికాకెత్తి మూసేశాను.

వీధిగేటు పక్కన ఎవరో నిలుచుని వున్నట్లున్నారు. "ఎవరు ?"

"నేనే – అత్తా" మా అమ్మ ఫ్రెండు. ఈ రోజు చేతిలో చిళ్లపెంకులేదు. గేటుపట్టుకుని తలమటుకు గేటుపైన పెట్టి చూస్తోంది. ఆ పిల్లని చూసేప్పటికి నాకు ప్రాణం లేచివచ్చినట్లయింది. 'రా – రా' అని పిలిచాను. ఆ పిల్లకోసమే ఎదురు తెన్నులు చూస్తునట్లు గభాలున లేచి వెళ్లి, గేటు తెరిచాను. అమ్మలేదని తెలుసుకు పారిపోతుందేమోనని, చెయ్యిపుచ్చుకు లాక్కుని మరీవచ్చాను. ఆ రోజు యీ పిల్ల మాట్లాడించినపుడు, నన్నెక్కడ మాటల్లోకి లాగుతుందోనని భయపడి తప్పుకున్నాను. ఈ రోజున నా అంతట నేనే కావాలని దగ్గరకు తీసుకుంటున్నాను.

"నీ పేరేమిటి ?"

"మీనా"

"ఎందుకొచ్చావ్? ఏమిటి విశేషం? ఏం కావాలి? ఎన్నో క్లాసు చదువు తున్నావ్? గుక్కతిప్పుకోకుండా ప్రశ్నలు వేస్తున్నాను. సమాధానం చెప్పేసి ఎక్కడ పారిపోతుందేమోనని - వరస వరసగా ప్రశ్నలు అడుగుతున్నాను. ఆ పిల్లకి కొత్తగా వున్నట్లుంది. నేను చాలా గర్విష్ఠి అనే యీ పిల్లకి జ్ఞాపకం. అల్లాంటిది ఈ రోజు నేనింత మాట్లాడుతుంటే ఆశ్చర్యంగా వున్నట్లుంది. గర్వ పడటం తనవంతు అన్నట్లుగా టెక్కుగా బదులు చెప్పింది.

"సిక్స్త్ స్టాండర్డ్ - సేవాసదన్‌లో" ఆ పిల్లని నా పక్కన కూచోపెట్టు కున్నాను.

"ఎవరు కావాలి? ఏమిటి సంగతి?"

"ఏం లేదు. మీయింటికొచ్చిన వాళ్లందరూ వూరికెళ్లిపోయారు, మామ్మ గారు కూడా వెళ్లపోయారని పిన్ని చెప్పింది. నేను కాదు అన్నాను. మాపిన్ని పందెం కట్టింది. చూసివెళదామని వచ్చాను. మామ్మగారు లోపలవున్నారా?" అంటూ లోపలికి తొంగి చూస్తోంది.

"మీ పిన్ని ఏం పందెం వేసింది?" అని అడిగాను. చెప్పిందే ఎక్కువ అనుకుంది కాబోలు. పెదిమలు బిగించుకుని తలవంచుకుని, నేలమీద గీస్తూ కూచుంది. ఒకటి అంటించి పంపేద్దామని అనిపించింది.

"అత్తా నేనొకటి అడుగుతాను చెపుతారా?" అంటూ వుపోద్ఘాతం మొదలుపెట్టింది.

"అడుగు చెప్తాను."

"మామ్మగారు మీతో దెబ్బలాడి వెళ్లిపోయారా? నిజంగానా? మామ్మ గారికీ మీకు పోట్లాట? యింక రానే రారా?"

నాకు ఏం చెప్పాలో తోచలేదు. మనసులో బాధగావుంది. మా అమ్మ ఎవరి దగ్గరో యీ విషయాలన్నీ చెప్పి గొడవజేసి వుంటుంది.

"పోట్లాట? దేనికి? దేన్ని గురించి? ఆ మాట ఎవరన్నారు? ఆవిడ మా అన్నయ్య యింటికి వెళ్లింది. తిరిగి వచ్చేస్తుంది" అని సర్ది చెప్పాను.

"మీరు ఒంటరిగానే వుంటారా?" ఇంకా ఏదో అడగాలని అనుకుంటోంది. కాని అడగకూడదని వూరుకున్నట్లుంది. పాపం దీన్ని గురించి యీ పిల్లను కోప్ప డటం దేనికి? అని నాలో నేను అనుకున్నాను. యీ పిల్ల నేను కార్లో రావటం, కార్లో వెళ్లడం చూసివుంటుంది. ఆ దృశ్యాలు ఆ అమ్మాయి కళ్లల్లో మెదులు తున్నట్లున్నాయి.

"అవును ఒక్కదాన్నే వుండాలి. కష్టంగా వుంది. నువ్వు వచ్చి నాకు సాయంగా వుంటావా?"

"ఇక్కడా? ఎప్పుడూనా?"

"ఏం?"

"అమ్మో - నేనుండను బాబు. మా అమ్మ కొడుతుంది."

"దీనికంతా కొట్టరు. కొంచెంసేపు యిక్కడుండు. ఆపైన మీ యింటికి వెళ్లి పోవచ్చు. నేనూ ఆఫీసుకు వెళ్లిపోతాను. నీకేం పనివుండదు. రేపు రేడియో కొని తీసుకొస్తున్నాను. నువ్వొచ్చి చూస్తావా?"

"అయ్యో రేడియో ఎందుకు? కొంటే ట్రాన్సిస్టర్ కొనండి అంచక్కా" అంటూ తెలివిగా సలహాయిచ్చింది యీ పిల్ల.

"యిట్ యీజ్ ఎ గుడ్ అయిడియా ఓ యస్. నువ్వు చెప్పినట్లు ట్రాన్సిస్టరే కొంటాను" అంటూ చెబుతున్నాను. ఇంతలో 'మీనా' అని కేక వినిపించింది.

"ఇదిగో వచ్చేస్తున్నాను పిన్నీ" అని అరవి బదులుచెప్పి, "రేపు వస్తానండి - టా టా" అంటూ పరుగెత్తుకు వెళ్లిపోయింది.

నేను మళ్లీ పుస్తకం విప్పాను. మనసు పుస్తకంమీద లేదు. ఇకమీదట మామయ్య యీ యింటికి రాడు - అన్న ఆలోచన ఏదో హాయిని కలిగిస్తోంది. నేను యీవిధంగా సంతోషించే స్థితికి ఆయన దిగిపోయారన్నది తలుచుకుంటే బాధగా వుంది. క్రిందటిసారి వచ్చినపుడు "గంగా - నువ్వే గెలిచావ్" అని నాతో అన్నాడు. ఈసారి వోడిపోయిన విషయాన్ని పైకి వొప్పుకోకపోయినా, తన పరాజయాన్ని వొప్పుకున్నట్లే తలవంచుకు వెళ్లిపోయాడు.

నిన్నరాత్రి పదిగంటలదాకా మేమిద్దరం డాబాలో కూచుని మాట్లాడుతూనే వున్నాము. నిన్నరాత్రే మొదటిసారి నేను ఆయనపట్ల కఠినంగా ప్రవర్తించాను. అదే ఆఖరిసారికూడా అయింది.

ఏవిటేమిటో మాట్లాడుతున్నాము. కొన్ని సమయాల్లో చాలా ఇంటరెస్టింగ్‌గా కూడా వుంది సంభాషణ. ఇంట్రస్టింగ్‌గా మాట్లాడడం మామయ్యకి ఒకరు నేర్పాలా ?

నా ప్రస్తుత పరిస్థితి, నా జీవితం, ఇకనుంచీ నేను ఎలా ప్రవర్తించబోతున్నది, నేను తీసుకున్న నిర్ణయాలు, వీటన్నిటి గురించీ ఆయనతో వాదిస్తున్నాను. మామయ్యకూడా చాలా సీరియస్‌గా నేను చెప్పేవి వింటూ, నాతోపాటు సరి సమానంగా మాట్లాడుతూ, గభాలున మాటలస్థితిని చాలా కిందికి లాగి తనూ దిగేశాడు. ఈయన గురించి, యీయనకీ నాకు మధ్యనున్న సంబంధం గురించి, చాలా పచ్చిగా 'స్టాటిస్టిక్స్' తీసుకుంటునట్లు, అదేదో లెక్కలు వివరాలు అడిగి, బేరీజు వేసుకుంటారే ఆమాదిరి అడగడం ప్రారంభించాడు. నాకు వొళ్లంతా భగ భగ మండిపోతోంది.

మామయ్య ఆ పేము కుర్చీలో కూచుని వున్నాడు. కింద నేలమీద ఓ పక్కగా, పిట్టగోడకి ఆనుకుని, మోకాళ్లమీద తల పెట్టుకుని, ఆయన అడిగినవాటికి బదులు చెపుతూ కూచుని వున్నాను. ఆయన కాలు మాటి మాటికి నా తొడమీదకి ఆనిస్తున్నాడు. నేను కొంచెం కొంచెం జరుగుతున్నాను. మాట్లాడుతున్న విషయాలపై మనసు లగ్నం చెయ్యడానికి వీలవకుండా, యీ గొడవ ఒకటి. ఇలాంటి అసహ్యకర మైన పనులు ఒకవైపు చేస్తూ, అదే సమయంలో పెద్ద పెద్ద విషయాలు ఎలా చర్చిస్తాడో ? నాకోపం బయటపడకుండా పళ్లు బిగపట్టుకుని, ఏదో మాట్లాడుతున్నాను. ఆయన మాట్లాడే మాటలు ఒకటికూడా నా బుర్రలోకి దూరటంలేదు. మనసు లగ్నం అవటంలేదు. అదేదో కొత్తభాష మాట్లాడుతున్నట్లు వున్నది.

మామయ్య ఏదో చెబుతూ కాలు బొటకనివేలూ దాని పక్కవేలూ చేర్చి నా తొడమీద గిల్లుతున్నాడు. నాకు తెలియకుండానే యీయన మామయ్య అన్న విషయం మర్చిపోయినట్లు ఆ చీకట్లో 'బ్లాగార్డ్' అంటూ గభాలున లేచి నిల్చున్నాను.

నేనన్న మాటలు వినపడనట్లు మామయ్య నవ్వుతున్నాడు. కాని ఆ మాట పైకి అన్నందుకు మనసులో బాధపడుతున్నాను. అక్కడినుంచి కదులుతే బాగుంటుందని, కాస్త జరిగి, పిట్ట గోడ పట్టుకు నిలుచుని, ఆ వీధులోకి చూస్తున్నాను.

మామయ్య స్వభావం తెలిసివుండి కూడా, నేనిట్లా కోపంగా ప్రవర్తించి వుండి వుండకూడదు. మామయ్యలో యీ బలహీనత ఒక భాగం అని నాకు తెలుసు. అయినా నన్ను నేను నిగ్రహించుకోలేకుండా వున్నాను. నేను మాట్లాడకుండా దూరంగా జరిగి వుండాల్సింది. నోరు మెదపకుండావుంటే చాలా బాగుండేది. ఆయన్ని అలా అని వుండకూడదు. నాకెట్లాయినా నోటి దురుసు ఎక్కువయిపోతోంది. నా నోటిని ఇకనుంచి అదుపులో పెట్టుకోవాలి. నన్ను నేనే దండించుకుంటున్నాను మనసులో. ఆయన ఎన్ని తప్పుడు పనులు చేసినా, మామయ్య అన్న బంధుత్వం ఒక్కటే కాదు, ఆయన నాకు చేసిన వుపకారం, ఆయన అంతస్తు, వయసు, ఆయనకు నా పైనున్న మమకారం యివన్నీ చూసినపుడు "యీయనకెందుకీ చాపల్యం, ఎందుకీ వక్రబుద్ధి" అని మనసులో బాధగా వుంటుంది. ఈయన వయసెంత? నా వయసెంత? ఈయన ఈ వయసులో - యీ కోర్కెని యింత దూరం ఎలా పెంచుకుంటూ వచ్చాడు? అది యింకా వృద్ధి పరుచుకుంటూనే వుంటాడా? నా గురించి అసలు యీయన ఏవను కుంటున్నాడో? తనకి లోబడిపోతానని నిజంగానే నమ్ముతున్నాడా? లేకపోతే యిలా నావెంట పడటంలో ఆయనకేమన్నా ఆనందం లభిస్తున్నదా? ఈ విషయానికి ఒక ముగింపంటూ లేదా? నేనయినా దీనికో ముగింపు చేకుర్చవద్దా? ఎన్నితాపులు తిన్నా యీయనకి బుద్ధి రాదా? ఈ మనిషికి బుద్ధి చెప్పే మార్గమే లేదా? ఇలా ఎదో ఎదో యోచించుకుంటూ, మేఘాలవంక చూస్తూ నిలుచున్నాను. ఈ మామయ్య నా వెనకాతలకు వచ్చి . . . . . .

ఇప్పుడు నాకు తిట్టేందుకు మాటలు కూడా కరువయ్యాయి. ఏడుపొస్తోంది. ఆయనని ఏమీ అనకూడదని పళ్లు బిగబట్టి, ఆ చేతిని విసురుగా లాగి, ఎదురుగ్గా తిరిగి నిలుచుని, ఏమి జరగనట్టు చాలా శాంతంగా చెప్పడం మొదలుపెట్టాను:

"మామయ్యా - నన్ను ముట్టుకోకుండా మాట్లాడండి" అంటూ అల్లాగే స్తంభంలాగా నిలుచున్నాను.

"ఏం ? నిన్ను నేను ముట్టుకోకూడదా ?" అంటూ నిదానంగా అడిగాడు. అయన తను న్యాయంగా అడిగాననే అనుకుంటున్నాడు. దానికి నేనేం బదులు చెప్పను ? మాట్లాడుతూ మళ్లీ ముట్టుకోబోతున్నాడు. అయన్ని చూస్తుంటే నాకేమిటో అసహ్యంగా వుంది. ఒళ్లంతా గగుర్పొడుస్తోంది. ఆయన నాకు చేసిన సహాయం, నాకొరకు ఖర్చుచేసిన డబ్బు, వాళ్లింట్లో వుంచుకు పెట్టిన తిండి అవన్నీ ఒక్కసారి అలానే మొహాన కొట్టెయ్యగలిగితే బాగుండుననిపించింది.

చెయ్యిపట్టుకు బిచ్చగాడిలాగా ఏవేమిటో వేడుకుంటున్నాడు. నాకు తెరలు తెరలుగా కోపం వస్తోంది. ఈయన గురించి ఏవిటేమిటో అంటున్నాడు.... ఏమేమో అసహ్యంగా అంటున్నాడు. ఆ మాటలు తిరిగి తలుచుకోటానికే సిగ్గుగావుంది. తననీ ఈయన్నీ కంపేర్ చేసుకుని, తామిద్దరికీ మధ్యసామ్యంతో ఏమేమిటో పేలుతున్నాడు నేను చాలా కఠినంగా, ఖచ్చితంగా చెప్పడం మొదలు పెట్టాను.

"ముందు నోరుమూసుకోండి. మీరు ఆయన కాలిగోటికి కూడా సాటిరారు. అయన కాళ్లకున్న దుమ్ము ముట్టుకోవడానికి కూడా మీకు అర్హతలేదు." నాకు వెర్రి ఆవేశం వస్తోంది. ఏం మాట్లాడుతున్నానో నాకే తెలియదు. "ఇంక మీకు గౌరవం చూపించక్కరలేదు. మర్యాదచూపే అవసరంకూడా లేదు. నాకు మీరెంతో సహాయం చేశారు. ఎంతో డబ్బు ఖర్చుపెట్టారు. అందుకని ఏది పడితే అది చెయ్యచ్చునని అనుకుంటున్నారా ? చేసినదానికి యీవిధంగా ప్రతిఫలం కావాలను కొంటే – మీరు చేసిందానికి ఒకటికి రెండు లెక్కగట్టి తీసుకుపోండి. అంతేగాని యీ యింటికి మటుకు రాకండి. మీరు చేసిన వుపకారానికి చాలా థాంక్స్. దయచేసి మీరు యీ ప్రక్కలకి యికమీదట రావద్దు. నవ్ యు కెన్ గెట్ అవుట్."

నేను గబగబ మెట్లు దిగుతున్నాను. వెనకాలే ఒక గొంతు వినిపిస్తోంది. ఆ కంఠం తడబడుతూ, వొణుకుతోంది.

"గంగా - ఒకసారి వచ్చివెళ్లు"

వెళ్లి ఆయనకు ఎదురుగా నిలుచునివున్నాను. తలవాల్చుకుని - ఆయన నిల్చుని వున్నాడు. నోటంట ఒక్క మాటకూడా లేదు.

"ముసలివాడినని అసహ్యించుకుంటున్నావుగదూ" అని ఆయన అడుగు తుంటే నాకు నవ్వొస్తోంది. అన్నివిషయాల్లోనూ అంత సూక్ష్మగ్రాహి అయిన యీ మనిషి యీ విషయంలో యింత తెలివిహీనంగా ఆలోచించడం చూస్తే, నాకు జాలేసింది. ఆయన కంఠం తడబడి ముద్దముద్దగా వస్తోంది. "తనకి వయసు అయి పోయింది. ముసలివాడు అయిపోయాడు" అని నేను అనుకుంటున్నానని ఆయనకి బాధగావుంది. అది తలుచుకు నవ్వక ఏం చేయను ?

తాను ముసలివాడిని కాదని నిరూపించుకోవాలని తొందరపడుతున్నాడు. ఆయన ముసలివాడు కాకపోతే నాకు వొరిగేదేమిటో. అయనే మళ్లీ అంటున్నాడు:

"ముట్టుకోవద్దని - అధికారం చెలాయిస్తున్నావుటే పిల్లా? నిన్ను కొట్టేందుకు కూడా నాకు అధికారం వుంది. తెలుసా?" అంటూ తమాషాకి అంటున్నట్లు చెపుతున్నాడు. కాని ఆ మాటల వెనక విషం వుంది. ఆయన కొట్టబోతున్నాడని నాకు బోధపడుతోంది. అంబుజం అత్తవంటి మీద కమిలిన చారలు వుండేవే - అవి జ్ఞాపకం వచ్చాయి.

"నాకు తెలుసు - మీరు కొడతారని కూడా తెలుసు - మీరు నన్ను కొట్టండి ఫరవాలేదు. కాని నావంటిమీద చెయ్యేసి ముట్టుకోకండి" అంటూ కళ్లుమూసుకుని ఆయనకు ఎదురుగా, వొళ్లు విరుచుకుని నిటాగ్గా నిల్చున్నాను. ఆయన నన్ను కొట్టబోతున్నారు. పళ్లు బిగబట్టుకున్నాను. బెల్ట్ విసరబోతుంటే గభాలున చేతులతో దొరక పుచ్చుకున్నాను. దాంతో నాలుగు వడ్డిద్దామని వుంది. బెల్ట్ యిప్పుడు నా చేతుల్లో వుంది.

"పదిగంటలయింది - భోజనానికి రారా?" అని అడుగుతూ అమ్మ డాబా మీద కొచ్చింది.

రాత్రి ఎప్పటిలాగా - ఆయనతో పాటు భోజనానికి కూచోలేదు. ఆయనతో మాట్లాడనూలేదు. ఆయన ముఖం కూడా చూడలేదు. ఆయన పక్క యీడ్చుకొచ్చి గది బయట పారేశాను. ఆయనే దుప్పటి దులుపుకు వేసుకున్నాడు.

ఇంతకుముందే వూరికి బయలుదేరి వెళ్లాడు. అప్పుడు మటుకు యిద్దరం ముఖం ఎత్తి ఒకరినొకరం సూటిగా చూసుకున్నాము. "ఇకమీదట నేను రాను" అని నాతో చెపుతున్నట్లున్నాయా చూపులు. నేను ఏమీ మాట్లాడలేదు. ఇకమీదట ఆయన యిక్కడికి రాడు.

ఒకవేళ వచ్చినాకూడా నన్ను ముట్టుకోనివ్వను. కాళ్లు వొత్తడం, సేవలు చెయ్యడం, యీ పనులన్నీ యికముందు జరగవు.

అమ్మ దగ్గిర చెప్పాను వంటకి పైపనులకీ యిద్దరు మనుషులని చూసిపెట్టమని - ఏదనా పనిమీద మామయ్య వచ్చినా యిక్కడ వుండవచ్చు, కాఫీ తాగచ్చు, పనివాళ్ల చేత పనులు చేయించుకోవచ్చు - అంతే.

కాని మామయ్య అలారాడు. వుండడు. ఆయన సంగతి నాకు బాగా తెలుసు. "ఎవడో సూద్రుడికి యిది వుంపుడుగత్తె అయింది. ఇక ఆ యింట్లో మనకి మానం, మర్యాద వుండవు" అంటూ తనంత తానే తప్పుకున్నట్లు అయన ప్రచారం చేస్తాడు.

కాని అమ్మమటుకు మామయ్య ఎప్పటిలాగా వస్తూపోతూంటాడని అనుకుంటున్నది. ఎప్పుడేనా చాలా రోజుల తర్వాత "ఎందుకు రావడంలేదని అమ్మ

అడిగితే అప్పుడుకూడా - మామయ్య యీమాటే బదులు చెపుతాడు. అమ్మకి ఆయన చెప్పిన కారణం సవ్యమైనదని కూడా అనిపిస్తుంది. ఎందుకంటే ఆయన యిలా సమయానుకూలంగా మాట్లాడి తప్పించుకునే మనిషి గనక.

టైము తొమ్మిదయింది. ఆకలి వెయ్యడంలేదు. అయినా కూడా తినాల్సిందేకదా! బయట లైటు ఆర్పేసి, వీధి తలుపు మూసి లోపలికి వెళ్లాను.

అన్నం వడ్డించుకు కూచున్నాను. వీధి తలుపు ఘడియ పెట్టానో లేదోనని అనుమానం వచ్చింది.

చెయ్యి విదుల్చుకుని లేచి వెళ్లాను.

## 23

వాకింగ్‌కి వెళ్లి రెండు మూడు రోజులయింది. మంజుని చూసి కూడా రెండు మూడు రోజులవుతోంది.

ఈయన ఆఫీసుకు వస్తున్నారు. మేడమీద నుల్చుని కిందకి చూస్తున్నాను. కారు వచ్చి ఆగింది. కిటికీలోంచి తల బయటపెట్టి పైకి చూస్తున్నారు. గ్లాసు-తలుపుల్లోంచి నేనూ కిందకు చూస్తున్నాను. కాని నేను చూస్తున్నది ఈయనకు కనిపించదు. ఆయన వదుల్తున్న సిగరెట్ పొగలో మొఖం మసగ మసగగా కనిపిస్తోంది. టైము చూసుకున్నాను యింకా రెండు నిముషాలుంది. వచ్చి సీట్లో కూచున్నాను.

ఈ వారం పత్రికలో ఆర్. కె. వి. కథ పడింది. మధ్యాహ్నం చదివాను. వూరికే కాలక్షేపానికి మళ్లీ తిరగేస్తున్నాను. ఆ అశ్వమేధం కథ వస్తుందా? ఎప్పుడొస్తుందా? అని ఎదురు చూస్తున్నాను. ఆ మనిషి యింకా రాసినట్టులేదు. ఈ కథ కూడా బాగానేవుంది. ఆ కథ కోసం ఎదురు చూస్తూంటంచేత మిగతావి ఎంత మంచి కథలయినా, ఆ కథ కాదు అని ఆశాభంగం కలుగుతోంది.

అయిదు గంటలయింది. హాండ్‌బాగ్‌లో తల పైకెత్తుకుని ఆ వారపత్రిక తొంగిచూస్తోంది. పెద్ద బాగ్ తెచ్చుకోలేదు. బయలుదేరాను.

లిఫ్ దగ్గిర ఒకే రద్దీ. రెండు నిముషాలు ముందుగా బయలుదేరాను యిక్కడే నిలుచోవచ్చునని. లిఫ్ట్ వచ్చింది. అందరూ తోసుకుంటూ వెళ్లి గబ గబా దూరుకుంటున్నారు. ప్రతివాళ్లకీ ఒకే తొందర. నేను తొందర పడకుండా, పక్కగా తప్పుకు నిలుచునివున్నాను. లిఫ్ట్ ఆపరేటరు ఎవర్నో కొంచెం జరగమని చెప్పి, నాకు దారివ్వమంటున్నాడు. 'ఓ- అయామ్ సారీ' అంటూ ఆ సూటు వేసుకున్న

పెద్ద మనిషి తప్పుకుని నాకు దారియిచ్చాడు. ఆయన నా వెనకాలె రాబోతూండగా లిఫ్ట్ తలుపు మూసుకుంది. దాంతో ఏడ్చినంతపని చేశాడా పెద్ద మనిషి. లిఫ్ట్ బర్‌మని గ్రౌండ్ ఫ్లోర్‌కి రావడంతోటే, అందరికంటే ముందు నేనే మొదట బయటకి రాబోతున్నాను. నా వెనక మనుషులు తోసుకుంటూ ముందుకు వెళ్లి పోతున్నారు. నేను బయటకి రావడం యీయన చూసినట్లున్నారు. కారు తలుపు తెరిచిపెట్టారు. కారెక్కి యీయన పక్కసీట్లో కూచుంటుంటే - గుండె దడ దడ మన్న శబ్దం వినిపించింది. ఈ దడ దడ మిగతావాళ్లకి వినపడకుండా దాచుకుంటున్నాను. కాని నాకు వినిపిస్తోందే? బాగ్‌లోంచి రుమ్మాలు తీసి నుదురు తుడుచుకున్నాను. ఆయన అంటున్నారు :

"నిన్ను చూసి చాలా రోజులయినట్లుంది. ఈరోజుకూడా ఎక్కడ రావద్దంటావోనని భయపడిపోయాను. మధ్యాహ్నం ఫోన్ చెయ్యడం మంచి దయింది. రమ్మని చెప్పావ్" అంటూ చిన్న పిల్లవాడిలా సంతోషపడిపోతున్నారు. ఆయనకి నన్ను చూస్తుంటే అంత సంతోషంగా వుందా? నాకు మటుకు ఆనందంగా లేదా! నేనూ అన్నాను.

"అవును నాకుకూడా ఎన్నో రోజులయినట్లుంది. ఈరోజు నేనే ఫోన్ చేద్దా మనుకున్నాను, యీలోగా మీరే చేశారు. మీ గొంతు ఫోనులో వినిపించేప్పటికి నాకెంత సంతోషమయిందో తెలుసా?" ఆ మాటలంటున్నపుడు నా గొంతుకేదో అడ్డుపడినట్లయింది

ఒక్కక్షణంపాటు యిదంతా ఏమిటి? అన్న ఆలోచన కలిగింది. మా యిద్దరి మాటలూ ఏదో యిద్దరు ప్రేమికులు మాట్లాడుకున్నట్లు వున్నాయి. దీని పేరే ప్రేమ కాబోలు. ఇది వొప్పుకోవడంలో సిగ్గు దేనికి? ఈయన ఆరోగ్యం గురించి, మనసు గురించి, జీవితం గురించి నేను ఎంతో శ్రద్ధగా ఆలోచిస్తూ వుంటాను. ఈయనా నా పట్ల ఎంతో అభిమానం చూపిస్తూంటారు. బాధ్యతతో మసులుకుంటూంటారు. ఈయన ఎవరు? నేనెవరు? ఈ అనుబంధం ఎలా ఏర్పడింది? చాలా మందికి యీ బంధం ప్రాణంవంటిది. కవులు వర్ణించినట్లు మొదట్లో యీ బంధం ప్రేమ అనే మైకంతో ఆరంభమయి, చివరికి సెక్సుతో ముగిసిపోతుంది. మా యీ అనుబంధం చాలా కిందస్థితిలో పశువాంఛతో, తాగినమైకంతో, ఒకానొక యాక్సిడెంటులాగా సెక్స్ అనే విపత్తులో ఆరంభమయి, యిప్పుడు బాధ్యతాయుత జీవితంతో, గౌరవ మయిన ప్రవర్తనతో, పవిత్రమయిన ప్రేమ భావంతో ముగుస్తుందేమో!

"ఏమిటి ఆలోచిస్తున్నావ్?" అంటూ మౌంట్‌రోడ్‌లో కారునడుపుతూ అడుగు తున్నారు.

"ఏం లేదు" అంటూ తలెత్తి చూసేసరికి ఎదురుగా ఒక రేడియో ఎడ్వర్‌టైజ్‌మెంట్ కనబడింది. రేడియోకోసమని మధ్యాహ్నమే డబ్బు తెప్పించి వుంచాను. మధ్యాహ్నం ముఖ్యంగా యీయనకి యీ విషయం గురించే ఫోన్ చేద్దామనుకున్నాను. తీరా మాటల్లో మరచిపోయాను. ఆ పిల్ల సాయంకాలంవచ్చి "అత్తా ట్రాన్సిస్టర్ ఏది" అని నిలవదీసి అడుగుతుందేమోనని భయం.

"ఒక్క నిముషం వుండండి. నేను ట్రాన్సిస్టర్ కొనాలి. మీకు తెలిసిన షాపుగాని. లేక ఏదన్నా రేడియోషాపు దగ్గర నిలపండి. నాకు దాని గురించి ఏం తెలియదు" అని అడిగాను.

"నాకుమటుకు తెలుసా? ఇవన్నీ మంజుకి బాగా తెలుసు. పద్మ సరేసరి. పిచ్చిపట్టినట్లు అది పట్టుకు తిరుగుతుంది. ఐ థింగ్ వుయ్ డీల్ యిన్ యిట్ - మా కంపెనీకి వీటి ఏజెన్సీ వుందనుకుంటా. వెంటనే కావాలా? రేపు నేనొక మంచి ట్రాన్సిస్టర్ చూసి పంపుతాను" అన్నారు.

"ఊహు - ఇప్పుడే యీ రోజునే కొనెయ్యాలి. ఇంట్లో ఒక్కదాన్ని వుండటానికి విసుగ్గా వుంటోంది."

"ఏం - మీ అమ్మగారు వచ్చారుగా?"

"లేదు. వచ్చి - తిరిగి వెళ్లిపోయారు"

కారు వెనక్కి తిప్పారు. ఏదో ఒక రేడియోషాపుకి ముందు నిలిపారు. ఇద్దరం దిగి లోపలికి వెళుతున్నాం. అందరూ మావంకే చూస్తున్నారు. మా జంట చూస్తే బాగుంది కాబోలు. కొందరు మమ్మల్ని ఆశీర్వదిస్తున్నట్లుగా చూశారు.

మొగవాడి తోడుతో పబ్లిక్‌లోకి వస్తే అందరూ గౌరవంగా, మర్యాదతో చూస్తారు. సూటిగా చూడటానికి కూడా భయపడతారు. అందులోనూ ఆ మొగవాడు హుందాగా వున్నపుడు. ఈయన 'మాన్లీ' గా కూడా వుంటారు. కొంచెం మొరటుగా కూడా కనిపిస్తారు. ఆ మొరటుతనం అపసహం కూడాను. ఈయనలో నిజంగానే కొంత మోటుతనం వుంది.... లోపలికి వస్తున్నాము. ఎదురుగా ఒకతను వస్తున్నాడు. ఈయన వంక పరీక్షగా చూస్తున్నాడు. ఊరికే చూస్తున్నట్టున్నాడు. అతను అలాగే నిలబడిపోయాడు. నేను ముందు వొస్తుంటే తప్పుకుని మర్యాదగా దారి చూపిస్తున్నాడు.

ఒంటరిగా కనక వస్తే ఇలాంటి సమయాల్లో పక్కనుంచి రాసుకుని పోతూంటారు. మెడ నెప్పి పెట్టేటట్లు తిరిగి తిరిగి చూస్తూవుంటారు. ఇద్దరు ఆడపిల్లలు కనక వస్తే ఏదో ఒక కామెంట్ పాస్ చేస్తూనే వుంటారు. కారణం లేకుండానే వెకిలిగా నవ్వుతూంటారు. ఇప్పుడు అలాటి వెర్రివేషాలు కనపడటం లేదే- - - -

రేడియోషాపులో మాకు రాజమర్యాదలు జరిగినాయి. సరాసరి షాపు యజమాని గదికి, ఏర్‌ఖండీషన్ గదికి పంపించారు. ఆ యజమాని లేచి నిలుచుని మమ్మల్ని ఆహ్వానించాడు. కాఫీ తెప్పించాడు. ఈయన ఎదురుగ్గా నిలుచునే మాట్లాడాడు. ఈయనకి ఎంత గౌరవ ప్రతిష్టలున్నాయో ఆ షాపులో వారి ప్రవర్తన చూస్తేగాని గ్రహించలేము. ట్రాన్సిస్టర్ కోసరం యీయన్ని షాపుకి లాక్కు వచ్చి తప్పు చేశానేమోనన్న భావం నాలో మెదిలింది.

మరుక్షణంలో టేబుల్ మీద రకరకాల ట్రాన్సిస్టర్స్ వెలిశాయి. వరస వరసగా అమర్చివున్నాయి. ఒక్కొక్క దానిలోంచి ఏదో స్టేషనులు, రకరకాల శబ్దాలు వస్తున్నాయి.

చివరికి ఆ షాపు యజమానే ఒక ట్రాన్సిస్టర్ తీసి చూపించాడు. 'ఇది జపాన్ ట్రాన్సిస్టర్" అంటూ.

"హౌ డు యు లైక్ దిస్" అని ఈయన అడుగుతున్నారు. దాని బాండ్స్ ఎలా మార్చాలో శ్రద్ధగా చూస్తున్నాను. నేను బదులు చెప్పలేదు.

ఆ షాపు ఆయన దీన్ని గట్టిగా రికమెండ్ చేశాడు.

"ఓ. కె. పాకిట్ అప్" అన్నారీయన.

నేను రహస్యంగా యీయన్ని అడుగుతున్నాను. "ఎంత ఖరీదు వుంటుంది ?" అని.

ఈయన ఎందుకిలా నవ్వుతున్నారు. నవ్వుతూ యింగ్లీషులో అన్నారు. "ఖరీదు విషయం నాకు జ్ఞాపకం రాలేదు. నీకీ సంగతి తెలుసా? మనం యిక్కడ డబ్బివ్వక్కర్లేదు. ఇది మా ఆఫీసు ద్వారానే వచ్చింది. వాళ మా కిచ్చేదాంట్లో మినహాయించుకుంటారు."

నేనూ యింగ్లీషులోనే అన్నాను. "ఇది నా కోసరం కొనుక్కుంటున్నాను."

"నో - నో - ఇది నీకు ప్రజంటుగా యిస్తున్నాను. ఇంతదాకా నీకేమీ ప్రజంటు అంటూ యివ్వలేదు. ప్లీజ్ నా అభ్యర్థనని తోసి పుచ్చకూడదు"

నాకు ఏం చెప్పాలో తెలియలేదు. ఈ రూమ్‌లో మేమిద్దరమే వున్నాము కాబట్టి సరిపోయింది. "సరి - ఏదో ఒకటి చేద్దాం. ముందు ధర కనుక్కోండి."

"హి విల్ బ్రింగ్ ది బిల్ నవ్" అని అంటూంటే షాపు యజమాని ఓ కట్ట కాయితాలు పుచ్చుకు లోపలికొచ్చాడు. నా పేరు ఎడ్రసు యివన్నీ రాసుకున్నాడు. రెండు రోజుల్లో లైసెన్సు వస్తుందట. నేను బిల్లు చూస్తున్నాను. అయ్యో బాబోయ్! ఎనిమిది వందల యాభై రూపాయలుంది. ఇటీజ్ టూ మచ్.

ట్రాన్సిస్టర్ తీసుకుని పెందరాడే యింటికొచ్చాను. వంట చేసుకోవాలి. అదీ గాక యీయన యింటికి పీటికి మాటికి వెళుతుండటం నాకే బాగాలేదు. ఆ రోజు పద్మ ధోరణి నేనింకా మరిచిపోలేదు.

నమ్మదించడాని కొచ్చిన ఈయన్ని "లోపలికి రండి" అని పిల్చుకొచ్చాను.

కాఫీ కలిపి తీసుకొచ్చాను. సాయంత్రంపూట నేను పాలు పుచ్చుకోవడం లేదు. పొద్దుట పాలతోనే కాఫీ కలిపి యిచ్చాను. కాఫీ చాలా బాగుందని మెచ్చుకున్నారు.

పాకింగ్ విప్పి ట్రాన్సిస్టర్ టీపాయ్ మీద పెట్టి ట్యూన్ చేస్తున్నారు.

"యు లైక్ కర్నాటిక్ మ్యూజిక్" అని అడుగుతున్నారు.

"నాకూ సంగీతానికీ చుక్కెదురు. ఒంటరిగా వుంటున్నాను కాలక్షేపానికి ఏదో ఒక కంఠం వినిపిస్తుంది గదా అని కొందామనుకున్నాను. అందుకోసరమని యింత డబ్బు ఖర్చు చెయ్యడమా? అక్కడ ఏదన్నా అంటే బాగుండదని వూరుకున్నాను. ఇది మీ యింటికి తీసుకెళ్లిపొండి. నాకు రెండు మూడొందల్లో సామాన్యమైనది ఒకటి ప్రజంటు చెయ్యండి చాలు" అన్నాను. నా మాటలు వింటుంటే ఆయన ముఖంలో రంగులు మారుతున్నాయి. మొఖం చిన్న బుచ్చుకుని కాఫీ తాగుతూ నన్ను చూస్తున్నార

"నేనేదన్నా తప్పుగా అన్నానా?" అని అడిగాను.

"అవును. ప్రేమతో ప్రజంటు చేస్తే - ఏదోసాకు చెప్పి దాన్ని తిప్పికొట్ట కూడదు" అన్నారాయన.

"అయామ్ సారీ" అని క్షమార్పణ చెప్పుకున్నాను. "థాంక్యూ వెరీ మచ్. నాకు చాలా సంతోషంగా వుంది" అనికూడా అన్నాను. ఆయన వెంటనే మాట మార్చి "నాకు కర్నాటిక్ మ్యూజిక్ అంటే యిష్టం. జాజ్‌కూడా యిష్టమే. హిందూస్థానీ సంగీతమన్నా యిష్టమే. కాని సినిమా పాటలు మటుకు భరించలేను. పద్మ అవి తప్ప మరొకటి వినదు."

"మంజూని చూసి కూడా రెండు మూడు రోజులయింది" అన్నాను నేను కల్పించుకుని. "అవునవును" అంటూ తలవూపారు.

"ఏమిటి మీరు కూడా చూడలేదా?" అని అడిగాను.

"అవును - రెండు మూడు రోజులుగా నేను యింటికి చేరుకునేప్పటికి అది నిద్దర పోతూంది. వాకింగ్‌కి వెళ్లడం లేదుగా, అందుకని పొద్దుటా కనబడటంలేదు."

"రేపటినుంచీ పొద్దుటే వాకింగ్‌కి వెళదాం" అన్నాను. "ఇప్పుడు మీ ప్రోగ్రాం ఏమిటి?" అని మామూలుగా అడిగాను.

ఈయన నవ్వుతూ "ఈ ప్రశ్నకు జవాబు చెప్పనా?" అంటూ అల్లరిగా కళ్లు చికిలించి అడిగారు.

"ఊఁ చెప్పండి" అంటూ భయపడినట్లు అడిగాను.

ఒక గరల్ ఫ్రెండుని కలుసుకోబోతున్నాను. అని తల ఎగరేసి నవ్వుతూ, "గరల్‌ఫ్రెండని వూరికే చెప్పానే గాని - 'గరల్' తప్ప 'ఫ్రెండు' మటుకు కాదు.

ఇన్ ది రియల్ సెన్స్ గరల్స్‌లోనయినా, మెన్‌లోనయినా నాకున్న ఒకే ఒక ఫ్రెండు, ఫిలాసఫర్, గైడ్ అన్నీ నువ్వొక్కదానివే. అంచేత ఆ ఎవరినో ఫ్రెండు అని మటుకే చెప్పుకోవడం నాకు బాగాలేదు. ఊరికే ఎసార్ట్ అఫ్ హాఫ్ నేను. నా అర్ధ భాగం అంటున్నాను.'' ఆ మాట అని యిబ్బందిగా యిటు అటు చూస్తున్నారు.

''నాకు అర్థం అయింది. మీరేం చెప్పక్కరేగు'' అంటూ నవ్వాను. నేనేదో తనని హేళన చేస్తున్నట్లు సిగ్గుతో తలవంచుకొని మళ్లీ ఏదో అడుగుతున్నారు.

''నువ్వు దాచకుండా నిజం చెప్పాలి. మీ అమ్మగారు పోట్లాడి నిన్ను వొదిలి వెళ్లిపోయారా? అది నాగురించే కదూ?'' బాలా బ్లంట్‌గా అడిగారు.

''ఎస్ - అవును.'' రెండు వ ర్లో బదులు చెప్పి ఆయన ముఖం పరీక్షగా చూస్తున్నాను. ఆయన నావంక చూస్తున్నారు. ఆయన ఏమనుకుంటున్నారో అంతు పట్టడంలేదు.

''గంగా'' అని పిల్చారు.

''ఎస్''

''మనిద్దరి మధ్యావున్న యీ అనుబంధం, మనలో పరస్పరమున్న యీ మమత, మ్యూచయల్ ఎఫెక్షన్, ఎవరూ అర్థం చేసుకోరు. నమ్మనూ నమ్మరు. అన్‌లెస్ యు గెట్ మారీడ్ టు సమ్‌వన్'' ఆయన కళ్లు చెమరుస్తున్నాయి.

''ఓ - హు కేర్స్ ఫర్ యిట్. వీటన్నిటినీ ఎవరు లక్ష్యపెడతారు.'' బాలా సంతోషంతో ఆయనకు సమాధానం చెప్పాను. ''ఎవరు ఎట్లా అనుకుంటే మన కెందుకు? మన మధ్యనున్న యీ స్నేహమే నాకు అర్థమూ, పరమార్థమూను. ఇదే నాకు సంతోషాన్ని యిస్తోంది. ఈ జీవితంలో నేనింతకంటే ఏమీ కోరుకోను'' అని చెపుతుంటే మీనా వస్తోంది.

ట్రాన్సిస్టర్‌లో ఏదో సినిమా పాట సన్నగా వినిపిస్తోంది.

''రా - మీనా, రా'' అంటూ పిలిచాను. లోపలికొచ్చి యీయన్ని చూస్తూ నిలుచుండిపోయింది మీనా.

''ఈ అమ్మాయి మీనా - పక్క యిల్లు. పక్కయిల్లేనా మీది?'' అడిగాను.

''కాదు - మూడో యిల్లు'' అంది మీనా.

''మూడో యింట్లో వుంటారు. మా అమ్మకి ఫ్రెండు. ఇప్పుడు నాకూను. ఈ అమ్మాయే ట్రాన్సిస్టర్ కొనమని సలహా చెప్పింది. ఎలా వుంది? బాగుందా? నీకు నచ్చిందా?'' మీనాని అడుగుతున్నాను.

ఆ పిల్ల ఏదో మొహమాట పడుతూన్నట్లు వుండిపోయింది.

''బాలా బాగుంది అత్తా. వరల్డ్ స్టేషన్సు అన్నీ బాగా వినిపిస్తాయా? బాలా బాగుంది'' అంటూ చేతిలో పట్టుకు చూస్తోంది.

"మెడ్రాసులో సినిమా పాటలు వుంటాయి" అంటూ ట్యూన్ వేస్తోంది.

ఈయన బయలుదేరుతున్నారు. పొద్దుట మంజుని కూడా తీసుకువస్తానని చెప్పి వెళ్లారు.

పొద్దుటే కారు హారన్ వినిపించగానే కిటికీలోంచి చూశాను. ఈయనొక్కరే కార్లో వున్నారు.

మంజు కనిపించలేదు.

ఇల్లు తాళం బెట్టి వెళ్లి కార్లో కూచున్నాను. మంజు ఎందుకు రాలేదని నేను అడగలేదు. నా మనసులో ఏదో అనుమానంగా వుంది - విషయం ఆయనే చెపుతారు. ఆయనంతట ఆయన చెప్పే దాకా ఆగుతాను. అనవసరంగా ప్రశ్నలు వేసి విసిగించకూడదు. అని మాట్లాడకుండా వూరుకున్నాను. ఈయన కూడ మొఖం మాడ్చుకుని వున్నారు. కోపంగాకూడా వున్నారు.

ఇద్దరం నిశ్శబ్దంగా వున్నాము. కాని ఈయన లోలోన ఏదో భాధపడుతున్నట్లు అనిపిస్తున్నది. ఆయన ముఖం చూస్తే జాలేస్తోంది.

"వాట్ యీజ్ ది మేటర్" అని యిక ఆగలేక అసలు విషయమేమిటని అడిగాను. చిన్న పిల్లవాడికి మల్లె యీయన పెదిమలు వొణుకుతున్నాయి.

"ఛ ఛ. వాట్ యీజ్ దిస్" అంటూ మొదటిసారి ఆయన్ని తాకుతూ బుజం మీద తట్టి సముదాయించాను. అయ్యో యీయన కళ్లనీరు కారుస్తున్నారే.

"ప్లీజ్ - ఏం జరిగింది? చెప్పరూ? అరె ఎవరన్నా చూస్తారు బాగుండదు" అంటూ జేబురుమాలు తీసి అందించాను. తీసుకుని ముఖం కళ్లూ తుడుచుకున్నారు. కళ్లూ ముక్కూ ఎర్రగా కందిపోయాయి. గొంతు సవరించుకుని సిగరెట్ తీసి అంటించారు. సర్దుకుని నను చూసి నవ్వుతూ "అయామ్ సారీ" అన్నారు.

"ఏం జరిగింది?" అని అడిగాను. "నిన్న చెప్పానుగదా! మన స్నేహాన్ని ఎవరూ అర్థం చేసుకోరు, నమ్మరు అని. మంజు కూడా ---" ఆ మాట అంటుంటే ఆయన గొంతుపట్టుకున్నట్లు బొంగురుగా వుంది. "మంజుకూడా నమ్మడం లేదు. వాకింగ్‌కి రమ్మని పిలుస్తే రానన్నది. కారణం అడిగితే ఏమిటేమిటో అంటుంది. హౌ రిడిక్యులస్" కోపంగా అంటున్నారు. ఈయన్ని చూస్తుంటే నాకెలాగో వుంది. ఈయనకింకా చిన్నతనం వదలలేదు.

"ఇది మంజు తప్పుకాదు. మంజు అలా ఎందుకువుందో వూహించుకోగలను. డోంట్ బాదర్. ఐ విల్ స్పీక్ టు హర్. నేను మంజుతో మాట్లాడుతాను. మీరేం భాధ పడకండి. మంజు బాలా మంచి పిల్ల. ఎవరో అన్నది విని దిమ్మెరపోయి, ఖంగారు పడిపోతోంది. నేను మాట్లాడుతానుగా" అంటూ సమాధానపరిచాను.

గాంధీజీ విగ్రహం దగ్గిర కారు నిలిపారు. అక్కడ అవిటివాడికి డబ్బులిచ్చారు మూడు రోజులదీ కలిపి మరీ యిచ్చారు.

ఇద్దరం నడక ప్రారంభించాము. మంజు లేకుండా యిద్దరం యిలా వంటరిగా నడుస్తుంటే ఎల్లాగోవుంది.

## 24

మంజు వచ్చి అరగంటసేపయింది. వాళ్ల అమ్మకి తెలియకుండా వచ్చినట్లుంది.

ఈ పొద్దుట మంజుకి ఫోన్ చేస్తున్నపుడు యీయన పక్కనే వున్నారు. ఆఫీసుకు వెళ్లగానే మంజుకి ఫోన్ చేస్తానని చెబితే, నేను మంజుతో ఏం మాట్లాడబోతున్నానో వినాలనే ఆయన నావెంట వచ్చారు. వచ్చిన మనిషి కిందా పైనా చూస్తూ నిలుచుండి పోయారు. మా ఆఫీసుకి ఈయన మొదటిసారి వచ్చారు. టైము పది అయింది. ఇప్పుడిప్పుడే ఒక్కొక్కళ్లు వస్తూవున్నారు.

"ప్లీజ్ కమిన్" అంటూ యీయన్ని లోపలికి తీసుకొచ్చాను. నా టేబుల్‌కి ఎదురుగుండావున్న రెండు కుర్చీల్లో ఒకటి లాగి కూచోమన్నాను. ఎవరెవరో విజిటర్స్ వచ్చి కూచుని మాటలతో విసిగించి చంపే ఆ కుర్చీలో నా మొదటి విజిటర్, ఒకే ఒక్క విజిటర్ యీయన్ని కూచోమన్నాను. నాకోసరం వెతుక్కుంటూ ఒక్క మనిషి కూడా యింతవరకూ రాలేదు.

రంగసామి గ్లాసుతో నీళ్లు తీసుకొచ్చి పెట్టి, పైన ప్లాస్టిక్ మూత పెట్టాడు. రెండు కాఫీ తీసుకుని రమ్మని అతన్ని పంపి వీళ్లింటికి ఫోన్ చేశాను.

మంజు ఫోన్ తీసింది. నేను సరి అయిన టైముకే ఫోన్ చేశానన్న మాట.

"నేను గంగను మాట్లాడుతున్నాను" అని అనగానే కొంచెంసేపు అవైపు నుంచి బదులేమీరాలేదు. ఏం మాట్లాడుతుందో చుద్దామని నేనూ నిశబ్దంగానే వుండి పోయాను. ఆ పిల్ల నన్ను విష్ కూడా చెయ్యలేదు. చాలా ఖంగారు పడిపోతోంది. కంఠంకూడా మారిపోయింది.

"నాన్న లేరు" అంది.

"నాన్నగారు యిక్కడే వున్నారు. నేను నీతో మాట్లాడాలనే ఫోన్ చేశాను. 'ఐ వాంట్ టు మీట్ యు' అని యింగ్లీషులో అన్నాను. "ఇప్పుడున్న పరిస్థితిల్లో నేను మీ యింటికొచ్చి మాట్లాడటం బాగుండదని అనిపిస్తోంది. అంచేత నిన్నే మా యింటికి రమ్మంటున్నాను. ఈ రోజు శనివారంగదూ. మధ్యాహ్నం మా యింటికి రా!

మీనాన్న వుండరులే! నేను నీతో విడిగా మాట్లాడాలి" అధికార స్వరంతో అన్నాను.

ఆ అమ్మాయి మాట్లాడకుండా వూరుకుంది. నా మాటల్లో అధికారానికి కారణం చెపుతున్నట్లు, నిదానంగా గొంతు తగ్గించి అడిగాను.

"ఆర్ వుయ్ నాట్ గుడ్ ఫ్రెండ్స్?" క్లాసు రూమ్‌లో ఆన్సరు చెప్పే విద్యార్థి కంఠంలా వుంది ఆ పిల్ల గొంతు.

"యస్"

"ఇద్దరు మంచి స్నేహితుల మధ్య ఎటువంటి బేధాభిప్రాయాలు లేనపుడు, నిర్బంధం వల్లనో, అపార్థాలవల్లనో, వారు విడిపోతున్నపుడు కనీసం గుడ్‌బై అన్నా చెప్పుకోవద్దా!" అని నేను యింగ్లీషులో అడిగాను. నేను యిలా అడిగేసరికి ఆ పిల్లకి ఏడుపే వచ్చినట్లుంది.

"అయామ్ సారీ" అని ఏదో చెప్పబోయి గొంతు సవరించుకుంటోంది. ఆ పిల్లని అలా బాధపెట్టినందుకు నాకూ కష్టంగానే వుంది.

"మంజూ - టేకిట్ యీజీ. నీతో చాలా విషయాలు చెప్పాలి. అందుకే చూడాలని అంటున్నది. ఎ టైమ్ హాజ్ కమ్ టు ఎక్స్‌ప్లైన్ ఎవ్విరిథింగ్ -" అని అంటుంటే "నేను రెండు గంటలకల్లా వస్తాను" అంటూ టకీమని రిసివర్ పెటేసింది. కళ్లముందు పద్మముఖం ఒక్కసారి కనపడ్డది.

"ఏమిటి? ఏమంటోంది" అంటూ చాలా ఆదుర్దాగా అడుగుతున్నారు యీయన.

"షి యీజ్ కమింగ్ హోమ్" అన్నాను.

"మంజు దగ్గిర ఏం చెప్పబోతున్నావ్" అని అడిగారు. "మాట్లాడాక చెబుతాను" అన్నాను. ఆయన ముఖంలో రంగులు మారుతున్నాయి. పన్నెండేళ్ల క్రితంనాటి సాయింకాలపు సంఘటన తలుచుకుంటున్నారు కాబోలు. ఆ విషయం తన కూతురు దగ్గిర చెప్పబోతున్నానని యీయనికి ఖంగారుగా వుందా? ఈయన లీలలు వారింట్లో ఎవరికి తెలియవు? కాని యీ అదుర్దా తన గురించి కాదు, మంజుకి తెలిసిపోతుందేమోనని కూడా కాదు, మా మధ్యనున్న స్నేహం ఏవిధంగా ఆరంభమయిందీ మంజుకి తెలిసిపోతుందని సిగ్గుపడిపోతున్నారు. మా స్నేహం యింకా ఆమాదిరిదేనని ఆ పిల్ల అనుకుంటుందేమోనని బాధ పడుతున్నారు.

రంగసామి కాఫీ తీసుకొచ్చాడు. నాకు ఆఫీసులో కాఫీ తాగే అలవాటులేదు. ఫ్లాస్కుగాని, జగ్గుగాని, ఇదిగో రంగసామి కాఫీ తెస్తున్నాడే మూతపెట్టిన ప్లాస్టిక్ మగ్‌లావుందే - అదిగాని కొని పెట్టుకుంటే బాగుండును. పాపం రంగసామి ఎవరి దగ్గిరో మగ్గడిగి కాఫీపోసి తీసుకొస్తున్నాడు. అసలు రంగసామి ఎవరినీ ఏమీ అడగడు. తన స్వంతం అన్నట్లు ఎక్కడినుంచో, అక్కడినుంచి పట్టుకొచ్చే

స్తుంటాడు. అతను అడిగితే 'లేదు' అని ధైర్యంగా ఆఫీసులో ఎవరైనా అనగలరా? అలా ఎవరైనా 'యివ్వను' అంటే యింకోసారి తెచ్చేటప్పుడు, కావాలని వాళ్లకళ్ల ముందే ఆ వస్తువ దభాలున వదిలేస్తాడు. 'చెయ్యి జారిపోయింది సార్' అంటాడు. 'నువ్వు చేసేపని నేను చేస్తున్నాను. నేను చేసేపని నువ్వు చెయ్యగలవా సార్?' అని సవాల్ చేస్తాడు. నాకూ యీయనకీ గాజుగ్లాసులో కాఫీ పోస్తుంటే అడిగాను.

"రంగసామీ గ్లాసులూ మగ్గూ యివన్నీ ఎవరినడిగావ్?"

"మన మాన్యూలమ్మ లేదూ ఆవిడనడిగాను. పుచ్చెమ్మ నిన్న కొనుక్కొచ్చింది. మనంకూడా ఒకటి కొనిపెట్టుకుందామమ్మా. మూడు రూపాయలవుతుందిట" లొడలొడ మాటలు ప్రారంభించాడు.

"సరి - సరి - క్లియర్ ది ప్లేస్" అని పంపించాను.

ఆఫీసు వర్క్ ఆరంభమయింది. ఒక్కసారి హాలంతా కలయచూశాను. అందరూ తమ తమ సీట్లోకూర్చుని వున్నారు. మాన్యూల్ నన్ను చిరునవ్వుతోనే విష్ చేసింది. నేనూ బదులుగా నవ్వాను. అందరి దృష్టీ నా మీదనే వుంది. ఆడపిల్లలంతా ఒక్కసారి యిటువైపు చూస్తున్నారు. వాళ్లలా చూస్తుంటే నాకేదో గర్వంగా, గొప్పగానూ వుంది.

కాఫీ తాగుతూ అన్నాను. "మధ్యాహ్నం మీరు రాకండి. నేనే యింటికెళ్లిపోతాను. మీరు సాయింత్రం రండి, మంజుదగ్గిర మాట్లాడిందంతా వివరంగా చెబుతాను."

"ఓ కె" అని బయలుదేరారు.

"ఐ విల్ సీ యు ఆఫ్" అంటూ కూడా వెళ్లాను. మొదట లిఫ్ట్‌దాకానే వెళదామని బయలుదేరాను. కాని తరువాత ఆయనతో పాటు లిఫ్ట్‌లో కిందకొచ్చి కారుదాకా వెళ్లి, ఆయన్ని కార్లో కూచోబెట్టి, "మంజు చిన్నపిల్ల కాదు. అడ్డమైన పుకార్లూ విని నమ్మేకంటే, వున్న నిజం సూటిగా తెలుసుకోవడం మంచిది. మన మధ్యనున్న స్నేహం గురించి సిగ్గు పడాల్సిందేమీ లేదు, షి షుడ్ నో దిస్" కారు తలుపు మీదకి వొంగి ఆయన బుజంపైన నెమ్మదిగా తట్టి ధైర్యంచెప్పి, "సాయంకాలం వచ్చి చూడండి" అంటూ, బుజ్జగించి స్కూలుకి పంపే తల్లిలాగా ఆయన్ని సాగ నంపి, కారు వెళ్లిపోయేదాకా చూస్తూ నిలుచున్నాను. కారు దూరమయిపోతోంది. అయినా అక్కడే నిలుచుని వున్నాను. అందరూ ఏమనుకుంటారు? ఏమనుకుంటే నాకేం?

ఒంటి గంటకి ఆఫీసు అయిపోగానే టాక్సీ తీసుకుని సరాసరి యింటికొచ్చేశాను. నేను వచ్చిన అయిదు నిముషాలకల్లా మంజు కూడా వచ్చింది. ఏదో కొత్తమనిషి లాగానూ, మొదటిసారి యీ యింటికొచ్చినట్లూ మొహమాటంగా, మెట్లదగ్గిరే

నిలబడిపోయింది. నేనే ఎప్పటిలాగా చనువుగా, ఆప్యాయంగా చెయ్యిపుచ్చుకుని లోపలికి తీసుకొచ్చి, కూచోమని, ఎదురుగుండా నేనూ కూచున్నాను.

"ఏం నువ్వు వాకింగ్‌కి రావడంలేదేం ?" అని అడిగాను. చదువుకుంటున్నాననో, పరిక్షో ఏదో నెమ్మదిగా గొణిగింది.

"నేను కూడా మీ యింటికి రావడం మానేసాగా ?" అని ఆ పిల్లమొఖంవైపు సూటిగా చూస్తున్నాను. అవును అన్నట్లు బుర్రవూపి తలొంచుకుని నేలచూపులు చూస్తోంది. "మీరెందుకు రావడంలేదని" అడుగుతుందేమోనని అనుకున్నాను. కాని అడగలేదు. నేను రాకపోవడానికి కారణం అడగడానికి బదులు, మొదట్లో నేను ఏ కారణంతో వచ్చివుంటానా అని ఆలోచిస్తున్నది కాబోలు.

"ఏమన్నా తింటావా ?" అని అడిగాను.

"ఇప్పుడే - భోంచేసివచ్చాను"

"పొద్దున్నెప్పుడో తిన్నాను. చాలా ఆకలిగా వుంది" అంటూ లోపలికెళ్లి ఒక ప్లాస్టిక్ ప్లేటులో డబ్బాలో వున్న బిస్కట్లన్నీ దిమ్మరించి, యిద్దరికీ మధ్యన పెట్టాను. నేనొక బిస్కట్ తీసుకొని కొరుకుతున్నాను.

ఈ అమ్మాయి వచ్చి అరగంటసేపయ్యింది. ఇప్పటికి తనూ ఒక బిస్కట్ తీసుకుంది. ఎక్కడ మొదలుపెట్టాలి ? ఎలా మొదలుపెట్టాలి ? నాకు అంతు పట్టడంలేదు. గభాలున 'అగ్నిప్రవేశం' కద జ్ఞాపకానికి వచ్చింది.

"నువ్వు వాకింగ్‌కి రాకపోవటానికి, నేను మీ యింటికి రాకుండా వుండటానికి, మనం కలుసుకోకుండా వుండటానికి, కారణం ఏమీలేదనే అనుకుంటున్నావా ?"

పాదాల్ని చూసుకుంటూ, ఆ కనురెప్పల్ని పైకెత్తి, వెనక్కి జారగిలబడి నా వంకే చూస్తోంది. అబ్బా ఎంత పెద్ద కళ్లో ! ఆ కళ్లలో బిలిపితనం, బాల్యం చూస్తున్నపుడు యీ పిల్ల యింకా చిన్న పిల్లే అని అనిపిస్తూంటుంది. ఆ కళ్లని మర్చిపోతే యీ అమ్మాయి నాలాంటి మరో ఆడది అని తప్ప యింకేమనిపించదు. నా అంత ఎత్తూవుంది. నా అంత లావూ వుంది. నాలాగే చీరె కట్టుకుంది. నాకు మల్లే ముడి వేసుకుని వుంటే మా యిద్దరి మధ్యా వ్యత్యాసమే కనపడేదికాదు. కాని ఆ కళ్లని పట్టి చెప్పవచ్చు - యీ పిల్ల చిన్న పిల్ల అని.

నేను వరసగా అడిగానే– తను వాకింగ్‌కి రాకుండా వుండటం, వాళ్లింటికి నేను వెళ్లకుండా వుండటం, మేము కలుసుకోకుండా వుండటం, యిప్పుడు కలుసుకోవటం, వీటన్నిటికీ ఒక కారణం వున్నదని - ఆ కళ్లే చెపుతున్నాయి.

ఈ పిల్లకి బాయ్ ఫ్రెండ్సు వుండివుంటారా ? ఈ కాలం పిల్లలని నమ్మలేం ! ఈ కళ్లని, ఈ అందాన్ని, చూసి పూరికే వుంటారా ? వెంటబడి తిరుగుతూనే వుంటారు. ఇన్నేళ్లొచ్చిన నా వెంటే పడుతున్నారే ! కాని యీ పిల నాలాంటిది

కాదు. ఈ వయసులో నేను వున్నంత తెలివిహీనంగా వుండదు. నేనే అడిగేస్తే. మేమిద్దరం ఫ్రెండ్సుకదా. ఆ చనువుతో అడిగేస్తే. ఏ విషయం తీసుకొచ్చి అసలు విషయానికి వద్దామా అని ఆలోచిస్తున్నాను.

"ఆర్ యు నాట్ ఎయిటీన్ ?" అంటూ ఆ అమ్మాయి వయసు అడిగాను.

"అవును - జరుగుతోంది"

"సో - యు హావ్ కంప్లీటెడ్ స్వీట్ సెవెన్‌టీన్" అంటూ కొంటెగా కన్ను కొట్టాను. ఆక్షణంలో 'నా బిట్టర్ సెవెన్‌టీన్' గురించి జ్ఞాపకం వచ్చి చేదుగా నవ్వుకున్నాను.

"నేనూ ఒకప్పుడు పదిహేడేళ్ల పిల్లనే" అంటూ మొదలుపెట్టాను. ఈ విషయం నేనెందుకు చెపుతున్నానో ఆ పిల్లకి బోధపడటం లేదా? లేక నాకు మతి భ్రమణ అనుకుంటోందా?

నాలో నేను మాట్లాడుకుంటున్నట్లు యింగ్లీషులో మొదలుపెట్టాను. ఆ అమ్మాయి వైపు చూడకుండా, ఎటో శూన్యంలోకి చూస్తున్నట్లు చెప్పుకుపోతున్నాను. కాని యీ పిల్ల వినాలనేగదా నేను మాట్లాడుతున్నది. నేనెప్పుడో చదువుకున్న ఇంగ్లీషు పొయిట్రీ - యీ పిల్లకు పాఠంలో వస్తే, విడమర్చి ప్రతిమాటా అర్థం అయేట్లు చెప్పేదాన్ని - అదేవిధంగా, పాఠం చెబుతున్నట్లు మొదలుపెట్టాను. పాఠం వింటున్నపుడు చేతిలో పుస్తకాన్ని, నా మొఖంలోని భావాలనీ మార్చి మార్చి చూస్తూవుండేది, అదేమాదిరి రెప్పవెయ్యకుండా నావంక చూస్తున్నది.

"నేనూ పదిహేడేళ్ల వయసప్పుడు లేతప్రాయంలోనే వున్నాను. అయితే ఆ పదిహేడేళ్ల లేతప్రాయం అలా వుండిపోలేదు. నా పదిహేడేళ్ల వయసులోనే, జీవితంలో కటికి చేదువుందని తొలిసారి తెలుసుకున్నాను. నీకు ప్రాణమిచ్చి, ప్రేమించే తండ్రి ఒకడున్నాడు. ఆయన వ్యక్తిగా ఎటువంటి మోసగాడూ, నీచుడూ, దగాకోరూ అయినా, నీకు సంబంధించినంతవరకూ నిన్ను ప్రేమించేటువంటి ఒక అమృతమూర్తి. నువ్వు ఆయనకు గారాల ముద్దుబిడ్డవు. యస్ యు ఆర్ హిజ్ మోస్ట్ ప్రెషస్ ఛైల్డ్" - ఈ మాటలు రెండు మూడు సార్లు తిప్పి తిప్పి అన్నాను. కూచున్న దాన్ని ఎప్పుడు లేచానో నాకే జ్ఞాపకం లేదు.

"నాకు బుద్ధి తెలిసినప్పటినుంచీ తండ్రి అనే వ్యక్తిని ఎరగను. నాకు అటువంటి వ్యక్తి లేరు. నన్నెవరూ కింద నడవనీయకుండా, నెత్తిన పెట్టుకుని పెంచనూ లేదు. నీ వయసు నాకూ వచ్చింది. అయితే నీ వయసుమటుకే నాకు వచ్చింది గాని, నీకున్నటువంటి హంగులూ, ఆత్మీయులూ నాకు లేరు. నేనిదంతా యింత వివరంగా ఎందుకు చెబుతున్నానో తెలుసా? ఇద్దరు ప్రాణ స్నేహితుల మధ్య దాపరికాలు వుండకూడదు. ఇద్దరూ ఒకరినొకరు బాగా అర్థం చేసుకోవాలి.

నీగురించి నేను కొత్తగా తెలుసుకోవలసిన విషయాలు లేవనే అనుకుంటున్నాను. అవునా? కాని నాగురించి కొత్త విషయాలూ, పాత విషయాలూ నువ్వు తెలుసుకోవలసినవి వున్నాయి. ఆ విషయాలు తెలియజెప్పకుండా, నీ స్నేహాన్ని కోరడం న్యాయం కాదనుకుంటాను. యస్ ఐ ఫీల్ యిట్ యీజ్ అన్‌ఫెయిర్" అంటూ ఆగి ఆ అమ్మాయి ముఖంలోకి సూటిగా చూశాను. ఆ కళ్లలో కాస్త బెదురు, మెరుపులాటి నిశ్చలత కనిపిస్తోంది.

"ఇప్పుడు తలుచుకుంటే నాకు ఒకటే ఆశ్చర్యంగా వుంటుంది. పదిహేడేళ్ల ప్రాయంలో నేనంత అమాయకంగా, తెలివిహీనంగా ఎలా వున్నానో అని. అటువంటి అమాయకత్వం ఆఖరికి కథల్లోకూడా, చదివిన మీలాంటివాళ్లు నమ్మలేకపోయారు. అటువంటి కథరాసి, ఆ రచయిత యీనాటి కాలేజీ పిల్లల తెలివితేటల్ని కించపరిచాడని కూడా మీకు కోపం వచ్చింది. యు ఆర్ రైట్. కాని ఆత్మరక్షణ చేసుకోగలగడం, లోక ప్రవృత్తి గ్రహించగలగడం యివి కాలేజీలో చదువుకుంటున్నంత మాత్రంచేత వస్తాయా? అదంతా వారి వారి పెంపకాన్నిబట్టి, చుట్టూ పరిసరాలనిబట్టీ అలవడుతాయి. వీటన్నిటినీ బట్టి చూస్తుంటే పద్మలాంటి మంచి వెడ్డా తెలిసిన మనిషి, నీకు తల్లి కావడం నిజంగా అదృష్టమనే వొప్పుకోవాలి. నువ్వు మా అమ్మని చూశావుగదా! వంటిల్లు తప్ప బయట ప్రపంచం తెలియదు. డు యు రిమెంబర్ దట్ స్టోరీ?" గబుక్కున ముఖం వంక చూస్తూ సూటిగా అడిగాను.

"వుచ్ స్టోరీ?"

"అగ్నిప్రవేశం"

"యు మీన్ - ఆర్. కె. వి. వ్రాసిన కథా?"

"యస్ - అది నా కథ కూడాను." ఆ అమ్మాయి వైపు చూడకుండా మరోవైపు చూస్తూ చెప్పడం మొదలుపెట్టాను.

"టు పుట్ ది స్టోరీ యిన్ ఎ నట్‌షెల్. సూటిగా చెప్పాలంటే - ఆర్. కె. వి. రాసిన ఆ కథ నా కథే అని చెప్పాలి. ఆ అగ్నిప్రవేశం - నా అగ్నిప్రవేశమే! ఆ కథకి నా కథ డిటో. అదే కాలేజి, అదే బస్‌స్టాప్, అదే కారు, అదే అతను, అదే ఆమె, అంతా అదే. బట్ ది ఎండ్. కథలో ముగింపు వుందే అది ఒకటిమటుకు నా కథకంటే డిఫరంట్. ఆ కథ. ముగింపు వేరు. నా కథ ముగింపు వేరు. ఆ కథలో వచ్చేటువంటి అదే తల్లి నా కథలో లేదు. ఆ కథలో వున్నటువంటి పిల్ల యిప్పుడు జీవితంలో లేదు. నా జీవితంలో వున్న తల్లిలాంటి తల్లి ఆ కథలోనూ లేదు. ఎలా చెప్పగలుగుతున్నానని అనుకుంటున్నావుకదూ. నేను అనుభవించి

తెలుసుకున్న జీవిత పాఠాలవల్ల. ఆ కథలోని 'ఆమె' యే నేను. ఆ 'అతను' మీ నాన్న. అంటు చెబుతున్నాను'' ఆ అమ్మాయి తెల్లపోయి చూస్తోంది.

''ఇది పన్నెండేళ్ల క్రితం జరిగింది. దాంతో నా జీవిత అధ్యాయం ముగిసిపోయింది. నేను యిలా అనటం మోడరన్ కాలేజీ పిల్లవయిన నీకు అర్థం లేని మాటలాగా అనిపించవచ్చు. బాయ్ ఫ్రెండు వుండటంలో, డేటింగ్ వుండటంలో, ప్రిమారిటల్ సెక్సువల్ రిలేషన్స్ కలిగి వుంటంలో ఘనత వుంది, ఇవన్నీ సహజమైన విషయాలు అని భావించేటువంటి యుగంలో పుట్టిన నీకు – యింత చిన్న విషయానికి జీవితం ముగిసిపోవడమా? అని ఆశ్చర్యంగా వుండవచ్చు. కాని ప్రపంచంలో వారి వారి పరిధులనిబట్టి నడుచుకునే మనుషులు కొందరు వుంటారు. లోకంలో రకరకాల పిచ్చివాళ్లు వుంటారు. ఎవరి పిచ్చి వారికి ఆనందమన్నట్లు. అటువంటి పిచ్చితనానికి బలి అయినవారిలో నేను ఒకదాన్ని.

''సరి - యివన్నీ మనం బావు చెయ్యలేము. ముగిసిపోయిన పాత కథ యిది. కథ ముగిసినా కూడా సమస్యలు కొత్త కొత్తవి పుట్టుకొస్తూనే వున్నాయి. 'అయామ్ నాట్ కన్‌ఫెసింగ్ ఎనీథింగ్ బట్ ఐ హేవ్ టు ఎక్స్‌ప్లైన్ సమ్‌థింగ్' నీ సానుభూతి కొరకనీ, లేక నీకు క్షమార్పణ చెప్పకునేందుకో - నేనిదంతా చెపుతున్నాననుకోకు. కొన్ని విషయాలు నువ్వు తెలుసుకోవాలని చెబుతున్నాను. ఇట్లా ఎవరి విషయంలోనూ నేనింత శ్రమ తీసుకు చెప్పలేదు. వారేమనుకుంటున్నారో అని బాధ పడనూలేదు. నువ్వు నిజం తెలుసుకోవాలనీ, నా అసలు పరిస్థితి ఎటువంటిదో నువ్వు గ్రహించుకోవాలనే వుద్దేశంతో చెబుతున్నాను. ఇలా వున్నది వున్నట్లు చెప్పడం మంచిదనిపిస్తోంది. అందరూ అనుకుంటున్నట్లు 'అయామ్ నాట్ యువర్ ఫాదర్స్ లవ్'. అటువంటి పేరు కావాలనే - నేను కోరి సంపాదించుకున్నాను. ఆ రకం జీవితం మీద నాకు మోహం లేదుకాని - ఆ పేరు పెట్టుకోవడంలో ఆనందం వుంది. కాని నాకు యిప్పుడిప్పుడే అనిపిస్తోంది. 'వుయ్ టు లవ్ యీచ్ అదర్'. మేమిద్దరం ఒకరినొకరు ఆరాధించుకుంటున్నాము అని. దానిపేరు మీ రందరూ అనుకుంటున్నటువంటి 'ప్రేమ' అన్న రెండు అక్షరాలు కాదు. 'ఇట్ యీజ్ సమ్‌థింగ్ మోర్, సమ్‌థింగ్ డిఫరెంట్. అదే కాదు ఇతరులు వూహించుకుంటున్నటు వంటి దైహిక సంబంధం మా యిద్దరి మధ్యా ఏర్పడటానికి అవకాశంలేదు. ఇది వరలో ఏర్పడిందే - అది ఆ సంబంధం కాదు. ఒకవిధమైన దుర్ఘటన అని నీకూ తెలుసు. మీ తండ్రికి భార్యనని చెప్పకోవడానికి మీ అమ్మకు ఎంత హక్కు వుందో, నాకూ అలాగే 'మీ నాన్న మనిషి'ని అని చెప్పకోవడానికి అంత హక్కు వుంది. యస్. నేను ఆ పేరుమటుకే పెట్టుకున్నాను. మిగతావాళ్లు ఎలా అనుకున్నా ఫరవాలేదు. నువ్వు మటుకు యీ అనుబంధం గురించి నీచంగా అనుకోకూడదు.

ఐ డోంట్ నో వై? ఒకవేళ మీ నాన్నకి నీ మీదవున్న ప్రేమా అనురాగం కారణం కావచ్చు. నువ్వు నన్ను కలుసుకోవడం, కలుసుకోక పోవడం అన్నది కాదు ముఖ్యం. ఒకవేళ మీ అమ్మ నాతో మాట్లాడవద్దని వారించవచ్చు వుండవచ్చు. ఒక విధంగా చూస్తే అది న్యాయమైన మార్గం కూడాను. కాని నువ్వు నన్ను చూసి అసహ్యించుకుని, తప్పుకు తిరుగుతుంటే అదిమటుకు సరిఅయింది కాదు. నువ్వు పసిపిల్లవు కావు. నేను చెప్పేదంతా అర్థం చేసుకోగలవని నమ్ముతున్నాను. నీకు సంబంధించినంతవరకూ, మీ కుటుంబానికి సంబంధించినంతవరకూ - నేనెప్పుడూ ఒక వెల్‌విషర్‌ని. మీ క్షేమం కోరే వ్యక్తిని. ఒక శ్రేయోభిలాషిగా మీరు నన్ను గుర్తించాలని ఆశపడుతున్నాను. ఒకవేళ మీరు అనుకోకపోతే బాధ పడను కూడాను. ఇప్పటికే మీ నాన్న తన ప్రవర్తనతో చెడ్డ పేరు తెచ్చుకునేవున్నారు. అటువంటి మనిషికి నావల్ల కొత్తగా చెడ్డ పేరు రాదు. కొత్తగా చెడిపోయేదీ లేదు. ఇలా తిరగడంచేత నా పేరు చెడుతుందిగాని ఆయనకేం నష్టంలేదు. నేను అలాటి చెడుపేరు కావాలనే కోరుకుంటున్నాను. మన ప్రవర్తన సవ్యంగా వుంటే చెడిపోవడమన్నది జరగదు. ఇదంతా చెప్పడానికే నిన్ను రమ్మన్నాను. హౌ ఎబౌట్ కాఫీ?" అని అడుగుతూ లేచాను.

నన్ను చూసి ఆప్యాయంగా నవ్వింది.

"ఆదివారం విందుకు రాకుండా మీకు ఆశాభంగం కలిగించాను. మీకు వంటలో హెల్ప్ చేస్తానని పెద్ద ఖబుర్లు చెప్పి - అసలే రాలేకపోయాను. ఇప్పుడు కాఫీ పెట్టడానికైనా సాయం చెయ్యనివ్వండి" అంటూ చనువుగా యింగ్లీషులో చెపుతూ వంటింట్లోకి వచ్చింది.

మా యిద్దరి మధ్యా ఒక కొత్త అన్యోన్యత ఏర్పడింది. ఈ అమ్మాయి చీరె కట్టుకోవడం చూసి ఆశ్చర్యపోతున్నాను. ఈ పిల్లని చీరెలో చూడటం యిదే మొదటిసారి. ఆ విషయం పైకి అన్నాను. 'దాని వెనకో పెద్ద కథ వుంది' అన్నది మంజు.

## 25

మంజుని చూస్తూనే తన హాఫ్ డ్రస్ గురించి అడగాలని అనిపించింది - కాని సీరియస్‌మూడ్‌లో ఒక విషయం గురించి మాట్లాడుతున్నపుడు యీ చీరెల గురించి ఏమిటని వూరుకున్నాను. ఇది సమయం కాదని మాట్లాడకుండా వూరుకున్నాను.

సాధారణంగా మంజు షెల్వార్ కమీజ్ వేసుకుంటుంది. అల్లాటి డ్రస్సులు షుమారు ఓ యాభై రకాలదాకా వున్నాయి. కతాన్ సిల్కులో, రంగ రంగుల చారల్లో, ముదురురంగుల్లో డిజైన్‌వేసి వున్నవీ, కషాయి రంగులో నన్యాసుల్లాగానూ, మల్లెపువ్వులాంటి తెల్ల డ్రస్‌మీద జరీ పువ్వులు కుట్టినవీ, మెరిసే ఏక రంగుల్లోనూ, వీపు మీదా ముందు భాగానా, ఏనుగు తొండంవలె ఎంబ్రాయిడరీ చేసినవీ, మెడచుట్టూ కుత్తుగంటులాగానూ, పూసలతోనూ యిలా రకరకాలు వేసుకుంటూ వుంటుంది.

ఆ డ్రస్సులు మంజుకి నిజంగానే నప్పినట్లు వంటికి నరిపోతాయి. అందంగా వుంటాయి. కొన్ని నమయాల్లో పైన దోపట్టావంటిది వేసుకుంటుంది. నిజానికి ఆదోపట్టా వేసుకోకుండా వున్నప్పుడే బాగా వుంటుంది చూడటానికి, కొన్నిరోజుల్లో ఫ్రాకుకూడా వేసుకుంటుంది. ఆ ఫ్రాకు వేసుకున్నపుడు మంజు చిన్న పిల్లలాగా కనిపిస్తుంది.

ఈ రోజు గభాలున ఒక చీరె కట్టుకుని పెద్ద మనిషిలా తయారయి వచ్చి నిలుచుంది. "నేనూ పెద్ద మనిషినే, నాతోనూ మీరు సీరియస్‌గా మాట్లాడవచ్చు" అని చెపుతున్నట్లనిపించింది ఆ పిల్లని చూస్తే, నాతో ఏదో ముఖ్యమైన విషయం చెబుదామనే యీ వేషంలో వచ్చిందని యిప్పుడు ఖచ్చితంగా తెలిసిపోయింది. నా దగ్గిర జరిగిందంతా చెప్పడం మొదలుపెట్టింది. ఒక్క విషయం కూడా దాచకుండా, జంకులేకుండా చెప్పేసింది. తెలివిగానూ, వుపాయంతోనూ చిక్కులన్నీ విడదీసుకు బయటపడి నవ్వుతూ చెపుతున్నది.

ఈ పిల్ల చెప్పే విషయాలు వింటూ కాఫీ కలుపుతున్నాను.

వీళ్లమ్మ యీ అమ్మాయిని షెల్వార్ కమీజ్, ఫ్రాకూ యివ్వేమి వేసుకోవడానికి వీల్లేదని ఖచ్చితంగా చెప్పేసిందట. "బుద్ధిగా చీరె కట్టుకుని, మర్యాదగా కారులో కాలేజీకి వెళ్లి - మళ్లీ నరానరి యింటికి వచ్చే మాటుంటే కాలేజీకి వెళ్లు - లేదంటావా చదువూ వొద్దు గిదువూ వొద్దు" అని చెప్పేసిందట. అనలు మొదటో "రేపటి నుంచీ కాలేజీకి వెళ్లద్దు" అని కారణం చెప్పకుండా ఆర్డరు వేసేసి, ఆ తరువాతనే యీ వొప్పందానికి కొచ్చిందట. అనలు విషయమేమిటో చెప్పకుండా, యిలా తలాతోకా లేకుండా ఆరంభించింది మంజు. కాని నాకు అర్థం అవుతోంది. 'తదన నా' అని ఆలాపిస్తూ మళ్లీ అది నంగీతమని వేరే చెప్పడం దేనికి? ముఖం చూడకుండానే యీ అమ్మాయి రియాక్షన్ గ్రహించలేదా అని? చెప్పేది వింటున్నాను. ఈ పిల్ల ఎంత గడునుదో, గుంభన గలదో అని మనసులో ఆశ్చర్యపోతున్నాను.

ఈ అమ్మాయి అడుగుతోంది. "మిస్ గంగా మీరే చెప్పండి? నాకెందరో గర్ల్ ఫ్రెండ్సు వున్నారు. అదే మాదిరి ఒక బాయ్ ఫ్రెండు వుండటం తప్పా?

హి వాజ్ జెస్ట్ ఎ ఫ్రెండ్. అంతెగదా! దాన్ని అమ్మ ప్రేమ అంటోంది. నాటింపు వేసినట్లు పెద్ద గొంతు పెట్టుకుని - రంకెవేస్తూ అరిచింది. అవమానంతో తలెత్తుకోలేకపోయాను. అతని ముందే కొట్టడానికి వచ్చింది. మొదట్లో నాకు చాలా బాధ వేసింది. రెండు రోజులు తిండి తినకుండా ఏడుస్తూ పడుకున్నాను. కాని మూడోరోజున అనిపించింది. 'పాపం నా మంచికేకదా అమ్మ చెప్పింది. ఆవిడకు బాధ్యత వుండబట్టే కేకలేసింది' అని సరిపెట్టుకున్నాను. అతనితో మాట్లాడటం మానేశాను. ఆ విషయం సూటిగా అతనితోనే చెప్పేశాను."

ఈ అమ్మాయి. "అతను - అతను" అని సంబోధించి చెవుతున్నది. "హౌ డిడ్‌యు మీట్ హిమ్? నువ్వు అతన్ని మొదట ఎల్లా కలుసుకున్నావ్ - ఎక్కడ కలుసుకున్నావ్?" అని ఇంగ్లీషులో అడిగాను. అతను అనుకుని సంబోధించినా - ఆ అమ్మాయి ఆయన - అని అనుకోవచ్చు. అందుకే యింగ్లీషులో అడిగాను.

ఒక్క క్షణం వస్తాయించింది. సిగ్గు పడుతోందా?

ఈ అమ్మాయి కారులో వెడుతూవుంటే అతను స్కూటర్లో వస్తూవుంటాడు. వెంటనే వస్తూ వుంటాడు. కారు పక్కనే వస్తూంటాడు - స్థూలంగా యిద్దరూ కలుసుకున్న విధం యిది.

నేను మాట్లాడకుండా వింటున్నాను.

ఆ తరువాత ఒక రోజు కాలేజీకి కారు రాలేదు. కారు ఎందుకు రాలేదు అని నేను కారణం అడగలేదు. అక్కర్లేదని చెప్పిందో, లేక కారు రావడానికి ముందే బయలుదేరిందో. ఇవన్నీ అడిగిగాని గ్రహించుకోలేమా?

బస్ స్టాప్ దగ్గిరకి వచ్చి నిలుచుని వుంది. చాలాసేపటిదాకా బస్ రాలేదు. తరువాత యిద్దరు ముగ్గురు పిల్లలు కలిసి నడుచుకుంటూ డ్రయివిన్ వరకూ వెళ్లి, కాఫీయో, అయిస్‌క్రీమో తింటానికని లోపలికి వెళ్లారు. అక్కడ ఇతనూ వీళ్లకి మల్లేనే యిద్దరు ముగ్గురు ఫ్రెండ్సుతో ఓ చెట్టుకింద కూచుని అయిస్‌క్రీమ్ తింటున్నాడు. అందులో ఒకతను యీ అమ్మాయితో వచ్చిన పిల్లల్లో ఒకమ్మాయికి బాయ్ ఫ్రెండట. అతను యీ పిల్లని చూసి 'హాయ్' అంటే యీ పిల్లా 'హాయ్' అందిట. ఆ స్కూటరబ్బాయి మంజుని చూస్తూ ఆ పిల్ల బాయ్ ఫ్రెండుతో ఏదో చెప్పాడు. అతను 'వో' అంటూ నవ్వాడు. తన్ను చూసి అతనేదో చెవుతున్నాడని మంజుకూడా తన గరల్ ఫ్రెండుతో ఆ స్కూటరబ్బాయి తనకు తెలుసునని చెప్పిందట. ఆ తరువాత పరస్పర పరిచయాలు అవడం, హౌ డు యు డులు, అయిస్‌క్రీములు, జోక్స్, మాటినీ సినిమా, తరువాత స్కూటర్‌లో యింటి దగ్గిర దించడం - - - మరురోజు కలుసుకుందామని అనుకోవడం. అంతే అంతకిమించి ఏం లేదు. ఇందులో తప్పేమిటి అని అడుగుతోంది మంజు.

ఎంతో సాధారణంగా అడిగేస్తోంది. నాకు యిందులో తప్పేం కనిపించలేదు. ఈ పిల్లలు నాలాటి అమాయకులు కారు. వీళ్లకి బ్రతకడం తెలుసు. తమని తాము రక్షించుకోవడం తెలుసు. వీళ్లకి ఎటువంటి భయమూలేదు. అదీగాకుండా వీళ్లంతా ఎప్పుడూ యిద్దరు ముగ్గురు ఆడపిల్లలు చేరి గ్రూప్స్ గ్రూప్స్‌గా వెళుతుంటారు. అలా వుంటేనే బాగుంటుందిట. ఇందులో నాకు తప్పు పని ఒకటి కూడా కనపడలేదు. నేను ఈ పిల్లలాగా తెలివిగా వున్నట్లయితే ఆ రోజు కార్లో ఎక్కగానే, ఈయన వుద్దేశం గ్రహించ గలిగి వుండేదాన్ని. "అయామ్ సారీ లీవ్ మి" అని తప్పుకుని కార్లోంచి దిగి 'టాటా' చెప్పి వచ్చేసి వుండేదాన్ని.

ఆ రోజుల్లో మొగవాడిని చూడగానే నాకోరకం భావన వస్తుండేది. అందరాడ పిల్లలకీ యిలానే భావన వస్తూంటుందా ? భావన అని నేను అనుకుంటున్నానే దాన్ని వాళ్లు ప్రేమ అని అనుకుంటున్నారు. ఈ ప్రేమ అనే మైకంలో పడినప్పుడే, వారు ఎడ్వాన్‌టేజ్ తీసుకుని ముందడుగు వేస్తూంటారు. అందరూ యింతేనా ? మొగ వాడిని తల ఎత్తి చూడకూడదు, మాట్లాడకూడదు, కలిసిమెలసి తిరగకూడదు అని చెప్పి చెప్పి యిన్‌హిబిషన్స్ బాల్యం నుంచీ పెంపొందించడంవల్ల, వయసులో వున్న పిల్లలకు మొగపిల్లవాడు అని అనుకోగానే, అతని మూర్తి చూడ గానే ఒక థ్రిల్, ఒక మానసిక నంచలనం ఏర్పడిపోతుంది. అది ఒక అందమైన భావం అన్న అభిప్రాయం కూడా ఏర్పడుతోంది. అన్ని కష్టాలకీ యిదే ఆరంభం.

ఈ మానసిక నంచలనం అందరి దగ్గిరా, చూసిన ప్రతివాడిపట్లా ఏర్పడట మన్నది 'ఇమ్మోరల్' - అపవిత్రమైన భావమని అనిపిస్తోంది.

మామయ్యకు నాగురించి అంత చులకనైన అభిప్రాయం ఏర్పడటానికి కారణం, నాకు చూసిన ప్రతివాడిపట్లా - యీ థ్రిల్ - యీ నంచలనం కలుగుతుందని - అనాడే గ్రహించుకుని వుంటాడు.

ప్రస్తుతం నేనాభావాన్ని దాటుకుని బయటపడిపోయాను. ఆరకమైన నంచలనం కాని, థ్రిల్ కాని ఎవరిపట్లా యికమీదట ఏర్పడదు. ఇకపైన నాకు ఏ మొగ వాడిని చూసినా భయం కలగదు. మొన్నమొన్నటిదాకా నన్ను ఏ మొగవాడన్నా భంగపరుస్తాడేమోనన్న భయం వుండేది. కాని యిప్పుడా భయం పూర్తిగా మాయమైపోయింది. ఆ రోజు రాత్రి మామయ్య చేతిలోంచి బెల్టు లాక్కుని నుల్చున్నానే ఆ క్షణంనుంచే ఆ భయం నా నుంచి పారిపోయింది. ఇకనుంచీ నాకు ఏ భయమూ లేదు. పురుషుణ్ణి చూడగానే కలిగే ఆ నంచలనమూలేదు. నవ్ అయామ్ రియల్లీ మెచూర్డ్. నేను మానసికంగా చాలా ఎదిగాను.

ఆ అమ్మాయి కథకి - సమానాంతర రేఖల్లాగా నా ఆలోచనలు పరుగెడుతున్నాయి. ఆ పిల్ల చెప్పేది చెవుల్లో పడటంలేదు. మనసుకి హత్తుకోవటంలేదు. వింటూ....ఆలోచించుకుంటూ పోతున్నానా ?

"ఎన్నాళ్లనుంచీ యీ ఫ్రెండ్‌షిప్ నడుస్తోంది. ఆ తరువాత ఏం జరిగింది ?" అని అడిగాను. ఈ స్నేహంపట్ల నా వుద్దేశాన్ని పైకి చెప్పలేదు.

ఇద్దరం మళ్లీ సోఫాల దగ్గిర కొచ్చి కూచున్నాము.

ఒక అయిదారుసార్లు అతన్ని కలుసుకుంది. కలుసుకున్నపుడల్లా మాటినీషోకి వెళుతుండేవాళ్లట. ఒకరోజున స్కూటర్‌లో వచ్చి దిగుతుంటే వాళ్లమ్మ చూసిందిట. ఈ అమ్మాయి అతన్ని లోపలికి పిలిచి 'నా బాయ్ ఫ్రెండ్‌ని' పరిచయం చేసిందిట.

వెంటనే ఆవిడకు పట్టరాని కోపం వచ్చిందట. అతని ముందే అరవడం ప్రారంభించిందట. "నిన్ను చదువుకోనమని బయటకు పంపించాను గాని, బాయ్ ఫ్రెండ్సుని తెచ్చుకోవడానికి కాదే" అని అరుస్తూ 'బయటికి పో' అంటూ అతన్ని తరిమికొట్టిందట. పాపం చిన్నపిల్ల ఆ మాటలు చెబుతూ యిప్పుడు కూడా ఏడవడం మొదలుపెట్టింది. ఆ పిల్ల మనసు ఎంత గాయపడి వుంటుందో వూహించగలను.

ఆ అమ్మాయి షెల్వార్ కమీజ్‌లన్నీ మూటగట్టి దాచేసిందిట. ఇకనుంచీ చీరె కట్టుకోవాలని కట్టుదిట్టం చేసిందట. బయటకెళ్లకూడదని ఆంక్ష పెటి, కాలేజీ నుంచికూడా మానిపించేస్తానందిట.

అప్పుడే పద్మ అందిట. "అచ్చుబోసిన ఆంబోతులాగా మీ నాన్నని యిష్టం వచ్చినట్లు తిరగమని వదిలేశాను. అల్లా నా పిల్లలని కూడా వదిలేస్తానను కుంటున్నావా ? ఫ్రెండు ఫ్రెండు అని చెప్పుకుంటూ మీ నాన్న వెంటబడి తిరుగుతోందే - ఆ గంగ - దానిలాగా నువ్వూ తయారవుదామని చూస్తున్నావా ? అసలు అది యిక్కడికి రావడం మొదలుపెట్టాకనే నువ్వు మరీ తెగించావ్. ఇకనుంచీ అది యిక్కడికి రాకూడదు. నువ్వు దానింటికి వెళ్లకూడదు. వాకింగ్ గీకింగ్ అంటూ నాకు చెప్పకుండా బయలుదేరావో ఏం చేస్తానో చూడు ? నాకు చెప్పకుండా యిల్లు కదిలావంటే వూరుకోను" అందిట పద్మ.

పాపం యీ అమ్మాయి రెండు మూడు రోజులు ఏడ్చి, వుపోషాలుండి, చివరికి తల్లి పెటిన ఖండీషన్సు అన్నిటికీ వొప్పుకుని, ఆఖరికి కాలేజీకి వెళ్లడానికని తల్లిని వొప్పించిందట.

వీళ్లమ్మ నా గురించి "ఫ్రెండు ఫ్రెండు అని చెప్పుకుంటూ యీయన వెంటబడి తిరుగుతోంది" అని అనేదాకా యీ అమ్మాయికి అటువంటి చెడు ఆలోచనే రాలేదుట. ఈ పిల్ల మొదట్లో అమ్మ కోపంలో లేనిపోని అబద్ధాలు అంటోంది

అనుకుందిట. ఏమీ లేకుండా తన గురించి యింత హడావుడిచేసిన తల్లి, నా విషయంలో మటుకు అపోహపడివుండదా అని అనుమానం కలిగిందిట. అంచేతనే తల్లి నోటికి భయపడి, నాతో మాట్లాడకూడదనీ, వాకింగ్‌కి వెళ్లకూడదనీ నిశ్చయించుకుందిట. తండ్రి దగ్గిర యీమాటలేమీ చెప్పకుండా "ఇకనుంచి ఫ్రెండయితే మీతో తిప్పుకోండి. నాకెందుకీగోల" అందిట. అలా అన్నందుకు యిప్పుడు ఫీలవుతోంది. ఇదంతా వాళ్లమ్మకి చెప్పి నమ్మించలేనని బాధ పడుతోంది మంజు.

"మీ అమ్మ దగ్గిర మంచి పేరు తెచ్చుకో. ఆమె చెప్పినట్టు విని, ఆమె అభిమానాన్ని పొందడం ముఖ్యం" అని ఆ పిల్లకి ధైర్యం చెప్పాను.

నేను యిదంతా గ్రహించుకుని వాళ్లింటికి వెళ్లడం మానుకున్నాను. అది తలుచుకు నా ముందుచూపుకి నన్నే అభినందించుకున్నాను.

"డు యు ల హిమ్? వాట్ యీజ్ హిజ్ నేమ్" అని ఒకవేళ తల్లికి భయపడి, యీ పిల్ల తన మనసులోని భావాలని పైకి వెలుబరచడంలేదేమో! అతని పైనున్న యిష్టాన్ని దాచుకు లోలోన బాధపడుతూందేమోనన్న వుద్దేశంతో అడిగాను.

"యు మీన్ స్వామిజీ" అని అడిగి నవ్వుతోంది. "అతని పేరు జి. స్వామి. అందరం అతన్ని స్వామిజీ, స్వామిజీ అని పిలుస్తాము. హౌ నైస్. ఇట్లా ఒక్కొక్కరికి ఒక్కొక్క ఫన్నీ నేమ్ వుంది. నా పేరు ఏమిటో తెలుసా? 'మణిజు' సి. కృష్ణవేణి అని ఒకమ్మాయుంది - ఆ పిల్లని సిక్కి - - -"

ఏమేమిటో చెప్పుకుపోతోంది. నేను అడిగినదానికి మటుకు సరి అయిన జవాబు రాలేదు. మరోసారి అడగడం బాగోదని వూరుకున్నాను. ఒకసారి అడగడమే టూ మచ్. ఆ పిల్ల వయసెంత? నా వయసెంత? అడిగింది చాలు. జవాబివ్వకుండా తప్పించుకోవాలని అనుకుంటుంటే నేనూ ఎరగనట్లు వూరుకున్నాను. ఇట్ యీజ్ హర ప్రైవెసీ.

తనపాటికి తను ఒక్కొక్క ఫ్రెండు గురించీ, వాళ్ల జోక్స్ గురించీ చెప్పుకుపోతూ, గబుక్కున నావంక సీరియస్‌గా చూడటం మొదలుపెట్టింది. నెమ్మదిగా నవ్వుతూ అంది. ఆ నవ్వు మనసారా నవ్విన నవ్వుకాదు. సగం నవ్వూ సగం బాధా మిళితమయి వున్నాయి. నేను ఆ పిల్లకు క్లాసుపాఠాలు వివరించేప్పుడు మొహం పెడతానే ఆ మాదిరి, తనో గురువు అన్నట్లు మొహంపెట్టి, ఇంగ్లీషులో చెప్పడం ఆరంభించింది.

"మిస్ గంగా. యు ఆస్కడ్ మీ సమ్‌థింగ్ ఎబౌట్ లవ్? ప్రేమ గురించి ఏదో అడుగుతున్నారు గదూ! మా అమ్మా అదే విషయం తమిళంలో కోపంగా అడిగింది. మీరు యింగ్లీషులో శాంతంగా అడిగారు. నాకు అమ్మ దగ్గిర చెప్పడానికి

చేతకాలేదు. మీ దగ్గిర చెబుతాను. మొగవాళ్లకీ ఆడవాళ్లకీ మధ్య మీరు అర్థం చెబుతున్నారే ఆమాదిరి ప్రేమ తప్ప; యింక ఏవిధమైన స్నేహమూ వుండటానికి అవకాశం లేదా? వీరిద్దరూ మంచి స్నేహితులుగా వుండలేరని మీ వుద్దేశం. (ఐ లైక్ స్వామిజీ - ఐ డోంట్ నో వెదర్ యిటీజ్ లవ్) నాకు స్వామిజీ అంటే యిష్టం. అది ప్రేమ అవునో కాదో తెలియదు. మేమిద్దరం ఫ్రెండ్సుమి. అంతే. బాయ్ ఫ్రెండ్సుగా వుండే స్నేహితులు మొగవాళ్లు, గరల్ ఫ్రెండ్సుగా వుండే స్నేహితులు ఆడవాళ్లు. అంతకుమించి మరో అర్థం నాకు కనిపించడంలేదు. మీరు అన్నట్లు ఒక మొగవాడి పొందు నాసించే వయసుగాని, అవసరంగాని, గ్రాహ్యంగాని నాకు రాలేదు. మేమంతా కుర్రవాళ్లం. కుర్ర చేష్టలే చేస్తూ వుంటాం. ఈ చిన్న వయసులో పెద్దలకున్నటువంటి స్వతంత్రమూ, పిల్లలు పొందవలసిన ప్రేమాభిమానాలూ, తల్లితండ్రులపట్ల భయభక్తులూ యివన్నీ సమపాళ్లలో గనక వుంటే ఆ జీవితాలు ఆరోగ్యవంతంగా వుంటాయి."

ఓ - ఎంత బాగా చెబుతోంది. ఈ పిల్లని హృదయానికి హత్తుకుని, దగ్గరగా తీసుకోవాలనిపించింది. నా కళ్లు నీళ్లతో నిండుకున్నాయి. నాకు ఏదో బాధగా, మనసులో కలవరంగా వుంది.

"ఆ స్వామిజీ చాలా మంచివాడు. చాలా విట్టీగా మాట్లాడుతాడు. సరదాగా వుంటాడు. మేమంతా కలిసి ఒకటే గొడవ చేస్తూంటాం. మా స్నేహితులందరం ఒకళ్లనొకళ్లు గిచ్చుకుంటాం, కొట్టుకుంటాం, ముట్టుకుంటాం. ఒకళ్ల గురించి యింకొకళ్లం తప్పుగా గాని అసహ్యంగాని వూహించుకోం, అనుకోం. అలా ఎవరన్నా వూహించుకున్నా ఛీ తప్పుగా అనుకుంటున్నామని మాలో మేము బుద్ధి చెప్పుకుంటాం. మర్యాదగా వుంటాం. మేనర్స్ కీప్ అప్ చేస్తాం. (వుయ్ ఆర్ ఫ్రాంక్. ఎట్ ది సేమ్ టైమ్ వుయ్ హావ్ రిజర్వేషన్సు) నేను మనిషిని (ఇంగ్లీషులో ఆ అమ్మాయి మనిషికి మాన్ అని వుపయోగించింది) మనిషిగానే చూస్తాను. నాకు ఆడపిల్లని అన్న కాంప్లెక్సు లేదు. అతను మిగతా ఫ్రెండ్సుని ఎలా చూస్తాడో నన్నూ అలానే స్నేహంగా చూస్తాడు. అతను మిస్‌బిహేవ్ చెయ్యడనే ధైర్యం నాకుంది. ఒకవేళ తప్పుగా వాళ్లు ప్రవర్తిస్తే మేం సరిదిద్దుతాం. ఇలా కలిసిమెలిసి తిరుగుతూ తప్పులు చేసేవాళ్లూ వున్నారు. వాళ్లు ఎక్కడన్నా చెడిపోతారు. మాట వరసకి మిమ్మల్నే తీసుకోండి. మీరు యింతక్రితమే మీ టీనేజ్‌లో జరిగిన అనుభవం చెప్పుకొచ్చారు - - . దానికి కారణం మీ బాయ్ ఫ్రెండా? మా నాన్న మీ బాయ్ ఫ్రెండు అయివుంటే అసలు అట్లా జరగకనేపోయేది . యామ్ ఐ రైట్ ? ఆయన యిప్పుడుగదా మీకు ఫ్రెండయింది. మీరు యీ రెండిటికీ మధ్యనున్న తేడా గమనిస్తున్నారనుకుంటా. ఫ్రెండ్‌షిప్ గురించి నేను యిలా ఆరోగ్యంగా

ఆలోచిస్తున్నాను కాబట్టే, మీకూ నాన్నకీ మధ్యనున్న స్నేహాన్ని గూర్చి నేను తప్పుగా అనుకోవడంలేదు. కాని యిటువంటివి చాలామంది అర్థం చేసుకోరు. నాకు ఫ్రెండ్‌షిప్‌కంటే అమ్మే ముఖ్యం. నా స్నేహాన్ని గురించి అమ్మ అర్థం చేసుకునేటట్లు వివరించి చెప్పి, ఆవిడ యిష్టప్రకారమే నడవడానికి నా అంతట నేను వొప్పుకున్నాను. అప్పుడే అమ్మకి నా మాటమీద నమ్మకం ఏర్పడింది. సో- -" ఒక దీర్ఘమైన నిట్టూర్పు విడిచింది. పెదిమలు కొరుక్కుంటున్నది. కళ్లు ఎర్రగా అయి నీళ్లతో నిండినాయి. కన్నీళ్లు బలవంతాన ఆపుకుంటున్నది. లేచి నిలుచుని కళ్లు తుడుచుకుంది. పెదిమలు కొరుక్కుంటోంది. నా గుండెలు ఎవరో సుత్తితో కొట్టినట్లు గబ గబ కొట్టుకుంటున్నాయి. నోట మాట లేకుండా గుడ్లప్పగించి చూస్తున్నాను.

నావైపు చూసి నవ్వుతూ గొంతు సవరించుకుని మళ్లీ చెప్పడం మొదలు పెట్టింది.

"మరునాడు నా ఫ్రెండ్సందరినీ పిలిచాను. డ్రయివిన్‌లో పార్టీ యిచ్చాను. అమ్మ పర్మిషన్ తీసుకునే పార్టీ ఏర్పాటు చేశాను. నన్ను చీరెలో చూసి వాళ్లంతా ఆశ్చర్యపోయారు. వాళ్లందరిముందూ స్వామీజీని మా అమ్మ తరఫున క్షమార్పణ అడిగాను. మా అమ్మ ఆనాడు అంత కఠినంగా ప్రవర్తించడానికి కారణమైన మా కుటుంబ పరిస్థితుల గురించీ, నాన్న గురించీ చెప్పాను. అమ్మ మాట ప్రకారం నేను నడుచుకోవలసిన అవసరం వివరించాను. "నాకు కాలేజీ ఎడ్యుకేషన్ ముఖ్యం. చదువులో వున్న ఆనందం నాకు యింక ఎందులోనూ లేదు. దట్ యీజ్ ట్రు. దేన్నయినా వొదులుకుంటానుగాని చదువును మటుకు వొదులుకోను. నేను చదువును త్యాగం చెయ్యలేను - మనం ఎప్పటిలాగా స్నేహితులమే కాని - ఫ్రెండ్‌షిప్ అంటే అయిస్‌క్రీమ్, మాటినిషో, ఎక్స్ఛేంజి ఆఫ్ జోక్సూ యివే కాదు. ఒకరినొకరు అర్థం చేసుకోవడం, అది నిజమైన స్నేహం. మీరు నన్ను అర్థం చేసుకుంటారని నమ్ముతున్నాను. మళ్లీ చెపుతున్నాను - మనం ఎప్పటికీ స్నేహితులమే" స్వామిజీ కళ్లనీళ్లు పెట్టుకున్నాడు. ఆనాడు మేమంతా మాటాపలుకూ లేకుండా, నిశ్శబ్దంగా అయిస్‌క్రీమ్ తిన్నాం. ఇప్పుడు చూసుకుంటే విష్ చేసుకుంటాం....అంతే.

ఆ పిల్ల చెక్కిళ్లను సూటిగా చూస్తున్నాను. ఆ అమ్మాయిలోని భావోద్రేకాన్ని గమనిస్తున్నాను.

"మంజు అయి రియల్లీ ఎడ్మైర్ యు" అంటూ ఒక్కసారి కావిలించుకున్నాను. ఈ పిల్లకి నేను క్లాసుపాఠాలు బోధించేదాన్ని. ఈ అమ్మాయి ఈనాడు నాకు జీవిత పాఠాలనే నేర్పింది.

"టైము అయిదయింది, మిమ్మల్ని చూసి అయిదింటికల్లా వచ్చేస్తానని అమ్మకి చెప్పివచ్చాను" అంటూ యీ అమ్మాయి అనేసరికి నా మనసులో ఎక్కడో అసూయ కలుక్కుమంది.

## 26

ఆ సాయంకాలం ఆయన వచ్చినప్పుడు అన్ని విషయాలూ వివరంగా చెప్పాను. మంజు బాయ్‌ఫ్రెండుని పద్మ అవమానించిన సంగతి మటుకు అలా పైపైన వది లేశాను. ఆరోజు సాయింకాలం నుంచీ రాత్రి తొమ్మిది గంటలదాకా యిక్కడే వున్నారు. అన్ని విషయాలూ చాలా వివరంగా చెబుతూ కాలం గడిపేస్తున్నాను. తొమ్మిది గంటలకి పైన యింక యీయన ఆగలేక పోయారనుకుంటా నుదురు రుద్దుకోవడం మొదలుపెట్టారు. చెయ్యి వొణుకుతోంది. ఆవలిస్తూ సిగరెట్ వెలిగించి, వెలిగించి ఆర్పుతున్నారు.

'దాహశాంతికి' టైమయింది కాబోలు అనుకున్నాను. ఈయన ఇక్కడ భోంచెయ్యరని తెలుసు. అయినా మాటవరసకి "ఇక్కడ భోంచేసి వెళ్లండి, చాలా సింపుల్‌గా వండాను యీ పూటకి" అన్నాను.

"అరే" అని షాక్ తిన్నట్లు లేచారు. "నో- నాకు ఆకలిగాలేదు ... అసలు యింతదాకా రానివ్వకుండా నా పెళ్లాన్ని పీకపిసికి ఎప్పుడో చంపేసి వుండాల్సింది. ప్లీజ్ ఎక్స్‌క్యూజ్ మి. రేపొస్తాను. నీ భోజనానికి ఆలస్యం అయిపోయింది" అంటూ లేచి వెళ్లిపోయారు.

నేను నవ్వుతూ ఆయన్ని కారెక్కించి వచ్చాను. ఇంట్లోకి వచ్చాక ఆలోచన వచ్చింది. ఈయన నేను చెప్పేదంతా వింటూ "ఆ – వూ" అంటూ తల వూపారే గాని ఒక్కమాట కూడా బదులు చెప్పలేదు - అని.

ఏమని అనుకుంటున్నారో ? మా యిద్దరి మధ్యా మరుగుపడివున్న ఆ రహస్యం మంజుకి తెలిసిపోయిందని సిగ్గు పడుతున్నారా? కూతురి మొహం చూడటానికి సంకోచపడుతున్నారా? ఇదంతా మంజుకి చెప్పేశానని నామీద కోపంగావుందా ? మంజుకి బాయ్ ఫ్రెండ్స్‌ని చేసుకునే వయసొచ్చిందని ఆశ్చర్యపోతున్నారా ? పద్మ మంజుపట్ల కఠినంగా ప్రవర్తించినందుకు మనసు కష్ట పెట్టుకుంటున్నారా?

ఈయన తన మనోభావాలని ఒక్కసారికూడా పైకి వెలువరించలేదు. మా అనుబంధం గురించి మంజు అపార్థం చేసుకోలేదన్న ఆ వొక్క మాటా విని తృప్తి

పడిపోయారే తప్ప, మిగతా విషయాలపట్ల అంత శ్రద్ధ చూపలేదు. వాటిని పట్టించుకున్నట్లు లేదు.

ఆ రాత్రంతా యీ విషయాల గురించే ఆలోచించాను. కాని మరునాడు పొద్దుట ఆయన వచ్చినపుడు యీ విషయం గురించి నేనేమీ అడగలేదు. ఎందుకడగాలి? నేనే ఎందుకడగాలి? చెప్పవలసిన సంగతులు చెప్పేశాను. వాటిని గురించి ఆయన ఏమనుకుంటున్నారో తెలుసుకోవలసిన అగత్యం నాకు లేదు. చెప్పవలసింది ఏదేనావుంటే ఆయనే చెబుతారని నేను ఆ విషయం ఎత్తకుండా వూరుకున్నాను. ఆయన ఏమీ చెప్పలేదు నేను ఏమీ అడగలేదు.

ఈ నాలుగైదు రోజులూ మేము ఏమీ మాట్లాడుకోలేదు. ఆలోచించిన కొద్దీ నాకేం అంతుపట్టలేదు. పొద్దుట ఆరు ఆరున్నరకల్లా వస్తున్నారు. వాకింగ్‌కి వెళ్తున్నాము. తీసుకొచ్చి యింట్లోదించి, ఆఫీసుకు వెళుతూ వచ్చి నన్ను వెంట బెట్టుకు వెళ్లి, మా ఆఫీసులో దించుతున్నారు. సాయంత్రం రెండు మూడు రోజులుగా ఆయన కనిపించడంలేదు. టాక్సీ తీసుకుని నా అంతట నేను యింటికొచ్చేస్తున్నాను. నా వెనక తిరగడం తప్ప యీయనకు మరోపని వుండదా ఏమిటి? కాని ఈ నాలుగు రోజులనుంచీ ఆయన ఒక మాదిరిగా వుంటున్నారు. దేన్ని గురించో చాలా సీరియస్‌గా ఆలోచిస్తున్నారు. సంగతేమిటని అడిగితే 'నథింగ్' అంటూ జవాబు చెప్పి మళ్లీ వెంటనే ఆలోచనలో పడిపోతున్నారు. ఈయన యిలా వుంటే నాకు బాధగా వుంది. ఎప్పుడూ నవ్వుతూ, తమాషాగా గలగల మాట్లాడే మనిషి యిలా ఎందుకయ్యారు? ఎందుకని యిలా అయ్యారు? పాత అలవాట్లు మార్చుకు - కొత్త వ్యక్తి అయిపోతారా? ఈయన యిలా మారిపోకూడదు - యిలా వుండకూడదు.

నాలుగు రోజుల తరువాత ఈ సాయంత్రం మా ఆఫీసు గుమ్మంలో నాకోసం కాచుకుని కూచుని, నన్ను కార్లో ఎక్కించుకున్నారు.

కారు నడుపుతుంటే పక్కనుంచి యీయన్ని పరిశీలిస్తున్నాను.

ఇప్పుడు చాలా విషయాల్లో ఈయనలో మార్పు కనిపిస్తోంది. ముఖం ఆరోగ్యంగానే వుందిగాని, షేవ్ చేసుకున్నట్లు లేదు. గడ్డం రెండు మూడు రోజుల నుంచీ ఎదిగినట్లుండి మాసిపోయింది. రోజూ వాకింగ్‌కి వెళుతుండబట్టి కాబోలు కాస్త సన్నబడ్డారు - బొజ్జ తగ్గింది.

కాని ఈ రోజు మొఖం వడిలిపోయి పీక్కుపోయినట్లుంది. సరిగ్గా భోంచేస్తున్నారో లేదో? దేన్ని గురించో యీయన మనసులో దిగులు పడుతున్నారు. ఎన్ని దిగుళ్లున్నా భోజనం మానేస్తారా ఎక్కడైనా?

"మధ్యాహ్నం ఏం తిన్నారు?" నేను అడిగిన ప్రశ్న ఆయన చెవిలో దూరినట్లు లేదు. ఏమి అడిగానో వినుపించుకోకుండా, నేను ఏదో చెబుతుంటే తను

వింటున్నట్లుగా బుర్ర వూపుతున్నారు. నేను అడిగిన ప్రశ్న ఆయన చెవిలో పడలేదని నాకు కచ్చితంగా తెలిసింది. అందుకనే కొత్తగా అడుగుతున్నట్లు - మళ్లీ అడిగాను.

"మధ్యాహ్నం మీరు భోజనం చేసినట్లు లేదే ?"

"హౌ డు యు నో ?" చాలా ఆశ్చర్యంగా నాకెల్లా తెలుసు అన్నట్లు అడుగుతున్నారు.

"మీ మొహం చూస్తుంటే తెలుస్తోంది."

"ఇజ్ యిట్ - ముఖం చూస్తుంటే తెలుస్తోందా ? ఇంకా ఏవేమి తెలుస్తున్నాయో చెప్పు చూద్దాం" అంటూ మామూలు ధోరణిలో నవ్వుతూ అడిగారు.

"యు ఆర్ నాట్ ఆల్ రైట్. రెండు మూడు రోజుల నుంచి మీరు ఎలాగో వుంటున్నారు. అది మటుకు స్పష్టంగా తెలుస్తోంది. రెండురోజుల బట్టీ మీరు సాయింత్రం పూట కనిపించడంలేదు. ఏదన్నా పనిమీద వున్నారని సరి పెట్టుకున్నా. కాని పొద్దుట వాకింగ్ అప్పుడుకూడా మీరు ఒక్క మాట కూడా మాట్లాడటం లేదు. ఆర్ యు వర్రీడ్ ? అందుకని వుపోషాలుంటారా ?"

ఈయన బదులు చెప్పలేదు. సిగరెట్ తీసి అంటించి, "నేను భోంచెయ్యకపోతే భోంచెయ్యలేదా ? అని బాధపడి ఇదివరలో నన్ను పెంచిన ఆయా ఒక్కతే అడుగుతూండేది. ఇప్పుడు మళ్లీ నువ్వు అడుగుతున్నావ్ ?" అని నోటి నిండా పొగ వదిలారు.

మళ్లీ ఆయనే చెప్పుకొచ్చారు. "అది వాళ్ల తప్పుకూడా కాదు. నేను యింట్లో భోంచెయ్యకపోతే బయట తిన్నాననుకుంటారు. నేను రిగ్యులర్‌గా యింట్లో తింటేగదా !" అంటూన్నారు తనలో తను అనుకున్నట్లు.

నాకు చాలా కష్టంగా వుంది. "అసలు మీ బాధ ఏమిటి చెప్పండి. ఎన్ని భాధలుంటే మటుకు భోజనం మానుకుంటారా ఎవరన్నా ?" అనునయంగా అడిగాను.

"నేను యింట్లో తినలేదని చెప్పాను గాని - భోజనమే చెయ్యలేదన్నానా ?"

"ఈ రోజు నాతో భోంచెయ్యండి"

"ఓ. యస్. థాంక్యూ"

"మీకేదన్నా 'నాన్ వెజ్' కావాలంటే బయటనుంచి కొనుక్కు తీసుకెళదాం. ఐ డోంట్ మైండ్ - దానికి నా అభ్యంతరం లేదు."

ఆయన ఆశ్చర్యంగా చూస్తున్నారు.

"యు నో" అని ఏదో చెప్పబోయారు. మాటరాలేదు. కాస్త సర్దుకుని మళ్లీ అన్నారు. "సీ - నా అంతట నేనే యీ రోజు మీ యింట్లో భోజనం చేస్తానని

చెబుదామనుకున్నాను. ఆ రోజు నువ్వు ఫోంచెయ్యమంటే - వుండకుండా వెళ్లిపోయానే అందుకే ఈరోజు నా 'మినీ బార్' వెంట తీసుకొచ్చాను. నేను రెండు రోజులుగా ఎలానో వున్నాననికదూ అన్నావు. ఆ రోజు రాత్రి యింటికెళ్లి దాంతో పెద్ద దెబ్బలాట వేసుకున్నాను. మనసంతా చెడిపోయింది - - -."

"ఓ - అయామ్ సారీ" అన్నాను. ఈయనతో నేను అన్ని విషయాలూ చెప్పనూలేదు, చెప్పినవేమో చాలా జాగ్రత్తగానే చెప్పాను. అయినా కూడా - అందువల్ల యింట్లో కలహాలు రేగాయి అని తెలుసుకోగానే - నేను తప్పు పని చేశానని గ్రహించుకున్నాను.

"నో నో నీ తప్పేంలేదు. తనెదో పెద్ద జాగ్రత్త గలదానిని అనుకుంటుంది." కోపం ఎక్కువయి ఇంగ్లీషులో మాటలొస్తున్నాయి. కోపంగా అంటున్నారు.

"అందరూ యీవిడకు అణిగి మణిగి వుండాలిట. వృత్తి అడవి మనిషి - మోటు సరుకు. మంజు డ్రస్సులన్నీ మూటగట్టి దాచేసి, దాన్ని అమ్మమ్మలాగా చీరె కట్టుకోమంటోంది. నాకు యీ చీరెలు యిష్టంలేదు. ఐ సెడ్ స్టాప్ దిస్ నాన్‌సెన్స్! అనవసరంగా ప్రతి విషయంలోనూ తల దూర్చకు, మంజు నా కూతురే దాని యిష్టం వచ్చినట్లు అది వుంటుంది. నీకు నచ్చకపోతే ఎక్కడి కయినా పో. ఇది నా యిల్లు అని. అదో పెద్ద జంతువు. నేను చెప్పింది కొంచెం కూడా అర్థం చేసుకోలేదు" అన్నారు.

"మంజుకున్న అండర్‌స్టాండింగ్ మీకు లేదుకదా. ఈ విషయానికని మీరు దెబ్బలాట వేసుకుంటారని తెలుస్తే - అసలు చెప్పివుండేదాన్నే కాదు. పద్మకూడా ఒక తల్లే. ఆ విషయం మీరు మర్చిపోతున్నారు. పద్మ కూడా ఒక తల్లేనన్న విషయం మీరు అర్థం చేసుకుని వుంటే యింత కోపం వచ్చి వుండేది కాదు. ఈ కాలం పిల్లలని ఒక కంట కనిపెట్టి వుండటం చాలా మంచిది. వాళ్ల వేషాలు చూస్తుంటే ఏ తల్లికయినా కాస్త భయమో! సందేహమో వస్తూనే వుంటుంది" అన్నాను నిదానంగా.

"సో - పద్మ చేసింది రైటు. చాలా మంచిపని చేసింది అంటావు - అవునా -" అంటూ వురుముతూ చూస్తున్నారు. నేను నవ్వుకున్నాను. ఈయన నామీద కోప్పడుతున్నారు. అది యింకా బావుంది.

"సరి. ఇక్కడ తప్పు ఒప్పులు ముఖ్యంకాదు. కూతురు బాగోగులు కనుక్కొని, అదుపులో పెట్టుకోవడం మంచిదే కదా! మీదగ్గర కొచ్చిమంజు 'అమ్మ నన్ను కష్టపెడుతోంది' అని మొరపెట్టుకోలేదు గదా! నాతో చెప్పినపుడు కూడా 'మా అమ్మకు తెలిసిందింతే అని ఎంతో సానుభూతితో అర్థం చేసుకు చెప్పింది' అన్నాను.

"తల్లి పిల్లలని దండించి అదుపులో పెట్టుకుంటే తప్పులేదు. అదే మొగుడు పెళ్లాన్ని కేకలేసి అదుపులో పెట్టుకుంటే అన్యాయం. అలా దండించే హక్కు ఆ మొగుడికి లేదు. నేను వుత్త బొమ్మని – పేరుకు మటుకు యజమానిని. అంతా అవిడగారికే తెలుసు. ఈ యింటికి అయిన మనిషి తనే ఇదంతా నాఖర్మ - - -" అంటూ వాపోతున్నారు.

పద్మని డబాయిద్దామని చూసివుంటారు. ఏం లాభం లేకపోయివుంటుంది. ఓడిపోయి వచ్చి వుంటారు. ఈ విషయం గుచ్చి గుచ్చి అడగడం బాగుండదని మాట్లాడకుండా వూరుకున్నాను.

"కాఫీ తాగి వెళదామా ?" అని అడిగారు.

"ఇంటికెళ్లి తాగుదాం. ఇంటికెళ్లి బట్టలు మార్చుకుని, కాఫీ తాగి ఎక్కడికయినా డ్రైవ్‌కి వెళ్దాం" అన్నాను. ఇలానే నెక్కడికయినా వెళదామంటే ఆయనకి పరమానందమయిపోతుంది.

"మనం బయట తినకూడదా ?" అని అడిగారు.

"వద్దు. ఇంట్లోనే వండుతాను. అయిదు నిముషాల్లో వండేస్తాను. మీకు కావాలంటే 'నాన్ వెజ్ – డిషెస్' మటుకు బయట కొని తెచ్చుకుందాం. ఒ. కె." అని కావాలనే వుత్సాహంగా అన్నాను.

ఇంతసేపటి నుంచీ వున్న మూడ్‌లోంచి బయటపడి, చిన్నపిల్లవాడిలాగా 'ఒ. కె.' అని వుత్సాహంగా వొప్పుకున్నారు.

ఇంటికొచ్చాము. ఈయన హాల్లో కూచునివున్నారు. నా గదిలోకికూడా వెళ్ల కుండా కాఫీకాచడానికి వంటింట్లోకి వెళ్లాను. హాండ్‌బాగ్ హాల్లో సోఫాలో పడేశాను. గబగబా ఆయనకి కాఫీచేస్తున్నాను. పాపం మధ్యానం అన్నం తినలేదనుకుంటా.

"బిస్కట్సు తింటారా ?" అడిగాను.

"నో థాంక్సు"

ఏం ప్రశ్న. 'తింటారా ?' అని.

ఒకపళ్లెంలో బిస్కట్సు, గ్లాసులో మంచినీళ్లూ తీసుకెళ్లి - ఎదురుగాపెట్టి "తినండి మిమ్మల్ని చూస్తుంటే నాలుగు రోజులనుంచీ వుపోషాలున్నట్లు కనిపిస్తున్నారు. ఎందుకిట్లా వొళ్లు పాడుచేసుకుంటున్నారని ?"

ఈయన ఒక బిస్కట్ తీసుకుని నవ్వుతూ : "నామీద నీకు వున్న యిష్టం చేత ప్రతీదీ ఎగ్జాజరేట్ చేసి చూస్తున్నావు. అయామ్ ఆల్ రైట్. నేను రెండు పూట్లా తింటూనే వున్నాను" అన్నారు.

"అబద్ధం" అని బదులుచెప్పి వంటింట్లోకి వెళ్లిపోయాను. ఇప్పుడు వంట తేలిగ్గా అయిపోతోంది. పాలుమరగబెట్టి యీ పొడి రెండు స్పూన్స్‌వేసి కలుపుతే కాఫీ రెడీ. అమ్మయితే గింజలు వేయిస్తుంది. ముందు గింజలు వేయిస్తుంది. ఆపైన 'గర గర' అంటూ మిషన్‌లోపోసి తిప్పి పొడుంచేసి, ఆ తరువాత ఫిల్టరు వేస్తుంది. ఒక కప్పు కాఫీ తాగడానికి యింత చాకిరీ. ఆ కాఫీకీ యిదే రుచిగదా! గబగబా పనులు జరగాలంటే, యిలాంటి సౌకర్యాలు వుండాలి.

ఈయనకి కాఫీయిచ్చి, నేను మొఖం కడుక్కు, బట్టలు మార్చుకునేందుకు లోపలికి వెళ్లాను. ఇలా ఒక మొగవాడు తోడుగా వున్నాడంటే, నాకేమిటో కొండంత ధైర్యం వచ్చింది.

ఈయన యీరోజు యిక్కడే తాగి భోంచేసి వుండిపోతారా? వుంటే ఏమవుతుంది? నాకు యీయన దగ్గిర నిర్భయం. ఈరాత్రి యిక్కడే వుండిపొమ్మంటే? నిండా మునిగినవాడికి చలిఏమిటి? ఈరాత్రి యిక్కడ వుండిపోతే యీయన ఎక్కడ పడుకుంటారు? ఎక్కడ పడుకోమనను? మామయ్య పరుపు జ్ఞాపకం వచ్చింది. ఆ పరుపుమీదా? ఛీ – ఆ పరుపు తలుచుకుంటేనే జుగుప్సగా వుంది. ఈయన అపక్కమీద పడుకోనవసరం లేదు. నా మంచంమీద పడుకోమని చెబుతాను. నేను చాప పరుచుకుని హాల్లో పడుకుంటే సరిపోతుంది.

చూద్దాం రాత్రి భోజనాలు అయాక ఈయన ఏమంటారో చూస్తాను. వెళ్లిపోతానని అంటే అడ్డుచెప్పను. ఆయన ప్రోగ్రామ్ చెడగొట్టడం న్యాయంకాదు. వెళ్లమంటాను.

డ్రస్ వేసుకుని బయటకొచ్చాను.

"యు లుక్ ఫైన్"

"థాంక్యూ - వెళదామా?"

ఇల్లు తాళంబెట్టి కారులోకొచ్చి కూచునేలోపల, వీధివీధంతా మమ్మల్ని చూసేవుంటారు.

మంజుగురించి చెపుతున్నాను. ఆపిల్ల మనోభావాలు, ఆ అమ్మాయికి చదువు పట్లవున్న ప్రీతి, తల్లి మాటమీద నున్న గురి యివ్వన్నీ చెబుతూ ఆ అమ్మాయిని మెచ్చుకున్నాను. మంజు విషయంలో యీయన పద్మతో తగాదా పడకూడదనే వుద్దేశ్యంతో యీ ప్రస్తావన మళ్లీ ఎత్తాను. నేను చెప్పే అన్నిటికీ అర్థం అయినట్లు తలవూపుతున్నారు. అన్నిటికి 'వూ' అనే జవాబే. నేను నవ్వుతే తనూ నవ్వుతున్నారు. కాని నవ్విన కాసేపటికి ఆ ముఖంలో విషాద ఛాయలు, నల్లని మబ్బువంటి ఒకభావం ఆ ముఖాన్ని కప్పేస్తోంది. అది చూసి నా మనసు కళవెళ పడుతోంది.

బీచిలో ఎప్పుడూ ఆగేచోటనే కారు ఆపారు. అయిస్‌క్రీమ్ పిల్లవాడు వస్తున్నాడు.... ఈయన పిలిచి అయిస్‌క్రీమ్ కొంటారు. ఎక్కడో దూరంలోకిచూస్తూ సిగరెట్ పొగ పీలుస్తూ, అయిస్‌క్రీమ్‌వాడి కేక వినుపించుకోనంత ఆలోచనలో నిమగ్నమై వున్నారు.

"అయిస్‌క్రీమ్ కొందామా ?" అడిగాను.

"ఓయస్ - ఇదిగో అబ్బాయి. రెండుకప్పు పిస్తా - రెండుకప్పు వెనిల్లా" చాలా వుత్సాహంగా తీసుకున్నారు. ఇది నిజమైన వుత్సాహంకాదు, ఇది నటన అని నా మనసుకి తోచింది.

ఈయనతో కలిసి నేనూ చాలా యిష్టంగా అయిస్‌క్రీమ్ తిన్నాను. నేను యిలా యిష్టపడటం కూడా అబద్ధమేకదా! ఇదీ ఒకవిధమైన నటనే! ఈయన నాకోసం నటిస్తున్నారు. నేను ఆయనకోసం నటిస్తున్నాను. ఈయన మనసుకి ఏదో తీవ్రమైన దెబ్బతగిలింది. ఆ దెబ్బ యీయన్ని గుచ్చి – గుచ్చి బాధిస్తోంది – అని నా మనసు గ్రహించుకుంది. కాని ఎలా అడగను? ఏమని అడగను? అడిగితే ఆయన చెప్పాలని ఎక్కడవున్నది? చెప్పదలుచుకుంటే - నేను అడక్కుండానే చెపుతారు. మనసులోని ఆ బాధని మర్చిపోదామని, నాతో కాసేపు మాట్లాడేందుకు వచ్చివుంటారు. తిరిగి అదే ప్రస్తావన ఎత్తి ఆయన్ని నేనెందుకు బాధించాలి? ఎంత సరిపెట్టుకున్నా – నేను ఆగలేకుండా వున్నాను. ఆయన యిలా వుండటం నేను ఎప్పుడూ చూడలేదు. ఒకవేళ వంట్లో బాగాలేదా?

మనసు రకరకాల ఆలోచనలతో సుళ్లుతిరుగుతోంది. అయినా నోరుతెరిచి అడగలేకపోయాను.

అయిస్‌క్రీమ్ తినడం అయిపోయింది. ఆ కాళ్లీ డబ్బా ఎలా పారేస్తారో చూద్దామని ఆగాను. సాధారణంగా ఆ డబ్బాని బంతిమాదిరి పైకి విసిరి, రెండో చేత్తో బాటులాగా కొడతారు. ఇది ఆయన అలవాటు.

కాని ఈరోజు అలా విసరలేదు. మామూలుగా అందరూ చేసినట్లే, అయిస్‌క్రీమ్ తిన్నాక ఆ కప్పు పక్కన పడేశారు. ఈయన మనోస్థితి ఆ కప్పు అలా పడెయ్యడంలోనే తెలిసిపోయింది. ఆయనకి కన్నీళ్లు వస్తున్నాయి.

"ఆర్ యు నాట్ వెల్ ?" అడిగాను.

ఆయన బదులు చెప్పకుండా నావైపుకి చూస్తున్నారు - నవ్వుతున్నారు. ఆ నవ్వులో దుఃఖంవుంది, సంతోషంలేదు. దుఃఖంతో నవ్వుతున్నారు. ఆ నవ్వు నా హృదయాన్ని పిండుతోంది. ముక్కలుగా కోస్తోంది.

"లైఫ్ యీజ్ నాట్ వర్త్ లివింగ్. ఈ జీవితం జీవన యోగ్యం కాదు" అన్నారు గభాలున.

"వాట్ డు యు మీన్? ఏమిటి అంటున్నారు" అని అడిగాను.

"ఐ వాంట్ టు డై.. నాకు చచ్చిపోవాలనివుంది" అని ఆయన అంటుంటే నా వొళ్లు గజగజ లాడిపోయింది.

"ప్లీజ్ - ఏం జరిగింది? నాతో చెప్పరూ" అని వేడుకుంటున్నాను.

"అయామ్ సారి" అంటూ నా చెయ్యి పక్కకు నెట్టి కొంచెంసేపు నన్ను వంటరిగా వుండనీ. లీవ్ మి ఎలోన్ అంటూ చాలా జాలిగా అర్థిస్తున్నట్లుగా కారులోంచి దిగి, కొంచెం దూరం నడిచి, ఇసకలో నుల్చుని సముద్రంవైపుకి చూస్తున్నారు. ఈయన ప్రవర్తన కొత్తగావుంది. ఈయన మారిపోతున్నారా? ఇలా మారిపోకూడదు. ఎప్పుడూ చిన్నపిల్లవాడిలాగా – నవ్వుతూ ఆడుతూ వుండాలిగాని యిలా ఏదో పోగొట్టుకున్నట్లు వుండకూడదు. ఈయన మళ్లీ మామూలు మనిషి అవడానికి ఏం చెయ్యను? ఎలా మార్చను. అలాగే కారులో కూచుని యోచిస్తున్నాను.

సముద్రపుగాలికి క్రాప్ చెదిరిపోయి, వెంట్రుకలు అల్లల్లాడుతున్నాయి. చేతిలో సిగరట్ కాలి నుసి అయిపోయి, ఆ నుసి గాలి కెగురుతోంది. కారులోంచి దిగకుండా చాలా సేపటినుంచీ యీయన వీపు చూస్తూ కూచున్నాను. ఎంతసేపు యిలా కూచోను! నేను వెళ్లి ఆయన పక్కన నుల్చుంటాను.

నేను వచ్చి పక్కన నుల్చున్నట్లు తెలిసింది కాబోలు. నావైపుకి తిరగకుండానే "ఇంటికెళ్లిపోదాం. ఐ వాంట్ టు డ్రింక్" అన్నారు.

## 27

నాకు విపరీతమైన భయం పట్టుకుంది. ఈయన కోపంగానూ, బాధతోనూ వున్నారు. అందుకనే యిదివరకు నేనెప్పుడూ చూడని విధంగా వున్నారు. ఈ మాదిరి మానసిక సంఘర్షన ఆయనలో నేనెప్పుడూ చూడలేదు. తన మనసులో బాధని నోరు తెరిచి చెప్పకుండా, నాతోనన్నా చెప్పుకోలేక తనలో తను కుమిలి పోతున్నారు. ఈ స్థితి నుంచి నేనెలా పైకి లాగను? ఈయనకి నేనేవిధంగా తోడ్పడగలను? ఏం చేస్తే యీ బాధ తగ్గుతుంది? హౌ కెన్ ఐ హెల్ప్ హిమ్.

కారులోకి వచ్చి కూచుని మరో సిగరెట్ ముట్టించారు. నావంక చూసి నవ్వుతూ - "అయామ్ సారి టు స్పాయిల్ యువర్ యీవెనింగ్" అన్నారు. నా యీ సాయంకాలన్ని తన ప్రవర్తనతో చెడగొట్టినందుకు బాధ పడుతున్నారట.

"దీనికంత ఫార్మాలిటీసా? మీరేదో చాలా బాధ పడిపోతున్నారు. ఇలాంటప్పుడు మీ పక్కన వుంటే మీకు మనశ్శాంతిగా వుంటుంది. కాని మీతో ఎలా మాట్లాడి వూరుకోపెట్టాలో నాకు తెలియడం లేదు. ఏం చేస్తే మీ బాధ తగ్గుతుందో అన్నది కూడా తోచడంలేదు. నేనిల్లాంటివి నేర్చుకోలేదు. ఐ హావ్ నెవర్ బీన్ ఎ గుడ్ కంపెనీ ఫర్ ఎ మాన్. మొగవాడికి తోడు నీడగా వుండి అనునయించడం నాకు చేతకాదు" అని నోటి కొచ్చిందంతా అంటున్నాను.

"డోంట్ బాదర్. ఐ విల్ బి ఆల్ రైట్. ఖంగారు పడకు" అంటూ నన్ను సముదాయించి విజిల్ వేస్తూ - మామూలుగా వుండటానికి ప్రయత్నిస్తున్నారు.

"ఏదన్నా సినిమాకి వెళదామా?" అని అడిగాను.

"ఏం సినిమా?"

"మీకు నచ్చే సినిమాకి దేనికన్నా వెళదాం. ఏదన్నా ఇంగ్లీషు సినిమాకి వెళదాం. మీకు కాస్త విశ్రాంతిగా వుంటుంది. ఏమంటారు?"

"వొద్దు ఆ హాల్లో కూచుని సినిమా చూడలేను. వినుగు పుడుతుంది. నీకు వెళ్లాలని వుంటే చెప్పు వెళదాం. నన్నడిగితే – నవ్ అయామ్ వెరీ మచ్ యిన్ నీడ్ ఆఫ్ డ్రింక్"

అవునవును తాగాలని యీయన ముందే చెప్పారు. అది మర్చిపోయి సినిమా డ్రామా అంటూ పట్టుకున్నాను. ఈయన్ని ఎలాగైనా ఆ మూడ్‌లోంచి తప్పించాలనే తాపత్రయంలో నాకు మతిపోయింది.

ఇంటి వైపుకి కారు తిప్పుతున్నారు.

"వుండండి మౌంట్‌రోడ్‌కి వెళ్లి మీకేదన్నా 'నాన్ వెజ్' తీసుకుందాం" అంటూ జ్ఞాపకం చేశాను.

"ఇట్ యీజ్ ఆల్‌రైట్ - నాకిప్పుడు ఏం తినాలని లేదు" అన్నారు.

"నో - యు షుడ్ యీట్ వెల్. ఖాళీ కడుపుతో తాగకూడదు. మీరేదన్నా తింటేగాని తాగడానికి వీల్లేదు. టైము చాలావుంది. కారు తిప్పండి" అంటూ బలవంతం చేశాను. ఎదురు చెప్పలేక కారు వెనక్కి తిప్పారు.

వరసలు వరసలుగా కార్లు నిలుచుని వున్నాయి. ఆ ముస్లిమ్ హొటల్‌కి ముందుగా రెండు కార్లకి మధ్యగా తీసుకెళ్లి యీ కారుని నిలిపేదాకా నేను యీయన్ని గమనిస్తూనే వున్నాను. తల యిటూ అటూ తిప్పకుండా సూటిగా రోడ్డు వైపే చూస్తూ కారు నడుపుతున్నారు. ఆ ముఖంలో మళ్లీ విషాదయ ఛ్ఛాయలు. . .

వెయిటర్ వచ్చి సలామ్ చేశాడు.

వాడి దగ్గిర ఏవిటేమిటో చెప్పి, ఒక ప్లేటు తీసుకురమ్మన్నారు. తరువాత ఇడియాపం కూడా తెమ్మని చెప్పి, నా వైపుకి తిరిగి అన్నారు.

"ఇప్పుడెళ్లి నీకుమటుకు ఏం వండుకుంటావ్? నువ్వు కూడా యిడియాపం తీసుకో, ఇది వెజిటేరియన్ డిష్షే. సేమ్యాలేదూ - దాంతో చేస్తారు. ఒక డజను పట్టుకురాప్పా. క్విక్ - క్విక్" అంటూ వాణ్ణి తరిమికొట్టారు.

"ఇంట్లో మిల్క్ వుందా?"

"ఎస్. వుంది"

"ఇడియాపం మీద పాలూ చక్కెరా వేసుకుతింటే చాలా రుచిగా వుంటుంది. మా మంజు ఒకటిన్నర డజన్లు కొట్టేస్తుంది" అంటూ మంజు గురించి యోచిస్తున్నట్లు ముఖం పెట్టారు. మళ్లీ ఆ ముఖంలో నల్లని ఛాయలు - - - - - కళ్లు ఆరుస్తున్నారు.

ఇకమీదట నా అంతట నేనుగా యీయన్ని ఏ విషయం ప్రశ్నించకూడదని నిశ్చయించుకున్నాను. తన మనసులో బాధని యీయన నాతో చెప్పుకుంటారనే నమ్మకం కలుగుతున్నది. లేకపోతే ఇంత మనక్షోభతో నన్ను చూడటానికి ఎందు కొస్తారు? నాతో కలిసి భోంచేసే వుద్దేశ్యంతోనే కదా సామాగ్రి వెంట బుచ్చుకుని మరీ వచ్చారు. తన కష్టాలని నా ముందు వెళ్లబోసుకుని, తేలిక పడదామను కుంటున్నారు. తనంత తానే బయట పడతారని, మాట్లాడకుండా బయటకు చూస్తున్నాను.

కార్లో కూచునే - కొందరు చేతుల్లో ప్లేట్లు పెట్టుకు తింటున్నారు. అందులో ఒకావిడ బొమిక కాబోలు తీసుకుని చీకి చీకి తింటోంది. ఇలా ఎందుకు చప్పరిస్తారో? దానిలోపల గుజ్జు వుంటుందా? చప్పరించి చప్పరించి బయట పారేసింది. దీని కోసం కాచుకునివున్న రెండు మూడు కుక్కలు ఎగబడి, ఆ బొమిక కోసం కాట్లాడుకుంటున్నాయి. చేతిలో కర్రతో అక్కడే తిరుగుతున్న కాపలావాడు ఒక్కటి అంటించి, ఆ రెంటినీ తరిమికొట్టాడు.

తెల్లని యూనిఫారమ్‌లో, చేతిలో ట్రే పుచ్చుకుని, పైన తెల్లని బట్టో పేపరో కప్పి ఏడెనిమిది మంది వెయిటర్స్, సప్లయి చేస్తూ, కార్ల చుట్టూ బొంగరాల్లాగా తిరుగుతున్నారు. రేడియోలోంచి సినిమా పాట వినిపిస్తోంది. ఎదురుగుండా తమల పాకుల కొట్లో, పళ్లెంలో బీడాలు గుండ్రంగా అందంగా పేర్చిపెట్టారు. ఆ కిళ్లీలు చూస్తుంటే నోరు వూరుతోంది. సిగరెట్టు పొగ చుట్టబెడుతోంది.

ఈయన ఏం చేస్తున్నారోనని లోపలికి చూశాను. స్టీరింగ్‌కి ముఖం ఆన్చుకుని వొంగి కూర్చున్నారు.

"నిద్ర పోతున్నారా?" నెమ్మదిగా చేతిమీద తడుతూ అడిగాను.

"నో" అంటూ తలఎత్తారు.

నేనిప్పుడంతా యీయన్ని తరుచు ముట్టుకుంటూనే వున్నాను. తలుచుకుంటే నాకే ఆశ్చర్యంగా వుంటుంది. ఈయన్ని తాకి మాట్లాడుతున్నపుడు అదేదో పరాయి వ్యాడిని తాకినట్లు, ఎబ్బెట్టుగా అనిపించడంలేదు. పరాయి పురుషుణ్ణి తాకుతున్నాననే భావమే కలగడం లేదు.

కాని ఈయన మటుకు నన్ను ఒక్కసారి కూడా ముట్టుకోలేదు. చనువుగా మీద చెయ్యి వెయ్యనూ లేదు అన్న విషయం నా కిప్పుడే తట్టింది. అలా ముట్టుకోవడం తప్పనుకున్నారా? అందరూ ముట్టుకునే మాట్లాడరు. కొందరికా అలవాటు వుండదు.

ఆడది మొగవాడిని తాకితే అంత తప్పా? అసహ్యం కూడా అనిపించదు. అదే పురుషుడు స్త్రీని ముట్టుకుంటే ఎలాగో వుంటుంది. చాలా బాగుంది. ఇలా ఆలోచించడం అన్యాయం.

ఈయనతో తప్ప యితరులతో యింత ఫ్రీగా, ముట్టుకు మాట్లాడలేను. అందు చేతనే ఈయన నన్ను ముట్టుకున్నా తప్పులేదనిపిస్తోంది.

ఆ వెయిటర్ ఈయన ఆర్డరిచ్చినవి కాబోలు అన్నీ తీసుకొచ్చాడు. సో క్విక్.

బిల్లు చూశాను. తొమ్మిది రూపాయల చిల్లరయింది. పదకొండు రూపాయలు తీసి వాడి చేతులో పెట్టి, తెచ్చిన పొట్లాలన్నీ వెనక సీట్లో పెట్టించి, కారు స్టార్టు చేశారు. ఆ డబ్బాలో ఏదో 'లిక్విడ్' లాటిది వుంది.

"అది తొణికిపోతుందేమో. చేతులో పట్టుకుంటాను" అని అడిగాను.

"ఛీ ఛీ - ఏం చిందదు. ఒకవేళ చిందితే రేపు తుడుస్తారు లేద్దూ."

"మీ కారులో చింది పడిపోతుందని కాదు. మీకు తింటానికి వుండదేమోనని అంటూన్నాను"

ఇంటి కొచ్చాక కారుని కొంచెం పక్కగా నిలిపారు. మా యింటి కాంపౌండ్ లోపలికి కారు రాదు. కారు నిలుపుకునే స్థలమూ లేదు. అందుచేత కారు వీధిలోనే గేటు పక్కగా నిలుపుతూంటారు. కారు దిగి తలుపు తాళం తీసి, నేను వెనక్కి తిరిగేసరికి, పొట్లాలన్నీ పట్టుకు వస్తున్నారు.

"నా చేతి కివ్వండి నేను పట్టుకుంటాను" అని అడిగితే యివ్వనన్నారు" ఈ పైన వున్న పొట్లం మటుకు తీసుకో. అది నీది. మిగతావి నువ్వు ముట్టుకోకూడదు" అన్నారు ఇప్పుడర్థమయింది నాకు.

"ముట్టుకుంటే ఏం పోయింది? అలవాటు లేదు కాబట్టి వాటిని తినను. చేత్తో ముట్టుకోకూడదు, కళ్లతో చూడకూడదు - అని ఎక్కడా లేదే! అలా అయితే యీ పొట్లం మటుకు నేను తినచ్చా?" అని అడిగాను. ఆయనతో వాదులాడటం నాకు యిష్టంగా వుంటుంది.

అన్ని పాకెట్లూ తీసుకొచ్చి టీపాయ్ మీద పెట్టి, కారు దగ్గిర కెళ్లి, కారులోంచి చిన్న సూట్‌కేసులాంటి నల్లపెట్టె పట్టుకొచ్చారు.

ఓహో - ఇదే కాబోలు ఈయన చెప్పిన 'మినీ - బార్' - అంటే...

ఆ పెట్టె తెరిచారు. లోపల ధగ ధగ మెరుస్తూ ముఖమల్ లైనింగ్ వేసివుంది. చక్కటి రెండు గ్లాసులూ - తరువాత ఒక వైన్ సీసా. ఏదో విస్కీ - పచ్చ సీసా మీద నలుపూ తెలుపూ రంగుల్లో దెబ్బలాడుకుంటున్న రెండు కుక్క పిల్లలు. బ్లాక్ అండ్ వైట్.

అదిగూడా తీసి బయటపెట్టారు. మొదట్లో విడిగా తీర్థంలాగా కొద్దిగా ఆరంభించారు.

"వై - డోంట్ యు జాయిన్" ఈయనకున్న ధైర్యానికి ఆశ్చర్యపడుతున్నాను. నన్ను కూడా తనతో కలిసి తాగమంటున్నారు.

"నన్ను కూడా మీలాగా అవమంటున్నారా ?" అని ప్రశ్నించాను.

"నెవర్ - నువ్వెప్పుడూ నాలాగా అవకూడదు. అవవుకూడాను. నేను ఎలాగూ గుడ్ ఫర్ నథింగ్‌ని. ఎందుకూ పనికిరానివాడిని. ఓ కే. లీవ్ యిట్. ఆ విషయం వదిలెయ్. విల్ యు డు మి ఎ హెల్ప్. నాకోసాయం చేస్తావా ?" అని అడిగారు.

"ఒక చెంబుతో మంచి నీళ్లు తెచ్చిపెట్టు" అన్నారు,

అప్పుడుగాని నాకు జ్ఞాపకంరాలేదు. ఈయన వాళ్లింటో తాగుతున్నపుడు చూశాను. సోడా కలుపుకుని తాగుతూంటారు. ఆ విషయం మర్చిపోయాను.

"ఒక్క క్షణం! వుండండి. పక్కనే కొట్టుంది. నేను వెళ్లి సోడా సీసాలు పట్టుకొస్తాను" అంటూ లేచాను.

"ప్లీజ్ - గంగా వద్దు. సోడా అక్కరలేదు నీళ్లు చాలు. నేను చాలాసార్లు నీళ్లు కలుపుకు తాగుతూంటాను. పీజ్ డోంట్ బాదర్. సిడవున్. కూచో" అంటూ లేచి వచ్చి నాదారికడ్డంగా నిలుచుని కోపంగా చూస్తున్నారు.

ఈయనకి కావలసినవి సమకూర్చలేకపోయానని కష్టంగావుంది.

ఈయన ఇంగ్లీషులో కాస్త ఘాటుగానే అన్నారు. "ఒక తాగుబోతుకి నువ్వెళ్లి సోడా పట్టుకొస్తావా ? అది కూడా యింత రాత్రివేళలోనా ?"

"ఏమంటున్నారు - వివరంగా చెప్పండి" అని అడిగాను.

నా వంక సూటిగా చూస్తున్నారు. కనుకొలకులు ఎర్రబడ్డాయి. నుదురు చిట్లించి చూస్తున్నారు.

"ప్లీజ్ - నాపై ఇంత ప్రేమాభిమానాలు కురిపించి - నన్ను కించపరచకు. నాకు వాటిని పొందే అర్హతలేదు."

"తాగకుండానే వాగుడు మొదలుపెట్టారే" అని నవ్వులాటకింద కొట్టేసి, లేచి వంటింట్లోకి వెళ్లాను.

స్టీలు బిందె ఒక్కటే మాయింట్లో వున్న పెద్ద సామాగ్రి. మిగతావన్నీ చిన్నచిన్న గిన్నెలు. మరో పెద్ద గిన్నెలో పాలున్నాయి. దేంతో తీసుకెళ్లను. అని యోచిస్తుంటే - వాటర్ జగ్ కళ్లబడింది.

జగ్‌తో నీళ్లు తీసుకెళ్లి పెట్టాను.

"ఐ ప్రిఫర్ రా" అంటూ గాజుగ్లాసులో కొంచెంగా పోసుకుని, రెండు వేళ్లతో గ్లాసు పట్టుకుని, అదేతో తీర్థంలాగా గబుక్కున ఒక్కసారి గొంతులోకి పోసేసుకున్నారు.

గుప్‌న వాసనొచ్చింది.

ఆ సీసాని చేతిలోకి తీసుకుని వాసన చూశాను. అమ్మో! ఆఘాటుకి నా ముక్కు కాలినట్లు మండిపోయింది. స్పిరిట్‌లాగా ఘాటుగావుంది. ఇటువంటి నిప్పుని తాగుతుంటే, లివర్ ఏమైపోతుంది.

"తింటానికేమైనా యిమ్మన్నారా? ఆ పొట్లం విప్పుతాను" అని అడిగాను.

"డోంట్ యిమాజిన్ థింగ్స్ - నాకేం ఫరవాలేదు. నువ్వేదో లేనిపోనివి వూహించుకుని భయపడకు. ఏదన్నా ఖబుర్లు చెప్పుకుందాం. ఐ వాంట్ గో వెరీ స్లో.... అందుకే నీళ్లు తెచ్చి పెట్టమన్నాను' అంటూ సిగరెట్ ముట్టించారు.

"మీరు నాకు తాగమని సలహాయిస్తున్నారా? అని అడిగాను.

ఒక్క క్షణం నావంక తేరిపారచూశారు. "నాలాగా మటుకు నువ్వు అవకూడదు. ఎప్పుడైనా సరదాకి రుచిచూస్తే తప్పులేదు. నథింగ్ రాంగ్ యిన్ యిట్."

"అల్లాగే గదా అందరూ ఆరంభించేది" అడిగాను.

"యు ఆర్ రైట్. అలాగే ఆరంభంలో అనుకుంటాం. బెటర్ యూ డోంట్ టచ్ దిస్. నువ్వు దీన్ని ముట్టుకోకుండా వుంటం మంచిది" అని చెప్పి సీసా తీసి పక్కగా పెట్టుకున్నారు.

"ఈ రోజు నేనూ రుచి చూస్తా" అన్నాను నేను.

"నో ప్లీజ్ - డోంట్" అంటూ తాగుతున్నారు. ఈయన బెదిరిపోయి తాగుతుంటే నేను నవ్వుతున్నాను.

"ఊరికే నవ్వులాటకన్నాను" అని ఆయన్ని వూరుకోబెట్టాను.

కొంచెంసేపు యిద్దరం నిశ్శబ్దంగా వున్నాము. ఏవో ఏవో ఆలోచనలు వస్తున్నాయి. మనసులో ఏదో చెప్పరాని భయం కలుగుతోంది. 'నేను ఈయన్ను లాక్కుని వస్తున్నాను. ఒకవేళ ఆయనే నన్ను లాక్కునిపోతే. ఆపైన నేను తాగడం మొదలుపెడతానా?' అన్న పిచ్చిపిచ్చి ఆలోచనలు నాలో పరుగెత్తుతున్నాయి.

"నేను తాగేరోజుగాని, తాగవలసిన అవసరంగాని రెండూ రాకూడదు" అన్నాను.

ఈయన ఇంగ్లీషులో అంటున్నారు. "నాకు జీవితం మీద విరక్తి పుట్టింది. ఇట్ హాస్ బికమ్ స్టేల్. విసుగ్గా వుంటోంది. నాకు అంతా సూన్యంగా వుంది. దేని మీదా కోర్కెలేదు. జీవితాన్ని పట్టుకువేళ్లాడాలంటే అసహ్యంగా వుంది. ఐథింక్ యిట్ హాజ్ కమ్ టు ఎ నెండ్. నా జీవితం ఒక ధరికి, ఒక పరిసమాప్తికి వచ్చేసింది. నాకు దేన్ని చూసినా ఏవగింపు కలుగుతోంది. ఒకటీ నచ్చటంలేదు. ఒకోసారి పిచ్చి పడుతుందేమో ననిపిస్తుంది. అసలు పిచ్చిపట్టినట్లుగా కూడా వుంటుంది. ఇలాంటప్పుడే కాస్త విశ్రాంతిగా రిలాక్స్ అయినట్లుగా వుంటుంది. నేను అడుగుతున్నాను చెప్పు - నేనెందుకు బతకాలో చెప్పు ? 'ఇంతవరకూ ఎందుకు బతికావ్' అన్న ప్రశ్న రావచ్చు. ఆ ప్రశ్న నాకు నేనే వేసుకున్నాను. ఇంతవరకూ నా ఆనందం కోసం బతికాను. అది ముగిసిపోయింది. ఇకమీదట నాకు దేంట్లోనూ ఆశక్తిలేదు. సంతోషం అంతకన్నాలేదు. లైఫ్ హాజ్ లాస్ట్ యిట్స్ ఛారమ్. ఇప్పుడంతా ఒక రొటీన్.... ఏదో ఒక మిషన్‌లాగా - విసుగ్గా అయిపోయింది. అన్నీ స్థంభించి పోయినట్లు, నా జీవితంలో ఒక స్టాగ్నేషన్ - ఒక స్థబ్ధత ఏర్పడింది" నుదురంతా చెమటతో తడిసిపోయి ధారగా చెంపలమీదకి చెమటకారుతోంది.

లోపలికెళ్లి టవల్ తీసుకొచ్చి యిచ్చాను. అందుకొని పక్కన పెట్టుకున్నారు. నేనే ఆటవల్ తీసుకుని నుదురుతుడిచాను.

"థాంక్యూ" అంటూ నా చేతిలోంచి టవల్ తీసుకుని తనే తుడుచుకున్నారు.

"నేను జీవితంలో ఎంత విసిగిపోయానో అన్నదానికి - ఒక సంఘటన చెపుతాను విను" అంటూ గ్లాసులోంచి ఒక గుక్క తాగారు.

"మొన్న మధ్యాహ్నం రేడియోగ్రాంలో ఒక రికార్డు వేశాను. దాని స్పీడు ముప్ఫై మూడు. దాన్ని డెబ్భై స్పీడుకి మార్చి పెట్టి వినటం మొదలుపెట్టాను. అప్పుడే నాకు బాగుందనిపించింది. లేకపోతే ఈ మామూలు స్పీడు 'డల్'గా వున్నట్లనిపించింది. అట్లాగే యీ మామూలు జీవితం కూడా చాలా చప్పగా, నిస్సారంగా వుంటోంది.

"అదేకాదు. గంగా నిజం చెప్పాలంటే నువ్వు లేకపోతే, నువ్వే తటస్థబడి వుండకపోతే యీపాటికి నేను ఆత్మహత్య చేసుకుని వుండేవాడిని. ఈ జీవితం దేనికి ? మానం, మర్యాద, గౌరవం యివన్నీపోయాక బతికి లాభంమేమిటి ? ఏమి మిగిలిందని బతకాలి ? నువ్వో పిచ్చిదానివి. నన్ను పట్టుకుని ఏడుస్తున్నావ్. అయ్యో - దొరక్క దొరక్క నేనే దొరికానా నీకు...." అని నవ్వుతున్నారు.

ఈయన చెప్పేమాటలు ఎల్లావున్నా, ఆ మాటల ధోరణిబట్టి, యీయన మనో భావాల్ని, బాధని అర్ధం చేసుకోగలుగుతున్నాను.... ఈయన చెప్పే ప్రతిమాటని జాగ్రత్తగా వింటున్నాను.

## 28

ప్రస్తుతం యీాయన సీరియస్ మూడ్‌లోకి వచ్చారు. చాలా బాధ పడుతున్నారు. మనసులో వున్న బాధనంతా నాముందు వెళ్లబోసుకునేటట్లు వున్నారు. కాని నాకు యీాయన్ని యీా స్థితిలో చూస్తుంటే తమాషాగా వుంది. ఇలాటప్పుడు నవ్వడం న్యాయం కాదని, రాబోయే నవ్వుని బలవంతాన ఆపుకుంటున్నాను.

ఈయనా – ఈయన కూచున్న తీరూ.... రెండుకాళ్లూ సోఫాలో పెట్టుకుని, బాసింపీట వేసుకుని కూచునివున్నారు. పాంటు వేసుకుని - మఠం వేసుకు కూచుని వున్నారు. ఇంట్లో అయితే యిలాంటప్పుడు లుంగీ, లూజ్‌గా వుండే సిల్కుదో లినన్‌దో జుబ్బా వేసుకుని, వరండాలో కుషన్ ఛైర్లోనో, పేము కుర్చీలోనో యిలా మఠం వేసుకు తాగుతూంటారు. రాజదర్బారులోలాగా - టీపాయి తీసుకువచ్చి పెట్టడానికి ఒక మనిషి, సోడా సీసాలు తేవడానికి ఒక మనిషి, పిలుస్తే వెంటనే పరుగెత్తుకు రావడానికి తయారుగా ఒక మనిషి, ఈయన తాగుతూ మధ్య మధ్య తింటానికి రకరకాల పదార్థాలు ప్లేట్లో పెట్టుకుని వచ్చి ఒకడు - ఆ వంది మాగధు లందరినీ వదులుకు, మార్చుకునేందుకు వేరు లుంగీ కూడా లేకుండా, ఆ టైటు పాంటుతో... ఆ పాంటు అలా వేసుకుంటే కష్టంగా వుండదుకాబోలు. నాకేమిటో వూపిరి సలపనట్లుగా వుంది. తల తిరుగుతోంది. చెంబులో నీళ్ల అక్కర్లేదు కాబోలు అవి అలానే వున్నాయి. జగ్‌లోని నీళ్ల, నేలమీాద కూచుని తాగినట్లు, సోఫాలో మఠం వేసుకుని, అన్ని సీసాలూ చుట్టూ పరుచుకుని . . . నాకు యిదంతా చూస్తుంటే చాలా గమ్మత్తుగా వుంది.

ఇప్పుడు తీసుకున్న దాంతో నాలుగో గ్లాసు పూర్తి చేసారన్నమాట. సిగరెట్ అంటించి మండుతున్న ఆ అగ్గిపుల్లని చివరిదాకా అలానే పట్టుకుని చూస్తున్నారు. వేలు కాలుతుందేమోనని భయంగా వుంది. చురుక్కుమంది కాబోలు. చురుక్కుమన్నాకనే అగ్గిపుల్లని యాష్ట్రేలో వేసి, కాలిన వేలుని నోట్లో పెట్టుకు చప్పరించారు. వేలు మండుతోంది కాబోలు.

"వేలు కాలిందా?" అని అడిగాను. ఇది బదులు చెప్పాల్సిన ప్రశ్న కాదన్నట్లు నావంక చూస్తూ, ఆ కాలిన వేలుని చూపించి నవ్వుతున్నారు. మొఖంలో మళ్లీ ఆ నల్లని ఛాయలు దోబోచులాడుతున్నాయి.

"దేర్ యీాజ్ నో పర్పస్ యిన్ లివింగ్" అని నావంక చూశారు. "చాలా సంవత్సరాలబట్టీ నాకిల్లాగే అనిపిస్తున్నది. దేనికొరకు జీవిస్తున్నారు? అని ప్రశ్నిస్తే చాలా మందికి ఏం బదులు చెప్పాలో తెలియదనుకుంటా." ఈయన యిదేదో కొత్త విషయం తనొక్కడికే, అందులోనూ యీా రోజే తట్టినట్లు

అడుగుతున్నారు. దీనికి నేనేదన్నా బదులుచెపితే మాటల ధోరణి మరోవైపుకి తిరిగిపోతుంది. ఆయనచేత మాట్లాడించాలనే ఉద్దేశ్యంతో ముఖం సీరియస్‌గా పెట్టుకుని వింటున్నాను.

"వన్ షుడ్ హేవ్ సమ్ పర్పస్ యిన్ లైఫ్. మనిషికి ఒక లక్ష్యం అంటూ వుండాలి. ఒక ప్రయోజనమంటూ వుండాలి. ఎనీథింగ్. అది లేనపుడు మనిషికీ జంతువుకీ మధ్య తేడా ఏముంటుంది? లక్ష్యం అందుకుంటాడా లేదా అన్నది వేరే విషయం. దేర్ విల్ బి నో పర్పస్ యిన్ ఎచీవింగ్ ఎనీ పర్పస్. చివరికి చూస్తూ దేనిలోనూ ఏమీ లేదు అనిపిస్తుంది. ఒక లక్ష్యం అంటూ ఏర్పరచుకున్నాడే అనుకుందాం. అది లభించిన తరువాత, ఆ లక్ష్యం చేరుకున్న తరువాత, అక్కడితో అయిపోయిందా? సో దట్ యీజ్ నాట్ ది పాయింట్.... వెదర్ యు అచీవ్ యిట్ ఆర్ నాట్ - - లక్ష్యాన్ని మనం సాధించామా లేదా అన్నది ముఖ్యం కాదు. బట్ యు షుడ్ హేవ్ వన్. అంచేత ఒక లక్ష్యం అంటూ వుండాలి. గాడిదకు ముందు ఎలుగుబంటిని కట్టినట్లు. ఆ కథ నీకు తెలుసుననుకుంటా" అంటూ నవ్వుతున్నారు.

ఆ కథ నాకు తెలుసు. ఈయన్ని కొంచెంసేపు యిలా మాటల్లో పెడితే సంతోషంగా వుంటారు అని. "నాకు తెలియదే నేనెప్పుడూ వినలేదు. ప్లీజ్" అంటూ అడిగాను.

"మంజుతో సావాసంచేసి నాకు రెండో మంజువి తయారయ్యావు. అదీ యింతే అసలు విషయం వదిలేసి కథలు పట్టుకు వెళ్లాడుతుంది. గాడిదా ఎలుగుబంటీ అని వుదాహరణకి చెప్పాను. అది పట్టుకు నా ప్రాణం తీస్తున్నావు"

"ప్లీజ్ - ప్లీజ్ చెప్పరూ - ఆ కథ నేనెప్పుడూ వినలేదు"

"ఎలుగుబంటిని చూస్తే గాడిద పారిపోతుంది తెలుసా?"

"ఎందుకని?"

"తీసుకెళ్లి సాంబారు కాచుకు తాగేస్తుందని" అంటూ వేళాకోళంచేశారు. అప్పుడనుకున్నాను 'ఎందుకని?' అని ప్రశ్నించి వుండకూడదని.

"ఏదో నర్సరీ క్లాసులోని పాట. ఆ పాట యిప్పుడు జ్ఞాపకం లేదనుకో. అందులో వున్న బొమ్మమటుకు నా కళ్లముందే ఆడుతోంది. ఒక పిల్లవాడు గాడిద వీపు వెనకగా కూచుని వుంటాడు. అతని చేతిలో పొడుగాటి ఒక కర్ర. ఆ కర్రచివర ఒక ఎలుగు బంటి బొమ్మ వేలాడదీసి, దాన్ని ఆ గాడిది ముఖం ముందుగా వేలాడతీస్తాడు. ఆ ఎలుగుబంటిని కరవడానికి గాడిద ముందుకు ముందుకు దూకుతూ వుంటుంది. అదేవిధంగా గాడిద ముందున్న ఎలుగు బంటిలాగా మనిషికి ఒక లక్ష్యం అంటూ వుండాలి. దానికొరకు అతను పరుగెడుతూ వుండాలి. మనిషి గాడిద. లక్ష్యం

ఎలుగుబంటి. పరుగెత్తడమే జీవితం. నాకు యిటువంటి వేమీలేవు. ఎన్నిసార్లో ఆలోచించి చూశాను. నేను దేనికోసం బతుకుతున్నాను అని. యాజ్ ఎ స్టూడెంట్ అయామ్ ఎ మఫ్, యాజ్ ఎ బిజినెస్‌మాన్ అయామ్ ఎ ఫ్లాప్, యాజ్ ఎ హస్బెండ్ అయామ్ అన్‌వర్తీ, యాజ్ ఎ ఫాదర్ అయామ్ అన్‌డిజర్వింగ్. (చదువులో నేను వుత్త బండని, పోనీ వ్యాపారంలో రాణించానా అంటే అక్కడా ఎందుకూ పనికి రాకుండా పోయాను. పోనీ నా భార్యని సుఖపెట్టానా అంటే ఆ విషయంలో నే నుత్తదగాకోరుని, తండ్రిగా కూడా నా భాధ్యతని సక్రమంగా నిర్వర్తించలేకుండా వున్నాను. అసలు తండ్రి అనిపించుకునే అర్హత నాకు లేదు.)

"నేనెంత పతనమయిపోయానో వింటే ఆఖరికి నువ్వుకూడా నా ముఖం మీద తలుపులు మూసేస్తావ్. 'లేచి బయటకి పో' అని విన్న మరుక్షణంలో నన్ను తరిమికొడతావ్. ఒకవేళ అలా అనకండా వుండగలిగావంటే అది నీ మంచితనమే తప్ప నా యోగ్యతమటుకు కాదు."

— ఈయన ఇంగ్లీషులో మాట్లాడుతున్నారు అది తమిళంలో గనక అయితే యిలా వుండివుండవచ్చు అనుకున్నాను.

ఏదో చెప్పబోతున్నారు. చెప్ప ప్రయత్నిస్తున్నారు. కాని చెప్పవలసిన విషయం వదిలి ఏదో మరో విషయంలోకి దిగి మాట్లాడుతున్నారు. ఈరోజు యీయన మాట్లాడే తీరుగాని, అన్న విషయాలుగాని - పూర్వం ఎప్పుడూ నాతో చెప్పలేదు. ఏదో చెప్పాలనే ఆరాటంతో చెప్పబోయే విషయానికి ముందుమాటలాగా చెప్పిన విషయాలనే తిప్పితిప్పి రకరకాలుగా చెపుతున్నారు. ఈయన తన గురించి తనే కొన్ని అభిప్రాయాలు చెప్పుకుంటున్నారు. ఈ చెప్పినవన్నీ ఆయన మనస్ఫూర్తిగా నమ్ముతున్నారా ? ఈయన నమ్మలేదు - నమ్మరుకూడాను. తనలోతను యోచించు కొని, ఏదో బాధతో యీ విషయాలన్నిటినీ పైకికక్కుతున్నారు. తనను అదిలించి సరిదిద్దేవాళ్లు లేకపోవడంచేత, తనని తానే పనికిమాలినవాడనుకుని నిందించు కుంటున్నారు.

"సరి - ఇదంతా యిప్పుడెందుకు ?" అని అడుగుదామని అనుకున్నాను. కాని అడగలేదు. నాకు కడుపులో ఎలకలు పరుగెడుతున్నాయి. పదిన్నర అయింది. ఈయన భోంచెయ్యడానికి యింకో గంటసేపు పట్టేట్లుంది.

"ఏదన్నా తింటారా ?" అని అడిగాను.

"ఆ పొట్లం అందుకో" అని ఒక పొట్లం చూపించారు. అది తీసి యిచ్చి ప్లేటు తీసుకురావడానికి వెళ్లి ఆ చేత్తో నేను కూడా రెండు బిస్కట్లు తెచ్చుకున్నాను. నేను వచ్చేసరికిపొట్లం విప్పి వుంచారు. ఏదో లోపల కాలూ చెయ్యీ పైకి పొడుచుకు

వచ్చి నుల్చునివుంది. మేకపిల్లా ? చూడటానికి ఎల్లాగోవుంది. చక్రాల్లావున్న ఓ రెండు టొమేటా స్లయిసెస్, ఒక నిమ్మకాయచెక్కా, రెండు పచ్చిమిరపకాయలూ - ఇవన్నీ యీయన ఎలా తింటారో చూడాలని ఆశగా వుంది.

"ఇది ఏం మాంసం ?" అని అడిగాను మరి ఏమని అడగను. లేక మేకపిల్లని అడగనా ? మేక మాంసాన్ని మాంసమనేగా అంటారు.

ఆయన దాన్ని చేతిలోకి తీసుకుని వివరాలు చెప్పడం మొదలుపెట్టారు. 'చికెన్.' అవును. కోడి అయితే ఇంకా పెద్దదిగా వుంటుందికదా ! చాలాతాపీగా దాని తల మీద నిమ్మకాయరసం పిండి, ఒక కాలుమటుకు పీకి తీసుకుని, కొరికి తినటం మొదలుపెట్టారు.

ఇప్పుడు నింపుతున్నది ఆరోగ్లాసు. ఇట్లా కొరుక్కుతింటూ తాగుతూ, మళ్లీ తింటూవుంటారా ? నాపికిన్ అడుగుతున్నారు. నేను టవలు తీసియిచ్చాను.

మళ్లీ మాటలు ఆరంభించారు.

"మనం కలుసుకున్న తరువాత మహాఅయితే ఒక పదిసార్లు క్లబ్‌కి వెళ్లి వుంటాను. క్లబ్‌కి వెళ్లడం పూర్తిగా నిలిపి వెయ్యాలని, క్లబ్‌కి వెళ్లడం మానుకోవాలని చాలాసార్లు అనుకున్నాను. ప్రతిసారీ వెళ్లకూడదని నిశ్చయించుకోవడం తీరా సాయింత్రం అయేవేళకి మళ్లీ అక్కడికి వెళ్లడం జరుగుతూండేది. కొన్ని సాయంకాలాలు 'ఈరోజు పేక ఆడను వూరికే వెళ్లొస్తాను' అనుకుని వెళుతుండేవాడిని. అలా అనుకుని వెళ్లే మళ్లీ పేకాటలో కూచుని పోయేవాడిని. మంజుకి, పద్మకి వాళ్లెవ్వరికీ ఇది యిష్టంలేని పని. మిగతా వాటన్నిటికంటే యీ పేకాటంటే వాళ్లకి చాలా కోపం. ఎందుకంటే యిందులో డబ్బు పోతుందిగదా ! పేకాడేవాళ్లని, వాళ్ల వాళ్ల కుటుంబాలలో ఎవరికి వారు మా వాళ్లే వోడిపోయి డబ్బు పోగొట్టుకున్నారు, అని అనుకుంటూంటారు. ఇది తల్చుకుంటే నాకు నవ్వుగా వుంటుంది. అందరూ వోడిపోతుంటే అది 'జూదం' ఎలా అవుతుంది. ఇందులో తమాషా ఏమిటంటే - పేకాటకోసమని యింట్లోంచి పట్టుకొచ్చిన డబ్బు మటుకే బయటకి తెలుస్తుంది. మిగతా యింకా ఎంతెంత పోతున్నదో చాలా మందికి తెలియదు. ఎందుకంటే ఈ గెలుచుకున్న డబ్బు ఎవరి చేతుల్లోనూ వుండదు. ఎవరిల్లదాకా కూడా వెళ్లదు. అదే యీ ఆటలో వున్న అసలు వ్యసనం. 'నువ్వు గెలిచినా సరే - ఓడిపోయినా సరే యీ జూదానికని యింటినుంచి బయటకొచ్చిన సొమ్ము. తిరిగి యింటికి చేరుకోదు' అందుకనే ఆడవాళ్లకి పేకాట అంటే అంత కోపం. అక్కడికొచ్చేవాళ్లందరికీ డబ్బు ఒక సమస్యకాదు. డబ్బు గురించి ఆలోచించే అవసరమూ వుండదు. డబ్బు సాధన కోసం పేకాడతారా ? కంపెనీ కోసం ఆడతారుగాని. మా క్లబ్బే

15

వుంది. ఇట్ యీజ్ నాట్ యీజీ టు గెటిన్. దాంట్లో మెంబరు కావడం తేలికయిన పనికాదు. అందులో వున్నవారంతా లక్షాధికార్లే. వాళ్లందరూ పేకాడదామని పిలుస్తున్నపుడు రాను అని ఎలా అనను? ఇందులో యింకో గమ్మత్తేమిటంటే, యీ లక్షాధికార్లకు యీ డబ్బున్నవాళ్లలో ఒక కాంప్లెక్సు వుంది. 'నా స్వంతం - నా మనిషి, మావాడు' అని. మొదట్లో యీ స్వభావం నా ఒక్కడికే వుంది అనుకునేవాడిని. కాని చూడగా చూడగా యీ లక్షణం డబ్బుగల వాళ్లందరిలో వున్నదని బోధపడింది. వాళ్లదగ్గిరవున్న డబ్బుకీ – వ్యక్తులకీ మధ్య ఎటువంటి సంబంధంలేదని గ్రహించుకోలేరు. డబ్బు నుంచి వ్యక్తిని విడదీసి చూడ లేరు. ఆ డబ్బే గనక లేకపోతే వీళ్లలో చాలామంది ఎంగిలి ఆకులు వూడవడానికి కూడా పనికిరారు. వ్యక్తులుగా అంత హీనస్థితిలో వుంటారు. అసాధారణమైన వ్యక్తులు. ఎందరో - సాహసవంతులు. తీక్షణమైన వివేచనాశక్తి పరిశీలనా దృష్టికలవాళ్లు, మంచివాళ్లు, పట్టుదలగలవాళ్లు - ఎందరో మామూలు సామాన్యమైన కుటుంబాల్లో పుట్టి, తమ అసాధరణమైన తెలివితేటల్ని పెళ్లాం బిడ్డలని పోషించ డానికి, పిల్లలకు తిండీ బట్టా యివ్వడానికి - నిరంతరం శ్రమించి, వ్యయపరచు కుంటున్నారు. అదే యీ డబ్బుగలవాళ్లున్నారే వారు తమ దగ్గిర యీ డబ్బే గనక లేకపోతే - మామూలు సాధారణ మనుషులలాగా పెళ్లాం బిడ్డలని పోషించుకోగల రన్నది కూడా సందేహమే! మా క్లబ్‌లో వున్నవాళ్లందరికీ పెద్ద జెంటిల్‌మెన్ అని పేరు. వీళ్ల జెంటిల్‌నెస్ - వీళ్ల పెద్ద మనిషి తరహా రాత్రి పదిన్నర దాటింతరు వాత అక్కడికొచ్చి చూస్తే తెలుస్తుంది. అంచేతనే ఐ వాజ్ నాట్ హేపీ గోయింగ్ టు ది క్లబ్. అది ఒక హేబిట్ అవడంచేత వెళుతూ వుండేవాడిని. అల వాటు అన్నది లేకపోతే వాడు మనిషే కాదు. 'ఏదో ఒక రోజున యిందులో ఆనందం దొరకకపోతుందా? అందరూ యిందులో ఆనందం వుంటుంది అంటున్నారే' అని తిరిగి తిరిగి ఒకపని చేయగా చేయగా, అది కొన్నాళ్లకి అలవాటయి పోతుంది. అలవాటయినదాంట్లో సంతోషం ఎక్కడుంటుంది? ఆ పైన ఆ అల వాటునుంచి తప్పించుకుపోలేక అదేపని చేస్తూంటాం. చివరికి గాడిద ముందు ఎలుగుబంటిని కట్టిన కథ అవుతోంది."

మాట్లాడుతూ తింటున్నారు. తింటూ తాగుతున్నారు. తిని పారేసిన బొమికలు ఆకులో అసహ్యంగా పడివున్నాయి. ఈయన చెప్పదలచుకున్నది చెప్పకుండా విషయం చుట్టూ ప్రదక్షణ చేస్తున్నారు.

"సో - మనం కలుసుకున్న తరువాత మోరార్‌లెస్ కంప్లీటుగా క్లబ్‌కి వెళ్లడం మానేశాననే చెప్పవచ్చు. ఎప్పుడన్నా అల్లా ముఖం చూపించి వచ్చేస్తూండేవాడివి. మనం నాలుగైదు రోజులు కలుసుకోలేదు జ్ఞాపకంవుందా? అప్పుడు మటుకు క్లబ్‌కి

వెళ్లాను. యు నో నాకు మంజు డబ్బు యిస్తూవుంటుంది. తిరిగి తీసుకొచ్చి మంజుకి యిచ్చేయ్యడం మళ్లీ కావాలంటే అడిగి తీసుకోవడం యిది నాకు అలవాటు. ఆ రోజున నాకు డబ్బు చాలాలేదు. మంజుని అడిగాను. దాని దగ్గిర కూడా కొంచమే వుంది. పద్మ బీరువాలోంచి తీసిమ్మని అడిగాను. 'సాయంత్రంలోగా ఎలాగో అలా తీసుకొచ్చి యిచ్చేస్తాను, పద్మకీ విషయం తెలియకుండా తిరిగి డబ్బు అక్కడే అలానే పెట్టెయ్యొచ్చు అని చెప్పాను. ఇలా యిదివరకు రెండు మూడు సార్లు జరిగింది - మళ్లీ మోసపోనని, యివ్వనంది మంజు. తరువాత యిచ్చిందనుకో. నేను క్లబ్‌నుంచి డబ్బు కోసం మధ్యలో వచ్చానని జాలిపడి యిచ్చింది. అయిదువేల రూపాయలు తీసుకుని, పరుగెత్తికెళ్లి పేకాటలో పెట్టాను. రెండు గంటలయేనరికి నా చేతిలో డబ్బు నీళ్లలాగా జారిపోయింది. ఆ రోజు నాకు 'బేడ్ లక్' ఒక్క ముక్క కలిస్తే వట్టు. అన్నీ వుత్త వెధవ ముక్కలు. ఆ రోజంతా ఒక్క ముక్క కలవలేదు. ఆ తరువాత సీసా గ్లాసూ పెట్టుకుని విడివిడిగా ఆడుకుంటూ కూచోవాలి. అంతేగాని ఆటమధ్యలో వదిలి వెళ్లిపోకూడదు. డబ్బేమో కరిగిపోయింది. మంజు మొహం జ్ఞాపకానికి రాగానే అధఃపాతాళానికి కుంగి పోతున్నాను. ఏం చేశాను? 'ఛీ - షేమ్ – వాట్ ఎ షేమ్.' తల్చుకుంటేనే అసహ్యంగా వుంది.''.... తల వంచుకుని ఒక సిగరెట్ అంటించి, గ్లాసు అందుకుని సిప్ చేస్తున్నారు.

దగ్గిర దగ్గిర అర సీసా ఖాళీ చేశారు. ఇంకా తాగుతారా? ఈ సీసా అంతా ఖాళీ చేసేస్తారా? ఇలా తాగుతే ఏమైపోతారు? ఇక అపుతే బాగుండును. నేను ఆపమని ఎలా చెప్పను? జగ్‌లో నీళ్లు అయిపోయినాయి. ఆ కారణం పెట్టుకుని అడిగాను.

"నీళ్లు చాలా యింకా కొంచెం కావాలా? తీసుకుని రమ్మన్నారా?"

"ఊ - చాలు. ఇవ్వాళ చాలా తాగేశాను. దిస్ యీజ్ ది లిమిట్. నీకు ఆకలి వెయ్యడం లేదా? లెట్ అజ్ యీట్. పాలు పోసుకుని చక్కెర వేసుకు తింటే, యిడియాపం చాలా బాగుంటుంది. మా మంజు ఒక డజను తినేస్తుంది" అంటూ యిదివరకు చెప్పిందే మళ్లీ ఒకసారి చెప్పారు. ఇదివరకు చెప్పిన సంగతి యీయనకు జ్ఞాపకం లేదు కాబోలు.

పాలు వెచ్చ బెట్టడానికి వంటింట్లోకి వెళ్లాను.

ఇంగ్లీషులో చెబుతున్నారు "As uncomfortable as an English man found cheating in cards in his club" అని ఇంగ్లీషులో ఒక ఎక్స్‌ప్రెషన్ వుంది. తెలుసా?"

నాకు తెలియదు. ఈయన చెప్పింది వినగానే అది ఎటువంటి అవమానకరమైన పరిస్థితో అని మనసు దడ దడ లాడింది. ఈయన అలాంటి పాడుపని ఏదన్నా

వేశారా ? తలుచుకుంటే నాకు చాలా జాలిగానూ, బాధగానూ వుంది. ఈయన్ని పట్టుకుని ఒక్కసారి గొల్లున మనసారా ఏడవాలనిపించింది. ఇంతకు ముందు యీయన అగ్గిపుల్లతో చెయ్యి కాల్చుకుంటారేమోనని భయపడి అడిగానే, అదే మాదిరి "అలాంటి పనేదన్నా చేశారా, క్లబ్‌లో ?'' అని అడిగాను.

ఆ కాలిన వాత చూపించారే అదేవిధంగా నావంక చూస్తున్నారు. కళ్లు రెండూ ఎర్రగా తడిగా వున్నాయి. చిన్న పిల్లవాడిలా తల ఆడించారు.

## 29

ఆ రోజు రాత్రి వొంటిగంటదాకా వుండి, అర్ధరాత్రి దాటాకా యింటి కెళతానని బయలుదేరారు. నేను వద్దన్నాను. 'పొద్దున్నే వెళ్లొచ్చు. వుండిపొండి' అని బతిమిలాడుకున్నాను. వింటేనా ? బయలుదేరారు. ఆ సీసా, గ్లాసూ లిక్కర్ కేసూ అన్నీ అలా సోఫాలో పడేసి బయలుదేరారు. చేసేది ఏమీలేక 'జాగ్రత్తగా వెళ్లండి, నిదానంగా వెళ్లండి' అంటూ కారుదాకా వెళ్లి పంపించి, లోపలికొచ్చి, చిందర వందరగా పడివున్నవన్నీ ఎత్తి జాగ్రత్తగా సర్దాను. ఆకులూ, కాయితాలూ, నమిలిపారేసిన చెత్తా అంతా శుభ్రంగా పోవుచేసి వీధిలో పారేసి వచ్చాను. ఆ రాత్రి నాకు నిద్రపట్టలేదు. ఈయన్ని ఏమని అనుకోవాలి? ఈయన యింత పసిపిల్లవాడా ? లేకపోతే బుద్ధిహీనుడా ? ఈయిన చెప్పినట్లుగానే అటువంటి స్పాయిల్ట్ ఛైల్డ్‌లా వున్నారే ! ఛీ – ఎంత అవమానం ? ఇంత పతనమయి పోయి వుంటారా ? ఈయనకి ఆత్మహత్య చేసుకోవాలని అనిపించిందట. అట్లా అనిపించడంలో ఆశ్చర్యం లేదు. అలా అనిపించడం సమంజసం అని కూడా మనసులో అనుకున్నాను - కాని పైకి అనలేదు. ఈయన్ని ఎటువంటి సమయంలో కూడా, అటువంటి ఆలోచన రానీయకూడదనీ, ఎంత బాధలోనూ అటువంటి పనులకి తలపెట్టకూడదనీ మందలించాను. ఈయన దుఃఖం చూస్తుంటే జాలిగా వుంది. కడుపులో దేవినట్లుంది.

డబ్బుపోతే పోయింది. ఎంత డబ్బు పోలేదు గనక ! దానికోసమని ముక్కలు మార్చి, పేకాటలో మోసగించడమా ? ఈయన తిరిగి తిరిగి మళ్లీ అంటున్నారు. "నా బుద్ధి ఎందుకు గడ్డి తిందో ?'' అని చెప్పి చెప్పి బాధ పడుతున్నారు. చుట్టూ వున్నవాళ్లతో చేరి యీయన యిలా చెడిపోయారు. స్వతహాగా యీయన డబ్బు కోసం కక్కుర్తిపడే మనిషి కాదు. డబ్బంటే యీయనకి లెక్కలేదు. ఏదో సరదాకి... ముక్కలు తీసి పెట్టుకుని,

ఆటలో గెల్చినట్లు చూపించారు. అది వాళ్లు తెలుసుకుని పట్టుకున్నారుట. అమ్మో ఎంత అవమాన పడిపోయారో! ఎవరూ ఏమీ అనలేదుట. అందులో ఒకతను పరిస్థితి అర్థం చేసుకుని "నువ్వు యిప్పటికే చాలా తాగావ్ - ఇక యింటికెళ్లు" అంటూ చెయ్యిపుచ్చుకుని కారు ఎక్కించడానికి లాక్కుపోబోయాడు.

ఈయన అక్కడే ఏడ్చేశారుట. "అయామ్ సారి. ఐ డింట్ మీన్ యిట్, పార్డన్ మీ" అని ఏమిటోమిటో అంటూ బతిమిలాడుకున్నారు.

అందులో ఇంకోతను "ఇది ఎన్నాళ్లుగా జరుగుతోందో? ఎన్నాళ్లుగా పవుల్ చేసి మమ్మల్ని మోసగిస్తున్నాడో?" అన్నాడు.

ఈసారే యిలా చేసింది. ఇది మొదటిసారి చేసిందని - వాళ్లని ఎలా నమ్మించడం.

"ఫ్రెండ్స్ బిలీవ్ మి. స్నేహితులారా నన్ను నమ్మండి" అంటూ అరవడం మొదలుపెట్టారుట యీయన. "నేను చాలా గౌరవనీయమైన కుటుంబంలో పుట్టినవాణ్ణి. ఏదో తాగుడు మైకంలోనూ, బైది యిన్ఫ్లూయేన్స్ ఆఫ్ సమ్ డెవిల్ - ఏదో దెయ్యం నన్నావహించింది. ఇలా చేశాను తప్ప - - -" అంటూ క్షమార్పణ కోరుకున్నారు

తను మర్యాదస్థుల వంశంలో పుట్టాడుట. చాలా ప్రతిష్ట గలిగిన యింట్లో పుట్టాడట – 'ఓహో' అంటూ అంతా హేళనగా నవ్వారుట.

"ఈ తప్పుకు ఎంత కావాలంటే అంత డబ్బు పరిహారంగా కడతాను" అంటూ బతిమాలుకుంటుంటే, క్లబ్‌లో మేంబర్సే కాక - పనివాళ్లు కూడా తమాషా చూస్తూ నిలుచున్నారుట.

"ఇకనుంచీ నువ్వు యీ ఛాయలకు రాకూడదు. నీ మెంబర్‌షిప్ కాన్సిల్ అయిపోయింది." 'ఇకమీదట యీ పెద్ద మనిషిని లోపలికి రానివ్వకండి' అని పనివాళ్లకి ఆర్డరిస్తున్న మాటలు కారులో ఎక్కికూచున్న యీయన చెవుల్లో పడ్డాయి.

ఆ రాత్రే ప్రాణత్యాగం చేసుకు చచ్చిపోదామని నిశ్చయించుకున్నారు. ఒక సీసా నిద్ర మాత్రలు, మరో సీసా విస్కీ రెడీగా పెట్టుకున్నారు. గ్లాసుకో రెండేసి మాత్రలు చొప్పున వేసుకు తాగుతూ, తాగుతూ అలా నిద్రపోతే, తాగుడు మైకంలో తెలియక చచ్చిపోయాడనుకుంటాడని ప్లాను వేసుకున్నారు. కాని చివరికి ధైర్యం చాలలేదు. ప్రాణం తీసుకునే తెగువలేదు. - ప్రాణంతో వుండేందుకు అవమానంగా వుంది. నలుగురికీ ముహం చూపించలేకుండా వున్నారు. బయటకొస్తే నలుగురూ తనని చూసి నవ్వుతున్నట్లు, ఏవేవో శబ్దాలు వినిపిస్తున్నట్లు వుండేవిట.

రాత్రి వొంటి గంటదాకా యిదే విషయాన్ని తిప్పి తిప్పి చెపుతూవున్నారు.

"అన్నీ మన మంచికే ఇకమీదట మీరా వెధవ క్లబ్‌కి వెళ్లకండి. వెళ్లక పోయినందువల్ల లాభమే తప్ప - నష్టమేమీ లేదు. మీరేదో భయపడి అలాంటి

వని చేశారని - కొన్నాళ్ళు పోయాక వాళ్లకే తెలిసివస్తుంది. దీనికోసం మీరు, మిమ్మల్ని గుచ్చి గుచ్చి బాధించుకోకండి. మీ గురించి వాళ్లకి ఆపాటి కూడా తెలియదా అని! కాని అలాంటిపని చేసినపుడు క్లబ్‌రూల్స్ ప్రకారం మిమ్మల్ని పనిష్ చేయడం న్యాయమనే అనుకుంటాను. మీరు చేసిన యీ పొరబాటుకు, మిమ్మల్ని ఆ ఛాయలకి రానివ్వదని తీర్మానించి ఒకవిధంగా వాళ్లు మీకు వుపకారమే చేశారని వొప్పుకోవాలి. లేకపోతే మీరు వెళ్లి – వాళ్ల ముందు దోషిగా నిలబడాల్సి వచ్చివుండేది. వాళ్లేదో విచారించినట్లు అడక్కుండానూ వుండరు. ఇదంతా లేకుండా ఒక్క క్షణంలో అంతా తేల్చేశారు. అదీ ఒకందుకు మంచిదే'' అంటూ ఆయనకు నచ్చజెప్పాను.

నేను ఓదార్పుగా రెండు మాటలు చెప్పగానే – మళ్లీ మామూలు మనిషి అయి పోయారు. నా మీద ఎంత నమ్మకం - ఎంత గౌరవం?

ఒక వారం రోజులుగా రోజూ సాయంత్రం అయేసరికి యిక్కడికే వచ్చేస్తున్నారు. తొమ్మిదీ పదింటిదాకా వుండి వెళ్లిపోతున్నారు. మిగతా 'కనక్షన్స్' ఏమీ లేనట్లున్నాయి. ఈయనకి జీవితంలో ఏ యింటరెస్టూ లేదని తోస్తోంది. ఒక్క తాగుడుమటుకే యీయనకు తోడుగా నిలిచినట్టుంది. మాట్లాడే తోడు నేను.

ఆ రోజునుంచీ యీయన యింకా షేవ్ చేసుకోలేదు. ఏదన్నా వైరాగ్యమా? లేక విరక్తా? నేను రెండు మూడు సార్లు హెచ్చరించి చూశాను. కాని యింకా ఆ శుభముహూర్తం వచ్చినట్లు లేదు. జవాబు చెప్పకుండా వూరుకున్నారు.

"ఏం యిదిమటుకు బాగానే వుందిగా? ఎయిటీన్త్ సెంచరీలో యూరప్‌లో అంతా యిదే ఫాషనుట. ఆ పద్దెనిమిదో శతాబ్దపు ఫాషను మళ్లీ యీనాడు – ప్రపంచంలోకి తిరిగివచ్చింది. నేనేం సన్యాసిని కాదలచుకోలేదు. ఇంకో పది రోజులు పోనీ. నీట్‌గా ట్రిమ్ చేయించుకుంటాను. అప్పుడు ఎంత బాగుంటుందో!'' అంటూ నవ్వులాట పట్టించారు.

పొద్దుట వాకింగ్‌కి వెళ్లివచ్చాక మళ్లీ చెప్పాను. "ఆ గడ్డం వద్దు బాబు - తీయించేసుకోండి. ఎల్లాగో కొత్తగా వుంది - తీసేద్దురూ'' అని.

కన్నుగీటి నావంక అర్థవంతంగా చూస్తూ:

"ప్రస్తుతం నా దాడీవల్ల ఎవరికీ యిబ్బందిలేదు. నో కంప్లెయింట్స్. అలాంటప్పుడు దీన్నెందుకు తియ్యాలి?''

ఆయన ఆటలుగా కన్నుగీటి అన్నా - ఆ మాటల్లో నిగూఢమయిన అర్థం వుంది. ఆ అర్థంతోటే ఆయన అంటున్నారు. ఈయన ప్రవర్తనలో మార్పు కలుగుతున్నదని నాకు బోధపడుతోంది.

రాత్రి పదిగంటల వేళ. సీసాలు కారులో వేసుకుని, గరల్ ఫ్రెండ్సు కోసం వూరు మీద పడుతూండేవారే, ఆ తిరుగుడులన్నీ ప్రస్తుతం కట్టిపెట్టేశారు. అలా వెళ్లడం పూర్తిగా మానేశారు. రోజూ సాయింత్రం యిక్కడికొస్తారు. రాత్రి పదీ, పన్నెండూ కొట్టాక యింటికి వెళుతున్నారు. పొద్దుటే వాకింగ్‌కి వస్తున్నారు. ఆ తరువాత ఆఫీసు. సాయంకాలం మళ్ళీ యిక్కడే వుంటున్నారు. ఇది చెప్పకోదగిన మార్పుగదా.

అవన్నీ బాగానే వున్నాయి. విరక్తి కలిగితే సరే - దాని దారి దాండే, దానికీ యీ గడ్డానికీ జులపాలకీ సంబంధం ఏమిటో - ఎందుకు పెంచుకుంటున్నారో వీటిని ?

ఈయన యింకా పూర్వపు మనుషి కాలేదు. ఆ సంతోషం, ఆ చిన్నతనపు చేష్టలూ రాలేదు.

వీధిలో కారు ఆగింది. సాయంకాలం ఆఫీసునుంచి నన్ను తీసుకొచ్చి వదిలి పెట్టి, ఇంటికెళ్లి బట్టలు మార్చుకుని వచ్చారు. చేతిలో నల్ల పెట్టి. దాన్ని తీసుకెళ్లి లోపల హాల్లో పెటాను. హాల్లోకొచ్చి కూచుని సిగరెట్ ముట్టించారు.

"గంగా - నాకో విషయం తెలిసింది. హౌ టు డీల్ విత్ యిట్ అనేది బోధ పడటం లేదు" అంటూ చాలా సీరియస్‌గా గడ్డం దువ్వుకుంటున్నారు.

'ఏం సంగతి చెప్పండి" అని నేనూ కూచున్నాను.

నా చేతిలో వున్న పుస్తకం కొరకు చెయ్యి జాపారు. ఇచ్చాను అది బ్రదర్స్ ఆఫ్ కరమ్‌జూవ్.

ఒకసారి చేతిలో పుచ్చుకుని 'బర్' అని విసినికర్రలాగా తిప్పి, పుస్తకాన్ని విరిచి పారేస్తున్నారు. మధ్యలో ఒక పేజీలోని పేరా కొంచెం చదివారు. చాలా శ్రద్ధగా చదివి ఆనందిస్తున్నట్లున్నారు.

"వెల్ సెడ్ - గంగా. యిట్లా రా – ఈ పేరా చదువు –" అంటూ పేజీ మధ్యలో ఒకచోట చూపించారు.

నేను చదువుతున్నాను.

"A man will fall in love with some beauty, with a woman's body, or even with a part of a woman's body. A sensualist can understand that, and he will abandon his own children for her; sell his country, Russia, too ! If he is honest, he will steal if he is human, he will murder ! if he is faithful he will deceive" –

(మనిషి ప్రేమలో పడినపుడు - ఒక సౌందర్యరాసిని ప్రేమించినపుడు - అది ఆ స్త్రీ యొక్క దేహం కావచ్చు. ఆ దేహంలోని ఒక అంగం కావచ్చు. ఈ ఆరాధనని ఒక్క రసికుడైన వ్యక్తే అర్థం చేసుకోగలుగుతాడు. ఆ వ్యక్తి తను ప్రేమించిన స్త్రీ కొరకు, తన కడుపున బుట్టిన పిల్లలని వదలుకుంటానికి, తన దేశాన్ని అమ్ముకోవడానికి ఆఖరికి రష్యా దేశాన్ని వదలుకోవడానికికూడా సిదపడతాడు.

నిజాయితీ పరుడు దొంగతనం చెయ్యడానికి వెనుకాడడు. మానవత్వం కలవాడు ఖూనీకోరుగా మారుతాడు, విశ్వాస పాత్రుడు మోసగాడు అవుతాడు.)

దీన్ని ఎందుకు చదవమన్నారో నాకు బోధపడలేదు. నేను చదివే ప్రతి మాటా శ్రద్ధగా ఆలకిస్తూ తల వూపుతున్నారు.

"ఇది మొగవాళ్లకే కాదు - ఆడవాళ్లకి కూడా వర్తిస్తుంది" అంటు నన్ను ఒక్కక్షణం తేరిపారచూశారు.

"ఏమిటంటున్నారు ?" ఆయన ధోరణి అర్థంకాక ప్రశ్నించాను.

"మంజు యీజ్ యిన్ లవ్ విత్ దట్ బాయ్. మంజు ఆ పిల్లవాడిని ప్రేమిస్తోంది. అది నేను కనిపెట్టాను. అది వాళ్లమ్మని, నిన్ను, నన్ను మనందరనీ మోసగిస్తోంది - అది తలుచుకుంటే నాకు చాలా కష్టంగా వుంది. పద్మ అంత పట్టుదలగా శాసించి వుండకపోతే, మంజు యీనాడు యిలా దొంగచాటు పనులు చేసి వుండేదికాదు. కారులో అంతా యీ సంగతే ఆలోచిస్తూ వచ్చాను. మంజు నీతో అబద్ధం చెప్పి, నిన్ను కూడా మోసగించింది. అది తలచుకుంటే నాకు చాలా కోపంగావుంది. ఈ పుస్తకంలో చెప్పినట్లు ప్రేమలో పడినపుడు యితరులని మోసగించడానికి వెనుకాడరని అనిపిస్తోంది. "నేను అతన్ని ప్రేమిస్తున్నాను. అతన్ని చూడకుండా వుండలేను - " అని పద్మతో మొండిగా అందే అనుకుందాం. అప్పుడేమయివుండేది ? దీన్ని యింట్లోంచి కదలనివ్వదు. సరి అందుకని యిది యీ మాదిరి దొడ్డిదారి తొక్కితే. . . వేర్ యీజ్ ది ఎండ్ ?" గడ్డం దువ్వుకుంటున్నారు.

మళ్లీ ఆయనే అన్నారు : "చివరికి ఏమవుతుందో చెప్పలేంకదా! ఈ రోజుల్లో పిల్లలకి మనం ఏమీ చెప్పక్కర్లేదు. అన్నీ వాళ్లకే తెలును. ఎటొచ్చీ యీ ప్రేమలన్నిటికీ గమ్యం పెళ్లి అని కూడా చెప్పలేకుండా వున్నాం" అని ఇంగ్లీషులో అన్నారు. "ఇది వాళ్లమ్మ కన్నుకప్పడం అర్థం చేసుకోగలను. కాని మనతో ఎందుకు అబద్ధం ఆడిందో - అదే బోధపడటంలేదు."

"దీనిని మోసం అంటారా ? మొదట్లో సంగతంతా చెప్పి వాళ్లమ్మని వొప్పిద్దామని అనుకుంది. కాని అది జరగని పని అని తెలుసుకుంది. ఎవరికి బాధ్యత వుందో వారికి చెప్పే అవకాశం లేకపోయింది. పోతే మిగతా మనిద్దరితో చెప్పవలసిన అవసరం లేదనుకుందేమో! కాని ఒక విషయం. ఇంతకు ముందు యీ పుస్తకంలో చదివాము చూడండి. మంజు ప్రేమ అటువంటిది మటుకు కాదు. షి విల్ నెవర్ ఎబాండన్ ఎనీథింగ్ ఫర్ ది సేక్ ఆఫ్ ఎనీథింగ్. ఆ అమ్మాయి తల్లి కోసమో, చదువు కోసమో తప్ప - ఒక కప్పు అయిస్‌క్రీమ్ కోసం తనని తాను మర్చిపోతుంది అనుకోను. మంజు వాళ్లమ్మకంటే, మీకంటే, నాకంటే, మనందరికంటే తెలివైనదీ పట్టుదల గలదీని. నేను ఈనాడు చెబుతున్నాను,

డోంట్ థింక్ దట్ యీజ్ లవ్. అది ప్రేమ అనుకోకండి. ఈ విషయంలో మంజు ఎవరినీ మోసగించలేదు, ఎవరికీ అబద్ధం చెప్పనూలేదు. ఈ స్వామిజీ లాంటివాడు రేపు 'మరో రాముజీ వచ్చినపుడు, వాడి స్కూటర్ ఎక్కి వెళుతుంది. 'స్కూటరు ఎక్కినంత మాత్రాన అది ప్రేమ అనుకోకు' అని చెప్పే పద్ధతి యిదన్నమాట. ఈనాటి కాలేజీ పిల్లలకు యివన్నీ కావాలి. జీవితమంతా ఇలా కాలేజీ స్టూడెంట్స్ లాగా గడపడం ఎలా అసంభవమో, అలాగే జీవితమంతా యిలా జాలీగా గడిపేయడం సంభవం కాదనీ వాళ్లకీ తెలుసు. ఇదంతా కాలేజీ జీవితంలో, స్టూడెంట్ లైఫ్‌లో ఒక భాగం. రేపు పద్మ పెళ్లికొడుకుని వెతికి తీసుకొస్తే, మంజు చక్కగా తలవంచుకు కూచుని, తాళి కట్టించుకుంటుంది. ఆ స్వామిజీ, రాముజీ అందరూ వచ్చి నూరేళ్లు వర్ధిల్లమని, ఆశీర్వదించి అక్షింతలు చల్లుతారు. ఒకే విషయానిని ఒక్కొక్క తరం ఒక్కొక్క రకంగా చూస్తుంది. డోంట్ బోదర్. మంజు చాలా తెలివిగలది. గడుసు పిండం'' అన్నాను.

నేను యింత వివరించి చెప్పినా ఆయనకు తృప్తి కలుగలేదు. ''పద్మ కల్పించుకోవడం వల్ల - విషయం యిలా బెడిసికొట్టిందని, దాపరికమంటూ ఎరగని, నిర్భయంగా వుండే ఒక ఆడపిల్ల ఇటువంటి దొంగచాటు పనులు చేస్తున్నదీ అంటే - పర్యవసానం ఎటువంటి సమస్యలకి దారితీస్తుందో ఎవరు చెప్పగలరు ? చివరికి మంజు జీవితం ఎటువైపుకి మళ్లుతుందో? ఈ విషయం గురించి పద్మతో సూటిగా మాట్లాడాల్సిన సమయం వచ్చింది'' అని యీయన అంటుంటే - బాధ్యతగల తండ్రి మనసు ఎలా కొట్టుకుంటోందో బోధపడుతోంది. కాని ఈయన చెప్పే విషయాలని పద్మ గ్రహించదనీ, మంచి చెడ్డలు అర్థం చేసుకోదనీ కూడా నాకు తెలుసు.

''ఆల్ దీజ్ మదర్స్ ఆర్ స్టుపిడ్స్'' అని గభాలున అన్నారీయన. నేను మా అమ్మను తలుచుకున్నాను.

ఎనిమిది గంటలయింది. ఇంకొంచెం సేపట్లో యీయన తాగడం మొదలు పెడతారు. పదిన్నరదాకా తాగి ఆ పైన యింటికి బయలుదేరుతారు.

''మీకు తినటాని ఏదైనా వద్దా ?'' అని అడిగాను.

''నువ్వు తినటానికి ఏం చేసుకున్నావ్ ?'' అని అడిగారు.

''అరే యీ రోజున ఏమీ వండుకోలేదు. నా కోసమని నాలుగు అప్పడాలు వేయించుకుంటాను'' అన్నాను. గబగబ చప్పట్లుకొట్టి చాలా ఖుషీగా అన్నారు.

''విస్కీకి అప్పడాలు సరిగ్గా సరిపోతాయి. ఏదీ ఓ అప్పడం పట్రా'' అన్నారు.

''క్షణంలో వేయించి తెస్తాను వుండండి'' అంటూ వంటింట్లోకి వెళ్లాను.

ఈయన తాగుడికి ప్రారంభోత్సవము చేశారు

అప్పడాలు వేయించి పళ్లెం నిండా పట్టుకొచ్చి పెట్టాను. తాగారంటే ఎక్కువ మాట్లాడుతూంటారు. సీరియస్‌గా మాట్లాడుతారు. సెన్సిబుల్‌గా కూడా మాట్లాడుతారు. ఈయన మాటలని బట్టి నాకొక భయంకరమైన విషయం బోధపడింది. ఈయన ఆత్మహత్య చేసుకుంటారని, ఎప్పుడో ఒకరోజు ప్రాణత్యాగం చేసుకొని చచ్చిపోతారని అనిపించింది. మనసు చాల బరువుగా వుంది. ఈయనకి జీవితంలో దేనిపైనా యింటరెస్టు లేదు. అన్నిటినీ పరిత్యజించి నిలుచుని వున్నారు. ఈ తాగడం కూడా, దానిపై పెద్ద వ్యామోహం వుండి కాదు. ఈ శూన్యతని, దేని మీద యిచ్ఛ లేని యీ నిర్వికారాన్ని మర్చిపోవడానికి తాగుతున్నారు. చాలా దయనీయమైన పరిస్థితి. ఈమధ్య ఆడవాళ్ల మీద కూడా యీయనకు యిచ్ఛ కలగనట్లు తోస్తున్నది. పూర్వం వున్నటువంటి ఆ స్త్రీ వ్యామోహం, తనకి స్త్రీలపై మోజున్నదని, తనను తాను మభ్య పెట్టుకుంటున్నటువంటి ఒకానొక భావం, ఆ విషయం యీయనే అన్నారు. యవ్వనం అంతరించి, వయసు పైనబడటం చేతనయివుండవచ్చా ? వృద్ధాప్యమన్నది గభాలున - నాలుగు రోజుల్లో పైనబడదే !

"గంగా - నాకు అనిపిస్తూ వుంటుంది. ఇదంతా వొదిలేసి ఎక్కడికయినా పారిపోదామని. ఈ జీవితంలోంచి, యీ లైఫ్‌లోంచి ఒక్కసారి అదృశ్యమయి పోవాలని ఒక్కబంధం కూడా వుండకూడదు. కారు, డబ్బు, తాగుడు, స్త్రీలు, పెళ్లాం, కూతురు, పిల్లలు, ఫ్రెండ్స్ వీటన్నిటినీ ఒక్కసారి ఛేదించుకుని, ఎవరికీ కనపడని దూర తీరాలకివెళ్లి, ముఖం తెలియనివాళ్ల మధ్య, కొత్తగా జీవితం ఆరంభించాలి. కష్టపడి చెమటోడ్చి ఏపూటకాపూట సంపాయించుకు తినాలి. రోడ్‌వారన పడుకుని ఎండకి ఎండి, వానకి తడిసి, యీదేహం రాటు తేలాలి. కటికి నేలమీద పడుకోవాలి. కట్టుకునేందుకు మారుబట్టలు లేక ఎందరో అల్లాడుతున్నారు. కడుపునిండా తిండీ, వంటినిండా బట్టాలేని యీ అసంఖ్యాకులలో ఒకడినై, వారితోపాటు నేనూ ఒకడినై కలిసి బతకాలి. గడిచిన జీవితం పూర్తిగా మర్చిపోవాలి. ఓ - - ఎలా వుంటుందో తెలుసా ? ఐ థింక్ అయామ్ గోయింగ్ టు డు దట్" అంటూ చాలా వుత్సాహంగా, తన వూహా చిత్రాన్ని చక్కగా చెపుతున్నారు.

నేను నవ్వాను. నా నవ్వుతో ఆయన వూహాచిత్రం కదిలిపోయింది. నేను తనని చూసి వేళాకోళంగా నవ్వుతున్నా ననుకున్నట్లున్నారు. ఒక్కక్షణంలో ముఖం చిన్నబోయింది.

"ఎందుకు నవ్వుతున్నావ్ ?" అని అడిగారు.

"స్కాచ్ సీసా పక్కన పెట్టుకుని మీరు అల్లుతున్న వూహలని చూసి నవ్వుతున్నాను, మీరు వూహించుకుంటున్నారే ఆ జీవితం, అటువంటి దేహిక శ్రమతో కూడిన

జీవితం గడుపుతున్నవాళ్లందరూ, యిప్పుడు మీరు కూచునివున్నారే - యిటువంటి స్థితిలో వుండాలని కలలు కంటూంటారు - అన్న ఆలోచన వచ్చి నవ్వుకుంటున్నాను" అని పైకి అనేశాను.

ఆయన ఒక్కక్షణంపాటు ఆలోచించారు. కొన్ని క్షణాలక్రితం వున్న ఆ కలలు, ఆ ఆనందం అన్ని కరిగిపోయాయి. ఆయన కలలని చెరిపి వుండకూడదని నన్ను నేనే మందలించుకున్నాను. నేనేదో తనని మోసగించినట్లు చూస్తూ "యు సే యిట్ యీజ్ ఇమ్‌పాసబుల్ ఫ్రమ్ . . . ఇది సాధ్యం కాదంటావు."

'నేనావిధంగా మారిపోవడం జరగని పని అనీ, జరగపోయే పనికాదనీ అంటున్నావా ? అంటూ నన్ను ప్రశ్నిస్తున్నారు. జరుగుతుంది. జరిపించి తీరుతాను అని ఆయన సవాల్ చెయ్యడంలేదు. నామాటల్లోని వాస్తవాన్ని గ్రహించి, తలవంచు తున్నట్లుంది ఆ ప్రశ్న.

"నేను యిదికూడా చెయ్యలేనా ?" అని ఆయన తనని తాను ప్రశ్నించుకున్నపుడు ఈయన ప్రశ్నకు ఏం బదులు చెప్పాలో నాకు బోధపడలేదు.

చివరకి మళ్లీ ఆయనే అన్నారు. "నీకు యిప్పుడైనా అర్థం అవుతోందా ? నేను ఏపనీ బాధ్యత వహించి చెయ్యలేనని. చెయ్యదలుచుకున్నదేదో చేసేసి, ఆపైన నలుగురిచేత మాటలు పడటమే జీవితం - అన్న నాఫిలాసఫీ సరిఅయినదని యిప్పుడైనా వొప్పుకొంటావా ?"

ఈరోజు యింతవరకూ ఎన్ని గ్లాసులు తాగారో లెక్కపెట్టడం మరచిపోయాను. నాకిదో పని అయింది యీ మధ్య. తాగేది ఆయనా - లెక్కపెట్టేదాన్ని నేనూనా ?

నా మనసులోవున్న విషయాన్ని ధైర్యంచేసి బయటకి అడిగేశాను. "మీరు యిప్పుడన్నారే - ఎక్కడికయినా క్రొత్త ప్రదేశానికి వెళ్లి, కొత్త మొహాల మధ్య, కొత్త జీవితం ప్రారంభించాలని వుందని. ఆ జీవితంలో నేనూ మీతో పాలు పంచు కుంటే ఎలా వుంటుంది ?"

కళ్లు పెద్దవిచేసి, నన్ను తేరిపార చూస్తున్నారు. "వాట్ డు యు మీన్ ?" నేను చెపుతున్నది అర్థంచేసుకుని, అర్థం కానట్లు మాట్లాడుతున్నారు.

"ఎస్ - ఐ మీన్ దట్" అన్నాను.

ఇప్పుడు నవ్వడం ఆయన వంతయింది. ఇలా మనసారా నవ్వి ఎన్నాళ్లయిందో? నవ్వుతూనే అన్నారు. "నేను పిచ్చివాడిలాగా ఏదేదో వూహించుకు కలలు కంటున్నపుడు, నువ్వు మటుకు ఎందుకు వూహించకూడదు ? నీకుమటుకు అటువంటి హక్కులేదా ?" అంటూ నవ్వుతూ నవ్వుమధ్యలో ఇంగ్లీషులోనే అన్నారు.

"మాటలు మార్చకండి. నేనూ వస్తాను, ఇద్దరం వెళ్ళిపోదాం" అంటూ బ్లంట్‌గా ముక్కుమీద గుద్దినట్లు అడిగాను.

"సన్యాసి పిల్లిని పెంచిన కథలాగా - కౌపీన సంరక్షణార్థం - అంటారే అల్లాగా ?" ఈయనకు యిలాంటి పిట్టకథలు చాలావచ్చు. ప్రతివిషయానికీ ఒక కథ చెపుతూంటారు. ఈయన్ని సంతోషంగా వుంచడానికి.

"అదేం కథ ?" అని అడిగాను.

"మొదలుపెట్టావ్ - చెపుతా విను" అంటూ కథ మొదలుపెట్టారు.

"ఒక సన్యాసి గోచిపాతని ఒక ఎలుక కొరికిందట. అందుకని ఎలుకని పట్టుకోవడానికి ఒక పిల్లిని పెంచాలనుకున్నాడట ఆ స్వామీజీ : ఆ తరువాత పిల్లి పాలకోసం ఒక ఆవుని పెంచాడుట. ఆవు పోషణార్థం ఒక పిల్లవాడిని తెచ్చుకున్నాడు. ఆ పిల్లవాడి ఆలనాపాలనా చూడటానికి ఒక పెళ్లాన్ని కట్టుకున్నాడు. చివరికి అల్లా అవుతుంది మన కథ కూడా" అంటూ నవ్వారు- నేనూ నవ్వాను.

అప్పడాలన్నీ ఖాళీచేశారు.

"ఇంకాసిని అప్పడాలు కావాలా ?" అంటూ తేవడానికి లేచాను.

"వద్దు-ఇంకచాలు. నేను బయలుదేరే టైమయింది" అంటూ వాచీ చూసుకున్నారు.

"మీకు ఒకటైమంటూ వుందా ?" అని అడిగాను. పొట్టమీద చేత్తో తట్టి చూపించారు, పాపం ! తినడానికి యిక్కడ ఏంలేదుగా - పొట్ట ఖాళీగా వుంది కాబోలు.

వంటకి ఎవరినేనా మనిషిని కుదుర్చుకుంటే బాగుండును. నాన్‌వెజిటేరియన్ వెజిటేరియన్ రెండురకాలూ తెలిసిన 'కుక్'ని వెతుక్కుంటే బాగుండును. అని వూహించుకుంటున్నాను. అప్పుడు యీయన్ని యిక్కడే భోంచెయ్యమనచ్చు. మొదట రేపే ఈయనకి తెలియకుండా బజారుకెళ్లి రెండు లుంగీలు తీసుకుని వస్తాను. పాపం ఆ వేసుకున్న బట్టలతో రాత్రి వొంటిగంటదాకా కూచుని వుంటున్నారు ఒకోసారి.

టైము పదిన్నరయింది.

బయలుదేరడానికి ముందు అన్నారు. లైఫ్ అంటే యింతేగదా ! ఇట్ యీజ్ ఆల్‌రెడీ డిజైన్డ్. ముందే అన్నీరాసి పెట్టివుంటాయి. మనం యిందులో ఒక్కటి కూడా మార్చలేము. చచ్చిపోదామనుకొని, ఆత్మహత్య కూడా చేసుకోలేకపోయాను ఇదంతా వదిలేసి ఎక్కడికయినా పారిపోదామంటే అదీ చెయ్యలేకుండా వున్నాను. చెయ్యలేనుకూడా. అన్నీ ఒకరోజున పరిసమాప్తి అయిపోతాయి. ఆరోజు వీటన్నిటిలో ఏమీ అర్థం వుండదు. సో లెట్‌జ్ లివ్ ది లైఫ్ విత్ డిటాచ్‌మెంట్. తామరాకుమీద నీటిబొట్టులాగా, దేనిపైనా ఆపేక్ష లేకుండా జీవించుదాం.

ఇటువంటి పెద్ద విషయాన్ని వెళుతూ వెళుతూ ఎంత తేలిగ్గా చెప్పేస్తున్నారో - అని నాలో నేను ఆశ్చర్యపడ్డాను.

ఈయన యీ మాటలని ఆలోచించే మాట్లాడుతున్నారా? అసలు యీ మాటలు యీయనకి జ్ఞాపకం వుంటాయా? అన్న ఆలోచన వచ్చింది నాకు.

మామయ్య గూడా యిల్లాంటి విషయాలని గురించి మాట్లాడుతూ వుండేవాడు. కాని ఆయన మాట్లాడుతున్నపుడు నాకు యింత వివరంగా అర్థం అయేదికాదు. అవి వుత్తమాటల్లాగా అనిపించేవేతప్ప కాని ఆ విషయాలే యీయన మాటాడుతున్నపుడు కొత్త డైమన్‌షన్‌లో కొత్త పరిమాణంలో అర్థం అవుతున్నాయి.

"ఇంకోసారి చెప్పండి" అని ఆయన్ని అడిగాను. నేను యిలా అడిగేసరికి ఆయన ఏదో గాభరా పడిపోయారు.

"ఏం చెప్పాను?" అని తిరిగి నన్నే అడిగారు. ఎందుకురా అడిగానని నోరు మూసుకొని వూరుకున్నాను. అడక్కుండా వుంటే యీయన యింకా యిలాంటివి మాట్లాడి వుండేవారేమో!

"యు సెడ్ సమ్‌థింగ్ ఎబవుట్ లివింగ్ విత్ డిటాచ్‌మెంట్" అంటూ తేలిగ్గా అర్థం అయేందుకు యింగ్లీషులో ఆ వాక్యమే తిరిగిచెప్పాను.

"యస్" అంటూ మళ్లీ చెప్పడం మొదలుపెట్టారు. "నాకేం పోయింది. మంజు గురించీ, నీ గురించి, నా గురించి అనవసరంగా బుర్ర బద్దలుకొట్టుకు చెయ్యగలిగింది ఏమీలేదు. ఇదంతా వూరికే బుర్ర పాడుచేసుకోవడం తప్ప, పురో జనం ఏమీలేదు. (ప్రయోజనం అన్నమాటని స్పష్టంగా పలకలేకుండా వున్నారు) అందుకనే మళ్ళా యింగ్లీషులో అందుకున్నారు. సో వెదర్ యు లివ్ దిస్ లైఫ్ ఆర్ దట్ లైఫ్ - దట్ యీజ్ నాట్ సో యింపార్టెంట్. ఎట్లా బతికితే ఏం? మన చేతిలో ఏమీలేదు. అన్నీ మన చేతుల్లో వున్నట్లు, అధికారమంతా మన ఒక్కరి చేతిలోనే వున్నట్లు, మభ్య పరుచుకుంటాం. లీవ్ యిట్. స్కాచ్ విస్కీ తాగినా ఒకటే - సారాయి తాగినా ఒకటే స్కాచ్ తాగి చెత్త మాట్లాడేవాళ్లూ వున్నారు, సారాయి తాగి గొప్ప విషయాలు మాట్లాడేవారూ వున్నారు. నేను యిప్పుడొక విషయం తెలుసుకున్నాను. మనం పుట్టడానికి, పెరగడానికి, చెయ్యవలసిన పనులు చెయ్యడానికి, దాచిపెట్టి, ఆ దాచినదాన్ని వీటి కొరకు ఖర్చు చెయ్యడానికి, వీటన్నిటికీ మనమే బాధ్యులమని అనుకున్నా, మన బాధ్యతకాదు అనుకున్నా - జరగపోయేది ఏమీలేదు. అందుకని విచారించనూ కూడదు, సంతోషపడనూ కూడదు. దుఃఖం కలిగినా, ఆనందం కలిగినా సమయాన్నిబట్టి అనుభవించడమే తప్ప — మన చేతుల్లో ఏమీలేదు"

ఈయన ఏమిటో వేదాంతం మాట్లాడుతున్నారు. వేదాంత ధోరణిలో పడ్డట్టున్నారు. ఒకవిధంగా యీయన మాట్లాడిన వేదాంతం సబబుగానే అనిపిస్తోంది. ఈయన దృక్పథంలో చాలా మార్పు కలుగుతోంది. ఈ మార్పు మంచి గమ్యానికే దారితియ్యాలని మనసులో వేడుకుంటున్నాను. ఇంతకు కొంచెంసేపు ముందు - 'యీయన ఏదో ఒక రోజున ఆత్మహత్య చేసుకుంటారు' అనుకుని భయపడిపోయాను. ఆ భయం యిప్పుడు పూర్తిగా తొలగిపోయింది. మనసు తేలిగ్గా వుంది.

ఈయన బయలుదేరి వెళ్లారు.

పొద్దుట వాకింగ్‌కి వెళ్లినపుడు "రాత్రి చెప్పిన మాటలన్నీ జ్ఞాపకం వున్నాయా ?" అని అడిగాను.

"ఐ వజ్ నాట్ - డ్రంక్" అని అన్నారు. "తాగివుంటం వేరు – తప్ప తాగి వొళ్లు మరిచిపోవడం వేరు" అంటూ ఇంగ్లీషులో వివరంగా చెప్పారు.

సిమ్మెంట్ చేసిన పేవ్‌మెంట్ మీద గబగబ నడుస్తూ అన్నారు: (ఇప్పుడంతా గబగబా నడుస్తూ మాట్లాడకోవటం అలవాటయింది). మాట్లాడుతూ నడవడం వల్ల ఒకళ్లనొకళ్లు చూసుకోవడానికి వీలు అవడంలేదు. ఉ ఉ అ - అంటూ చెప్పేవి వింటూ నడుస్తున్నాము.

"నేను ఒకసారి ఆత్మహత్య చేసుకునే ప్రయత్నంలో కావాలనే రెండు మాత్రలతో ఆపేసి, నిద్రపోయాను. ఫ్రమ్ దట్ డే - ఆ రోజునుంచి ఐ సీ మెనీ ఛేంజెస్ - జీవితంలో ఎన్నో మార్పులు, ఎన్నో కొత్త విషయాలు నాకు బోధపడుతున్నాయి - యస్ రియల్లీ...."

"ఏదో కష్టమో - దుఃఖమో వచ్చిందే అనుకో, ఆ బాధనుండి తప్పించుకోవడానికి చచ్చిపోదామని అనిపిస్తుంది. అందుచేత నేను ఆ రోజు ప్రాణత్యాగం చేద్దామనుకున్నాను. కరక్ట్. ఆ సంఘటనకు సంబంధించినంతవరకూ - నేను చచ్చిపోయినవాడి కిందనే లెక్క - అదేమాదిరిగా ఒక్కొక్క విషయంలోనూ - మనం మరణిస్తూనే వుంటాం."

"కష్టాలు పడగా పడగా మనిషి రాటు తేలుతాడు" అన్న సామెత గుర్తుకొచ్చింది.

"మరునాడు పొద్దుట కళ్లు తెరవగానే 'నేను చచ్చిపోలేదు' అన్న భావం నాకెంతో సంతోషాన్ని కలిగించింది. నా మంచం పక్క కిటికీలోంచి కొబ్బరిఆకు ఒకటి వింజామరలాగా వూగుతూ నా కంటి కగుపించింది. కిటికీ దగ్గరకొచ్చి నిలుచున్నాను. ఆ కొబ్బరిఆకు వినసక్రలాగా పరుచుకున్నది. ఆ వుదయపు కాంతిలో, ఆ కొబ్బరి ఆకు తళతళ మెరుస్తూ, తల అడిస్తూ నన్ను చూసి

ఆనందిస్తున్నట్లుగా అనిపించింది. రొమాంటిక్‌గా ఫీలయ్యాను. ముందువైపు లాన్‌లోని పూలతొట్టెల్లోని పూలమొక్కలు 'ఒరేయ్ నువ్వు చావలేదు, అందుకే మా పూలని చూసి ఆనందించ గలుగుతున్నావ్' అని అంటున్నట్లు అనిపించింది. దట్ యీజ్ లైఫ్. జీవితం అందంగా, కాంతివంతంగా, చాలా సింపుల్‌గా వుంటుంది. మనమే దాన్ని చేతులారా పాడుచేసుకుంటున్నాము. కాంప్లికేట్ చేసుకుని - చిక్కులు తెచ్చుకుంటున్నాము అనిపించింది. ఈ రోజు నీతో యివన్నీ చెప్పెయ్యాలని అనుకున్నాను. నేను ఆత్మహత్యకి ప్రయత్నించానని విని నువ్వు బాధపడతావని చెప్పలేదు. అదొక్కటే కాదు, ఆఖరికి నేను ఆత్మహత్య కూడా చేసుకోలేని అసమర్థుడనన్న ఒక ఫీలింగ్ నాలో ఏర్పడింది. ఇప్పుడు ఆ పిరికితనం చచ్చిపోయింది. ఐ విల్ నెవర్ ట్రైటు కమిట్ సూయిసైడ్. ఆత్మహత్య చేసుకుందామన్న ప్రయత్నం యింకెప్పుడూ తలపెట్టను'' అని దృఢంగా చెప్పారు.

నిన్న రాత్రి నా మనసులో కలిగిన భయం అర్ధంలేనిదని తెలుసుకున్నాను. ఈయన చెయ్యి పట్టుకుని ఒక్కసారి నా సంతోషాన్ని వ్యక్తం చెయ్యాలని అనిపించింది. వెనక్కి తిరిగి ఆయన వంక చూశాను. ఆయనా నావంకే చూస్తున్నారు. ఇద్దరి కళ్లూ ఒక్కక్షణం పాటు పెనవేసుకున్నాయి. చిరునవ్వు నవ్వుతున్నారు. ఈయన కళ్లు ఒక కొత్త కాంతితో మెరుస్తున్నాయి.

''ఈ గడ్డాన్ని ఎప్పుడు ట్రిమ్ చేసుకోబోతున్నారు? లేకపోతే బాబాజీ అయిపోతారు'' అంటూ ఏడిపిస్తూ సీరియస్‌గా అడిగాను.

''ఈరోజు చేయించుకుంటున్నాను'' అంటూ గడ్డాన్ని తడుముకున్నారు.

ఆఫీసులో వున్నాను. ఫోన్ మోగుతోంది. ఈయనే అయివుంటారు. లేకపోతే నాకు ఫోన్ చేసేవారు ఎవరున్నారు? లేక ఆఫీసు వ్యవహారంగా ఎవరన్నా ఫోన్ చేస్తున్నారేమో!

''యస్ ....''

''మిస్. గంగా''

''స్పీకింగ్''

....అరె ఆశ్చర్యంగా వుందే. ఆర్. కె. వి. మాట్లాడుతున్నారు.

''నమస్కారం సార్''

''మిమ్మల్ని చూడటానికి వస్తున్నాను. వచ్చాక మాట్లాడుతాను. ఆఫీసుకు రమ్మన్నారా ? ఇంటికి రమ్మన్నారా ? ఇంట్లో అయితే అమ్మా వుంటారనుకుంటా''

''అమ్మ అన్నయ్యగారింటికి వెళ్లింది. ఆఫీసుకే రండి.''

''లంచ్ అవర్‌లో రానా ?''

''ప్లీజ్ కమ్''

"థాంక్స్. వస్తాను. ఎందుకొస్తున్నానో కారణం వచ్చాక చెబుతాను. అంతదాకా సస్పెన్స్. ఆర్. కె. వి. కూడా సస్పెన్స్ పెడ్తున్నారే అని ఆశ్చర్యంగా వుందా? కథల్లో ఎలానూ వుండదు. జీవితంలో నన్నా సస్పెన్సు వుండనీయండి. ఓ - కె"

నాకు అయోమయంగా వుంది. ఏమయి వుంటుందో? అని ఆలోచిస్తున్నాను. సరే. కాస్సేపట్లో ఎలాగూ తెలుస్తుంది గదా!

## 31

నాకు తెరలు తెరలుగా నవ్వొస్తున్నది. బయటకు రానివ్వకుండా మనసులోనే దాచుకు దాచుకు నవ్వుకుంటున్నాను. కాస్త అల్లరిచేసి చూద్దామనిపించింది. నా ముఖాన్ని ఒక్కసారి అద్దంలో చూసుకోవాలనిపించింది. భూమి గుండ్రంగా వుందని దీన్నే అంటారు కాబోలు. నేను తలవంచుకుని చాలా భయభక్తులతో, నా ముందున్న కుర్చీలో కూచుని ఆర్. కె. వి. చెపుతున్న 'హాస్యకధ' వింటూ, చాలా శ్రద్ధగా పెన్సిల్ చెక్కుతూ వచ్చే నవ్వుని అవుకుంటున్నాను.

"మీరు ఆ రోజు మా యింటికి వచ్చివెళ్లారు - అప్పటినుంచీ మా అమ్మ మీ గురించి చాలాసార్లు అనుకుంది. నన్ను చూద్దామని చాలామంది వస్తూంటారు. వాళ్లని గురించి ఆవిడ ఒక్కసారి కూడా పటించుకోలేదు. కాని మీరు వచ్చి వెళ్లి నప్పటినుంచీ - మిమ్మల్ని గురించి తలుచుకోని క్షణం లేదు. మీరంటే ఆవిడకు చాలా గౌరవం - ఇష్టమూను. అంత చదువుకుని, అంత పెద్ద వుద్యోగం చేస్తున్నా - మీరు ఎంతో అణుకువగా మర్యాదగా వున్నారుట - అటువంటి మంచిపిల్లకు యింకా పెళ్లికాకపోవడమేమిటి? ఎందుకు పెళ్లి చేసుకోలేదని నా ప్రాణం తీస్తోంది. దీనికి నన్నేం బదులు చెప్పమంటారో — మీరే చెప్పండి. 'నువ్వు కావాలంటే వాళ్లింటికెళ్లి ఆ వివరాలన్నీ కనుక్కో - అంతేగాని నా ప్రాణం తియ్యకు' అన్నాను. అసలు యివ్వాళ కూడా మీ దగ్గరకు వద్దామని అనుకోలేదు. మీ యింటికి మా అమ్మను తీసుకెళదామని అసలు ప్లాను. కాని మీ ఎడ్రసు తెలియదే! మీరు పంచవటిలో వుంటున్నానని చెప్పినట్లు గుర్తు. ఆ పంచవటి కెళ్లి యింటింట్లో అడుగుదామని అంటుంది. నాకింక వేరే ఏం పని లేనట్లు. సరి మిమ్మల్ని యిప్పుడు కలుసుకోవలసిన అవసరం రానే వచ్చింది. అంతకు మించి మీ దగ్గర చెప్పకూడదు. మిగతాదంతా మీ అమ్మగారి దగ్గిర మాట్లాడుతాను" అంటూ ఒక చిరునవ్వు నవ్వారు.

"మీ సస్పెన్సు చాలా వీక్‌గా వుందే?" అని అడిగాను.

"అందుకనే నేను నస్పెన్సులు పెట్టను" అన్నారాయన.

"విషయమంతా నాతో పూర్తిగా చెప్పచ్చుగా" అడిగాను.

"ఓ - తప్పకుండా. ఇది చెప్పకూడని విషయం కాదుగదా! కాని పెద్దవాళ్లు మాట్లాడుకుంటే బాగా వుంటుందని అనుకున్నా. ఎవరు మాట్లాడినా – ఫైనల్ డిసిషెన్ మీ మీదనే ఆధారపడి వుంటుంది. ఈ ఆఫీసు వాతావరణంలో యీ విషయాలు మాట్లాడటం బాగుండదేమోనని నందేహిస్తున్నాను" అంటూ ఏదో తప్పుపని చేస్తున్నవాడిలా చుట్టూ చూస్తున్నారు.

"ఫరవాలేదు చెప్పండి. లంచ్ టైము యింకా అయిపోలేదు" అన్నాను. పెన్సిలు ములికి సన్నగా కోసుగా చెక్కడం అయిపోయింది. ములికి సన్నగా కోసుగా, ముట్టుకుంటే విరిగేటట్టువుంది. వేలంతా నల్లగా అయింది. తలెత్తి ఆయన మొఖం చూడాలంటే మొహమాటంగా వుంది. నవ్వు వొస్తుందేమోనని భయంగా వుంది. చెవుల వెనక దురదగా వుంది. చక్కటి కధలురాసే, ఇంత తెలివిగలవాడూ ఎంత అమాయకంగా వున్నాడోనని ఆశ్చర్యమేసింది. ఇది ఆయనకి స్వతసిద్ధంగా కలిగిన ఆలోచన అని కూడా అనిపించడంలేదు. ఏదో ఒక ఆడపిల్లకి యింకా పెళ్లి కాలేదు. ఆ అమ్మాయికి ఒక మంచిదారి చూపిద్దాం - అన్న ఆలోచన కూడా కాదు, యీవిధంగా ఆయన ఆలోచిస్తాడనుకోను. ఈ ప్రోద్బలమంతా ఆయన తల్లి వైపునుంచి అయివుంటుంది. ఆవిడ పోరి పోరి తరిమి వుంటుంది. చెప్పదలచుకుంది చెప్పండి. అదేదో బయట పెట్టండి .... అరె పెన్సిల్ మొన విరిగి పోయిందే. ఇదీ ఒకందుకు మంచిదే - మళ్లీ చెక్కడం మొదలుపెట్టాను.

ఆయన చెపుతూవున్నారు. అతని కజిన్‌ట. పేరు రామరత్నం. ఈయనకంటే రెండేళ్లు చిన్నట. షుమారు నలభై ఏళ్లుంటాయిట. విడోయర్‌ట. రెండేళ్లయిందట - భార్య పోయి. పిల్లలు లేరు. బెంగుళూర్‌లో వున్నారుట. హెచ్. ఎమ్. టీ. లో పెద్ద ఆఫీసరు. చాలా అయిడియల్స్ వున్న మనిషట. మొదటి నంబంధానికి కట్నం గిట్నం ఏ పుచ్చుకోలేదుట. పోయిన నెల వాళ్లింటికి వచ్చినపుడు అర్. కె. వి. గారి అమ్మ నా విషయం చెప్పిందట. వాళ్లమ్మ యీ విషయం మాట్లాడుతున్నపుడు యీయనకి యిబ్బందిగానే వుందిట. వాళ్లమ్మ నాకు పెళ్లి చెయ్యాలనే ఎందుకింత తాపత్రయ పడిపోతోందనని - చికాగ్గా కూడా అనిపించిందట. కాని ఆ తరువాత అనిపించిందట. 'ఇదేం చెడ్డపని కాదే! మంచి పనేకదా!' అని అడిగి చూద్దాం ప్రాప్తం వుంటే అవుతుంది. లేకపోతే లేదు అనుకుని వచ్చారు.

ప్రాప్తం ఎవరికి? ఈయన కజిన్‌కా? నాకా? నేను బదులు చెప్పకుండా – వళ్లు బిగించుకుని వూరుకున్నాను. పెళ్లి నంగతులు మాట్లాడుతుండటంచేత - నేను సిగ్గుపడి తల ఎత్తకుండా వున్నాననుకున్నారు కాబోలు.

"మీరేం పసిపిల్లకాదు. ఈరోజుల్లో ఆడపిల్లలు చదువు, వుద్యోగం యివన్నీ అయిన వెనుకనే, పెళ్లి విషయం ఆలోచిస్తున్నారు" అని ఏమిటేమిటో చెపుతున్నారు. ఈ విషయాల గురించి ఆయన మాట్లాడుతుంటే తమాషాగానే వుంది. అసలు యీ సంగతే గమ్మత్తుగావుంది. కాని దీనిని నేను ఎలా పరిష్కరించ గలుగుతాను అన్నది, పెద్ద సమస్య అయికూచుంది. ఈ విషయం నేనెందుకు పరిష్కరించాలి? మాట్లాడ కుండా అమ్మ చేతికి వొప్పజెప్పేస్తాను. అమ్మమటుకు ఏం చేస్తుంది? 'నా కూతురు చెడిపోయింది. అది పెళ్లి చేసుకోదు' అని చెపుతుందా? లేకపోతే అందరిలాగా, 'దాన్ని అడిగి చెపుతాను' అంటూ బంతిలాగా నా దగ్గరకే తిరిగి వచ్చేస్తుందా? అప్పుడు నేను కూడా అందరి ఆడపిల్లలాగానే "నాకిప్పుడు పెళ్లి వద్దమ్మా" అంటూ పమిట చెంగు వేలుకు చుట్టుకుంటూ చెపుతానా? తమాషాగానే వుంటుంది.

లేకపోతే మామయ్య చెప్పినట్లు "నాకు పెళ్లి చేసుకునే అర్హతలేదు" అని వాళ్లకి వాళ్లే తప్పుకుంటారేమో? ఏవయితేనేం? ఈ జోక్ ఎలా సాగుతుందో చూడాలని అనుకున్నాను.

ఆ తరువాత ఆర్. కె. వి. అన్నయ్య యింటి ఎడ్రసు కావాలని అడిగారు. "ఓ - దానికేం యిస్తాను" అని ఒక కాయితం మీద రాశాను. ఆ కాయితం చేతికిస్తూ అన్నాను.

"సార్ మీరు అన్నయ్య ఎడ్రసు అడిగారు. ఇచ్చాను. అంతే ఎవరి ఎడ్రసు యిచ్చినా చివరిమాట నాదే కదా. ఈ విషయంలో మొదటిమాట మీది - ఆఖరిమాట నాది. ఈ విషయం గురించి చాలా మాట్లాడాల్సివుంది. అందరి ఆడపిల్లలలాగా అణుకువతో అన్నాను. ఈ వయసులో చిన్నపాపాయిలాగా నాకు పెళ్లేమిటండీ" అని అడిగేద్దామనుకుని నవ్వుకున్నాను.

"థాంక్స్" అని చెప్పి ఎడ్రసు తీసుకున్నారు. నేను తల వంచుకు కూచుని వుండటం. పెన్సిలు చెక్కుతూ వుండటం, ఎడ్రసు రాసివ్వడం, నవ్వుకోవడం యిదంతా ఆయన అపార్థం చేసుకున్నారు.

"ఇక మీతో మాట్లాడే సంగతులు లేవు. అంతా అమ్మగారితో మాట్లాడుతాను. సాయంకాలందాకా అక్కడే వుంటారా? మీ అన్నగారు కూడా సాయంకాలం ఆఫీసు నుంచి వచ్చేస్తారనుకుంటా. అప్పుడే వెళ్లి యిద్దరితో మాట్లాడుతాను. అడ్రసు కోసం వచ్చాను. ఇంటికెళ్లి అమ్మని వెంటబెట్టుకు వెళతాను. ఒకపూట లీవు తీసుకోవాలి" చాలా వుత్సాహంగా సగం పెళ్లి అయిపోయినట్లు సంతోషపడి పోతున్నారు

ఆర్. కె. వి. వెళ్లిపోయాక నేను యీయనకి ఫోన్ చేసి, "సాయంకాలం సరాసరి యింటికెళ్లిపోతాను. మీరు ఆఫీసుకి రావద్దు" అని చెప్పాను. "కాని సాయంత్రం

మీరు తప్పకుండా యింటికి మటుకు రండి" అని గట్టిగా చెప్పాను. "ఒక యింట రెస్టింగ్ అయిన న్యూస్ వుంది" అంటూ నేను నస్పెన్సుతోనే చెప్పాను.

"ఎనీథింగ్ ఎబవుట్ మంజు" అని అడిగారు.

"నో - నో - నా గురించిన న్యూసే" అన్నాను ఆయనకి అర్థం అయినట్లు లేదు.

"గాట్ ఎ ప్రమోషన్" అని అడిగారు.

"నో - మీరు గెస్ చెయ్యలేరులెండి. కలుసుకున్నాక చెబుతాను. ఎట్‌లీస్ట్ కొత్త న్యూస్ వినబోతున్నానన్న నంతోషం మీకు కలగనివ్వండి" అంటూ నవ్వాను.

"నరె. - ముఖాముఖి తెలుసుకుంటే పోతుంది" అన్నారు.

"ఏవిటి నంగతులు " అని అడిగారు.

"నథింగ్" అన్నాను.

"చాలా బిజీగా వున్నావా ?"

"ఉహు - మీరు ?"

"ఉత్తరం డిక్టెట్ చేస్తున్నాను."

"డిస్టర్బ్ చేశానా ?"

"ఉహు - అయిపోయింది"

"మీరు బిజీగా పని చేసుకుంటుంటే వచ్చి చూడాలనివుంది. ఇక్కడి నుంచి మీరు ఎలా వర్క్ చేసుకుంటున్నారో వూహించుకుంటున్నాను, కాని సరిగ్గా వూహించ లేకుండా వున్నాను. ఎప్పుడో ఒక రోజు మీ ఆఫీసుకు వచ్చేస్తాను"

"ఓ - - నువ్వు మా ఆఫీసుకే రాలేదుకదూ. హౌ యిట్ హాపెండ్? నాకు తట్టనే లేదు సుమా! వయ్ నాట్ కమ్ టుడే? ఇప్పుడొస్తావా? ఐ విల్ సెండ్ ద కార్" అని అడిగారు.

"ఇవ్వాళ కాదు. ఇంకోరోజున వస్తాను. మీకు చెప్పకుండా గభాలున వచ్చి ఎదురుగ్గా నిలుచుండిపోతాను - " అన్నాను.

"ఓ - యస్" అన్నారు.

"ఓ - కె" అని నంభాషణ ముగించాను.

"ఓ - కె" అని ఆయనా అన్నారు ఆవైపునుంచి.

రిసీవరు నేనూ పెట్టలేదు. ఆయనా పెట్టలేదు. ఆయన కింద పెడతారని నేనూ, నేను కింద పెడతానని ఆయనా ఎదురు చూస్తున్నారు.

"పెట్టెయ్యండి" అన్నాను.

"నేను కాదు. నువ్వే పెట్టెయ్యి. కాల్ చేసింది నువ్వు కాబట్టి నువ్వే డిస్కనక్ చెయ్యాలి" అన్నారు.

"మీరేం డ్రస్ వేసుకున్నారు ?" అని అడిగాను సంభాషణ పొడిగిస్తూ.

"డ్రస్సా ? వుండు మానుకు చెపుతాను. నీతో మాట్లాడుతూ గమనించలేదు. గ్రే కలర్ డెక్రాన్ సూట్, క్రీమ్ కలర్ టెర్రీకాట్ షర్టూ, క్రీమూ రెడ్ కలిసిన టై, బ్లాక్ షూజ్ - -" అంటూ నేనూ అడిగినదానికి చాలా సీరియస్‌గా వివరంగా బదులు చెప్పారు.

"ఈ డ్రస్‌తోనే రండి. మీ కోసం లుంగీలు కొని తీసుకొచ్చాను" అన్నాను. సాయంకాలం కొనబోతున్నాను అది జ్ఞాపకం వచ్చి కొనేసినట్లే చెప్పాను.

"ఎప్పుడు కొన్నావ్ ? ఎక్కడ కొన్నావ్?" అంటూ చిన్న పిల్లవాడిలా కుతూహలంగా అడుగుతున్నారు.

"ఎక్కడో ఎప్పుడో కొనేశాను" అని కోతలు కోశాను.

"ఇప్పుడర్థమయింది. నీ నస్పెన్సు నాకేదో ప్రజంటేషన్ కొని వుంచావు — అవునా ?"

"లేదు. డోంట్ గెస్" అంటూ మందలిస్తున్నట్లు అన్నాను.

"సరి యిప్పుడు రెండున్నర అయిందిగదా. మూడు గంటల్లో అదే తెలిసి పోతుంది" అంటూ నవ్వారు.

"ఓ. కె" చివరికి నేనే సంభాషణ ముగించి రిసీవర్ పెట్టేశాను.

సాయంకాలం మయింది. ఈపాటికి గణేశన్ యింట్లో ఏం జరుగుతూ వుంటుందో వూహించుకుంటూ, టాక్సీ తీసుకుని, షాపుకెళ్ళి మూడు లుంగీలు కొని తీసుకొచ్చాను. లుంగీలు చక్కగా మంచిరంగుల్లో మెత్తగా బాగున్నాయి. ఇవి కట్టుకుని బయటకి ఎందుకని వెళ్ళరో ? సాయిబ్బుల్లా వుంటామని భయం కాబోలు. ఏం వుంటే ? చక్కగా మంచిరంగుల్లో మెరుస్తున్నాయి. ఈయనకి నచ్చుతాయా ? నేనేం చేసినా అయనకి నచ్చుతుంది. ఆరుదాటింది ఈయన యింకా రాలేదు.

రాత్రి భోజనం లోకి ఏం చేసుకోవాలి ? పూట పూటకీ నేనే వండుకుని - నేనే తింటం విసుగ్గావుంది. వంటకి ఒక మనిషిని కుదిర్చి పెట్టమని యీయనతో చెప్పాలి. ఆకలి వేసిన వెంటనే తినటానికి వీలవటం లేదు. ఆకలి వేశాక అప్పుడు హొయ్యిరాజేసి వండుకోవడం అవుతోంది. ఆకలవకుండా ముందుగా వండి పెట్టుకుంటే మొఖం మీద కొట్టినట్లు ఆ వండుకున్నది తినటానికి వీలవడంలేదు. హోటల్‌కెళ్ళి తిందామంటే - ఈయన తినేది నాన్‌వెజిటేరియన్. వెజిటేరియన్ ఎక్కడ బాగుంటుందో ? ఛీ తిండి గురించి ఇంత ఆలోచనా ? ఈయన యింకా రాలేదు. ఈలోపల తినటానికి ఏదన్నా చేస్తే ! రవ్వవుంది. కూరలున్నాయి. ఉప్మా చేస్తే. కొంచెం నెయ్యివేసి రవ్వకేసరి కూడా చేసుకుంటే బాగుంటుంది. గబుక్కున తేలిగ్గా చేసెయ్యొచ్చు.

పొయ్యి మండుతోంది - నెయ్యి కాగుతున్నది.

ఈయన వచ్చినట్లు కారుశబ్దం వినిపించగానే, గరిటతో వచ్చి తొంగిచూశాను. చెప్పినట్లుగా అదే సూటులో వచ్చారు. చేతిలో మినీబార్.

"ఒక్కక్షణంలో వచ్చేస్తాను. కూచోండి. మీరు రావడానికి ముందే అయి పోతుందేమోనని మొదలుపెట్టాను" అంటూ వంటింట్లోంచే కేకేశాను.

'ఏంతొందరలేదు. టేక్ యువర్ వోన్ టైము" అంటూ పేపరు తీసుకుని విప్పారు. వంటింట్లో పని ముగించుకుని వచ్చి, యీయన వంక పరిక్షగా చూశాను. నామాట ప్రకారం యింటికెళ్లి స్నానంచేసి, అదే డ్రస్ వేసుకుని వచ్చారు. గడ్డం ట్రిమ్ చేసుకున్నాక చూట్టానికి బాగానే వుంది. లుంగీ తీసుకొచ్చి ఆయనకిచ్చాను – చూసి "వెరీగుడ్ వెరిగుడ్" అన్నారు.

"కొంచెం స్వీటు రుచి చూడండి. ఏదో చేశాను. ఎలావుందో తిని చూసి చెప్పండి" అంటూ ఒక చిన్న ప్లేట్లో కేసరి పెట్టి, స్పూన్‌తోసహా పట్టుకొచ్చాను.

"నీకు" అడిగారు.

"మీరు ముందు రుచి చూడండి. ఆ తరువాత తింటాను." స్పూన్‌తో తీసుకుని కొంచెం తిని "బాగుంది-చాలా బాగుంది-రియల్లీ" అంటూ మనస్ఫూర్తిగా అన్నారు.

"స్వీట్ పెట్టావు. హౌ ఎబౌట్ ది గుడ్ న్యూస్ - ఏదో చెపుతానన్నావు" అని అడిగారు.

చచ్చాం - దాని కోసం స్వీట్ చేశాననుకుంటున్నారా ? ఇదో చిక్కు!

"దానికీ - దీనికీ సంబంధం ఏమీ లేదు" అన్నాను ఆ ఆలోచన యీయన మరచిపోవాలని.

'సంబంధం వుందనే అనుకుంటున్నాను" అన్నారాయన.

"ఈ రోజు లంచ్ టైములో నన్ను చూట్టానికి ఆర్. కె. వి. వచ్చారు. కలుసుకు మాట్లాడాల్సిన పనివుందని ముందే ఫోనుచేశారు. అమ్మ నాదగ్గిర లేదుకాబట్టి గణేశన్ ఎడ్రసు అడిగారు. తరువాత అసలు విషయం చెప్పారు. అసలు తమాషా యికవుంది" అంటూ గ్లాసుతో నీళ్లు పట్టుకొచ్చి పెట్టాను.

గొంతు కొంచెం అల్లరిగా మార్చి, నవ్వుతూ నవ్వుతూ చెప్పుకొచ్చాను. "ఎవరో అతని కజినట. విడోయరుట. పెద్ద అయిడియలిస్టుట. వాళ్లమ్మగారు నా సంబంధం బాగుంటుందని అన్నారుట. ఈ తమాషా ఎలా వుంటుందో చూడాలని, అన్నయ్య ఎడ్రసిచ్చి పంపాను. ఈపాటికి అక్కడికి వెళ్లేవుంటారు. రేపటికి ఈ జోక్ పూర్తి అవుతుంది" అంటూ నేను చెప్పుకుపోతున్నాను. ఈయన గొంతు తగ్గించి, చాలా సీరియస్‌గా అడిగారు.

"వాట్ యీజ్ దేర్ టు జోక్ ఎబౌట్ యిట్" అని. నా నవ్వుటక్కున ఆగిపోయింది. ఆయన ప్రశ్నకు ఏం సమాధానం చెప్పాలో తోచలేదు. ఇందులో నవ్వడానికి ఏముంది ? అని యీయన అడుగుతున్నారు. దీనికి ఏమని బదులు చెప్పనా అని ఆలోచిస్తున్నాను. ఈయన అడిగారు కాబట్టి, నేను ఆలోచించే సమాధానం చెప్పవలసి వుంటుంది.

నావంక చూడకుండా ప్లేటులోవున్న స్వీటుని, స్పూన్‌తో తీసుకుంటూ, దీర్ఘాలోచనలో పడిపోయారు. ఆతర్వాత నావంకచూసి, నవ్వుతూ అన్నారు.

"ఇండీడ్ ఇట్ యీజ్ ఎ గుడ్ న్యూస్"

నేను పెదిమలు కొరుక్కుంటున్నాను. ఈ విషయాన్ని నేనిట్లా నిర్లక్ష్యం చెయ్యడం యీయనకి నచ్చినట్లులేదు.

"గంగా, రియల్లీ ఐ కన్‌సిడర్ దిస్ యీజ్ గుడ్ న్యూస్"

"బట్ ఐ డోంట్" అన్నాను. ఆయన అభిప్రాయాన్ని ఖండిస్తున్నట్లు.

ఈయన ఇంగ్లీషులో మళ్లీ అన్నారు.

"తొందరపడకు. ఎక్కడో సంబంధంలేని యీ ఆర్. కె. వి. కి నీజీవితంలో ఏదో ఒక ముఖ్యపాత్ర వున్నట్లు తోస్తోంది. ఇట్ యీజ్ సమ్‌థింగ్ రిమార్కబుల్"

ఏదో నవ్వులాటకి చెప్పబోయి అనవసరంగా చిక్కుల్లో యిరుక్కుంటున్నాను. నా మనసుని అనుసరించి యీయన మాట్లాడటంలేదు. ఈయనకి యీ విషయం పట్ల ఆసక్తి వుండదు. ఈ విషయాల గురించి మాట్లాడరు అన్న నమ్మకతో యీ సంగతి ఎత్తాను. ఇప్పుడు అనవసరంగా చిక్కుకున్నట్లున్నాను. ఈయన యీ సంగతిపట్ల చూపుతున్న వుత్సాహం, ఆమోదం చూస్తుంటే, సంభాషణమార్చి, విషయందాచి లాభం లేదనిపిస్తున్నది. ఈ విషయం గురించి నేను మర్చి, పోదలుచుకున్నాను. మర్చిపోయినట్లే మాట్లాడుతాను.

ఇద్దరం ఏదో విషయంకొరకు ఆయత్తమవుతున్నట్లు, అందుకొరకు శక్తి పుంజుకునేందుకా అన్నట్లు నిశ్శబ్దంగా వున్నాము. ఈ సంగతి గురించి సంభాషణ పొడిగించకుండా అక్కడితో ఆపడం మంచిదనిపించింది నాకు.

కాని యీయన వదిలిపెట్టేట్లు లేరు. ఈ విషయం గురించి ఆలోచిస్తున్నది చాలు అని మందలిస్తున్నట్లు చెప్పాను.

"ఇది మీ చేతుల్లోనూ నా చేతుల్లోనూ లేదు. పిల్లని అడగడానికి వెళ్లారే అక్కడ గణేశన్ మావదిన వాళ్లిద్దరూ ఆ వచ్చినవాళ్లకి వీధి గుమ్మంలోనే నాకథంతా చెప్పకుండా వదులుతారనుకున్నారా ? ఇందులో జోక్ ఏముందనికదూ అడిగారు. పెళ్లిచూపులకి నన్ను చూసుకునేందుకు రావడమనేది, ఎటువంటి నవ్వులాటైన విషయమో, మా అన్నావాళ్లకి తెలుసు. వాళ్లు ఆ విషయం చెప్పుకు చెప్పుకు, నవ్వుకుంటూంటారు" అని చెపుతుంటే ఆయన నమ్మలేనట్లు :

"నో నో - అలా ఎప్పుడూ జరగదు. అన్నీ నిశ్చయమయి - నీదగ్గిర కొచ్చినపుడు నువ్వు 'యస్' అన్నావంటే యీ కార్యం తప్పకుండా జరుగు తుంది'' అని నొక్కి అన్నారు.

''సరి అన్నీఅయి - నాదగ్గిరకు వొచ్చినప్పుడుకదా. అప్పుడు చూసుకుందాం'' అంటూ ఈ సంభాషణని అక్కడితో తుంచేశాను. కాని నామనసులో నాకు తెలుసు. ఇది నాదాకారాదు. ఒకవేళ అలావస్తే - నేను దానికి 'యస్' చెప్పబోను.

## 32

ఆర్. కె. వి. మా ఆఫీసుకొచ్చి ఎడ్రసు పట్టుకెళ్లి నాలుగైదు రోజులయింది. ఆయన వాళ్ల అమ్మని వెంటబెట్టుకుని గణేశన్ యింటికి వెళ్లాడో లేదో తెలియలేదు. అసలు ఏమయిందో కూడా తెలియలేదు. ఆ రోజు సాయంకాలమే వెళతానని అన్నారే - ఆయన ఖచ్చితంగా వెళ్లేవుంటారు. ఆపైన ఏం జరిగిందో మటుకు తెలియలేదు. అమ్మ సంతోషించి వుంటుంది. గణేశన్ ఆవిడ నోటిని నొక్కిపెట్టి వుంటాడు. వొదిన పక పకా నవ్వివుంటుంది. ఆర్. కె. వి. వాళ్లమ్మని బాగా మర్యాదచేసి పంపివుంటారు వీళ్లు. అతను ఏమని అనుకొని వెళ్లాడో? వీళ్లు ఏం చెప్పి పంపారో?

గణేశన్ యిలా చెప్పివుంటాడు. 'మేము చూసి పెళ్లి చెయ్యడానికి అదేమి చిన్న పిల్లకాదు. మా మాటకు అణిగి పడివుండే పిల్లకాదు. దానికి పెళ్లికాదు. అది పెళ్లి చేసుకోదు. మీరు తప్పుగా అనుకోకండి. ఎందుకీ వృధాప్రయాస. దానికి పెళ్లి అవదండీ బాబు. మీరేదో మంచివారు. ఓమంచిపని చెయ్యాలని తాపత్రయ పడుతున్నారు, కాని ఆ అర్హత మాకు వుండద్దా? నేను యింతకిమించి ఏం చెప్పలేను. మీరు పెద్ద రచయిత - లోకాన్ని చూసినవారు, అన్నీ తెలిసినవారు. ఈ చెప్పిం దాన్నిబట్టి మీరు గ్రహించుకోగలరు. ఇంతకిమించి ఏం చెప్పగలను.'

ఛీ, అలా చెబుతాడా? అదీ ముక్కు మొహం తెలియని ఒక కొత్త మనిషితో అలా అంటాడా? గణేశన్ విషయంలో ఏం చెప్పలేం? వాడు ఏది కావాలన్నా అనగలడు. ఎలానన్నా చెప్పగలడు. పాపం! అమ్మ ఏం చెప్పలేక ఏడుస్తుంది. వొదిన మధ్యలో చురకల్లాటి మాటలు విసురుతూ వుంటుంది.

నేను తప్పు చేశానా? ఆర్. కె. వి. కి వాడి ఎడ్రసిచ్చి పంపివుండకూడదేమో; నేనెందుకు యిలాంటి పనులు చేస్తున్నాను. ముందు వెనుకలు ఆలోచించకుండా ఏదో చిక్కుల్లో యిరుక్కుని, అమ్మని కూడా చిక్కుల్లోకి తోస్తే నాకు సంతోషంగా

వుంటుందా? రేపు నేనే ఒకదారి చూడాలి. ఎక్కడా అలికిడి లేదే! ఏం జరిగి వుంటుందో అన్న 'క్యూరియాసిటీ' నన్ను నిలవనివ్వడంలేదు. ఎవరినేనా పంపి చూస్తిరమ్మంటే. ఎవరిని పంపిస్తే - ఏం తెలుస్తుంది? ఈ సాయింత్రం అవైపుకి వెళ్లి చూసి రావాలనుకున్నాను. నేను వెళితే బాగుంటుందా?

'ఏం జరిగితే నాకేం?' అని నేను మాట్లాడకుండా వూరుకుందామనుకున్నా, యీయన వూరుకోనివ్వడం లేదు. ఆ రోజు నుంచీ రోజూ ఆ విషయం గురించే మాట్లాడుతున్నారు. ఆ విషయం గురించి చాలా సీరియస్‌గా ఆలోచిస్తున్నారు. 'ఎందుకురా యీయనతో అన్నాను' అని లెంపలేసుకున్నాను. ఆయన కోసమని అయినా యీ విషయం ఎట్లా ఫైనలయిందో తెలుసుకు, యీయనకి చెప్పేస్తే బాగుండును.

నా మటుకు నాకు యీ విషయం ఫైనలయిపోయిందనే తోస్తున్నది. అందువేతనే తిరిగి యీ మాటలు నా చెవులదాకా రాలేదు. ఆర్. కె.వి. కి ఫోన్ చేసి చూస్తే! ఫీ ఏమని ఫోన్ చెయ్యను? నేను ఫోన్ చేస్తే ఆయన మరో విధంగా అనుకోవచ్చు. నేనీ విషయంలో యింటరెస్టు చూపిస్తున్నాననుకోవచ్చు. ఎన్నిసార్లు ఎన్ని విధాల ఆలోచించినా అంతుపట్టడం లేదు. ఈ బాధ డబ్బుపెట్టి కొనుక్కునట్లయింది చివరికి. అసలు మొదటితప్పు గణేశన్ యింటి అడ్రసు యివ్వడం. రెండో తప్పు యీ విషయం యీయనతో చెప్పడం. చాలు యీ చేసిన రెండు తప్పులూ చాలు. ఇంకా మూడోది కూడా ఎందుకు? ఈయన నాకు చెపుతున్నంత వోపిగ్గా మంజుకు కూడా చెప్పరనుకుంటా. అంత నిదానంగా నాకు బోధిస్తున్నారు. కడుపున పుట్టిన బిడ్డకు చెప్పినంత ప్రీతిగా మంచి చెడ్డా చెపుతున్నారు.

పెళ్లయిం తరువాత ఈయన నన్ను చీటికి మాటకి వచ్చి చూడరుట. నేను కూడా ఆయన్ని చూడకూడదుట. ఫోన్లు చెయ్యకూడదుట. ఆ వచ్చే 'అతను' యీయన్ని చూసి యిష్టపడితే, ఒక స్నేహితునివలె, ఎప్పుడైనా వచ్చి చూసి వెళుతుంటారుట. అతను అంటే ఆ వొచ్చే మనిషి మంచివాడిలాగానే అనిపిస్తున్నాడుట. 'మీ కెందుకలా తోస్తున్నది?' అని నేను అడగలేదు. 'మంచి మనిషి' అన్న దానికి అర్థమేమిటని కూడా నేను అడగలేదు. ఈయన కంటున్న పగటి కలలనీ, వూహాలనీ విని ఆనందిస్తున్నాను. అతనికి తెలియని రహస్యం అంటూ నా దగ్గిర వుండకూడదుట. అంటే నేను ఏ విషయం దాచకుండా చెప్పేయ్యాలట. నా గురించి అతనేదేనా యిప్పటికే వినివుండి, ఆ విషయాల గురించి గనక నన్ను అడిగితే, ఏ వొక్క విషయం దాచిపెట్టకుండా జరిగిందంతా చెప్పేయ్యాలట. కాని ఆ 'అతను' ఈయనే అని మటుకు చెప్పకూడదట. ఒకవేళ నేను గనక అలా చెప్పేస్తే, ఇకమీదట ఆయన నన్ను కలుసుకోరుట. చూడరుట.

అలా చెప్పేసినందువల్ల కోపం వచ్చి కాదుట, ఇది తెలుసుకున్న తరువాత తిరిగి మేము కలుసుకోవడం బాగుండదట. నా సంసారజీవితం, అమోఘంగా, మూడు పువ్వులూ ఆరుకాయలతో, పచ్చ పచ్చగా వుండాలిట. ఎంతో పుణ్యం చేసుకుంటే గాని నాలాటి మంచిపిల్ల భార్యగా లభించదుట. అన్నీ కలిసి వస్తున్నపుడు, అదృష్టం వచ్చి తలుపు తడుతున్నపుడు, కాదని దాన్ని తోసెయ్యకూడదట. చెయ్యి అడ్డుపెట్టకూడదట. ఒకవేళ నేను ఏదన్నా అడ్డుపుల్లవేసి - కాదు అంటే నా ముఖం కూడా చూడరుట. తనకి అంత కోపం వస్తుందట.

ఇలా రోజు రోజూ నాకు పెళ్లిచేసి ఆనందిస్తున్నారీయన.

వాకింగ్‌కి వెళ్లివస్తున్నాము. ఆదివారం అవడంచేత వస్తూ కాఫీతాగి సావకాశంగా వచ్చాము. రోజూకంటే ఆలస్యమయింది. టైము తొమ్మిదయింది. కారులోంచి దిగుతుంటే చూశాను. చేతిలో ఓ మూట పట్టుకుని, వీధి గుమ్మాలమీద అమ్మ కూచునివుంది. నన్ను చూస్తూనే సంతోషంతో నవ్వింది. ఆమెని చూసి చాలా రోజులయింది, నాకూ సంతోషంగానే వుంది. అమ్మని చూడగానే ఆయన భయపడిపోయి 'నేను వస్తాను' అంటూ బయలుదేరి వెళ్లిపోయారు. కారునిగాని ఆయన్ని గాని గమనించనట్లు అమ్మ నన్నుమటుకు 'రా - రా' అంటూ పిలిచింది

"వచ్చి చాలా సేపయిందా?" అడిగాను.

"ఇంతకుముందే వచ్చాను. మళ్ళీ గాభాలున భయం పట్టుకుంది. ఆదివారం అయిందే నువ్వెక్కడికయినా 'సర్క్యూట్‌కి' వెళ్ళేవేమో ఏ సాయంకాలందాకా రావేమోనని. ఏం చెయ్యాలో పాలు పోక కూచునివున్నాను"

తాళం తీసాను. లోపలికి రాగానే అమ్మ అంటోంది. "నువ్వు ఎంతసేపటికి వచ్చినా సరే - వచ్చేదాకా కనిపెట్టుకుని కూచుందామనుకున్నాను. తిరిగి వెళ్ళానంటే వాడు నవ్వుతాడు. తలుపు తాళంపెట్టి వుండటంచేత వచ్చానో, లేక వెళ్లగొట్టటం చేత వచ్చానో, ఎవరికి తెలుసు?"

ముందువైపు తీగెమీద లుంగీ ఆరుతోంది. మంచిపని. అమ్మదాన్ని చూడక ముందే చుట్టచుట్టి దాచేశాను. ఆవిడకేం తెలుసు? నా చీరె అనుకుని వుంటుంది కూడాను.

హాలులో 'మినీబార్' కూడా వుంది. నిన్న ఈయన దీన్ని తీసుకెళ్లలేదు. లిక్కరు పూర్తిగా ఖాళీ అయిన రోజుగాని యింటికి తీసుకెళ్లరు. మిగులూ తగులూ యిక్కడే పెట్టి వెళ్లిపోతూంటారు? ఈ సాయంత్రం ఏం చేస్తారో? ఇది లేకపోతే ఆయన తాగుడు నిలిచిపోతుందేమిటి? ఇంట్లో కేసులకొద్దీ సీసాలు కొని వుంచుకోరా? అమ్మను చూశారు కాబట్టి ఈ సాయంత్రం యీ ఛాయలకురారు, రేపు పొద్దుట కూడా వీధిలోంచే హారన్ కొడతారు.

అమ్మ యీ లిక్కర్ కేసుని చూసి 'ఇదేమిటని?' అడుగుతుందేమోననే భయంతో, ఆ పెట్టెని తీసుకెళ్లి నా గదిలో పెట్టేశాను.

ఈ ఇంట్లో 'ఈయన తాగుతున్నారు నాన్‌వెజిటేరియన్ తింటున్నారు' అని జ్ఞాపకం వచ్చి నాలిక కొరుక్కున్నాను.

హాలులో స్తంభానికి ఆనుకుని కూచుని అమ్మ మూట విప్పుతోంది. దాన్నిండా రేకు డబ్బాలు, సీసాలు, కాగితం పొట్లాలూ వున్నాయి. ఏవేవిటో వొడియాలూ, వరుగులూ, పచ్చళ్లూనూ - - -

"అక్కడున్నానే గాని మనసంతా యిక్కడే వుంది. ఏపూటా ముద్ద నోట్లో పెట్టుకోగానే నువ్వు ఏం వండుకున్నావో - తిన్నావో లేదోనని బాధపడుతుండేదాన్ని. మనసులో అనుకోవడంతప్ప పైకిఅని గెలవగలనా ? నీ పేరు చెపితే, అందులోనూ నేను గనక నీపేరు ఎత్తితే అందరూ తలో మాటా అంటారు. నారోజులు బాగా లేవని నోరు మూసుకు వూరుకునేదాన్ని. రంగసామి డబ్బివ్వడానికి వచ్చినపుడు వాడిని చాటుగా అడిగేదాన్ని నువ్వెల్లా వున్నావోనని. గణేశన్‌కి యనభైరూపాయలిచ్చి, మిగతా యిరవై నాదగ్గిర పెట్టుకునేదాన్ని. అవిమటుకు నాకోసమా ఏమిటి? ఆ యింట్లో వాళ్ళ ఖర్చులకేగా! పిల్లలు ఏదన్నా కొనిపెట్టమంటే వాకిట్లోకి వచ్చినవి, నాయిష్టం వచ్చినట్లు కొనిపెట్టేదాన్ని. అంచేతనే నా యిష్టం వచ్చినవి మూట గట్టుకు తెచ్చుకున్నాను. నా డబ్బు నేను తింటూ కూడా వాడికి అణిగి మణిగి పడివుండాలి" అంటూ ఏదో కొంత పైకి, కొంత తనలో చెప్పుకుంటూ లేచి లేచి వంటింట్లోకి, హాల్లోకి వెళ్లి వెళ్లి వస్తోంది. తెచ్చిన సామానంతా సర్దుకుంటూ గిర గిర తిరుగుతోంది.

హాలులో కూచుని మాట్లాడకుండా అంతా చూస్తున్నాను.

"ఇది ఎలా వుంటుందో చూడు" అంటూ స్పూన్‌తో ఏదో తీసుకొచ్చి పెట్టబోయింది.

"ఏమిటి ?" అడిగాను.

"చెయ్యిపట్టు. నువ్వే చెప్పు ఏమిటో ?" అంటూ అరిచేతిలో పెట్టింది. ఏమిటో తమాషా అనుకుంటూ తిని "బాదం హల్వా" అని అన్నాను.

"అది మటుకు కాదు" అంటూ చప్పట్లు కొట్టి నవ్వింది. "ఆలోచించి చెప్పు. కొనుక్కో గలవేమో చూద్దాం" అంటూ యింకో స్పూన్ తీసుకొచ్చి పెట్టింది. ఇందులో ఆలోచించాల్సిందేముందని.

"నాకు తెలియడం లేదు. తినటానికి బాగుంది" అంటూ చెయ్యి కడుక్కున్నాను. నేను అదేమిటో గుచ్చి గుచ్చి అడుగుతానని అనుకుంది కాబోలు. అడిగివుంటే 'బాగా ఆలోచించి చూడు' అంటూ యింకో నాలుగు స్పూన్లు పెట్టి, చప్పట్లు కొడుతూ

ఆలోచించి వుండేది. నేను మొద్దులాగా చెయ్యి కడుక్కుని 'టక్' అని ఆ విషయాన్ని అక్కడితో ఆపేశాను.

"బంగాళాదుంపల హల్వా. ఒక చుక్క బాదం ఎసెన్సు వేశాను. ఎవ్వరూ కనిపెట్టలేక పోయారు. అచ్చు బాదం హల్వాలాగా వుంది. ఏం తేడావుంది? దీనికోసం అనవసరం ఖర్చు. బాదంకాయలు చితకొట్టి, పప్పు నానబెట్టి" అంటూ పెద్ద చాంతాడులాగా మాటలు ఆరంభించింది - నేను గదిలోకి వెళ్లిపోయాను.

"కాస్త కాఫీ కలిపి పట్టుకురానా?" గదిగుమ్మం దగ్గిర నిలుచుని అడుగుతోంది. నాకిప్పుడు తాగాలనిలేదు. ఒకవేళ ఆవిడకు తాగాలని వుందేమోనని 'సరి' అన్నాను.

వంటింట్లోకి వెళ్లి తనలో తను మాట్లాడుకుంటూ కాఫీ కలుపుతోంది. సామానంతా కలిపేశానుట. తను పెట్టిన చోటులో ఒక్క వస్తువు కూడా లేదుట. బాత్‌రూమ్ అంతా పాచిపట్టి వుందిట. గదులన్నీ వారానికి ఒక్కసారన్నా కడగాలిట. అరికాళ్లకి జిడ్డు అంటుకుంటోందిట. "పాపం అది మటుకు ఏం చేస్తుంది?" అంటూ మళ్లీ జాలి పడుతోంది. 'హోటలు భోజనం చెయ్యకుండా యింట్లో వండుకు తింటోంది. అది నయంకదూ" అంటూ మళ్లీ తృప్తిపడి పోతోంది. కాఫీ పట్టుకొచ్చి యిచ్చి, "ఏం వండను?" అని అడిగింది.

కాఫీ తాగుతూ 'నీకు' అని అడిగాను.

"వుంది - వుంది" అంటూ వంటింట్లోకి వెళ్లింది.

కడుపునిండా భోంచేసి చాలా రోజులయినట్లుంది. ఈవిడ యింటి కొచ్చేసింది. నాకు మనసుకి తెరిపిగా, హాయిగా వుంది. కాని ఒక విషయం మటుకు అనుమానంగానే వుంది. ఈవిడ రాక వెనక ఏదో ఒక కారణంవుంది. అది ప్రారంభించడానికి సరిఅయిన టైముకోసం ఎదురు చూస్తోంది.

స్నానం చెయ్యడానికి బాత్‌రూమ్‌కి వెళ్లాను.

ఆర్. కె. వి. వచ్చి పెళ్ళి విషయం మాట్లాడి వెళ్లిపోయాక, యీవిడకూ గణేశన్‌కీ మధ్య నిప్పు రాజుకుని వుంటుంది.

ఆ పెళ్లి ప్రపోజల్స్‌ని ఎవరు తిప్పికొట్టి వుంటారో అని - యోచిస్తున్నాను.

అమ్మ 'వద్దు' అని వుండదు. గణేశన్ వున్నమాట కుండ బద్దలు కొట్టినట్లు చెప్పేసివుంటాడు. జరిగిందేదో ఆవిడే చెప్పవచ్చుగా. అది చెప్పడానికే గదా వచ్చింది. బంగాళదుంపల హల్వా ఎలా చెయ్యాలో నాకు నేర్పడానికి వచ్చిందా? మరి దేనికి?

వచ్చిన వెంటనే అలవాటు ప్రకారం అమ్మ వంటింట్లో ప్రవేశించింది. ఆ యింట్లో సామానంతా దులిపి, కడిగి శుభ్రం చేసింది.

బాత్‌రూమ్‌లోంచి బయటికొస్తున్నాను. వంటింట్లోని నూనె మరకలన్నీ తోమి తోమి కడిగేసింది. పాపం! ఇట్లా ధారాళంగా బిందెలు బిందెలు నీళ్లుపోసి కడగడం అక్కడ వీలవుతుందా? అసలే అక్కడ నీళ్ల యిబ్బంది. ఒక వాటాలో కావిని నీళ్లు పోసి కడుగుతే పక్కవాటాలోకి పోతాయి. అసలు నీళ్లంటూ వుంటేగదా! ఇలా ధారాళంగా నీళ్లు వస్తేగదా! పాపం నీళ్లకి కరువు వాచినట్లుంది.

ఇన్నిరోజులకి ఈనాడు సావకాశంగా స్నానం చేశాను. డ్రస్ చేసుకుని మంచం మీద, తడితలతోనే హాయిగా పడుకున్నాను. చాలా రోజుల తరువాత తడితల ఆరబెట్టుకుంటూ, వెల్లకితులా పడుకుని పుస్తకం తీరికగా చదువుకుంటున్నాను. లేకపోతే పొయ్యిమీద ఒక కన్ను పుస్తకంమీద మరో కన్ను. హాలుకీ వంటిల్లుకీ మధ్య పరుగెత్తుతూ వంట చేసేదాన్ని.

నేను వండుకున్నది నేనే తినాలి అంటే నయించేది కాదు. తినబుద్ధి పుట్టదు. ఎవరన్నా వొండిపెడితే, తినటానికి రుచిగావుంటుంది.

తడిచెయ్యి తుడుచుకుంటూ అమ్మ హాలులోకివచ్చి, సోఫాలో కూచుని, గదిలోపల చదువుకుంటున్న నన్ను చూస్తోంది.

"ఆర్. కె. వి. అని నువ్వు చెప్పావే.– ఆ ఆర్. కె. వి. అన్నాయన వచ్చారు. నువ్వు వాళ్లింటికి కూడా వెళ్లావుట. అడ్రసు కూడా నువ్వే యిచ్చావుట. ఆపై విషయాలు నీకేం తెలియవని చెప్పారు. ఆయనతోపాటు వాళ్లమ్మగారు కూడా వచ్చారు. చాలా మంచి మనిషి" పుస్తకం మూసేసి కూచున్నాను.

"పనికిరానివాడు - పోకిరీ పిల్లవాడు" అని అన్యాయంగా వెంకు అన్నయ్య అంటూ వుండేవారు. ఈతను ఎంత మంచివాడో తెలుసా? ఆ కథలు రాసే అతను యితనే అని తెలిసి ఆ యింట్లోవున్న జనమంతా గుంపుగా చుట్టు ముట్టేశారు.

"ఒదినా ఆడబిడ్డలకు పడక మనం విడిగా వున్నామని అతను అనుకున్నాడు. అతనెందుకొచ్చాడో నువ్వు అడగలేదా?" అంటూ మిగతా విషయాన్ని ప్రారంభించడమా, మానటమా అని నా ముఖంలోకి చూసి, నా మనోభావాల్ని పట్టుకోవడానికన్నట్లు, తలెత్తి నా కళ్లలోకి సూటిగా చూస్తోంది. నేను నవ్వుతున్నాను.

## 33

నేను అనుకున్నట్లుగానే అన్నీ జరిగాయి. ఆర్. కె. వి. వాళ్లు వెళ్లిపోయాక గణేశన్ అమ్మతో దెబ్బలాట వేసుకున్నాడనుకుంటా. "ఆలోచించి చెబుతాం.

అమ్మాయిని కూడా అడగడం మంచిది కదా" అంటూ అని వాళ్ళని మర్యాదగా సాగనంపారు.

వాళ్లు వెళ్ళిపోయాక గణేశన్ పంచాంగం విప్పాడుట. చాలా అసహ్యంగా అన్నాడుట. "పెళ్లి చేసుకుని ఒకడితో బుద్ధిగా కాపరం చెయ్యగలిగిన యోగ్యత దానికివుందా? అతనేదో అసలు విషయం తెలీక పిల్లని అడగడానికి వస్తే పొంగిపోర్లపడి పోతున్నావు" అంటూ అరచి గొడవ చేశాడుట. వాడు నోటికి వచ్చినవన్నీ వాగాడుట. వాడడిగిన మాటలకి అమ్మ నోరెత్తి బదులు చెప్పలేక పోయిందట. వాడు అలాంటి అనరాని మాటలన్నీ అన్నాడుట. తిరిగి మాట్లాడ లేకపోయిందట. ఈ విషయం చెబుతుంటె ఆవిడ కళ్లలోంచి, నీళ్లు జలజలా రాలాయి. నన్ను బతిమాలుతున్నట్లు, ఏదో అర్థిస్తున్నట్లు అడుగుతోంది.

"నా మాట వినవే. ఈ వొక్క విషయంలోనూ నా మాట విను. ఈ కారువాడు వుత్త పోకిరీ మనిషి. వాడితో నీకీ సావాసం వద్దు తల్లీ. అతను చాలా చెడిపోయిన మనిషిట. వుత్త పనికిమాలినవాడని వూరూవాడా ఏకమై కూస్తున్నది! ఈ అపవాదు నీకెందుకమ్మా - ఎవరన్నా నిన్ను చేసుకుంటానని వస్తారా అని వెయ్యి కళ్లతో ఎదురు చూశాను. ఆ శుభ సమయం రానే వచ్చింది. ఆ కథలు రాసేవాడు వయసులో చిన్నవాడయినా చేతులెత్తి దణ్ణం పెట్టవల్సినంత దొడ్డమనిషి. నా మనసులో శంకలన్నిటికీ ఎంతో విశదంగా బదులు చెప్పాడు. ఆ బెంగుళూర్ పెళ్లికొడుకు చాలా మంచి మనిషిట. కుడిచేత్తో చేసే పని ఎడం చేతికి తెలియ నివ్వనంతటి వుత్తముడుట. అటువంటి గుంభన గల మనిషట!" నాకు దగ్గిరగా వచ్చి, గొంతు తగ్గించి నా మనసు కరిగేటట్లు, నిగూఢార్థంతో చెపుతున్నది.

"భర్త చనిపోయిన బాల్య వితంతువుని పెళ్లిచేసుకోమని మీరంతా చెపు తున్నారు. బాగానే వుంది. ఆ వొచ్చే పిల్ల 'ఇంతకు ముందు మరో ఆడదానితో కాపరం చేసినవాడు' అని నన్ను అనుకోదా? కొన్నాళ్లు కాపరం చేసి భర్తను కోల్పోయిన స్త్రీలు చాలా మంది వున్నారు. పెళ్లిచేసుకుంటే అలాంటి అమ్మాయిలలో ఒకమ్మాయిని చేసుకుంటాను అన్నాడు: ఇతను యిలాంటి పిల్లని చేసుకునేందుకు ముందుకొచ్చినా - అలాంటి పిల్లలు యీ పెళ్లికి సిద్ధపడటం లేదే అని - అంచేత నువ్వు ఏం మాట్లాడక్కర్లేదు. నన్ను అడిగితే మనం ఏమీ దాచవద్దు. వున్నది వున్నట్లు విషయం అంతా చెప్పేసి, ఆపైన పెళ్లి నిశ్చయించుకోవచ్చు. ఎవరినీ మోసగించవద్దు. ఏదీ దాచిపెట్టనూ వద్దు. అన్నీ వివరంగా ముందే చెప్పేద్దాము. నేను రెండు మూడు రోజులు ఆలోచించాను. ఇది వుత్తమమైన మార్గంగా తోచింది. ఎందుకే నవ్వుతున్నావ్?"

ఈవిడ అడిగాక తెలిసింది. నేను నవ్వుతున్నానని.

ఈవిడ చెపుతున్న నీతులకి నవ్వక ఏం చెయ్యను? ఇన్నాళ్లనుంచీ నన్ను పెళ్లిచేసుకోవడానికి ఎవరూ ముందుకు రాకపోవడంచేత, నేను యిన్ని సంవత్సరాలుగా పెళ్లిచేసుకోకుండా వున్నానా? ఈవిడ యీ మాదిరిగా అనుకుంటున్నది - అని తలుచుకునేసరికి నవ్వు వచ్చింది నాకు. ఈ విషయం ఎంత తేలిగ్గా చెపుతున్నదో? నేను జరిగిందంతా మర్చిపోయి ప్రవర్తించాలా? ఎప్పుడో కారులో జరిగిన ఆ సంఘటన ఒక్కటే కాదు - ఆ తరువాత ఈ రోజున యీయన నన్ను కార్లో తీసుకొచ్చి దింపి వెళ్లారే ఇప్పటిదాకా జరిగినవన్నీ మర్చిపోయి, ఎవరో ఒక మనిషిని నా స్వంతం అనుకుని, హృదయాన్ని అర్పించి, ఆయన అవసరాలు తీరుస్తూ, ఆ పరపురుషునితో కాపరం చెయ్యడం అన్నది తల్చుకుంటుంటేనే కంపరంగా వుంది - ఏదో వెలపరంగా వుంది. అలాంటప్పుడు ఆచరణలో ఇది ఎలా సాధ్యమవుతుంది? నేను అలా చెయ్యగలిగినపుడు, గణేశన్ నేను ఏ వెధవపనులు చేస్తున్నానని అంటున్నాడో, ఆ వెధవ పనులన్నీ చెయ్యగలిగి వుండేదాన్ని. వెంకు మామయ్యని నిరాకరించి వుండేదాన్ని కాదు. బస్‌లో వెనకనుంచి మీదపడేవాళ్లని చూసి భయంతో తప్పుకుని, తప్పుకుని నక్కి వుండేదాన్ని కాదు. కండక్టర్ వేలు తాకుతూ చిల్లర యిస్తుంటే, నా దేహం సిగ్గుతో కుంచించుకుపోయి వుండేదికాదు. ఇదంతా అర్థం చేసుకున్నవుడే - నేను పెళ్లి ఎందుకు చేసుకోలేనో బోధపడుతుంది. ఈ మనుషులని ఆమడ దూరంలో వుంచే నేను - యీ బెంగుళూరు పెళ్లికొడుకుని ఎలా దగ్గరకు చేరనిస్తాను? హేతుబద్ధంగా చూస్తే, బోధపడే యీ విషయం ఈ అమ్మకి ఎంత వివరించి చెప్పినా అర్థంకాదు. ఆవిడకు అర్థం అయేటట్లు చెప్పడం నా తరంకాదు - అని నాలో నేను అనుకుంటూ నవ్వుకున్నాను.

మనస్ఫూర్తిగా నా మనసుని ఎవరికీ అర్పించలేను. ఆ విషయం నాకు బాగా తెలుసు. ఒకవేళ నేను ఎవరికేనా మనసా వాచా నన్ను నేను అర్పించుకున్నాను అంటే అది వుత్త అబద్ధమైన జీవితమే తప్ప నిష్కళంకమైన జీవితం కాదనీ, అది వొట్టి వ్యభిచారమనీ, వ్యభిచారం చెయ్యడానికి నేను వొడబడ్డాననే అర్థం. నేను ఎందుకిలా ఆలోచిస్తున్నాను. నా మటుకు నాకు పతనంలో ఇది మొదటిమెట్టు తప్ప వేరొకటి కాదు. అది తల్చుకుంటే నేను పాతాళంలోకి కుంగిపోయినట్లు భయంగా వుంటుంది. నాకు అన్నివిధాలానచ్చి, నా మనసుని అన్ని వైపులనుంచీ ఆకర్షించుకున్న యీయనపట్లే నేను తొలగి దూరంగా వుంటూ వుంటానే, ఈయనకంటే ప్రీతిపాత్రుడు మరొకరు లేడు. నాకు తెలియకుండానే మొదటి చూపులోనే నా హృదయం స్పందించివుంటుంది. 'నేను ఐ లవ్ హిమ్' అయితే యీ ప్రేమ అన్ని ప్రేమలకిమల్లే ఒక గమ్యంలో ముగిసిపోదు. ఒక ధరికి చేరుకునేది,

ఒక గమ్యానికి వచ్చి ఆగిపోయేది, దిక్కు తెలియనిదీకాదు. ఈయన మీద యిష్టం వల్లగాని, ఆయనపై వ్యామోహం చేతగాని నేను ఏనాడూ, ఏ పరిస్థితిలోనూ ఆయనకి లొంగి, వొడబడిపోను. ఈ దేహం తప్ప ఆయన ఏది అడిగినా నేను యివ్వడానికి సిద్ధంగా వున్నాను. ఒకవేళ ఆయనే నన్ను కాంక్షించి, ఆ కాంక్షకు రకరకాల రంగు పూసి అర్థిస్తే, ఈయన్ని పూర్తిగా అర్థంచేసుకున్న నేను, ఎటువంటి బలహీన స్థితిలోనూ వొప్పుకోను, ఈ విషయం ఆయన కూడా గ్రహించలేదని — నాలో నేను నవ్వుకున్నాను.

నాలోని యీ భావసంచలనాన్ని అమ్మకి ఎలా విడమర్చి చెప్పను? ఎలా చెపితే అర్థం అవుతుంది.

"గణేశన్ మాట అలావుంచు. పేరాశతో బుద్ధిని మభ్యపెట్టుకోకూడదు. ఇదంతా జరిగే పనికాదు. దీన్నిగురించి మాట్లాడి మాట్లాడి లేనిపోని పేకమేడలు కట్టుకుని మనసుని కష్టపెట్టుకోకు" అన్నాను.

ఈ జవాబు అమ్మ మనసుని ఎంత గాయపరుస్తుందో నాకు తెలును. దీన్ని యింకా పొడిగిస్తే, వ్యవహారం బెడిసికొట్టి, నాకు ఎక్కడకోపం వస్తుందేమోనని, భయంగావుంది.

అమ్మ ఒక పెద్ద నిట్టూర్పు విడిచి ఇంక మాట్లాడితే ఏగొడవవుతుందోనని, భయంతోలేచి వంటింట్లోకి వెళ్లిపోయింది.

చదవడం ఆరంభించాను.

వంటింట్లో ఏవిటో తనలో తను గొణుక్కుంటోంది. ఏవిటో మాట్లాడుకుంటోంది. నేను విననట్లు వూరుకున్నాను.

భోజనం వడ్డిస్తూ మళ్ళీ నెమ్మదిగా ప్రారంభించింది.

"ఎన్ని బాధలు పడినా ఎంత మాట్లాడినా అవుతుందా? బాగా ఆలోచించి చూడు. చూసేవాళ్ళకేం నోటికొచ్చిందంతా అంటారు. నువ్వు సుఖంగా, గౌరవంగా నలుగురికిమల్లే బతకాలన్న ఆశతో చెపుతున్నాను" అంటూ పమిట చెంగుతో కళ్లుతుడుచుకుంటోంది.

నేను మాట్లాడకుండా తింటున్నాను. ఆవిడమీద కోపం తెచ్చుకోకూడదని, ఆవిడని ఏమీ అనకూడదనీ మనసులో నిశ్చయించుకున్నాను. ఈ విషయంలో నేను కోపం తెచ్చుకోవడం అది నా బలహీనతకు నిదర్శనం తప్ప వేరుకాదు. నా మనసు వూగిసలాడటం చేతనో, లేక నాలో పిరికితనం వుంటేనో కోపం వస్తుంది. ఇవేమీ లేనపుడు నాకు కోపం రాకూడదు. తమాషాచేసి చూద్దామని, అల్లరి చేద్దామనే వుద్దేశంతో ఆర్. కె. వి. ని అక్కడికి పంపాను. అటువంటప్పుడు ఈ తమాషాని చూసి ఆనందించాలి తప్ప కోపం తెచ్చుకోకూడదు.

నేను మౌనంగా వుండటంచేత, అది అర్ధాంగీకారమనుకుంటోంది యీావిడ.

సాయంకాలం గణేశన్ వచ్చాడు. వాడొచ్చి ఏమడుగుతాడో? ఏమంటాడో అని భయంగా వుంది. వీడితోమాట్లాడి ఎన్నేళ్లయిందో? వీడొచ్చి ఏదేనా అడిగితే - ఏం జవాబు చెప్పాలన్నది కూడా నాకు తట్టలేదు. బుర్ర బ్లాంక్‌గా అయిపోయింది. వచ్చి హాల్లో కూచుని వున్నాడు. అమ్మ కాఫీ కాచి తెచ్చిస్తున్నట్లుంది.

"ఏమంటోంది? ఏం జెప్పింది?" అని అడుగుతున్నాడు. అమ్మ ఏం జెప్పిందో నాకు వినిపించలేదు. చేత్తో సౌంజ్ఞ చేసిందేమో! నాకు వినిపించాలనే గొంతు హెచ్చించి మాట్లాడుతున్నాడు.

"ఖర్మ కొద్దీ మన కుటుంబంలో యిటువంటి జరగరాని పని జరిగిపోయింది. అందుకని అదేదో పట్టుబట్టినట్లు యింకా చెడిపోవాలా? చెడిపోయే టైమొచ్చినపుడు - ముందు వెనకలు చూడకుండా ఎలానూ నాశనమైపోయింది. మంచి మార్గాన నడవడానికి, బయటపడడానికి యింత ఆలోచనా? దీనికి కూడా కిందా పైనా చూస్తూ చిలుచుందీ అంటే, యిది మన ఖర్మగాక మరేమనుకోవాలి?"

దీనికి నేనేదన్నా సమాధానం చెపుతానని అనుకున్నట్లున్నాడు. నేను మాట్లాడకుండా వుండటంచూసి, గది గుమ్మం దగ్గరకొచ్చి నిలుచున్నాడు. నేను పుస్తకాలని సర్దుకుంటున్నాను. వాడువచ్చి నిలుచున్న విషయం తెలుస్తున్నది. వెనక్కి తిరిగి వాడిని చూడాలని అనిపించలేదు. వాడి మొహంలోకి సూటిగా చూసి ఎన్నో ఏళ్లయినట్లుంది. నన్ను చూశానన్న కారణంచేత వాడు పోట్లాటకి వస్తూంటాడు. కాని నేను ఎప్పుడూ వాడిని చూడలేదు. చూడకుండావుండటం వేరు - చూడకూడదని ముఖం తప్పించుకోవడం వేరు. నేను చూడకూడదనే ముఖం తిప్పుకున్నాను.

'ఇదిగో - గంగా' వీడు పిలిచే తీరు యిది. "ఇదిగో - ఇదిగో" అంటే యిటు చూడు అని అర్ధం. వాడు యిటుచూడు అని అడిగినా - నాకు చూడబుద్ధి అవలేదు. వాడే మాట్లాతున్నాడు. నోటినిండా తమలపాకులతో ముద్ద ముద్దగా మాట్లాడుతున్నాడు. నేను యింకా వాడివంక చూడలేదు.

"నీ యిష్ట వచ్చినట్లు వుంటానంటే నిన్ను వదిలేశాము. ఇప్పుడు కూడా నువ్వేదో బాగుపడతావని నీ మంచికోరి చెపుతున్నాను. అయిందేదో అయిపోయింది. నువ్వు యిలా మొండిగా, ఎవరి మాటా వినకుండా వుండటం వల్లనే నలుగురూ చూసి నవ్వుకునేందుకు ఆస్కారం దొరికింది. పసిపిల్లవు కాదు. నువ్వు ఎలాగో అలా గౌరవంగా బతకాలని అమ్మ ఆశపడుతోంది. నాకు నీ గురించి బాగా తెలుసు. నాకుమటుకు నువ్వు సుఖపడాలని ఆశ వుండదా! అందుకనే మా మాటలని లక్ష్యపెట్టవని తెలిసికూడా వచ్చాము. ఇది నీకు లాస్ట్ ఛాన్సు. ఇప్పుడు కూడా నువ్వు మేము చెప్పింది వినక, మా మాటని తోసి పుచ్చావంటే

ఇక యీ జన్మలో మనం కలుసుకోవడం సంభవించదు. మన రక్తసంబంధం మరి అతుక్కోదు. నువ్వెల్లాయినా నాకేం ఫరవాలేదు - ఎటొచ్చీ అమ్మ మటుకు సుఖ శాంతులులేక, చచ్చేదాకా ఏడుస్తూ కష్టపడుతుంది. 'ఇదిగో' నేను చెప్పేది బుర్ర కెక్కుతోందా ?"

నేను వెనక్కి తిరిగి చూశాను. ఏమీ మాట్లాడాలని అనిపించలేదు. ఏం మాట్లాడాలో తెలియలేదు. అమ్మ హాల్లో నిలుచుని వున్నట్లుంది.

"నో" అన్నాను. గొంతు పట్టుకుంది. ఇదివరకటిలాగా కొట్టబోతాడేమో ! నని విచిత్రమైన చిన్నతనపు వూహ మదిలో మెదిలింది.

"నో – నేను అది సంభవమని అనుకోను. అనుకోలేకుండా వున్నాను" అన్నాను.

"నీకు పెళ్లవుతుందని మేము కలలో కూడా వూహించలేదు. మనం అనుకోనిదీ, వూహించనిదీ జరకూడదా ఏమిటి ? మర్యాదగా, గుట్టుగా, అందరికి మల్లే జీవితం గడపాలన్న కోర్కె గనక నీలోవుంటే, యీ ఛాన్సు వొదులుకోవు" అంటూ కొంచెం కఠినంగాను, అధికారంతోనూ అన్నాడు.

వాడికెందుకీ తాపత్రయం ? అమ్మకయితే నా మీద ప్రేమ. నేనేమయిపోతానో అన్న బాధతో గిలగిల్లాడి పోతున్నది. వీడికెందు కంట మధ్యన ? - నా గురించి వున్నవీ లేనివీ కలిపించి బాకా వూదుకుంటూ తిరిగేవాడు - - - ఆలోచించు కుంటున్నాను. నా మనసులోని మాటను గబగబా అడిగేద్దామని అనిపించింది. కాని యీ మాటలన్నీ అడగడం ముఖ్యం కాదనిపించింది.

నాలో నేను మథన పడుతున్నాను. ఈ విషయంలో వీడెందుకింత తాపత్రయ పడుతున్నాడని.

పాపం ! చెల్లెల్ని యింట్లోంచి వెళ్లగొట్టానని మనసులో ఎక్కడన్నా కలుక్కు మంటోందేమో ! వాడు వెళ్లగొట్టడం న్యాయంగానే వుంది. తను చేసింది చాలా నీతి వంతమైన పని అని సమర్థించుకోవడానికే గదా, వున్నవీ లేనివీ నా గురించి ప్రచారం చేసి, అవి నిజాలని తనని తానే మభ్యపరచుకుంటూ, నన్ను ద్వేషించి సంతోషపడుతున్నాడు.

"లేకపోతే నిన్ను కార్లో తిప్పుతున్నాడే ఆ ప్రభూగాడిని పెళ్లి చేసుకోమని అడిగి చూడు. ఆ మాట అడిగిన మరుక్షణంలో నీ వంక తిరిగి చూడకుండా పారిపోతాడు. తెలుసా ?" నన్ను బెదిరిస్తున్నాడు.

"పెళ్లంటూ చేసుకుంటే కదా !" అని నాలుక కరచుకున్నాను.

"అమ్మా విన్నావా ? ఇది అన్నమాట వింటున్నావా ? పెళ్లంటూ చేసుకుంటే గదా అని అడుగుతోంది" అని అంటున్నాడు. నేను మనసులో నవ్వుకున్నాను.

"దీంతో మాట్లాడి ప్రయోజనం లేదు. దాని మాటే గాని యింకోళ్ళ చెప్పింది వినదు. అందరినీ యీసడించి నిలుచునుంది. దీన్ని కన్నందుకు శిక్ష అనుభవిస్తున్నాను. నువ్వు దాంతో మాట్లాడకు. ఇదంతా నా ఖర్మ. పొగ లేకుండా నిప్పు వుడుతుందా? వూరంతా అనుకునేది నిజమే కాబోలు - -" అంటూ అమ్మ ముక్కు తుడుచుకుంటోంది.

"నాకు ఎవ్వరినీ పెళ్లి చేసుకోవాలని లేదు. దానికోసం మీరంతా ఎందుకింత రాద్ధాంతం చేస్తున్నారో బోధపడకుండా వుంది. నాకిష్టం లేదు కుయ్యో మొర్రో అంటున్నపుడు అక్కడికి వదిలెయ్యాలి. నాక్షేమం గూర్చి మీరింత తాపత్రయ పడుతున్నారు బాగుంది. అందుకు నాకు చాలా సంతోషంగా వుంది. చాలా థాంక్స్. ఇక్కడికి ఆపెయ్యండి చాలు" అంటూ హాల్లోకి వచ్చి వాళ్ళిద్దరివంకా చూడకుండా పేపర్లో మొఖం దాచుకు, యిద్దరికీ బదులు చెప్పాను.

"ఎవర్నో నువ్వు పెళ్లి చేసుకోలేదని మేము ఏడవడం లేదు. ఎవడికో ముండవనీ ఆ పేరు పెట్టుకు నువ్వు ఆనందిస్తున్నావని చూసి, తల ఎత్తుకోలేక నీకు బుద్ధి చెపుదామని యింతసేపూ ఏడ్చాము" అంటూ పళ్లు బిగబిట్టుకుని అడిగాడు గణేశన్.

మొఖం మీదున్న పేపరు పక్కనపెట్టి, వాడివంక సూటిగా చూశాను. నవ్వుతూనే చూశాను.

"కరక్ట్" అన్నాను.

"ఆ కారణం వల్లనే నేను ఎవరినీ పెళ్లి చేసుకోనని చెపుతున్నది. ఇటువంటి పేరు పడ్డదానికంటే, అతను చెప్పినట్లు వితంతువయినా ఫరవాలేదు. అంతేగాని యిలాంటి దాన్ని పెళ్లి చేసుకోకూడదు. ఇలాంటి పరిస్థితి రాకూడదనే నాకు నచ్చిన విధంగా ఈ లైఫ్‌ని కోరుకున్నాను. అది మార్చడం ఎవ్వరితరం కాదు."

"షోర్ ముయ్" అంటూ అరిచాడు గణేశన్. నేను మాట్లాడటం ఆపేశాను.

"సిగ్గు లేకుండా ఇదేదో పెద్ద నీతిగా బతుకుతున్నట్లు చెపుతోంది"

"ఇది నాకు నీతిగల మార్గంలాగా కనిపిస్తున్నది" అంటూ బదులు చెప్పాను.

ఆ తరువాత ఎవ్వరం మాట్లాడలేదు. ఎలా చెప్పి, ఎన్నివిధాల చెప్పి, యీ పెళ్లికి నన్ను వొప్పించలేరని, వాళ్ల మాట నేను విననని గ్రహించుకున్నారు.

నాకు సంబంధించినంత వరకూ "ఇక్కడితో యీ విషయం వదిలెయ్యండి" అని చెప్పడంతో ఈ సంగతి ఒక ధరికి వచ్చినట్లు అనిపించింది.

డాబా మీద పచార్లు చేస్తున్నాను. ఈవినింగ్ వాక్‌కి వెళదామనిపిస్తోంది.

గణేశన్ వెళ్లిపోయినట్టున్నాడు.

నాకు ఈయన్ని చూడాలని అనిపిస్తోంది. పొద్దుట చెప్పివుంటే యీ పూట వచ్చి వుండేవారు. రేపు పొద్దుట వాకింగ్‌కి బయలుదేరేదాకా యీయన్ని చూడటం పడదు అన్నభావం - నన్ను తీరని దప్పికవలె బాధిస్తున్నది.

నాకిప్పుడు ఆయన కావాలి. ఈయన్ని చూస్తూ, యీయన పక్కన కూచుని, ఖబుర్లు చెపుతూ కూచుంటే నా జీవితానికి పరిపూర్ణత లభించినట్లుంటుంది. నాకు అది చాలు.

వాకింగ్ కెళ్లడానికి బయలు దేరాను.

## 34

యస్. గణేశన్. గంగ సోదరుడు. అని ఇంగ్లీషులో రాసివున్న ఒక కాగితాన్ని పభు ఆఫీసు మేనేజర్ రావు తీసుకొచ్చి, ప్రభుకి అందించాడు.

"రమ్మని చెప్పండి" అని ఇంగ్లీషులోనే చెప్పి, అతన్ని పంపించేసి, టైం సరిచేసుకున్నాడు ప్రభు.

తనపై అధికారి రూమ్‌లోకి అడుగు పెడుతున్నంత భయంతోనూ, రూమ్‌లోకి వచ్చి ప్రభుని చూశాడు గణేశన్. ఇంతకు ముందెప్పుడూ వారు ఒకరి నొకరు చూసుకోలేదు.

తనకి ఒక అన్నయ్య వున్నట్లు, అతను తనని తరిమేసినట్లూ, యిప్పుడూ తనని ఏదో ఒక నెపంతో దూషిస్తూ, ఇంటికొచ్చి వీధివాకిట్లో నుంచునే నానా మాటలూ అని వెడతాడని, గంగ ప్రభుకి చెప్పింది.

గంగ చెప్పిన మాటలనిబట్టి అతనేదో కోపంతో, తనను నానామాటలూ అంటానికి వచ్చివుంటాడని అనుకున్నాడు. అతని గురించి మనసులో ఏర్పడిన చిత్రానికీ, ఎదురుగుండా వచ్చి నిలుచున్న యీ మనిషికీ, ఎక్కడా పోలికేలేదు. ఈ రెంటిలో చాలా తేడా కనిపించింది ప్రభుకి.

ముఖాముఖి చూసేసరికి అతనిపట్ల సానుభూతి, ఆదరభావమూ కలిగింది.

తన వయసో లేక తనకంటే ఒకటి రెండేళ్లు చిన్నవాడో అయివుంటాడు. బాధల్లో, లేమిలో బాగా ఆటుపోట్లు తిన్న మనిషిలాగా కనిపిస్తున్నాడు. జుట్టు నగానికి పైన తెల్లగా పండిపోయింది. నిరంతరం తమలపాకులు నమలడంచేత ఏర్పడిన గారపట్టిన పళ్లు, నుదుటిమీద విభూది, ఇస్త్రీమొహం ఎరగని పుతికి ఎండేసిన బూడిదరంగు చొక్కా, లూజు లూజుగా లట లటలాడుతూ, నడుం దగ్గిర

పరికిణీ కుచ్చెళ్లలాగా వొదులుగావున్న తెల్లని పాత డ్రిల్‌పాంట్, చేతిలో ఒక కాకినంచి, అందులోంచి తలపైకెత్తి తొంగిచూస్తున్న ఒక యింగ్లీషు డైరీ, నంచీలో ఒకమూలగా టిఫిన్‌బాక్సు, వరిగి పడివున్నట్లు, నంచిపైకి ఎత్తుగా తెలుస్తోంది - వస్తూనే "గుడ్‌మార్నింగ్ సార్" అంటూ ఒక గుమాస్తాలాగా పక్కగా వొదిగి నిలుచున్నాడు.

"ప్లీజ్ సిడ్డవున్" అంటూ ఎదురుగావున్న కుర్చీ చూపించాడు ప్రభు.

చాలా అణుకువగా రెండు కాళ్లూ దగ్గిరగా పెట్టుకుని, కుర్చీ ముందుకు అంచున వంగికూర్చుని, తన కాకినంచీ పక్క నేలమీద పెడుతుంటే లోపల డబ్బా - నేలకి తగిలి 'టక్'న శబ్దం అయింది.

"మీరేం తీసుకుంటారు – కాఫీయా టీ .... కూల్ డ్రింకా?" అంటూ చాలా మర్యాదగా అడిగాడు ప్రభు.

"నో థాంక్స్ ఏమీ వద్దు" ఖంగారుతో అన్నాడు గణేశన్.

"ఇట్ యీజ్ ఆల్ రైట్. జస్ట్ ఎ కూల్ డ్రింక్" అంటూ టేబుల్ మీదనున్న కాలింగ్‌బెల్ నొక్కాడు. ఆ బెల్ శబ్దం వింటున్నాడు గణేశన్. ఇంతలో ప్యూన్ వచ్చాడు.

"కూల్‌డ్రింక్స్" ప్యూన్ వెళ్లిపోయాడు. ప్రభు సిగరెట్ వెలిగించడానికి ముందు పాకెట్ గణేశన్‌కి అందించబోయాడు.

"నో. థాంక్స్" ప్రభు సిగరెట్ ముట్టించి పొగవదులుతున్నాడు. గణేశన్‌కి ఎలా మొదలుపెట్టాలి? ఏం మాట్లాడాలి అని బోధపడకుండావుంది. కొన్ని క్షణాలు ఆ రూమ్‌లో నిశ్శబ్దం రాజ్యం చేసింది. ఏర్‌ఖండీషన్ చేస్తున్న 'గిర్' మన్న శబ్దం ఆ నిశ్శబ్దాన్ని ఛేదిస్తున్నట్లుంది.

ప్రభు సిగరెట్ పొగపీల్చి, ఒక్కసారి దగ్గు వచ్చినట్లయి, కొంచెం వుక్కిరి బిక్కిరిఅయి, రుమాలుతో కళ్ళు తుడుచుకొని "అయామ్ సారి - - కోల్డ్" అన్నాడు.

"రోజూ వుదయం మంచులో వాకింగ్‌కి వెళ్తున్నారు కాబోలు" అడిగాడు గణేశన్.

"ఎబ్బే - అంత మంచు పడటంలేదు. ఇంకో నెలపోతే స్కార్ఫ్ లేకుండా వెళ్లడానికి అవదు" అన్నాడు ప్రభు.

ముప్పాతిక అడుగు పొడవున్న రెండు గాజుగ్లాసుల్లో స్ట్రావేసి తీసుకొచ్చి, వాళ్లముందే రెండుసీసాలు వోపెన్‌చేసి, గ్లాసుల్లోపోసి, ఆ గ్లాసులు వాళ్లముందు పెట్టి వెళ్లిపోయాడు ప్యూన్.

కూల్‌డ్రింక్ ఒకసారి సిప్‌చేసి ఇంగ్లీలో అడిగాడు ప్రభు "మీరు ఎక్కడ పనిచేస్తున్నారు?" అని.

"రైల్వే - ఆఫీసులో" అంటూ విరునవ్వుతో జవాబిచ్చాడు. గ్లాసులో స్ట్రా తీసేసి, గ్లాసుఎత్తుకు గడగడ తాగేశాడు. చేతికున్న రిష్టువాచీ చూసుకున్నాడు. ఇంకో అరగంటలో వచ్చిన విషయం తేల్చి చెప్పేసి, ఇక్కడనుంచే ఆఫీసుకు వెళ్లిపోవచ్చు అనుకున్నాడు. అతను దేనికొరకు వచ్చాడో అన్న సంగతి మర్చిపోయి, గణేశన్ గురించీ అతనికొచ్చే జీతం, సంసారం, పిల్లలూ, వాళ్ల చదువులు, యిలా యింటి విషయాలు, అతని సమస్యలు, బాధలు వాటన్నిటి గురించీ అర్థంపర్థం లేకుండా ఆలోచిస్తున్నాడు ప్రభు.

"నేను వచ్చిన విషయం ఏమిటంటే" అని అతను చెప్పడం మొదలు పెట్టాక, ప్రభువుకి అతనేదో పనిమీద వచ్చి వుంటాడన్నది జ్ఞాపకం వచ్చింది.

"నేను మీకేదన్నా చేయగలనా ?" అని ఇంగ్లీషులో అడిగాడు.

గణేశన్ యింగ్లీషులో చెప్పాడు. "ఇంతకాలానికి – నా చెల్లెలికి ఒక పెళ్లికొడుకు అంటూ వచ్చి పెళ్లి చేసుకునేందుకు సిద్ధపడ్డాడు. అమ్మ ఎలాగోఅలా యీ సంబంధం ఖాయం చేద్దామని ఆశపడుతోంది. ఈ పెళ్లి జరగడమన్నది మీ చేతుల్లోవుంది" అన్నాడు. ప్రభు నోరుతెరిచి మనస్ఫూర్తిగా నవ్వాడు. తరువాత ఇంగ్లీషులో . . .

"అట్లాయితే యీ పెళ్లి జరగడానికి నేనేం చెయ్యాలో చెప్పండి. ఈ పెళ్లి జరగాలని అందరికంటే ఎక్కువగా కోరుకునేవాడిని నేనే. దీన్ని గురించి గంగతో చాలాసార్లు వాదించాను కూడా. గంగకి జీవితంలో ఏర్పడిన చేదు అనుభవం చేత పెళ్లి అంటేనే భయపడిపోతోంది. మీరు చెయ్యవలసిన ప్రయత్నాలన్నీ చెయ్యండి. చివరకి అంతా చక్కబడుతుంది. నా కూతురు పెళ్లి గురించి నేనింత ఆదుర్దాపడను - యిన్ని వూహించను. నాకు అంత వుత్సాహంగా వుంది గంగ పెళ్లి అంటే. ఈ విషయం గురించి గంగ చెప్పిన రోజునుంచీ నాకు ప్రతీ రోజూ యీ పెళ్లిగురించి ఆలోచనలే. గంగ వైవాహిక జీవితం గురించి వూహించు కోవడంతోనే సరిపోతోంది. 'యు నో షి యీజ్ యాన్ ఏంజిల్' అటువంటి మంచిపిల్ల మీకు చెల్లెలయినందుకు మీరు నిజంగా గర్వపడాలి" అంటూ పొగుడుతుంటే - గణేశన్‌కి మనసులో నవ్వు వస్తోంది. ఇతను నిజంగానే – మనస్ఫూర్తిగా అంటున్నాడా - లేక .... అన్న సందేహం కలుగుతున్నది. ప్రభు మళ్లీ చెప్పడం ఆరంభించాడు.

"నాతో పరిచయం అయాక - ఆమె ఒక స్నేహితురాలిగా నాకెంత మహోపకారం చేసిందో, నన్ను ఎంత మార్చిందో, మా కుటుంబంతో స్నేహం అయాక - మా అమ్మాయికి ఎటువంటి సాయంచేసి, దాన్ని ఎట్లా మంచి మార్గాన తిప్పిందో మీకు తెలుసా ? ఇవన్నీ పైకి చెప్పుకోవడానికి గాని, నా మనసులోని కృతజ్ఞతా

ఖావాన్ని పైకి వెలిబుచ్చడానికి గాని నాకు యింతవరకూ అవకాశం కలుగలేదు. ఆమె జీవితం సుఖప్రదం కావడానికి ఏం చెయ్యమంటే అది చేస్తాను ? నన్ను ఏం చెయ్యమన్నారో చెప్పండి ?"

గంగ పెళ్లికోసం యీయన ఏం చెయ్యడానికైనా సిద్ధంగా వున్నాడనీ, అది మనస్ఫూర్తిగా అంటున్నాడనీ - గణేశన్‌కి బోధపడి, అనుమాన నివృత్తి అయింది. 'ఈతను చాలా మంచిమనిషి. తన గురించి ఎదుటివాళ్లు ఏమను కుంటున్నారో కూడా వూహించలేనంత అమాయకుడు. ఎదురుగుండా కూచుని వున్నానే - నేను యీయన గురించి ఎంత అసహ్యంగా అనుకున్నానో కూడా వూహించలేనటువంటి సహృదయుడు. తను చెప్పేదంతా మిగతావాళ్లు నమ్ము తారనుకునేటువంటి - నిర్మల హృదయుడు' అని గణేశన్‌కి బోధపడుతోంది.

అతన్ని గురించి బాధపడుతున్నట్లు సానుభూతితో చిన్న నవ్వునవ్వి చెబుతున్నాడు.

"నేను ఏదన్నా చెబితే అపార్థం చేసుకోరుకదూ - పొరబాటనుకోరుకదూ...."

"నాట్ ఎటాల్ చెప్పండి" ఇంకో సిగరెట్ ముట్టించాడు ప్రభు.

"మిమ్మల్ని గురించీ మా చెల్లెలు గురించీ లోకులేమనుకుంటున్నారో తెలుసా? అది నిజమా కాదా అన్నది అలావుంచండి. మీ మధ్యనున్న సంబంధం గురించి ఎటు వంటి మాటలనుకుంటున్నారో మీకు తెలుసా ?" అని గణేశన్ ప్రశ్నిస్తుంటే ప్రభు ఒక్కసారి పొగవదిలి, కళ్లు మూసుకొని క్షణకాలంపాటు యోచిస్తూ వుండిపోయాడు. అతను వదిలిన పొగ ఎదుటి వాడి మొఖం కనిపించనంత దట్టంగా చుట్టుకుంది, చేత్తో పొగని చెదరగొట్టి అన్నాడు.

"ఎస్ ఐ నో అయామ్ సారీ. యు నో . ." అంటూ ఏదో చెప్పబోతుంటే, అతనెంత బాధపడుతున్నాడో, అతని మనసుని తాను ఎంత గాయపరిచిందీ గ్రహించుకుని, తనే అతన్ని అనునయిస్తున్నట్లు చెపుతున్నాడు గణేశన్.

"నో - నో. మీరు ఆ సంగతులన్నీ నాకు చెప్పక్కర్లేదు. మా అమ్మాయి గుణం మాకు తెలియదా ? నేను చెప్పబోయేదేమిటంటే, యిన్నాళ్లకి చివరికో పెళ్లి కొడుకంటూ దాన్ని చేసుకుంటానని వచ్చాడు. ఆ పెళ్లికొడుకు దీని పాస్ట్ గురించి బాదర్ చేసుకునే మనిషిలాగా లేడు. హి వాంట్స్ టు మారీ యే విడో. అలాం టప్పుడు అది. ...." అది అంటూ ఆ విషయం వుచ్చరించటానికి యిష్టంలేనట్లు, అది ఎల్లా చెప్పాలో తెలియనట్లూ మాటలకు తడుముకుంటున్నాడు.

"ఊ. కంటిన్యూ" అంటూ అతని ముఖంవంక చూడకుండా యాష్‌ట్రేలోకి బూడిద దులుపుతున్నాడు ప్రభు.

అతను చెప్పదలచుకున్న విషయం ఎంత మందబుద్ధికైనా అర్థం అవుతుంది. అతను చెప్పకుండానే గ్రహించుకోగలిగాడు ప్రభు.

గణేశన్ మొఖంవంక ఒక్కసారి పరకాయించిచూసి "డు యు మీన్ టు సే" అంటూ ఒక్కసారి అదిరిబడ్డాడు. మనసు కలవరపడింది. ఇది అనవసరమైన కలవరమని, తనను తానే అదుపులో పెట్టుకున్నాడు. గుండెలు ఒక్కసారి గబగబ కొట్టుకున్నాయి. వొళ్లంతా చెమటలు పట్టినట్లయింది. తనని తాను నిగ్రహించుకుని చెప్పడం మొదలుపెట్టాడు.

"నేను మీ చెలెల్ని - కలుసుకోవడం మానితేగాని యీ పెళ్లి జరగదంటారు - ఈ పెళ్లి జరగడానికి నా నుంచి యీ సాయం కోరుదామని అనుకుంటున్నారు గదూ ..." అంటూ అదేదో మామూలు విషయమన్నట్లు చిరునవ్వుతో అడిగాడు.

"గంగని - మీ గంగని" అని - ఆమెని మరొకరి గంగ అని ఆ క్షణాన మొదటిసారి సంబోధించాడు. ఆ మాటలు తన చెవులకే కొత్తగా వున్నాయి. గణేశన్ మొఖాన్ని చూస్తూ, తన మనసులోని భావాల్ని బలపరుస్తున్నట్లు పైకి "ఎస్ షి యీజ్ యువర్స్"

"బికాజ్ ఎందుకంటే...." అంటూ గణేశన్ ఏదో వివరించబోతుంటే ప్రభ అతన్ని ఆపుతున్నట్లు.

"నో - నో నాకు ఏమీ వివరించనక్కర్లేదు. దీంతో ఆపెయ్యండి. నావల్ల మీ అమ్మాయికి అంటిన మకిలి చాలు. ఏర్పడిన చెడ్డపేరు చాలు. మీ అమ్మాయిని మీరు అర్థం చేసుకున్నారు. అదేమాదిరి ఆ రాబోయే కొత్తమనిషి అర్థం చేసుకుంటాడని మనం ఆశించకూడదు. నేను మీ కులంవాడినయితే ఏదో చెప్పి బంధువనో, దూరవుచుట్టమనో సర్దుకునేవారు. అంచేత నేను తప్పుకుని దూరంగా వుండటం అన్ని విధాలా మంచిది. నన్ను మంచి మార్గాన పెట్టడానికి ఎన్నో విధాల సహాయంచేసి, నాకు మంచిమాటలు చెప్పి నన్నో మనిషిని చేసింది. ఆ చేసిన వుపకారానికి - ప్రత్యుపకారంగా తననుంచి తప్పుకుని వెళ్ళిపోతాను. నేను చెయ్యగల ప్రత్యుపకారం యిదే అయితే తప్పకుండా, మనస్ఫూర్తిగా చేస్తాను. నేను యీ శక్తిని తన దగ్గిరనుంచే పొందాను. నేను యీ విషయాలన్నీ తన దగ్గిరే నేర్చుకున్నాను. నాకు యీ తెలివితేటలన్నీ తన సాంగత్యం వల్లనే వచ్చాయి. ఇలా తప్పుకుని దూరంగా వెళ్ళిపోయేందుకు బాధపడుతున్నాననుకుంటున్నారా ? లేదు. నాకు ఏ మాత్రం బాధగాలేదు. ఈ మనోస్థయిర్యము తన దగ్గిరే నేర్చుకున్నాను. నాకు చాలా సంతోషంగా వుంది. గొప్పగా కూడా వుంది. ఈ పని చేయగలుగుతున్నందుకు గర్వంగా కూడా వుంది. ఇంకో విషయం ఈ మధ్యకాలంలో గంగకు చెప్పకుండా నేను ఏపనీ చెయ్యడంలేదు, ఏ నిర్ణయమూ తీసుకోవడం లేదు. కాని ఈ విషయంలో తన సలహా తీసుకోవడం మంచిది కాదు. తనతో చెబితే నన్నీ నిర్ణయం తీసుకోనివ్వదనే భయంచేత నాకు నేనుగా

నిశ్చయం చేసుకుంటున్నాను. మీరు నా తరఫున యీ విషయం తనకి విడమరచి చెప్పండి. 'ఈ పెళ్ళికి తను వొప్పుకున్నదన్న విషయం విన్నాకనే నేను తనని కలుసుకోవడం జరుగుతుంది' అని చెప్పండి. అప్పటిదాకా తన పెళ్లికి యివ్వబోయే బహుమతుల గురించి వూహించుకుంటూ కాలం గడుపుతానని చెప్పండి అమె జీవితం సుఖశాంతులతో, స్వర్గ సౌఖ్యాలతో విలసిల్లుతుందని నాకు ప్రగాఢమైన నమ్మకం వుంది. మనం ఎప్పుడూ తన మంచిని కోరేవారం. అమె మంచి కొరకు ఒక శుభకార్యం చేస్తున్నాం. విష్ యు గుడ్ లక్" అంటూ లేచి గణేశన్ చెయ్యి పట్టుకుని షేక్‌హాండ్ యిచ్చాడు ప్రభు.

మళ్లీ గణేశన్‌తో అన్నాడు "ఈ పెళ్లికి నువ్వు గనక వొప్పుకోకపోతే – అతను ఈ జన్మకి మరి నిన్ను కలుసుకోడు" అని ఒక మాట అని చూడండి. అంటూ కళ్లు ఎగరేసి నవ్వుతూ అన్నాడు ప్రభు.

గణేశన్‌కి మతి పోయినట్లయింది. 'మా అమ్మాయిని కలుసుకోకూడదు' అని యీయనతో చెబుదామని వచ్చాడు. తను అలా అన్నపుడు ఒకవేళ అతను వొళ్లు తెలియని కోపంలో "ఆ సంగతి నీ చెల్లెలుకు చెప్పుకో – పో - యు గెట్ అవుట్" అనేటువంటి సీనుకి సిద్ధపడి వచ్చిన గణేశన్‌కి యిక్కడ జరిగింది చూసేసరికి తలగిర్రున తిరిగినట్లయింది. ప్రపంచం పల్టీకొటినట్లయింది.

ఒక మంచి మనిషిని కలుసుకున్నపుడు, ఒక సహృదయుడు తటస్థపడినపుడు - అందరికీ సంతోషంగా వుంటుంది. ఆ వ్యక్తి ఎంత మంచివాడో నలుగురికీ తెలియపరచాలని వుంటుంది. ఈ మనిషి ఎంత వున్నతుడో తమ యింట్లో అందరికీ తెలియ చెప్పాలని మనసు ఆతృత పడుతున్నది.

"సార్ - మీరు చాలా గొప్పవారు సార్. మీ మనసు యింత మంచిదని గ్రహించలేకపోయాను. మీ గురించి నేను ఎంత చెడుగా అన్నానో తలుచుకుంటే నాకే సిగ్గుగా వుంది. మీరు నన్ను క్షమించాలి. తరువాత వచ్చి తమ దర్శనం చేసుకుంటాను" అంటూ మనసులోని పశ్చాత్తాపాన్ని వెళ్లగక్కి, తేలికగా వూపిరి తీసుకుని వెళ్లిపోయాడు గణేశన్.

పెద్ద కుట్ర జరిగిపోయింది. ఈ కుట్రకి యీయన ఎలా వొడబడ్డారో అర్థం కాకుండా వుంది ఈ పాపిష్టి వాడు గణేశన్ వెళ్లి అయన్ని చూసి వచ్చాడా? ఏం చెప్పాడో? ఏం చెప్పి అయన మనసు విరిచేశాడో. అయ్యో! ఎవరు ఏం చెపితే అది నిజమని నమ్మే పసిపిల్లవాడి వంటివారు యీయన. నేను అయన్ని చూడాలి. ఈ రెండు కళ్లతో ఒక్కసారి చూడాలి. అయన నా కంటబడి మూడు రోజులయింది. ఈ మూడు రోజులూ నా మనసు పరిపరి విధాలపోతున్నది. ఎన్ని విధాల ప్రయత్నించినా యీ మనిషి నాకు దొరకడంలేదు. ఇంట్లోలేరు – ఆఫీసులో

లేరు. ఎప్పుడు ఫోన్ చేసినా 'లేరు' అని బదులు చెపుతున్నారు. మా యిద్దరినీ వేరు చేస్తారా? ఇలా చేసినందువల్ల యీ పాపిష్టివాళ్ళకి ఏం సంతోషం లభించిందో! నేను యింక యీయన్ని చూడలేనా? చూడకుండా ఎలా బతకగలను? నన్ను చూడకుండా యీయన ఎలా వుంకగలుగుతున్నారు? నన్ను చూడకుండా వుండగలరా? వుండగలరా ఏమిటి? నన్ను ఏకాకినిచేసి వెళ్ళిపోయారు. నాకు ఎవ్వరూ లేరు.

ఈ అమ్మ యీయన్ని తెగపొగుడుతోంది. గణేశన్ సరేసరి. ఆకాశానికి ఎత్తేస్తున్నాడు. ఇకమీదట ఈయన నన్ను చూడటానికి రారుట. వీడికేదో పెద్ద - ఆయన సంగతి తెలిసినట్లు మాట్లాడుతున్నాడు. వీడినీ, యీ అమ్మనీ యింట్లోంచి వెళ్ళగొట్టి విరగడ చేస్తే ఆయన తప్పకుండా వస్తారు. ఆరోజు పొద్దుట అమ్మ 'తిరిగి వెళ్ళిపోతే యిల్లు తాళంపెట్టి వుండటంచేత వచ్చాననుకుంటారా?' అని - అంది... ఈ రోజు నిజంగానే తరుముతాను. నా సంతోషాన్ని మట్టిపాలు చేశారు నాలోని నమ్మకాన్ని వీళ్ళందరూచేరి కుట్రపన్ని ఛిన్నాభిన్నం చేశారు. అలాంటప్పుడు నేనెందుకు చేతులు ముడుచుకు వూరుకోవాలి!

"పెళ్ళి చేసుకోవాలట --- పెళ్ళి కాదు శ్రాద్ధం పెడతాను"

నాకు వొళ్లు మండిపోతున్నది. ఈకోపంలో ఎవరిని ఏం చేస్తానో, నన్ను నేనేం చేసుకుంటానో కూడా తెలియడంలేదు. భరించలేని కోపం వస్తోంది. నాకిదవర కెన్నడూ యిటువంటి కోపం రాలేదు. ఎప్పుడూలేనటువంటి, అగ్నిలాంటి కోపం కుములుకొస్తున్నది.

ఈయన్ని చూసి మూడు రోజులయింది. వాకింగ్ కెళ్లి మూడు రోజులయింది. నేను కన్నుమూసి మూడు రోజులయింది. కడుపునిండా తిని మూడు రోజులయింది. ఆఫీసులో పని సరిగ్గా చేసి మూడు రోజులయింది. ఈయన్ను ఎలాగైనా యీరోజు చూసి తీరాలని ప్రొద్దుటే టాక్సీ తీసుకుని వాళ్లింటి కెళ్లాను. ఎన్నో నెలల తరువాత వాళ్లింటి కెళుతున్నాను.

టాక్సీలో కూచుని హాండ్‌బాగ్‌లోంచి అద్దం తీసుకుని నాముఖం చూసుకున్నాను. నాకెందుకో భయంగా వుంది.

ఏ రోడ్డువెంట టాక్సీ వెళుతోందో కూడా గమనించలేదు. అదిగో వారి బంగళా వచ్చింది. ఎలాగో అలా మూడురోజుల తరువాత యిప్పుడు యీయన్ని చూడబోతున్నాను. అదిగో ఆయన కారు అక్కడేవుంది. ఈయన్ని చూడగానే నేను ఏడవకూడదు. కళ్ల నీళ్లుపెట్టుకోకూడదు. అని నాలో నేను నిశ్చయించుకున్నాను. ఇక మీదట యీమాదిరిగా మోసం చెయ్యొవద్దని గట్టిగా చెప్పాలి - టాక్సీవాడికి డబ్బులిచ్చి, లోపలికి పరుగెత్తబోతున్నాను.

నమయానికి చూశాను. మంజు చేతులో పుస్తకం పట్టుకుని లాన్‌లో కూచునుంది. నేను వచ్చిన విషయం గమనించలేదు. ఆ అమ్మాయి నా స్థితిని కనిపెట్టనివ్వకుండా, నన్ను నేను అదుపులోకి తెచ్చుకుని, నార్మల్ మూడ్‌లో వున్నట్లు మూలనున్న పేమ్ కుర్చీ లాక్కుని కూచున్నాను.

"గుడ్‌మార్నింగ్ మంజు" అన్నాను. నన్ను చూసేటప్పటికి ఆ పిల్లకి సంతోషం, ఆశ్చర్యం రెండూ కలిగాయి. పరిగెత్తుకొచ్చి నా ప్రక్క కుర్చీలో కూచుంది.

"నొంట్లో బాగా లేదా? అల్లా వున్నారేం? చాలా చిక్కిపోయి నల్లబడ్డారు. మొఖమంతా పీక్కుపోయింది. అర్ యు నాట్ వెల్? నాన్న నాతో ఒక్కమాట కూడా అనలేదే?" అంటూ నా చెయ్యి పట్టుకు అడుగుతున్నది.

"అబ్బే ఏం లేదు. నువ్వు చూసి చాలా రోజులయింది కదూ! అందుకని." జుట్టుముడి నవరించుకుంటూ నవ్వుతూన్నట్లన్నాను.

"నాన్నగారెక్కడ?" అంటూ చాలా నహజంగా వుండెట్లు, మామూలుగా అడిగినట్లు ప్రశ్నించాను.

"మీతో చెప్పకుండానే వెళ్లిపోయారా? బెంగుళూర్ వెళ్లారే? మూడు రోజులయింది"

"ఇవ్వాళ వస్తానన్నారు. వచ్చారేమోనని అనుకున్నాను." నన్ను నేను నమర్థించుకుంటూ వెనక్కి జారగిలబడి కూచున్నాను.

"పదకొండు గంటలకి గాని ప్లేన్ రాదు" అంటూ పుస్తకాన్ని యిటు అటు తిప్పుతోంది.

"కాఫీ తాగుతారా? టిఫిన్ పట్టుకొస్తాను" అంటూ అడుగుతోంది.

"ఏమీ వద్దు" అంటూ ఆ పిల్లని గురించి ఆలోచిస్తున్నాను.

ఆ స్వామీజీతో కలిసి యీ అమ్మాయి తిరుగుతోందన్న విషయం జ్ఞాపకం వచ్చింది.

నా పరిస్థితి యీ పిల్ల గ్రహించకుండా వుండటానికి ఏదో ఒకటి మాట్లాడాలని ప్రారంభించాను.

"అలాంటిదేమీ లేదని నాతో అంత కథ నమ్మకంగా చెప్పి, చెప్పిందంతా గాలికి వదిలి స్వామీజీతో తిరుగుతున్నావుట. మీ అమ్మకి తెలిసిందంటే- - -"

మంజు ఒక్కసారి చుట్టూ చూసింది "నాన్న చెప్పారా? నాకు తెలును. అవ్వేళ ఒకే ఒక్క రోజున - - . ఆ వొక్క రోజున వెళ్లాను. నాన్న కారు క్రాస్ చేసింది మమ్మల్ని. ఈజ్ హి వర్రీడ్? అసలు సంగతేమిటంటే మీరనుకున్నట్లు నేనేం కథ అల్లలేదు. నా మటుకు నాకు తెలును. నేను నిజం చెప్పానని: ఉన్నది వున్నట్లు చెప్పానని. కాని పాపం ఆ స్వామీజీ వున్నాడే - అతనో పిచ్చివాడు.

గడ్డం పెంచుకుని 'రేపు నా బర్త్ డే నువ్వు రాకపోతే నేను సెలబ్రేట్ చేసుకోను' అంటూ వొచ్చి ఏడ్చినంత పనిచేశాడు. సరి అని వొప్పుకుని పార్టీకి వెళ్లాను. హి యీజ్ గుడ్ - - -" అంటూ ఏమిటేమిటో చెప్పుకు పోతోంది మంజు.

నాకు ఒక్కటిగూడా బుర్రకెక్కలేదు. నామనసు దేనిపైనా లగ్నం కావడంలేదు.

"మీ నాన్నగారితో నేను అదే మాట అన్నాను. మంజుని నమ్మండి - తను అబద్ధం చెప్పదు" అని.

ఒక పదినిముషాల పాటు ఈయన్ని చూడలేక పోతున్నాననే బాధని దాచిపెట్టు కుంటూ మాట్లాడాను. కాఫీ తాగి బయలుదేరి వచ్చేశాను.

ఈరోజు లంచ్ అవర్‌లో టెలిఫోన్ చేస్తాను. ఐ షుడ్ టాక్ టు హిమ్. నేను మాట్లాడానంటే - నన్నూ యీయన్ని విడదీయడానికి పన్నిన యీ కుట్రని ముక్కలు ముక్కలు చెయ్యగలను. నేను చెపితే ఈయన వింటారు. నా మాటకి ఎదురు చెప్పరు. హి యీజ్ మై మాన్.

## 35

"యస్ ప్రభూ హియర్"

ఈయన కంఠం వినిపించేసరికి నాకు కళ్లనీళ్లు ఆగలేదు. నేనెందుకు ఏడుస్తున్నాను? మాట్లాడటానికి గొంతు పెగలటంలేదు. చుట్టుపక్కల ఎవరూలేరు. అది కొంతనయం. లంచ్ టైములో నా డిపార్ట్‌మెంటంతా ఖాళీగా వుంటుంది. ఈలోపల యీయన రెండుసార్లు హలో హలో అన్నారు. ఫోన్ ఎక్కడ పెట్టేస్తారో నని, ఒకసారి గొంతు సవరించుకున్నాను. ఆ శబ్దంతో యీయన నన్నుపోల్చు కున్నారు.

"గంగా వాట్ యీజ్ దిస్. ఆర్ యు క్రయింగ్ ?"

కళ్లుతుడుచుకుని అన్నాను. "నేనే ఏమిలేదు. నేను మిమ్మన్ని వెంటనే చూడాలి. నాకు చెప్పకుండా వూరువెళ్లారా? మా అన్నయ్య గణేశన్ వచ్చి మిమ్మల్ని చూశాడట ? వొడొచ్చి ఏం చెప్పాడో తెలుసా? మీరు యికమీదట నన్ను చూడనని చెప్పారుట ? వాడు చెప్పింది నేను నమ్మలేదు. వూరికే అనివుంటాడు. మీరు యిలా చెప్పివుండరు. ఏవిటి మాట్లాడరేం ? మీరు నిజంగా ఆ మాట అన్నారా ? హలో హలో"

ఆయన మాట్లాడకుండా మౌనంగా వుండటంతో నా గుండెల్లో రాయి పడ్డట్టయింది. ఒకవేళ ఈయనగాని అలా అని వుంటారా ? అంటేమటుకు.

అన్నంత మాత్రాన ఏమవుతుంది. అప్పటికి వాడికేదో వొకటి చెప్పి పంపాలని అలా అని వుంటారు. అసలు వాడే ఆ మాట ఆయనచేత బలవంతంగా అనిపించి వుంటాడు. ఈయన నా యిష్టానికి వ్యతిరేకంగా ఎప్పుడూ నడుచుకోరు.

"ఏమిటి? మాట్లాడకుండా వున్నారు ఏదో ఒకటి మాట్లాడండి. మీ గొంతు విన్నాక సంతోషంగా వుంది. మూడురోజులబట్టీ ఎంత కష్టబడ్డానో తెలుసా? మనం కలుసుకోకపోయినా ఫరవాలేదు. ఎన్ని రోజులు మనం ఒకరి నొకరు చూసుకోకుండా వుండలేదు? మనం మళ్లీ కలుసుకుంటామన్న ఆశతో, మళ్లీ చూసుకుంటామన్న ఆశతో ఎన్నాళ్లయినా, వేచి వుండవచ్చు - అంతేగాని, 'ఇంక కలుసుకో పోవడంలేదు' అన్న మీ నిశ్చయం విన్నాక ఒక్కక్షణం కూడా నిలవలేకుండా వున్నాను. ఈ బాధ భరించలేక పొద్దుట లేచీ లేవంగానే మీ యింటికి పరుగెత్తుకొచ్చాను. మీరు వూళ్లో లేరని తెలిశాక మనసు కుదుటబడింది. మంజుని చూసి మాట్లాడాను, చెప్పిందా? ఆ స్వామిజీ గురించి ఆ రోజున మీరు అంత వర్రీ అయారే, ఆనాడే నేను మీతో అన్నాను యిందులో పెద్ద బాధ పడాల్సింది లేదని. ఈ విషయం గురించి మంజుని సూటిగా అడిగేశాను. ఆ రోజు అతని బర్త్‌డేట తను రాకపోతే పార్టీ చేసుకోనని ఏడుస్తూవచ్చి పిలిచాడుట. అందుకోసమని జాలిపడి పార్టీకి వెళ్లిందట. అంతేట. ఆరోజు కాస్తా మీ కంట్లో పడ్డారుట వీళ్లు. ఏమిటి? నేను మాట్లాడుకుంటూ పోతున్నాను మీరు ఒక్కమాట కూడా మాట్లాడటం లేదు. ఏదో ఒకటి మాట్లాడండి - - -"

ఆయన గొంతు సవరించుకుంటున్నారు. నేను కావాలనే అల్లరిగా ప్రశ్నించాను.

"ఆర్ యు క్రయింగ్? ఇప్పుడు మీరు ఏడుస్తున్నారా?" నవ్వుతూ అడుగుతున్నాను. చిన్నగా నూతులోంచి మాట్లాడినట్లు "యస్" అన్నారు.

ఆయన మొఖాన్ని వూహించుకుంటున్నాను. పాపం చాలా బాధపడుతూంటారు. మనసు కొట్టుకుపోతూ వుంటుంది.

"అసలు ఏం జరిగిందో చెప్పండి? గణేశన్ వచ్చి మీతో పోట్లాడాడా? తిట్టాడా? మీరు దేనికి బాధ పడుతున్నారు?" అని అడిగాను.

"నో - నో - అదేంకాదు. మీ అన్నయ్య వచ్చి నన్ను చూశారు. నువ్వు యీ పెళ్లికి వొప్పుకుంటేగాని నిన్ను చూడనని చెప్పమన్నాడు. మనం కలుసుకోవడం, మీ యింటికి నా రాకపోకలూ యివన్నీ వుంటే ఆ పెళ్లి జరగదేమోనని అతనికి భయంగా వుంది. నాకూ అలానే అనిపించింది. అందుకోసమనే నేను కూడా అలా చెప్పాను. నావల్ల నీ జీవితం యింకా చెడిపోతూనే వుండాలా చెప్పు? ముందు నువ్వు ఆ పెళ్లికి 'యస్' అను – అన్ని ఏర్పాట్లూ జరగనియ్యి. ఆ తర్వాత నేనొచ్చి నిన్ను చూస్తాను. మనం యిలా కలుసుకుంటూవుంటే - యీ పెళ్లికి నువ్వు

వొప్పుకోవని తోస్తోంది. నువ్వు తెలివిగలదానివి, చదువుకున్నదానివి, అన్నీ తెలిసినదానివి, నేను చెప్పేది 'గుడ్ స్పిరిట్' లో అర్థంచేసుకో''

ఈయన ఏవిటేమిటో నీతులు బోధిస్తున్నారు. నాకు కోపం, ఏడుపూ రెండూ వస్తున్నాయి.

''స్టాప్ - యిట్'' అంటూ గట్టిగా అన్నాను. తరువాత ఏడుస్తున్నాను. మాటలు రాక ఎక్కెక్కి ఏడుస్తున్నాను. ఈయన సరే ఏడవనీ అన్నట్లు ఆవైపు నుంచి 'బండరాయి' మాదిరిగా వింటూ వూరుకున్నారు. ఆయన తోడు నాకు ఎంత ముఖ్యమో, ఆతోడు కొరకు నేను ఎంత పరితపించి పోతున్నానో యీయన కూడా అర్థం చేసుకోలేరు. నా యీ తీవ్రమైన కాంక్షను యీయన గ్రహించలేకుండా వున్నారన్న భావం నా హృదయాన్ని తూట్లు పొడుస్తున్నది. నా గుండెలు బరువుగా, భారంగా వున్నాయి. ఈయన నా చేతినుంచి జారిపోయి, కొత్త మనిషిలాగా యింత దూరాన నిలుచుంటారని ఏనాడూ అనుకోలేకపోయాను.

నేను తిరిగి చెపుతున్నాను. ''నాకు పెళ్లి అన్నది జరగదు. నేను ఎవరినీ పెళ్లి చేసుకోను. మీరు ఎప్పటిలాగా వచ్చి నన్ను చూస్తూవుండండి. అది చాలు నాకు యింకేమీ అక్కరలేదు'' అంటూ బతిమాలుకున్నాను. ''నాకు అమ్మా, అన్నయ్యా, స్నేహితులు బంధువులు ఎవ్వరూలేరు. వాళ్లందరినీ నేను ఏనాడో మనస్ఫూర్తిగా వదులుకున్నాను. నాకు వున్నటువంటి స్వంతం, నా అప్తులూ మీరొక్కరే. అయామ్ యువర్స్. యు ఆర్ మై మాన్. ఇదివరకొకసారి మీరన్నారు 'ఈ జీవితాన్ని యిలాగే విదుల్చుకుని, ఎక్కడికయినా వెళ్లి ముఖపరిచయం లేని కొత్తమనుషుల మధ్య కొత్త జీవితం గడపాలని' మీరు అటువంటి జీవితానికి రమ్మని పిలుస్తే, యీ నిముషంలో కట్టుబట్టలతో నిలుచున్న పళంగా రావడానికి సిద్ధంగా వున్నాను. రియలీ వుయ్ లవ్ యీచ్ అదర్. నేను వాళ్లందరినీ ఏడిపిద్దామనే వుద్దేశంతో ఆ ఆర్. కె. వి. కిచ్చిన అ్రడసుపట్టుకు మీరిల్లా మొండిగా ప్రవర్తించడం బాగుందా ? ప్లీజ్ - ప్లీజ్ మిమ్మల్ని తక్షణం చూడాలనివుంది. మీతో చాలా మాట్లాడాలి. ప్లీజ్ మీట్ మీ'' ఇంతసేపటి నుంచి ఆగకుండా కారుతున్న కన్నీళ్లని తుడుచు తుడుచుకు విసుగెత్తి వదిలేశాను. అయ్యో నేనెందుకు యిలా అవుతున్నాను. ఎందుకిలా కించపరచుకుంటున్నాను.

ఆయన దీర్ఘమైన నిట్టూర్పు విడిచారు.

'గంగా' అని పిలిచారు. ఈయన అలా పేరుపెట్టి పిలుస్తుంటే ఎంతో సుఖంగా వుంది. ఈయన ఎప్పుడూ యిలా పిలుస్తుంటే చాలు. నాకింకేమీ అక్కరలేదు.

ఇంగ్లీషులో చెప్పడం ప్రారంభించారు. నేను చాలా ఎమోషనల్‌గావుండి, ఏదేదో వూహించుకుని, ఏమిటేమిటో మాట్లాడుతున్నానుట. ఎటువంటి పరిస్థితులలోనూ

నేను యీయనకి స్వంత మనిషిని కాదుట. నేను ఒకరికి కూతుర్ని, మరొకరికి చెల్లెల్నిట. వున్నతమైన కులంలోపుట్టి, గౌరవనీయమైన కుటుంబానికి చెందినదాన్నట నాకు యోగ్యుడైన భర్త లభించాలని, చక్కటి జీవితం ఏర్పడాలనీ ఆయన కోరికట. ఇటువంటి చక్కటి జీవితం ఏర్పడబోతున్నది గనకనే తనకు ఎంత కష్టంగా వున్నాసరే, అడ్డురాకుండా వుండాలని దూరంగా తొలిగివుంటున్నారట. తను దీనికి అడ్డుతగిలితే ఆ పాపం తన కూతురికి తగిలి, ఆ పిల్ల జీవితం ఏమయిపోతుందోనని భయంగా వుందిట. ఈయన నన్ను తన రెండో కూతురిగా భావించుకుంటున్నారుట. మా యిద్దరికీ ఒకరిపై మరొకరికిగల ప్రేమ అటువంటిదేట. ఇంకొక రకం ప్రేమ వుండకూడదుట— అని ఈయన చెబుతున్నారు. కాలం ఎలా మారిపోతున్నదో తలుచుకుని నాలో నేను వేదన పడుతున్నాను.

ఈయన నొక్కి చెబుతున్నారు.

''ఉయ్ కెనాట్ లవ్ యీచ్ అదర్. యు యువర్‌సెల్ఫ్ హేవ్ సెడ్ దిస్ సెవరల్ టైమ్స్ బిఫోర్. డు యు రిమెంబర్? దట్ యీజ్ ద ట్రూత్ ...''

అవునవును. నేను యీ విషయాన్ని చాలాసార్లు నొక్కిచెప్పాను. ఏదో ఒకటైములో చెప్పిన ఆ విషయం 'పచ్చి అబద్ధమని' నాకు బోధపడుతున్నది. ఆ విషయాలన్నీ వరసగా తలుచుకుని చూస్తున్నాను.

మొట్టమొదట నేను ఈయనకి ఫోన్‌చేసి పిలిచినపుడు, యీయన వచ్చారే; అయిలాడ్ గ్రౌండ్‌కొచ్చి కారు నిలుపుకుని నాకోసం ఎదురుచూస్తూ కూచునివున్నారే- అప్పుడు యీయన ఏ వుద్దేశ్యంతో వచ్చివున్నారో? ఈయన రాసుకున్న సెంటు, చేసుకున్న అలంకారం, ఈయన నావంక చూసిన తీరు, ఆ మునిమాపువేళలో యీమనిషి ఏ వుద్దేశ్యంతో, ఏ అభిప్రాయంతో వచ్చివున్నారో నేను పసిగట్టానే!

నాగురించీ, ఈయన వల్ల నా జీవితంలో ఏర్పడిని అమచ్చ గురించీ యీయనతో ఎలా చెప్పాలి? ఎక్కడ మొదలుపెట్టాలి అని మధనపడుతూ, పెదమలు తడి ఆరిపోతుంటే - - -

ఈయన్ని చివరిసారిగా దెబ్బతిన్నట్లుగా దిమ్మెత్తిపోయి చూశాను. ఇది రెండోసారి చూస్తున్నాను. ఆక్షణం నుంచీ యీ నిముషం వరకూ జరిగిందంతా యీయనకి ఎలా చెప్పడం - అనిలో విస్తూ.

ఒక క్రమతలో వుండక విషయాలన్నీ గజిబిజిగా ఒకటి తలుచుకుంటే మరొకటి ముందుకు తోసుకువస్తున్నాయి. అదేవిధంగా మనుషులు, వారి మాటలు తెరలు తెరలుగా నన్ను చుట్టుముడుతున్నాయి. దెబ్బలూ తిట్లూ, కాలేజీ హాస్టలూ ఇల్లూ ఫ్రెండ్సూ, లెక్చరర్సూ స్టూడెంట్సూ - - - - అన్నీ చెవుల్లో బిగ్గరగా

వినిపిస్తున్నాయి, కళ్లకి స్పష్టంగా కనిపిస్తున్నాయి. నాతల గిరగిరా తిరుగుతున్నది. మనసులో బయటా అంతా వలయాలు తిరుగుతున్నాయి.

కళ్లు మూసుకుని - తల సీటు కానిచ్చి ఒక పక్కకు వరిగాను.

"వాట్ యీజ్ ది మేటర్?" అని ఏదో అడుగుతూ, నా తొడమీద ఆయన చెయ్యివేశారు. ఆ సమయంలో నేను మాట్లాడకుండా వూరుకుని వుండివుంటే - ఇప్పుడు యీయనకీ నాకూ మధ్య సంబంధం మరోరకంగా వుండివుండేది.

నేను 'ఛీ' అని ఎందుకలా విసిరికొట్టానో? పాపం! నేనెందుకు యీయన కాళ్లూ చేతులూ విరగగొట్టానో? ఆ తరువాత యీయన తనను తాను మరిచిపోయి నపుడు, ఆఖరికి వొళ్లు తెలియని స్థితిలో కూడా, నన్ను తాకలేదు. నా వంటిమీద చెయ్యి వెయ్యలేదు.

ఆరోజున అలా ప్రవర్తించినందుకు - యీరోజునన్నీ విధంగా శిక్షిస్తున్నారా?

ఈయన ఫోన్‌లో ఏదో మాట్లాడుతూనే వున్నారు. నాకు ఒకటీ బోధపడటం లేదు. ఏదేదో ఆలోచించు కుంటున్నాను.

ఇన్ని సంవత్సరాలుగా మా మధ్య నున్న యీ అబద్ధపు తెరలన్నీ పటాపంచలించి, స్త్రీ పురుషులన్న ఆ ఒక్క బంధానికే - మేమిద్దరం కట్టుబడి వుండాలని నా మన సిప్పుడు ఆతురతపడుతున్నది. ఈ క్షణంలో నాకిది స్పష్టంగా బోధపడింది. ఇజ్ యిట్ టూ లేట్? ఇప్పటికే సమయం మించిపోయిందా? ఈయన నన్ను 'చూడను' అంటున్నారే. నా పెళ్లి శుభలేఖ చేత్తో పట్టుకొచ్చినపుడే నన్ను చూసారుట. ఇదేం పిచ్చో?

"ఐ విల్ మారీ యు" అని నేను నవ్వాను. "మీ డబ్బు కోసం కాదు అంతస్తు కోసంకాదు" ఈ మాటలని నేను నవ్వాను. "వీటన్నిటికోసం కాదని నాకు తెలుసు. మీరు ఒక మొగవాడుగానే మొదటసారి నాకు పరిచయం అయారు. మీతో నాకు ఫక్తుదేహికమైన సంబంధమే కాదా - మీతో నా తొలి పరిచయం అటువంటి పశుప్రవృత్తితోనే - హీనంగానే కదా ఏర్పడింది. ఇతర కారణాలవల్లా, ప్రేమవల్లా అని, మనని మనం మభ్యపెట్టుకు మోసపుచ్చుకోవద్దు. మీ దగ్గిర నాకు సిగ్గు, సంకోచం ఏమీలేవు. మన మనోవాంఛలని బట్టబయలు చెయ్యడానికి నా మంచం కాచుకునివుంది. 'ఐ విల్ షేర్ మై బెడ్ విత్ యు' చెవులో గుసగుస లాడుతున్నట్లు, రహస్యం చెపుతున్నట్లు ఫోన్‌లో యీ మాటలన్నీ చెప్పాను. నా కంట్లోంచి కన్నీరు ఆగకుండా ప్రవహిస్తున్నది.

"స్టాప్ దట్ నాన్‌సెన్స్" అని టక్కన రిసీవర్‌ని పెట్టేశారు.

నేను అలానే టేబుల్‌మీదకి వరిగి, రెండు చేతుల్లో మొఖం దాచుకుని ఏడుస్తున్నాను. వేళ్ల మధ్య నుంచి కన్నీళ్లు జారుతున్నాయి.

కన్నీళ్లు! మనసుని ప్రక్షాళనం చేసేవి యీ కన్నీళ్ళేగదా!

లంచ్‌కి వెళ్లినవారంతా తిరిగి వచ్చేశారా? అని గభాలున తలఎత్తి చూశాను. ఎవరన్నా నా దుఃఖాన్ని చూశారా? ముఖం తుడుచుకున్నాను. కుర్చీలో కూచుని నా చుటూ ఒక్కసారి కలయచూశాను. ఇంకా ఎవరూ రాలేదు. టైము కాలేదు.

మళ్లి యీయనకు ఫోన్ చేశాను.

"ఎస్. ప్రభు హియర్"

"నేను - గంగను" గొంతులో ఏదో అడ్డుకున్నట్లుగావుంది. మాటలు రావడం లేదు. క్షణంపాటు నిశబ్దం.

"చెప్పు" ఆ కంఠంలో కొంత కూడా మార్దవం లేదు. జాలిలేదు. కఠినంగా అడుగుతున్నారు.

"నేను చెప్పవలసిందంతా చెప్పేశాను." ఎక్కడ ఏడుపు వస్తుందోనని, గుండెలని అదిమి పట్టుకున్నాను.

"నేను చెప్పవలసింది - అంతా చెప్పాను" అంటూ దీర్ఘమైన నిట్టూర్పు విడిచారు.

"మీరు లేకుండా నేను వుండలేను" అంటూ చిన్న పిల్లలాగా తల్లడిల్లి పోతున్నాను. తండ్రిలాగా, వెన్నునిమురుతూ సముదాయిస్తున్నట్లు చెపుతున్నారు.

"ఉండి చూడు - వీలవుతుంది"

"మీరు వుండగలరా?"

"ఉండగలననే అనుకుంటున్నాను. ఉండగలను కూడాను."

"అలా ఎందుకనుకుంటున్నారు? మీరు అలా అనుకోకండి"

"గంగా — నువ్వేనా యిల్లా మాట్లాడుతున్నావు? నాకు సందేహంగా వుంది. నిజంగా నువ్వే మాట్లాడుతున్నవా అని? నువ్వేనా ఈ మాట్లాడుతున్న వ్యక్తివి? నీకేమయింది? నువ్వు యిలా బెంబేలు పడకూడదు. ఇలా మారిపోకూడదు. ఈనాడు నేను ఇలా ఒక మనిషిగా వున్నాను అంటే, పట్టుదలతో వున్నాను అంటే అది నీ చలవవల్లనే. అలాంటప్పుడు నువ్వే యిలా అయిపోవాచ్చా?" అని ఈయన అడుగుతుంటే - మొఖం చిన్నబుచ్చుకుని అన్నాను -

"ఐ హావ్ లాస్ట్ మై సెల్ఫ్. నన్ను నేను పోగొట్టుకున్నాను - ఇది మీకు అర్థం అవడం లేదా?"

"నో - నిన్ను నీవు పోగొట్టుకోలేదు. ఒకసారి నేనూ అల్లాగే అనుకుని, అలా ఆలోచించడం ఎంత తప్పో గ్రహించుకున్నాను. అటువంటి తప్పు మరోసారి చెయ్యదలచుకోలేదు. అందుకు సిద్ధంగా లేనుకూడా. అండ్ యిట్ యీజ్ నాట్ రైట్ ఫర్ యాన్ ఎంజెల్ లైక్ యు. నేనిల్లా అంటున్నందుకు మన్నించు. నువ్వు యీ పెళ్లో, మరొక పెళ్లో చేసుకుని, ఇంకొకడి భార్యవి అయిన తరువాతనే

నన్ను చూడటం సాధ్యపడుతుంది. నేను నిన్ను చూడకుండా వున్నపుడే అది సాధ్యమవుతుంది. నాలో యీ నిగ్రహాన్ని యీ శక్తినీ కలిగించి, నన్నో మనిషిని చేసిన నీకు నేనింకే విధంగా ఋణం తీర్చుకోగలను చెప్పు? నీపట్ల నాకున్న వాత్సల్యం, కృతజ్ఞత చూపించుకోవడానికి నాకీ అవకాశం యివ్వు. నువ్వు చెప్పే ప్రతి విషయం నేను వింటున్నాను. ఏ వొక్కటీ జవదాటలేదు. నేను అడుగుతున్న యీ అభ్యర్ధనని తోసి పుచ్చకు. నా వేడుకోలు తోసిపారెయ్యకు. 'నా మాట వినను' అని నువ్వు మొండితనం వేస్తే, మనం శాశ్వతంగా విడిపోవాల్సివస్తుంది తప్ప - వేరు మార్గం లేదు. భగవంతుడు నిన్ను కాపాడాలని - నా మనస్ఫూర్తిగా కోరుకుంటూ - మే ఐ సే గుడ్ బై".

నాకు తల బద్దలవుతున్నది. అగ్నిపర్వతాలు నా తలలో భగ్గున పేలి పోతున్నాయి. రిసీవర్‌ని టెలిఫోన్ మీద యీడ్చిపడేశాను. ఆ తరువాత నాకు నేనే చెప్పుకున్నాను 'గుడ్ బై' అని.

తల తిరుగుతోంది. ఇప్పుడు ఏడుపు కూడా రావటం లేదు. అంతా శూన్యంగా వుంది. ఏ విషయం జ్ఞాపకం రావడంలేదు. బుర్ర ఖాళీగా అఖాతంలాగా వుంది. నా మనసులోని ఆలోచనలన్నీ ఛిన్నా భిన్నమయి, పారిపోయినట్లున్నాయి, నాకు నేనే ఒక కొత్త మనిషిలా అనిపిస్తున్నది. నాకు నేనే అపరిచితురాలివలె అనిపిస్తున్నది. నా చుట్టూ వున్న యీ ప్రపంచం అర్థవిహీనంగా తోస్తున్నది. ప్రాణంవుండీ చచ్చిపోయినట్లున్నది. జీవచ్ఛవములాగా వున్నాను.

టేబుల్‌మీద ఫైల్లు తీసి అన్నిటిమీద గబగబ సంతకం పెట్టాను. గుండెల్లో ఏదో బాధ. హృదయాన్ని పిండుతున్నట్లుంది. రంగసామి తీసుకొచ్చి, ప్లాస్టిక్ మూతపెట్టి వుంచిన ఆ గ్లాసుడు నీళ్లూ తీసుకుని గడగడ తాగేశాను. అప్పటికి తెప్పరిల్లినట్లయింది.

మాట్లాడకండా లీవురాసి వెళ్లిపోతే ఏమవుతుంది? ఏదో భయంగావుంది. ఇంటికెళ్లి పడుకుని నిద్రపోవాలి, పడుకుంటే నిద్ర దానంతట అదేవస్తుంది. లేచి బయలుదేరాను.

ఏది ఎల్లా కావాల్సివుంటే అల్లా అవుతుంది – అనుకుంటూ ఎక్కడి వక్కడ వొదిలేసి బయలుదేరాను. రంగసామి వస్తున్నాడు. "వొంట్లో బాగాలేదు. ఇంటికెళ్లి పోయానని చెప్పు" అంటూ చెప్పి, అతను వెళ్లిపోతుంటే, వెనక్కి పిలిచి "నాకో టాక్సీ తెచ్చిపెట్టు" అని అడిగాను.

అతను నాతోపాటు లిఫ్ట్‌లో కిందకొచ్చాడు. నా ముఖంలోకి పరిశీలనగా చూస్తున్నాడు. నాకు ఏమయిందో, ఎందుకిల్లా వున్నానో అడుగుదామని అనుకుంటున్నాడు కాబోలు. ఎందుకో భయపడి అడక్కండా వూరుకున్నాడు.

కిందకొచ్చాము. "మీరిక్కడే వుండండి" అంటూ టాక్సీ తీసుకురావడానికి పరుగెత్తాడు. మిసెస్ మాన్యూల్ సిగరెట్ తాగుతూ ఎదురుగా వస్తోంది.

"గోయింగ్ హోమ్ ?" అడిగింది.

"యస్" అన్నాను - ఆ సిగరెట్ వాసనతో ఆయన జ్ఞాపకానికి వస్తున్నారు.

"నాట్ ఫీలింగ్ వెల్ ?"

మళ్లీ ఒక 'యస్'

టాక్సీ వచ్చింది. మిసెస్ మాన్యూల్ వైపు చేయి వూపుతూ బయలుదేరాను. మౌంట్‌రోడ్‌లో టాక్సీ వెళుతున్నది. కళ్లు మూసుకుని వూహించుకుంటున్నాను. "నేను ఆయనతో ఎక్కడికో వెళుతున్నాను. నాపక్కన ఆయన కూచుని కారు డ్రయివ్ చేస్తున్నారు. ఆరోజు టెలిఫోన్‌లో మాట్లాడిందంతా ఒక పీడకల.

ఇంటికొచ్చాను. ఇంట్లో ఎవరూలేరని అమ్మ స్వేచ్ఛగా తలమీద ముసుకు తీసుకుని వెల్లకిలా పడుకుని పుస్తకం చదువుకుంటున్నది. నేను వచ్చిన అలికిడి విని, గబగబా తలమీద ముసుకు సర్దుకు లేచికూచుని ఆశ్చర్యంగా చూస్తోంది. ఆవిడకు ఏం అడగడానికి అవకాశం యివ్వకుండా నా గదిలోకి వెళ్లి తలుపు మూసుకున్నాను. హాండ్‌బాగ్ విసిరి పారేశాను. అది ఎక్కడికెళ్లి పడిందో కూడా చూసుకోలేదు. గబగబమని చీరె విప్పి పారేశాను, మంచం మీద కెళ్లి గభాలున పడ్డాను. ఒళ్లంతా చితకకొట్టినట్లు వుంది. కాళ్లు చేతులు విసిరేసినట్లు జావి పడుకున్నాను. కాళ్లు రెండూ పరుపుమీద వేసి రుద్దుకుంటున్నాను.

నేను బయటకొస్తానని చాలా సేపటిదాకా ఎదురు చూసి, తలుపుదగ్గిర నిలుచుని ఏదో అడుగుతోంది అమ్మ.

"ఏవిటే ? వంట్లో బాగాలేదా ? ఇవ్వాళ శనివారం గూడా కాదాయే – లీవు పెట్టి వచ్చావా ? తలుపు తెరవ్వే - కాఫీ పెట్టనా ?"

నేను బదులు చెప్పకుండా లేచి కూచుని వున్నాను. జవాబుకోసం కాసేపు ఎదురు చూసింది.

"ఏమిటే తల్లీ నోరుతెరిచి చెపితేగదా తెలిసేది ? ఇట్లా గదిలో తలుపులు బిడాయించుకు కూచుంటే నేనెల్లా చచ్చేదే ? తీసుకెళ్లిన అన్నం తిన్నావా ?"

నేను దేనికీ సమాధానం చెప్పలేదు. నోరు తెరవలేదు. నోరు తెరుస్తే ఎటువంటి మాటలొస్తాయోనని భయంగావుంది. గభాలున ఆయన 'మినీబార్' నా కళ్ల బడింది. నాకళ్లంట నీళ్లు గిర్రునతిరిగాయి. ఆరోజు వచ్చినపుడు యిక్కడ పెట్టివెళ్లారు - అంతే- -

ఆ పెట్టె తీసుకొచ్చి మంచంమీద పెట్టుకు మూత తెరిచాను. మూడొంతుల దాకా విస్కీవుంది ఆ సీసాలో. రెండు పక్కలా చక్కని గాజుగ్లాసులు, ఆ విస్కీ సీసా చేతులోకి తీసుకుని చూస్తున్నాను.

ఆ రోజున - "ఇది తాగేటువంటి రోజుగాని, తాగే అవసరం కాని నాకు రాకూడదు" అన్నాను. ఆ మాటలు జ్ఞాపకం వచ్చాయి. ఇప్పుడు తాగవలసిన అవసరం వచ్చిందా ?

బాటిల్ తెరిచాను. ఈ పసుపుపచ్చని ద్రవం ఎలాటి మత్తుని కలిగిస్తుందో చూస్తాను. గ్లాసు తీసుకుని, గ్లాసులోకి మూడొంతులదాకా సీసాలోంచి వంచాను. ఒక చేతిలో సీసా - యింకో చేతిలో గ్లాసు. వంటిమీద చీరలేదు. పెటికోటుతో నిలుచునివున్న నా ప్రతిబింబాన్ని అద్దంలో చూస్తున్నాను. ఇంతవరకూవున్న ఆ పాత 'గంగకి' నేను గుడ్ బై చెప్పి చాలా సేపయింది.

మందు తాగినట్లు ఒక్క గుక్కలో - - - -

అయ్యో - గొంతంతా, గుండెలంతా, పొట్టంతా, కడుపంతా భగ్గన మండి పోతోంది.

మండి పోనీ - -



ఎన్నెనో జరిగిపోయాయి. కాని గంగ జీవితంలో యింతవరకు జరగని - కొత్త విషయాలేమీ జరగలేదు. జరగని ఆ విషయం తలుచుకున్నపుడల్లా గంగకు తనమీదా, తన దేహంమీద, తనచుట్టూ పరిసరాలమీద, తనని యీ స్థితిలోకి తోసిన బంధువులమీద, చుట్టూ మనుషులమీద పట్టరాని ద్వేషం కోపం కలుగుతూంటుంది. ఆ కోపాగ్నిలో ఆమె తననుతాను దహించుకుని, ఎదుటివాళ్లని భస్మీపటలం చెయ్యాలని అనుకుంటూ, వాళ్లుతెలియని ఆ ఆగ్రహంలో పళ్లు పట పట కొరుకుతూ, మొఖంమంతా ఎర్రగా చేసుకుని, అపరకాళికావతారం దాలుస్తూ వుంటుంది. ఇందుకు ప్రతీకారంగా ఏంచేసి కక్ష తీర్చుకోవాలో అని ఆలోచిస్తూ వుంటుంది.

ఇప్పుడు ఆమె మొఖం - ఆమె మొఖంలాగా లేదు. పూర్వపు గంగకీ - యీ గంగకీ ఎక్కడా పోలికలేదు. ఒక్క మొఖమేకాదు మాటతీరు, ప్రవర్తన యివన్నీ ఆఫీసులో, - బయట, టాక్సీ వాళ్లదగ్గిర - వాళ్లందరితో మాట్లాడే ధోరణే పూర్తిగా మారిపోయింది.

రంగసామి ఒకప్పుడు ఆఫీసుకు వచ్చి పనిచేసే ఆడపిల్లలకి, గంగని వుదాహరణగా చూపించి, అందరూ అలా వుండాలని మెచ్చుకుంటూండేవాడు. అలాటి అతను ఈమెను గురించి లోకువగా మాట్లాడటం మొదలుపెట్టాడు.

మిసెస్ మాన్యూల్ గంగా, యిద్దరూ గంటలు గంటలు రూమ్‌లో విడిగా కూచుని ఖబుర్లు చెప్పుకుంటూ వుంటారు. 'లంచ్ అవర్'లో యిది నిత్యకృతమై పోయింది. మిసెస్ మాన్యూల్ సిగరెట్ తాగుతుందనే విషయం ఆఫీసులో అందరికీ తెలును. గంగా కూడా ఆవిడతో చేరి సిగరెట్ తాగడం నేర్చుకుంది. ఈ విషయం మొట్టమొదటిసారి చూసినవాడు రంగసామి. ఇప్పుడా విషయం ఆఫీసులో అందరికీ తెలిసిపోయింది. మిసెస్ మాన్యూల్ పెదిమల్లాగా గంగ పెదిమలుకూడా నల్లబడటం ఆరంభించాయి.

కొన్ని సమయాల్లో ఆఫీసు అదిరిపోయేటట్లు ఖంగు ఖంగున దగ్గుతూ వుంటుంది. ఇన్ని సంవత్సరాలుగా రోజూ గంగ టేబుల్‌మీద, మంచినీళ్లగ్లాసుపెట్టి, పైన ప్లాస్టిక్ మూతపెట్టి వుంచుతున్నాడు రంగసామి. ఆ నీళ్లమీద మూత కూడా తీసేదికాదు గంగ, ఇప్పుడు రూమ్‌లోకి రాగానే ఆ గ్లాసుడు నీళ్లు తాగడమే కాదు, రోజూ రెండు మూడుసార్లు మంచినీళ్ల కోసం బెల్లు కొట్టి రంగసామిని పిలుస్తూవుంటే, అతను అందరినీ నిర్లక్ష్యం చేసినట్లే గంగనూ ఎదిరించి మాట్లాడటం ఆరంభించాడు. మనసులో గంగని కూడా అసహ్యమైన తిట్లతో - అనుకోవడం మొదలుపెట్టాడు.

మిసెస్ మాన్యూల్‌తో కలిసి గంగ అప్పుడప్పుడు సినిమాకి కూడా వెళుతూంటుంది. మాన్యూల్ ఇంటికికూడా ఆమె తరుచు వెళుతూంటుంది. మాన్యూల్ దంపతులు గంగ యింటి కొచ్చినపుడు, కొన్ని సాయంకాలాలు, రాత్రిఅయి, ఆరాత్రి అర్ధరాత్రిఅయి, ఆ అర్ధరాత్రివేళ వీళ్లు మోటర్ సైకిల్ పెద్ద శబ్దంతో స్టార్ట్ చేసుకుంటూ - వూరందరికీ తెలిసేటట్లు వెళ్లిపోతూంటారు.

పోయిన వారం మిస్టర్ మాన్యూల్ జన్మదినోత్సవ సందర్భంగా పార్టీ జరిగింది, ఆ పార్టీలో అర్ధరాత్రి వరకూ గడిపి, గంగ టాక్సీలో యింటికొచ్చి, ఆ టాక్సీ వాడితో పెద్దగా అరుస్తూ పోట్లాడటం ఆ వీధంతా ఆశ్చర్యంగా చూశారు. ఆటాక్సీ వాడు గంగ ఏ పరిస్థితిలో వుందో - వీధి వీధంతా పిలిచి ప్రత్యక్షంగా చూపించాడు. గంగ వాడి మొహాన ఒక పదిరూపాయలనోటు విసిరికొట్టి, టాక్సీవాడు వెళ్లిపోయిన తరువాత పదినిముషాలదాకా ఆ వీధి వారందరికీ తన మాటలతో విందు చేసింది. అదికూడా వీధి మధ్యలో నిలుచుని టాక్సీవాళ్ల పొగరుమోతుతనాన్ని, మద్యపాన నిషేధ రూల్సునీ ఇదంతా చూస్తూ ఆనందిస్తున్న ఆ వీధిలో వాళ్ల అనారోగ్యకరమైన కుతూహలాన్ని గురించి కూడా చాలా ఘనంగా అరుస్తూ ఇంగ్లీషులో వుపన్యాస మిచ్చేసింది.

ఆ వీధిలో యిటువంటి గలాటాలు సర్వసాధారణంగా పగటివేళ నడుస్తూంటాయి. పంచవంటికి పక్కన గుడిసెల్లోవున్న అలగాజనం ఇక్కడ యిళ్లలో పాచిపని చేసుకు బతుకుతూంటారు. ఆ ఆడవాళ్లు అప్పుడప్పుడ తమిళంలో యిలానే దెబ్బలాడు కుంటూంటారు. తగవులాట సమయంలో యీ వీధులో వాళ్లు బయటకి రావడానికి భయపడుతూంటారు. అదేమాదిరిగా యీ వీధిలో వాళ్లు యింగ్లీషులో యీలా పోట్లాడే గంగ నోటికి దడిసి, భయపడటం మొదలుపెట్టారు.

ఈవిడ తాగింది అన్న విషయం ఆ టాక్సీ డ్రైవరు ప్రపంచానికి తెలిసేటట్లు వివరించి చెప్పినపుడు - ఈమె కూడా ప్రపంచానికి ఒక అబద్ధం ప్రచారం చేసింది.

తను పర్మిట్ తీసుకుందిట. తనను ఎవరూ ఏమీ చెయ్యలేరుట. తను నాలుగు అంకెల్లో జీతం సంపాయించుకుంటోంది.

ఈ సంఘటన జరిగాకనే తాగడానికి తనకి పర్మిట్ అవసరమన్న నిశ్చయానికి వచ్చింది గంగ. మిసెస్ మాన్యూల్ అందుకు కావలసిన ఏర్పాటు చేసింది.

తల్లి, అన్న, అన్న కుటుంబం, ప్రభు, మంజు వీరందరూ గంగకి సంబంధించి నంతవరకూ, జరిగిపోయిన కాలానికి చెందిన మనుషులు. ఆమె వీళ్లెవరినీ తలుచుకోదు. జ్ఞాపకం తెచ్చుకోదు. ఒకవేళ ఖర్మంజాలక జ్ఞాపకం గనక వస్తే వాటిని తరిమికొట్టి, తనను తాను అదిలించుకుంటుంది.

స్వల్ప విషయాలకి, అనవసరమైన విషయాలకి కూడా పెద్ద నోరు పెట్టుకు నలుగురికీ వినబడేటట్లు మాట్లాడటం మొదలుపెట్టింది. పాలవాడితో, కూరల వాళ్లతో, పేపరువాడితో రోజూ ఎవరితోనో - ఒకరితో దెబ్బలాడక మానదు. అసలు పోట్లాటకు సిద్ధంగా వున్నట్లు, కజ్జానికి కాలు దువ్వినట్లు కూచుని, ఆ వీధి కంతా తన వాగ్ధాటి చూపిస్తూ వుంటుంది. ఆవిడ అరవకండా వున్నప్పుడు, ఆ ట్రాన్సిస్టర్ చెవులు బద్దలయేటట్లు గట్టిగా పూర్తోవున్న సినిమా పాటలన్నీ పాడుతూ వుంటుంది. ట్రాన్సిస్టర్ అరుస్తోంది అంటే గంగ చాలా సంతోషంగా వుందని అర్థం.

ఇప్పుడు కూడా వాళ్లమ్మ అప్పుడప్పుడు వచ్చి శాపనార్థాలు పెట్టి పోతూంటుంది. పోయిన వారం కూడా వచ్చి వెళ్లిందామె. అలవాటు ప్రకారం రంగసామి ద్వారా వచ్చే ఆ నూరు రూపాయలు - ఆ నెల ఆవిడ చేతికి రాలేదు. గంగ ఏదో పనుల్లో ఆ విషయం మర్చిపోయి, డబ్బు పంపలేదు. ఇది కనకం దృష్టిలో చాలా పెద్ద విషయం. ఒకవారం రోజులపాటు ఎదురుచూసి ఇక పట్టలేక కూతురుతో దెబ్బలాట వేసుకునేందుకు వచ్చింది.

ఆరోజు ఆఫీసుకు సెలవు కూడా పెట్టి తల్లితో పెద్ద పోట్లాట వేసుకుంది గంగ.

తల్లికి తను డబ్బు పంప అవసరం లేదుట. కొడుకింట్లో తింటూ, నెలా నెలా తనని అడిగి, వాళ్లకి డబ్బు యిస్తుంటే - కూచుని తినే ఆ కుటుంబానికి సిగులేకుండా పోయిందట. డబ్బు కావాలనుకున్నవాళ్లు మర్యాదగా, వొంగి అడగాలట, అంతే గాని అధికారంచేసే హక్కు ఎవరికీ లేదుట.

"ఇక నీ మొఖం నా కళ్లబడనీయకు. డబ్బు నీ మొఖాన్న విసరి పారేస్తాను" అంటూ నూరు రూపాయలకు బదులు, వెయ్యిరూపాయలు ఆ క్షణంలోనే బీరువాలోంచి తీసి హాల్లో నేలమీదకి విసిరికొట్టింది గంగ.

కనకం నెత్తీ నోరూ కొట్టుకు ఏడ్చింది. హాల్లో పడిన రూపాయలనోట్లు ముష్టిదానిలాగా ఏరుకుంటూ, ఏడుస్తూ శాపనార్థాలు పెట్టి వెళ్లింది. వెళుతూ ఆ వీధిలో యింటింటిముందూ ఆగి, వీధి గుమ్మాల్లో నిలుచున్న ప్రతివాళ్లకి తన కూతురుచేసే ఆగడం గురించి చెప్పుకుంది. ఇంటింటి దగ్గిర శాపనార్దాలు పెట్టి - ఆ అమ్మాయిని తిట్టిపోసింది.

'ఉప్పులో వూరిన బానలాగా, దాని వొళ్లు చీకి చీకి నీరు కారిపోతుందట; ఈ వీధిలో వున్నవాళ్లు దాన్ని తన్ని తగిలెయ్యాలిట. మనుషులు దీనికి శాస్తి చెయ్యకపోతే - భగవంతుడే దీనికి తగిన శాస్తి చేస్తాడుట.' కనకం తన కూతురిని తిట్టేతిట్లూ, పెట్టే శాపనార్థాలు విని, అవి తమ కెక్కడ తగులుతాయోనన్నట్లుగా, వీధిలోకి వచ్చి తొంగి చూడటానికే భయపడిపోయారు ఆ వాడకట్టంతా.

కాని గంగ మటుకు. తల ఎత్తుకు, హాయిగా, నిట్టాగ్గా, గర్వంగా తిరుగుతోంది. బుజానికి హాండ్‌బాగ్ తగిలించుకుని, నడుం దిగకండా పమిట వేసుకుని 'టక్ టక్' మని రోడ్‌మీద నడిచి వస్తుంటే ఆ వీధిలోని మర్యాదస్తులు తలవంచుకుని, ఏవగింపుతో తప్పుకొని వెళ్ళిపోతూంటారు. కొందరు రౌడీపిల్లలు మటుకు 'ఆడేగుర్రం' అని పేరుపెట్టి వెనక నుంచి నవ్వుతూంటారు. ఏమయినా అందరూ ఆమెనిమూసి యిప్పుడు భయపడుతున్నారు. ఆమె కూడా 'ఎవరొస్తారో చూస్తాను' అన్నట్లు పందెంకాసి తయారుగా వున్నట్లు వెళ్తూంటుంది.

రోజంతా వూరు తిరిగివచ్చే గంగ పొద్దుటా సాయంత్రం వాకింగ్‌కి కూడా తప్పకుండా వెళుతూ వుంటుంది. ఉదయంవేళ ఒకోసారి వెళ్ళకపోయినా, సాయింత్రంవేళ తప్పనిసరిగా వెళుతూ వుంటుంది. ఒకోరోజు సాయింత్రంవేళ వాకింగ్‌కి వెళ్ళి, బాగా చీకటి పడ్డాక తిరిగి యింటికి వస్తూంటుంది

స్పర్‌టాంక్ రోడ్ చాలా చీకటిగా వుంది. రోడ్ మీదవున్న యిల్లు జరిగి పోతుందా అన్నంత శబ్దం చేసుకుంటూ బస్ వెళ్ళింది. వీధి దీపాలు వెలిగే సమయం. కార్పరేషన్ అధికారుల ధర్మమా అని - కొన్ని స్తంభాల ఎలక్ట్రిక్ లైట్లు యింకా వెలగలేదు. చెట్లు దట్టంగావున్న ఆ రోడ్డులో ఎలక్ట్రిక్ దీపాలు చెట్ల ఆకుల మధ్యనుంచి మిణుకు మిణుకుమంటున్నాయి.

గంగ వాకింగ్‌కి వెళ్ళివస్తోంది. ఆమె ముందున్న వీధిలోంచి ఒక చిన్నకారు పైన వెల్తురు పడేట్లుగా వస్తోంది. ఆమె తిరిగి చూసేసరికి ఆ కారులో మనిషి, ఆ కారు ఆమె మనసులో ఏదో చిరపరిచిత చిత్రంవలె అనిపించింది - క్షణం ఆగింది. కారు వేగం తగ్గించి నెమ్మదిగా పక్కనుంచి - కాస్త దూరం నుంచి వెళ్ళింది. ఆ కారులో వ్యక్తికి - నిలువెత్తునా కన్పించేటట్లు - వొళ్ళు విరుచుకు నిలుచుంది గంగ.

పక్కనుంచి వెళ్ళిన ఆ కారు, ఆ కారులోంచి విసిరేసిన సిగరెట్ ముక్క యివన్నీ ఆమెకి ఏదో సందేశాన్ని తీసుకొచ్చినట్లు అనిపించింది. గాలికి కాలుతున్న ఆ సిగరెట్ పీక నిప్పురవ్వలు ఎగిరి ఆమె కాలు దగ్గిర పడినాయి. నిలుచుని ఆ కారు వంక పరకాయించి చూసింది. ఆ కారు కాసామేజర్‌రోడ్ మధ్యలోనున్న అయిలాండ్‌ని చుట్టివచ్చి తిరిగి స్పర్‌టాంక్ రోడ్‌లోకి ఆమెకి ఎదురుగా వస్తోంది.

సిగరెట్ పీకమీద కాలువేసి నేలరాస్తూ, ఆ వెళుతున్న కారుని ఆగి చూసి, మళ్ళీ వాకింగ్ ఆరంభించింది. మళ్ళీ ఆ కారు ఒకసారి నెమ్మదిగా పక్కనుంచి వెళ్ళింది. ఆ కారు లైటు కాంతి మొఖంమీద పడగానే ఏదో జ్ఞాపకం వచ్చి నవ్వుకుంది.

ఒక్కక్షణం క్రితం కారులోంచి పడిన ఆ సిగరెట్‌పీక ఏదో సందేశం తీసుకొచ్చింది. ఆ భావానికి తనలో తాను నవ్వుకుంది.

తన పక్కనుంచి వెళుతున్న ఆ కారునిగానీ, మనిషినిగానీ తిరిగి చూడలేదు. ఆ కారు మళ్లీ తిరిగి వస్తుంది ....

ఆ వూహాలలో, ఆ జ్ఞాపకాలలో, వుల్లానంగా గాలిలో తేలిపోతున్నట్లు వాకింగ్‌కి వెళుతోంది.

అమెని గురించి రకరకాలు అనుకొంటూంటారు. అమెకూడా ఇతరుల గురించి రకరకాల మాటలు అంటూంటుంది. అమెకి ఈ మధ్యనే ప్రమోషన్ వచ్చింది. అమెని ఆఫీసుకి తీసుకెళ్లడానికి, తీసుకొచ్చి దించడానికి ఆఫీసు కారు వస్తూంటుంది. కొన్నిసమయాల్లో ఆ కారులో ఆఫీసర్లు కూడా వస్తూంటారు. వాళ్లందరికీ యింట్లో పార్టీ యిస్తూంటుంది

ఎదురింటి మేడమీంచి, పక్కింటి కిటికీలోంచి యీ తమాషా అందరూ చూస్తూంటారు.

గంగా వాళ్ల డాబాలో జరుగుతున్న యీ పార్టీల్లో, కూచున్న మనుషుల మొఖాలు పూర్తిగా కనిపించకపోయినా - గాజుగ్లాసులూ, కప్పులూ చేసే శబ్దం, 'ఛీర్స్' అని ఒకరికొకరు చెప్పుకుంటూ తాగడం యివన్నీ చూసేవాళ్లకు - వింతగానూ కాల క్షేపంగానూ వుండి, పక్కింటివాళ్లు యీ వింత గురించి తరుచు చెప్పుకుంటూంటారు.

గణేశన్ అప్పుడప్పుడొచ్చి ప్రభుని కలుసుకుంటూంటాడు. గంగని గురించి ప్రభుతో రకరకాల పుకార్లు చెబుతూంటాడు. వాటికి సమాధానం చెప్పకుండా తాపీగా సిగరెట్ తాగుతూ వింటూంటాడు ప్రభు, ఎప్పుడో జరిగిపోయిన ఒక విషాదగాథను వింటున్నట్టు, సిగరెట్ తాగుతూ వింటూవుంటాడు.

అమెని చూడటానికి, అమెతో మాట్లాడటానికి మనస్కరించక, తన జీవితంలో ఆమె, అమె జీవితంలో తను కల్పించుకునే ధైర్యం లేక భయపడిపోతున్నాడు.

అదీగాక ఆ రోజున టెలిఫోన్‌లో అమెతో మాట్లాడిన తరువాత, అతనికి లోగడ అమె చెప్పిన విషయాలన్నీ జ్ఞాపకం వస్తున్నాయి - 'తనని ఎవరేనా 'రేప్' చేస్తారేమో నన్న భయం కలుగుతోంది' - అమెని వెళ్లిచూస్తే తనకే యిటువంటి ఆపద ఏదన్నా కలగవచ్చుననే ఒకవిధమైన 'అడ్‌లెసెంట్' వయసులోవున్న చిన్నపిల్లవాడి లాగా భయపడిపోతున్నాడు.

తన అభ్యర్థనని మన్నించలేదనీ, తను చెప్పిన విధంగా అమె జీవితాన్ని మలుచుకుని సుఖపడలేదనీ కూడా అతనికి కోపంగా వుంది.

తనుచూసి, కలిసిమెలిసి తిరిగి, అలవాటు పడిన స్త్రీల అందరివంటిది కాదనీ, అమె ఒక విశిష్టమైన, ప్రత్యేక వ్యక్తి అన్న అలోచనచేతనో, అమెపట్ల తను ద్రోహం చేశానన్న సిగ్గుతో కూడినకోపం; వాత్సల్యం, గౌరవం, భక్తి - అతని అరోగ్యంపట్ల అమె చూపేటువంటి శ్రద్ధ, అతనిలోని బలహీనతలన్నింటికీ

తట్టుకుని, వాటిని భరించగల మనోదారుఢ్యం, తామిద్దరిమధ్యా వున్నటువంటి ఆ అనుబంధం.

ఇప్పుడవన్నీ చితికి ముక్కలయి, కరిగి కాలగర్భంలో కలిసిపోయాయి. ఈ మారిపోయిన గంగలాంటి అమ్మాయిలను అతను చాలా మందిని చూశాడు-కలుసుకున్నాడు, కలిసి మెలిసి తిరిగాడు.

ఇప్పుడతని విచారమంతా ప్రేమించబడాలనీ, గౌరవించబడాలనీ, భక్తి ప్రపత్తులు పొందాలనీ, వీటన్నిపొందే అర్హత తనకివుండి కూడా పొందలేక పోతున్నాననికాదు. తన అందానికీ, తన వయసుకీ భ్రమిసి ఒక సమయంలో యీ ఆడపిల్లలు తనమీద ప్రేమ, భక్తి చూపించి చివరికి యిలా అయిపోతారా? ఈ మాదిరి మారిపోతారా? అనేటువంటి యీ ఆలోచనలు అతన్ని క్షోభ పెడుతున్నాయి.

గంగకూడా అందరిలాంటిదే. ఆమె కూడా అందరిలాంటిదే. అతనికి చివరికి అంతా ఒకటే, అందరూ ఒకటేననిపించింది. ఎవరి పట్లా చూపించని ప్రేమ, వాత్సల్యం, గౌరవం ఆమె పట్ల కనబరిచినా చివరికి ఆమె పూర్వపు సౌశీల్యమూ, నిర్మలత్వమూ పోగొట్టుకుందా? అని తరుచు విచారపడుతున్నాడు.

అతనికి జీవితం గందరగోళంగా, అల్లకల్లోలంగా కనిపిస్తోంది. మంజుని తలుచుకు తలుచుకు భయపడిపోతున్నాడు. అతను దేనినీ నమ్మటంలేదు - ఎవరినీ విశ్వసించ లేకుండా వున్నాడు. ఈ గంగ చేసిన ద్రోహంతో అతనికి పద్మమీద గౌరవం పెరిగింది. అతని భార్య పద్మ అతని కంటికిపుడు ఒక దేవతలాగా కనిపిస్తోంది తన కూతురు మంజుని, తన పిల్లలని క్రమ శిక్షణతో పెంచి, వారి క్షేమం కొరకు, భవిష్యత్ కొరకు నిరంతరం తాపత్రయపడే పద్మపట్ల అతనికి లోలోపల ఒక కృతజ్ఞతా భావం కూడా కలుగుతోంది. తనని కూడా అలా కాపాడి, తనకి కూడా రక్షణ యివ్వాలి అన్నట్లు పద్మ విషయంలో అతను వొదిగి నడుచుకుంటున్నాడు.

సంసారం, ఆఫీసు తప్ప మిగతా విషయాలన్నిటినీ, అలవాట్లన్నీ వొదులుకుని కుదురుగా వుండటం పద్మకి పరమానందంగా వుంది. బట్టల విషయంలో అతను పూర్వమంత శ్రద్ధ చూపడంలేదు.

ఆమె ఆశించినట్లు - యిన్నాళ్లకి - ఆఫీసుకెళుతున్నాడు, ఆఫీసు అవగానే సరాసరి యింటికి వచ్చేస్తున్నాడు. ఇంట్లోనే కూచుని వంటరిగా తాగుతున్నాడు. కొత్తగా పెంచుకున్న ఆ గడ్డం కొంత కాలం అయేసరికి, దాన్ని సరిగ్గా పోషించే వాళ్లు లేక పొడవుగా ఎదిగిపోయింది. గుబురుగా, నల్లగా వున్న ఆ గడ్డంలో అక్కడా అక్కడా తెల్లవెంట్రుకలు మెరుస్తున్నాయి. అవి అతని జీవితానుభవాలకి, వయసుకి, అతని విరక్తికీ ప్రతినిధులవలె, అతనికొక స్థిరత్వాన్ని, పెద్దరికాన్ని

కలిగిస్తున్నాయి. అలవాటు పడి మానలేక తాగుతున్న ఆ త్రాగుడులాగా, యీ గడ్డం కూడా పాతబడిపోయి అతనిలో ఒక భాగమై పోయింది.

తన దుర్వ్యసనాలని చూసి, చివరి రోజుల్లో కృంగి కృశించిపోయిన తన తండ్రివలె తను కూడా వృద్ధాప్యంలో తన పిల్లలు చెడిపోవడం కళ్లారా చూసి, బాధపడవలసి వస్తుందేమోనన్న భావన, అతనిని వెంటాడి తరుచు భయ పెడుతూ వుంది.

అందరూ ఎప్పుడో ఒకప్పుడు తప్పకుండా చెడిపోతారని అతనికి ఒక ఘట్టి నమ్మకం. దానికి ప్రత్యక్ష నిదర్శనంగా అతనికి గంగ జీవితం తరుచు జ్ఞాపకం వస్తూ వుంటుంది.

బాల్కనీలో లైటు మందంగా వెలుగుతోంది. మంజు తన గదిలో కూచుని చదువుకుంటోంది- పనివాళ్లు ప్రభు తాగడానికి కావలసిన సరంజామా అంతా ఏర్పాటు చేస్తున్నారు. తాగుతూ అతను మధ్య మధ్య తినటానికి రకరకాల పదార్థాలు పైకి తీసుకొస్తున్నారు. ప్రభు పక్కన ఒక కుర్చీలో పద్మ కూచుని అతనికి కావలసినవి అందిస్తోంది. ఆమెకి పక్కనున్న ట్రాన్సిస్టర్‌లోంచి సన్నగా హిందీ సినిమా పాటలు వినిపిస్తున్నాయి.

పద్మ చెప్పడం మొదలుపెట్టింది. ''ఇవ్వాళ మధ్యాహ్నం థియేటర్‌లో గంగను చూశాను. అదేమిటండీ ఆ పిల్ల అలా మారిపోయింది? నన్ను గుర్తుపట్టినట్లు లేదు. వెంట ఎవరో ఓ ఆంగ్లో యిండియన్ దొరసానివుంది - - - అవునూ - మీరిప్పుడు గంగని కలుసుకోవడంలేదా? నాకు దాన్ని చూస్తే ఎట్లాగో అనిపించింది. నన్ను గుర్తుపట్టనట్లుగా అది వెళ్లిపోతూంటే నేను మటుకు ఎందుకు పలకరించాలని, మాట్లాడకుండా వచ్చేశాను - నాకు అనిపిస్తోంది - - - -'' అని ఇంకా ఏదో చెప్పబోతున్న పద్మ వంక కోపంతో వురిమి చూస్తున్నాడు ప్రభు. అతని కెందుకో కోపంగా వుంది.

''ఎవరెట్లాపోతే నాకేం? డోంట్ స్పాయిల్ మై యీవినింగ్. ఈ వెధవ గోలతో నా సాయింత్రం పాడుచెయ్యకు -'' అంటూ ఒకసారి పట్టరాని కోపంతో గదమాయించాడు. దాంతో పద్మ భయపడిపోయి, అతనిని అనునయిస్తున్నట్లుగా, గ్లాసులో మరి కాస్త విస్కీ పోసింది.

అవునవును – ఇప్పుడు పద్మ కూడా మారిపోయింది.

